# గ్రంథాలయ ప్రగతి

## [రెండవ భాగము]

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షాది ఉపన్యాసములు, తీర్మానములు

[1926 వ సం. నుండి 1942 వ సం. వరకు]

సంపాదకుడు

పాతూరి నాగభూషణం, డి. యల్. యస్‌సి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘము

పటమట :: విజయవాడ-6

1969

తెలుగునాటి పొత్తపు గడికండంకపెద్ద

తెలుగుతల్లి మేటి కొలువరి

కీ. శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికి

వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమైయున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.

ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానమును నట్లు సేవ్యమై యుండవలెను.

సూర్య చంద్రమండలముల తేజస్సు
ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగనున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును

# పీఠిక

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘ స్వర్ణోత్సవమును పురస్కరించుకొని మేము ప్రచురించ సంకల్పించిన 5 ప్రచురణలలో 2 మాత్రమే యింతకుముందు వెలువడినవి. గ్రంథాలయ ప్రగతి - 3 భాగములలో మొదటి భాగమును 1962 లోను, మూడవ భాగమును 1964 లోను ప్రచురించినాము. రెండవ భాగములో చేర్చవలసిన ఉపన్యాసములు, తీర్మానములు వగైరా సామగ్రి సేకరణలో జరిగిన విలంబన కారణంగా యిప్పటివరకు దీనిని వెలువరించుట సాధ్యపడలేదు. మొదటిభాగములో 1914-1926 సం. లలో జరిగిన మొదటి 10 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసములు, ముఖ్య తీర్మానములు, సంగ్రహ వృత్తాంతములు, ఆ కాలములోని సంఘ ప్రధాన నిర్వాహకులు, అప్పుడు వెలువడిన సంఘ ప్రచురణలు, ఉపన్యాసకుల పరిచయాలు, పటములు యిచ్చినాము. మూడవ భాగములో కొన్ని జిల్లా, తాలూకాది గ్రంథాలయ మహాసభల అధ్యక్షాది ప్రసంగములు, ప్రథమ కర్నూలుమండల, తృతీయ తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ మహాసభల వృత్తాంతములు, గుంటూరుమండల, తెనాలి తాలూకా గ్రంథాలయ సంఘముల నిబంధనలు, కొన్ని జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభల ముఖ్య తీర్మానములు, దీనిలో ప్రచురించిన ఉపన్యాసములు చేసిన వారి పరిచయాలు, పటములు చేర్చినాము.

ఇప్పుడు వెలువడుచున్న 2 వ భాగములో 1926 నుండి 1942 వరకు జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షాది ఉపన్యాసములు, ముఖ్య తీర్మానములు, 11-24 మహాసభల సంగ్రహ వృత్తాంతము, అప్పటి సంఘనియమావళి, ఆయా సంవత్సరాలలోని సంఘ నిర్వాహకులయు, ఆ కాలంలో వెలువడిన సంఘప్రచురణలయు వివరాలు, దీనిలో ప్రచురించిన ఉపన్యాసాలు చేసినవారి పరిచయాలు,

పటములు మాకు లభించినవరకు సేకరించి చేర్చినాము. దీనిలో చేర్చిన తీర్మానములను విషయము ననుసరించి విభజించినాము. ఒక్కొక్క తీర్మానము క్రింద మహాసభ జరిగిన సంవత్సరము, మహాసభ సంఖ్య (రోమను అంకెలో), తీర్మాన సంఖ్య వరుసగ యిచ్చినాము. ఎంత ప్రయత్నించినా 12, 16, 18, 21 మహాసభల ఉపన్యాసాలు గాని, వృత్తాంతాలుగాని మాకు లభించలేదు. ఎవరుగాని వీనిని మాకు సేకరించిపెట్టగలుగుచో మిగుల కృతజ్ఞులమై యుందుము. 17 వ మహాసభ అధ్యక్షోపన్యాసం కంటె ఆహ్వాన సంఘాధ్యక్షుల ఉపన్యాసం విపులంగా ఉన్నది. 24 వ మహాసభ అధ్యక్షోపన్యాసం పూర్తిపాఠం వెలువడలేదు. అందుచేత మేము ప్రచురించిన మిగిలిన మహాసభల ఉపన్యాసములలో 17, 24 మహాసభల అధ్యక్షోపన్యాసాలకు బదులుగ ఆహ్వానసంఘాధ్యక్షుల, ప్రారంభకుల ఉపన్యాసముల నిచ్చియున్నాము.

## అంకితము

ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకులలో ప్రముఖులుగ నుండి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాభివృద్ధికి హృదయపూర్వకముగ పాటు పడుటయేగాక, దీని భవిష్యత్తు చక్కగా నుండవలెనని జీవితాంతము వరకు తాపత్రయపడిన పెద్దలు, దేశభక్తులు, భాషాసేవకులు నగు కీ. శే. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికీ గ్రంథమును అంకిత మిచ్చుట సమంజసముగ మాకు తోచినది. వీరు పెద్దవయసులో నుండి కూడ ఓపికగ ఎన్నో గ్రంథాలయ యాత్రలలో పాల్గొని పలు ప్రాంతాలలో పర్యటించినారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు కార్యనిర్వాహక సంఘాధ్యక్షులుగను, ఉపాధ్యక్షులుగను, విశాఖ పట్నంజిల్లా గ్రంథాలయ సంఘమున కధ్యక్షులుగను, గ్రంథాలయ సర్వస్వమునకు సంపాదకులుగను ఉండి తమ ధర్మమును చక్కగా నిర్వహించినారు. ఇరువదిరెండవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ కధ్యక్షత వహించి ఎన్నెన్నో విశేషములతో విపులమైన ప్రసంగం చేసినారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి స్థిరవసతి యేర్పడుటకు

నైతికంగా ఎంతో సహాయపడినారు. శ్రీ సర్వోత్తమ భవన నిర్మాణము జరిగినప్పుడు ఎనలేని సంతోషమును పొందినారు. దీని ప్రధాన దాత శ్రీ కొమ్మా సీతారామయ్యగారి సీవిషయంలో ఎంతో ప్రోత్సహించినారు. సంఘ కార్యదర్శి భారమును నాపై పెట్టి యీ కార్యసాధనకు నన్ను వారు ప్రేరేపించినారు. వీరి జీవితకాలంలో, వీరితోపాటు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, శ్రీ కొమ్మా సీతారామయ్యగారు మున్నగు పెద్దల అండదండలతో, ఉద్యమాభిమానుల సహాయంతో, కార్యకర్తల సహకారంతో, దైవం తోడ్పాటుతో సంఘ కార్యక్రమంలో స్థిరమైన పనిని సాధించుటకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమున కవకాశము లభించినది. అందుచేత శ్రీ శాస్త్రిగారిపట్లమాకుగల భక్తిని, కృతజ్ఞతను వెల్లడించుకొను తలంపుతో ఈ గ్రంథమును వారికంకిత మియ్యబూనినాము.

## కృతజ్ఞత

ఈ గ్రంథ నిర్మాణములో మాకు సాయపడిన పరికరముల వివరములు ఆ యా ఉపన్యాసముల చివర ఇచ్చియున్నాము. ఇందలి ఉపన్యాసములు 8 సంఘ ప్రచురణలనుండి సంగ్రహింపబడినవి. 11,14,20 మహాసభల ఉపన్యాసములు శ్రీ వెంకటరమణయ్యగారిచ్చినారు. 14,20 మహాసభల వృత్తాంతములు ఆంధ్ర దినపత్రికలో వెలువడినవి. ఉపన్యాసకుల పరిచయములు, పటముల సేకరణలో మాకు శ్రీ వెంకటరమణయ్యగారితోపాటు దిగువనుదహరించిన మిత్రులు, అభిమానులు తోడుపడినారు.

డాక్టరు బి. రామరాజుగారు
శ్రీ పురిపండా అప్పలస్వామిగారు
,, జయంతి కామేశ్వరరావుగారు
,, కొడెంపూడి నాగేంద్రుడుగారు
,, పండ్రంగి గోపాలరావుగారు

శ్రీ సి. వి. చలపతిరావుగారు

,, హరి ఆదిశేషువుగారు

,, వెలగా వెంకటప్పయ్యగారు

,, మహీధర జగన్మోహనరావుగారు

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

ఇక ముద్రాపకులగు సర్వోదయ ప్రెస్‌వారి సహకారం విషయమై ప్రత్యేకం ప్రస్తావించవలసియున్నది. వీరి అభిమానం పూర్తిగా మాకుండుటచేతనే, 1950 వ సం. నుండి నేటిదనుక, ఏలాటి యిబ్బందులు లేకుండా సంఘ ప్రచురణలు వెలువడుటకు అవకాశం లభించింది.

అయిదు సంవత్సరాల కృషికిపిమ్మట భగవదనుగ్రహంవలన, యీ పుస్తక ముద్రణను పూర్తిచేసి వెలువరించగలుగుతున్నందుకు సంతోషిస్తున్నాము. ఈ పనిలో మాకు సహాయపడిన వారందరికీ మా హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

పాతూరి నాగభూషణం
కార్యదర్శి
ఆం. ప్ర. గ్రం. సంఘము

శ్రీ సర్వోత్తమభవనము
విజయవాడ_6
31_8_1969

# నివేదన

ఈ పుస్తకం ప్రచురణలో అనుకోనంతగా ఆటంకాలు మేమెన్నో ఎదుర్కొన్నవి. సమాచార సేకరణలోను, చిత్రములు, బ్లాకుల సంపాదనలోను అంతులేని విలంబనము జరిగినది. ఆంధ్రప్రదేశ్ సంఘోపాధ్యక్షులు, హైదరాబాదు జిల్లాపరిషత్ అధ్యక్షులు నగు శ్రీ మామిడి భోజిరెడ్డిగారు హైదరాబాదు జిల్లా పంచాయతీ సంఘం పక్షాన 1000/- లు విలువచేయు సంఘప్రచురణలను కొనడంద్వారా దీని ప్రచురణకు ఆర్థికంగా సహాయపడినారు. వీరి మేలు ఈసందర్భమున ప్రత్యేకముగా పేర్కొనవలసియున్నది. వీరికి మా హృదయపూర్వకమైన కృతజ్ఞతను వెల్లడించుచున్నాము.

గత ఆగస్టు నెలలోనే దీనిని వెలువరించుటకు ఆయత్తపడినాము. అప్పుడు మాకు మరొకచిక్కు ఎదురైనది. డాక్టరు యస్.ఆర్. రంగనాథన్‌గారి బ్లాకు మరల చేయించవలసి వచ్చినది. ఇంతలో 1969 డిసెంబరు 27, 28 తేదీలలో తిరుపతిలో జరుగనున్న 33 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలోపాటు స్వర్ణోత్సవమునుగూడ నిర్వహించుటకు సంకల్పింపబడుటచే స్వర్ణోత్సవ ప్రచురణలలో ఒకటి యగు దీని నీసందర్భమున వెలువరించుట సముచితముగ తోచినది. ఈవిధముగ ఎట్టకేలకు శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధిన, తిరుపతి క్షేత్రమున దీని ప్రచురణకు అవకాశము లభించినది. దీనిని దైవ నిర్ణయముగా భావిస్తున్నాము.

తిరుపతిలో స్వర్ణోత్సవ నిర్వహణమునకు, ఈ గ్రంథ ఆవిష్కరణకు అవకాశమును కలుగజేసిన 33 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఆహ్వానసంఘమువారికి, దీనిఆవిష్కరణకు దయతో అంగీకరించిన డాక్టరు తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారికి మా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

— ప్రకాశకులు

# విషయ సూచిక

## ౧. ఉపన్యాసములు



## ౨. తీర్మానములు

## ౩. అనుబంధములు

# పటముల పట్టిక

# సవరణ పట్టిక

[చదువరులీ పుస్తకమును చదువుటకుముందే దిగువ సూచించిన సవరణలను ఆ యా పుటలందు సరిచేసుకొనదగును.]

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| viii | 10 | వెలువడలేదు. | వ్రాతలోలేదు. |
| ,, | 16 | ఆధ్రదేశ | ఆంధ్రదేశ |
| ౨ | 8 | రామాయనింగారే | రామారాయనింగారే |
| ౩ | 4 | కొప్పా | కుప్పా |
| ,, | 6 | రమణరావు | రమణ |
| ౪ | 2 | ఒకవేళ | ఇదిఒకవేళ |
| ౬ | 2 | గ్రంథాలయోద్యమఘను | గ్రంథాలయోద్యమమును |
| ౧౫ | ,, | వ్యవసాయమమీద | వ్యవసాయముమీద |
| ౨౬ | 8 | బెజవాడలో నగు | బెజవాడ లోనగు |
| ,, | 20 | కళాశాలలే, | కళాశాలలే. |
| ౨౮ | 4 | పేరనొకటియును | పేర నొకటియును |
| ౨౯ | 21 | అరగంట కాల | అరగంట |
| ౩౦ | 19 | వర్దనముల | వర్ధనముల |
| ౩౫ | 14 | జానోదయము | జ్ఞానోదయము |
| ,, | 23 | ఆభివృద్ధి | అభివృద్ధి |
| ౩౬ | 10 | ఆ ప్రభుత్వ | ఆదేశములో ఆ ప్రభుత్వ |
| ౩౮ | 13 | అజానులుగానున్న | అజ్ఞానులుగానున్న |
| ,, | 13,14 | జానోదయము | జ్ఞానోదయము |
| ౩౯ | 24 | పనిపాటు | పనిపాట్లు |
| ౪౦ | 5 | వర్ధిల్లిన | వర్ధిల్లిన |
| ౪౩ | 5 | సాపనమును | స్థాపనమును |
| ౪౪ | 5 | శకి | శక్తి |
| ౪౫ | ,, | తన. చిత్రములు | తన చిత్రములు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪౭ | 17 | పాలకులు | పాలకుడు |
| ౫౧ | 25 | చూడవలసిన | చూపవలసిన |
| ౫౫ | 9 | ప్రదీ_కి | ప్రదీప్తికి |
| ౫౬ | 1 | పారిశుద్యము | పారిశుద్ధ్యము |
| ,, | 2 | 15 వంతు | 15 వ వంతు |
| ౫౮ | 6 | పయాణమువలె | ప్రయాణమువలె |
| ,, | 8 | ద్రవ్యపదానము | ద్రవ్యప్రదానము |
| ౬౩ | 14 | జిల్లా బోరులకే | జిల్లాబోర్డులకే |
| ౬౪ | 3 | దెశసేవకు | దేశసేవకు |
| ౬౫ | 10 | సంవత్స ముపాటు | సంవత్సరముపాటు |
| ౭౦ | 15 | స స్థానమున | సంస్థానమున |
| ౭౨ | 10 | పలు=కు | పలుకు= |
| ,, | 13 | వా ంతమనుగడ | ప్రాంత మనుగడ |
| ,, | 18 | లోబికి | లోనికి |
| ,, | 11 | పకిరించి | పరికించి |
| ,, | 12 | ఉండిపట్లు | ఉండినట్లు |
| ౭౬ | 18 | పవేశించి | ప్రవేశించి |
| ,, | 19 | దావిడులు | ద్రావిడులు |
| ౭౭ | 22 | టిండియనే | టిండియానే |
| ౮౧ | 6 | సంతపించు | సంతసించు |
| ౮౨ | 11 | రశరథుని | దశరథుని |
| ౮౩ | 8 | భిక్షులకును | భిక్షుకులకును |
| ,, | 12 | తీసికాని | తీసికొని |
| ,, | 14 | ఇతకంటె | ఇంతకంటె |
| ,, | 23 | ఇక్కడకూడ | ఇక్కడకూడ |
| ౮౫ | 20 | భిక్షకులు | భిక్షుకులు |
| ౮౬ | 13 | తెచ్చివట్లు | తెచ్చినట్లు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౮౬ | 25 | గణితము | గణితము, |
| ౯౦ | 1 | విద్యాసంస్థలో | విద్యాసంస్థలలో |
| ,, | 6 | లయముగ | లయము)గా |
| ,, | 8 | మఱికొన్నినుయు | మఱికొన్నియును |
| ,, | 18 | ఇండియాలోకెల | ఇండియాలోకెల్ల |
| ,, | 27 | అట | అట్లు |
| ౯౧ | 24 | ఎ | ఎత్తి |
| ౯౫ | 2 | ఉండివి | ఉండిరని |
| ౧౦౨ | 2 | నిద్యోగులలో | నిరుద్యోగులలో |
| ౧౧౨ | 10,11 | ఉధ్యమపు | ఉద్యమపు |
| ౧౧౬ | 1 | అంద్రదేశ | ఆంధ్రదేశ |
| ౧౧౭ | 6 | (B jorsjerna) | (Bjorsjerna) |
| ౧౨౨ | 2 | దురాగహము | దురాగ్రహము |
| ౧౨౪ | 18 | ఆవిచ్ఛిన్నముగా | అవిచ్ఛిన్నముగా |
| ,, | ,, | ఆంధులు | ఆంధ్రులు |
| ౧౨౯ | 4 | టాగోరులు | టాగోరులు, |
| ౧౩౦ | 21 | చరిత, | చరిత్ర, |
| ,, | 23 | చేసిరునా. | చేసినారు. |
| ,, | 25 | నాపింపవలెను. | స్థాపింపవలెను. |
| ౧౩౧ | చివరిపంక్తిని దిగువవిధంగా మార్చవలెను. —— ఇరువదిమూడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సంచిక | | |
| ౧౩౨ | 23 | ప్రారంభకులు | *ప్రారంభకులు |
| ౧౩౩ | 26 | విశంఖలంగా | విశృంఖలంగా |
| ౧౩౯ | 22 | హాఅయి | స్వాహాఅయి |
| ,, | ,, | స్వాభారత | భారత |
| ౧౪౨ | 19 | సన్యాసియమ్మ | సన్యాసమ్మ |
| ౧౪౪ | 11 | ప్రఇట్టి | ఇట్టి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౪౪ | 12 | జల | ప్రజల |
| ౧౫౧ | 26 చివర | త | తమకు |
| ౧౫౫ | 14 | శృంగారమో | శృంగారమో, |
| ,, | 18 | చున్నారు. | చున్నారు, |
| ౧౫౭ | 2 | మవ | మన |
| ,, | 3 | కలుగువట్లు | కలుగునట్లు |
| ౧౬౧ | 17 | ద్వితీయాశ్వాసమలో పట | ద్వితీయాశ్వాసము లోపటి |
| ౧౬౨ | 13 | స్వదేశీతమము | స్వదేశీమతము |
| ౧౬౯ | 20 | యుగొసావియా | యుగొస్లావియా |
| ౧౭౩ | 21 | సాపించ | స్థాపించ |
| ౧౭౭ | 22 | విజానులుగండు. | విజ్ఞానులుగండు. |
| ౧౮౧ | 4 | 5 | 4 |
| ,, | 12 | 1 | 15 |
| ౧౮౯ | 16 | ఫోర్టుసెంటుజార్జి | ఫోర్టుసెంటుజార్జి |
| ౧౮౭ | 5 | భూ యిష్టముగా | భూయిష్ఠముగా |
| ౨౦౬ | 16 శీర్షిక పైన | 'గ్రంథభాండాగారుల తరిబీతు' చేర్చవలెను. | |
| ౨౧౦ | 24 శీర్షిక | యాత్ర | యాత్రలు : |
| ౨౧౩ | 4 శీర్షిక | వివిధములు | |
| ౨౧౯ | 15 | అనుభవమును | అనుభవములను |
| ౨౨౮ | 10,11 | 2 పంక్తులు కొట్టివేయవలెను. | |
| ౨౩౫ | 5 | 194 | 1941 |
| | ,, | 9 9 | 1939 |
| ౨౩౯ | 2 శీర్షిక | ఆంద్రదేశ | ఆంధ్రదేశ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౨౩౯ | 1 | సూర్యప్రకాశ | సూర్యప్రకాశరావు |
| | శీర్షిక | | |
| ౨౪౦ | 4,5 | బారిషరు | బారిష్టరు |
| ౨౪౧ | 4 | 915_ 9 | 1915_19 |
| | 10 | గు టూరుజిల్లా | గుంటూరు జిల్లా |
| | 10,11 | గ్ర థాలయ | గ్రంథాలయ |
| ౨౪౨ | 22 | 1 21 | 1921 |
| ౨౪౩ | ,, | గ్రథాలయశాస్త్ర | గ్రంథాలయశాస్త్ర |
| | 24 | వరీకరణము | వర్గీకరణము |
| | 26 | ఆభ్యసించి | అభ్యసించి |
| ౨౪౪ | 10 | వేరు | పేరు |
| ౨౪౫ | 29 | ఆధ్యక్షతను | అధ్యక్షతను |
| ౨౪౬ | 18 | మనవేశములో | మనదేశములో |

# పదునొకండవ ఆంధ్రరాష్ట్ర గ్రంథాలయ మహాసభ,
# ఏలూరు

[ 1926 నవంబరు 30 ]

## శ్రీ నాళము కృష్ణారావు

గ్రంథాలయోద్యమ చరిత్రము

గ్రంథాలయోద్యమ ప్రస్తుత స్థితినిగూర్చి తెలిసికొనుట కా యుద్యమ చరిత్రమును కొంత స్మరింపవలసి యున్నది. ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమము రాజమహేంద్రవరమున 1899 వ సంవత్సరమున వీరేశలింగ పుస్తక భాండాగారమును స్థాపించిన నాటి నుండియు నించుమించుగ నారంభించినట్లు చెప్పవచ్చును. అంతకు పూర్వము దేశములో గ్రంథాలయములు లేవనికాదు. గ్రంథాలయముల స్థాపన మొక యుద్యమముగా మాత్ర మంతకు పూర్వము లేకుండెనని యనవచ్చును. ఈ గ్రంథాలయ స్థాపనమును గూర్చియు, తద్గ్రంథాలయ కార్యదర్శులు చూపిన యుత్సాహమును గూర్చియు వెల్లడియయిన కొలదిని ఆంధ్రదేశమునం దెల్లయెడల నచ్చటచ్చట చిన్నచిన్న గ్రంథాలయములు బయలుదేఱినవి. గ్రంథాలయములను నడుపవలసిన విధానమును గుఱించియు, అవి చేయవలసిన పనులను గుఱించియు నాంధ్రు లాలోచింపసాగిరి. ౧౯౧౧ వ సంవత్సరమున బెజవాడలో శ్రీ రామమోహన పుస్తక భాండాగారము స్థాపింపబడెను. ౧౯౧౪ వ సంవత్సరమునకు ఆంధ్రదేశమున 130 గ్రంథాలయములు స్థాపింపబడెను. ఆ సంవత్సరముననే అఖిలాంధ్ర దేశ గ్రంథాలయసభ బెజవాడలో జరిగెను. అందనేకులకు గ్రంథాలయోద్యమముపట్ల గాఢమగు నుత్సాహము జనించెను. ఆ సంవత్సరమున మఱి ముప్పది గ్రంథాలయములు పొడచూపినవి.

రెండవసభ ౧౯౧౫ వ సంవత్సరమున ప్రస్తుతము మన ప్రధానమంత్రులగు పానగల్లు రాజావారి యాజమాన్యమున రాజమహేంద్రవరమున జరిగెను. ఈ సభ యనేకవిధముల ముఖ్యమయినది. ఇంతకు పూర్వ ముత్సాహపూరితులగు సామాన్య యువకులచేత నిర్వహింపబడుచుండిన గ్రంథాలయోద్య మప్పటినుండియు పెద్దల దృష్టిలోనికి వచ్చినది. తక్కిన రాజకీయ సాంఘికాది ఉద్యమముల వలె గ్రంథాలయోద్యమమును నంత ముఖ్యమని నాయకుల మనస్సుల కెక్కినది. ఆనరబుల్ రామాయనింగారే గాక దివాన్ బహద్దరు మోచర్ల రామచంద్రరావుగారు, పాణకా పట్టాభిరామారెడ్డిగారు మున్నగు ప్రముఖు లీ సభయందు పాల్గొనుటయే యిందుకు నిదర్శనము. ఇందు చేయబడిన తీర్మానము లతి ముఖ్యములై యుండెను. తీర్మానములకంటె నా సభయందేర్పడిన ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘ సభ్యుల నిర్ణయము మఱింత ముఖ్యమైన దయ్యెను. ఆ సభ్యులలో నించుమించందఱును గౌరవోద్యోగములకు పెనగులాడువారుగాక ఉద్యమాభివృద్ధి కొఱకు బద్ధకంకణులయి యుండిరి. వారు సభ్యులయిన తరువాత వారొనర్చిన సేవ యమితమైయుండెను. అట్టి వారిలో సూరి నరసింహశాస్త్రిగారును, వారి సహచరులగు అయ్యంకి వేంకటరమణయ్యగారును ముఖ్యులు. వీరి ప్రయత్నములవలన నీ యుద్యమ మాంధ్రదేశ మందంతటను వ్యాపించినది. ఇప్పటికిని గ్రంథాలయోద్యమ మాంధ్రదేశమున సాగుచుండుటకు వీరి యుత్సాహాతిశయమే కారణమని చెప్పవచ్చును.

ఆంధ్రగ్రంథాలయోద్యమము వేళ్లుపాఱి నిలచియున్నదనుటకు ఛత్రపురము, బరంపురము, బారువా, విశాఖపట్టణము, పిఠాపురము, కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, బెజవాడ, గుంటూరు, నెల్లూరు, సికింద్రాబాదు, హైదరాబాదు మున్నగు స్థలములయందు గ్రంథాలయోద్యమాభిమానులు నిరంతరకృషి సలిపి స్థిరముగ నిలిపిన గ్రంథాలయములే సాక్ష్యము. ఈ గ్రంథాలయోద్య

మమునందు పనిచేసినవారిలో వెలిదండ శ్రీనివాసరావుగారు, కొడాలి శివరామకృష్ణారావుగారు, వేమూరు రాంజీరావుగారు, బెల్లంకొండ రాఘవరావుగారు, చట్టి నరసింహారావుగారు, చల్లా శేషగిరిరావు గారు, కొప్పా శ్రీరామశర్మగారు, మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు, తిత్తి బలరామయ్యగారు, మాడపాటి హనుమంతరావుగారు, అద్దంకి సత్యనారాయణశర్మగారు, యాతగిరి లక్ష్మీవేంకటరమణరావు గారు మున్నగు వారెందఱో చిరస్మరణీయులుగ నుండగలరు.

మూడవసభ ౧౯౧౬ వ సంవత్సరమున నెల్లూరులో జరిగినది. ౧౯౧౫ వ సంవత్సరమున 289 గ్రంథాలయములు ఆంధ్రదేశము నందు సాగుచుండెను. జిల్లాబోర్డుల వారును, మునిసిపాలిటీలవారును గ్రంథాలయములకు విరాళముల నిచ్చుచుండుట తమ విధ్యుక్తధర్మ మనుటను గుర్తింపసాగిరి. కొన్ని జిల్లా గ్రంథాలయ సంఘములు స్థాపితములయ్యెను. ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘ కార్యదర్శులు పలుతావులకేగి యుత్సాహమును బురికొల్పి క్రొత్త గ్రంథాలయములను స్థాపింపచేసిరి. కార్యదర్శులు బరోడారాజ్యమునకు యాత్రపోయి, అచ్చటి గ్రంథాలయోద్యమ విషయములను పరిశీలించి యందలి మంచి యంశములను ఆంధ్రదేశమునందు ప్రవేశపెట్ట బ్రయత్నించిరి.

మఱుసటి సంవత్సరమున అనగా ౧౯౧౭ వ సంవత్సరమున బారువలో చతుర్థాంధ్ర గ్రంథాలయ మహాసభ జరిగినది. ఆ సభకు నేడు మన రాష్ట్రమునకు విద్యామంత్రిగానున్న పాత్రోగారాహ్వాన సంఘాధ్యక్షులుగ నుండిరి. వారి అధ్యక్షోపన్యాసములోని యొక విషయమును మనము ఈ సందర్భమున గమనించవలసియున్నది. “గ్రంథాలయమువలన సామాన్య ప్రజలలో విద్యా వ్యాప్తియు, నాగరికతయు, గలుగుటయేగాక - పత్రికా పఠనమువలన ప్రాపంచిక జ్ఞానమును, పూర్వకవిప్రణీత గ్రంథపఠనమువలన వారి యున్నత భావనాగ్రహణమును, అన్యదేశ చారిత్ర పఠనమువలన మనోవికాస

మును తప్పక కలుగును. ధనికులును, పట్టణ వాస్తవ్యులును అగు కొందరికి ప్రస్తుతమున్న పాఠశాలలవలన ఒకవేళ సాధ్యమైనను అజ్ఞానాంధకారమున మునిగియున్న యెక్కువమంది బీదసాదలగు సామాన్య ప్రజల కివి పనికిరావు. వారికి ఉచిత గ్రంథాలయములు అవసరములు'' అని సెలవిచ్చిరి. ఈ యభిప్రాయము వారి హృదయ నిశ్చయమువలన గలిగినదో, తాత్కాలికోత్సాహము వలన గలిగినదోగాని వారు విద్యామంత్రి యయినతరువాత మాత్ర మిసుమంతయు గార్యరూపము దాల్చినదికాదు. వీరికి తమ యభిప్రాయమందు తమకైనను విశ్వాసముండినచో మంత్రి పదవియందుండిన యూఱు సంవత్సరములలో ఎన్నియో గ్రామములందు ఉచిత గ్రంథాలయముల నేర్పఱచుటకు తగిన యవకాశములుండెను. కాని యా యవకాశములను వీ రిసుమంతయు నుపయోగపఱచుకొనలేదు.

ఇట్లే ద్వితీయ గ్రంథాలయ మహాసభ కధ్యక్షులుగానుండిన మన ప్రధానమంత్రులగు పానుగల్లు రాజావారును "గ్రంథాలయోద్యమము ద్రవ్యైక సాధ్యమనునది తమకు సమర్పకమె. ఆంధ్రులలో ప్రభువులు, ధనికులు ననేకులు గలరు. అధైర్యపడ నక్కరలేదు. సర్వేశ్వరుడు గ్రంథాలయ ప్రయత్నములను సఫలము జేయుగాత!'' అని ఒక రిత్త కోరికను మాత్రము కోరి గోడమీాది పిల్లివాటముగ నూరకుండిరి. తాము ప్రధానమంత్రులయి విద్యామంత్రికి సలహా ఇయ్యగలవారయి యుండి, గ్రంథాలయోద్యమమున కించుక సహాయము చేయజాలకపోయిరి. ఈ విషయమయి మున్ముందు ప్రసంగించెదను. కాని యీా పెద్దలు చేయజాలని గొప్ప కార్యములను శ్రీ వావిళ్లవారు తమ శక్తికొలది కొంతవఱకైనను చేయగలిగిరి. గ్రంథాలయోద్యమమునకు శ్రీ వావిళ్లవారు చేసిన భూరిదానము ఆంధ్ర గ్రంథాలయోద్యమ చరిత్రమునందు చిరస్మరణీయముగా నుండగలదు. ఇప్పటితో నీ యుద్యమమునందు నూతనశక మారంభమయినది. ప్రతి మండలమునందును మండల గ్రంథాలయము లేర్పాటయి

నవి. మండల గ్రంథాలయముల క్రింద తాలూకా గ్రంథాలయములు లేచినవి. సంచార గ్రంథాలయములు బయలు దేరినవి. మాజికులాంతరుల సహాయ్యమున నుపన్యాసము లిచ్చుచు ఉద్యమాభిమానులు పల్లెలవెంట తిరుగుచు నూతన గ్రంథాలయములను స్థాపించుచు వచ్చిరి. పూర్వ మే యద్దె యిండ్లలోనో గృహస్థుల పంచలోనో కాలము గడుపుచున్న గ్రంథాలయములకు స్వంతభవనములు నిర్మింపబడినవి. దేవాలయములందు గ్రంథాలయములు ఏర్పరుపబడి ఉద్యమమున కాధ్యాత్మికదృష్టి కల్పింపబడినది. జిల్లాబోర్డులవారును, పురపాలక సంఘములవారును గ్రంథాలయముల కింకను విరివిగ విరాళములను నొసంగుచు వచ్చిరి. అప్పుడు జరుగుచున్న యుద్ధమునందు పాల్గొనుచున్న ఆంధ్ర సైనికుల యుపయోగార్థము 400 ఆంధ్ర గ్రంథములును, 3000 ఆంధ్రపత్రికలును పంపబడినవి. ఈ ఉద్యమ వ్యాప్తికి ఆనాడు శ్రీ సూరి వెంకటనరసింహశాస్త్రిగారు హిందూపత్రికకు వ్రాసిన వ్యాసమువలన ఆంధ్రగ్రంథాలయోద్యమమునుగురించి ఆంధ్రేతర మండలములవారు తెలిసికొని తమ మండలములందును నీ యుద్యమమును నెలకొల్ప ప్రయత్నపరులైరి.

ఇంతపని జరిగియుండుటచే విశాఖపట్టణమున ౧౯౧౮ వ సంవత్సరమున జరిగిన యైదవసభ యత్యుత్సాహ భరితమయి యుండెను. ఈ సభయందు ఓడిపోయిన ఒక తీర్మానమును గురించి మాత్రమిప్పుడు ప్రస్తావించెదను :—"ఆంధ్రమహాజన సభతో బాటుగ ఈ గ్రంథాలయ సభను ఆంధ్రమహాజనసభ జరుగు ప్రదేశములందే ప్రతి సంవత్సరము జరుపుచుండవలెనని, ఆ సభవారు చేసిన తీర్మానమును ఈ సభవారు అంగీకరించుచున్నారు" అనునొక తీర్మానము సభ యెదుటకు రాగా దానికి అనుకూలముగా 19 మంది, వ్యతిరేకముగా 171 మందియు వోట్లనిచ్చిరి. కాని యీ సూచన తరువాత సభలయందనుసరింపబడకుండెను. ప్రారంభ సంవత్సరమందు వలెనే ఇతర రాజకీయ సభలతోనే గ్రంథాలయ సభయు సాగుచున్నది. ఆ సంవత్సరమున గ్రంథా

లయోద్యమమునకు క్రొత్తబలము వచ్చినది. పిఠాపురమునందు ఆంధ్రపరిశోధక మహామండలి పక్షమున లిఖిత మాతృ గ్రంథాలయమును స్థాపించుటయే దీనికి తార్కాణము. ఇందు విషయమయి కృషి సలిపిన శ్రీ చెలికాని లచ్చారావుగారును, వంగూరు సుబ్బారావుగారును కీర్తిశేషులగుట గ్రంథాలయోద్యమమునకు గొప్ప కొఱతయని చెప్పకతప్పదు.

బాలభటోద్యమము

౧౯౧౭—౧౮ సంవత్సరములలో గ్రంథాలయోద్యమ పక్షమున నూతనోద్యమ మొకటి బయలువెడలినది. అదియే బాలభటోద్యమము. గ్రంథాలయములు పుస్తక దుకాణములు గావనియు, గ్రామమున కంతకును ఉపకరింపదగినట్టి సాంఘిక స్థానములనియు, సంఘసేవ చేయుటకు గ్రంథాలయములు తోడ్పడవలెననియు, ఆ సంఘసేవను ఎక్కువ శ్రద్ధతోడను, ఎక్కువ సమర్థతతోడను నిర్వహించుటకు బాలభటోద్యమము ముఖ్యాంగముగా నుండగలదను సదభిప్రాయముతో నిది ప్రారంభింపబడినది. ఈ యుద్యమమువలన ఆంధ్రదేశమున నప్పటికొక విధముగ మేలు కలిగినదని చెప్పక తప్పదు. గోదావరీ పుష్కర సమయమున నీ బాలభటులు యాత్రికుల కొనరించిన సేవ యనల్పము. అయినను గ్రంథాలయోద్యమమును బాలభటోద్యమమును ప్రత్యేకముగ నుంచుట రెండుద్యమములకును శ్రేయస్కరముగా నుండునని ఆనాడు తలంచియుంటిని. ఇప్పటికిని నా కా యభిప్రాయము మారలేదు. బాలభటోద్యమము ముందర గ్రంథాలయోద్యమము వెనుకకు పోయినదనియు, బాలభటోద్యమము కొంతకాలమునకు వెనుకకు జరుగగా తిరిగి గ్రంథాలయోద్యమము అభివృద్ధినొందుటకు తగిన యుత్సాహము దేశమునందు పొడచూపలేదనియు నేను తలంచుచున్నాను. గ్రంథాలయోద్యమము పక్షమున నిరంతరకృషి సలిపి యుండిన అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారే ఆంధ్రరాష్ట్రీయ ప్రధాన సైన్యాధ్యక్షులుగ

నుండి పనిచేయుటవలన బాలభటోద్యమమునకు తాత్కాలికాభివృద్ధిని గలిగింప గలిగిరి. కాని, గ్రంథాలయోద్యమమును కొంత కాలము విస్మరించిరని చెప్పిన నన్ను క్షమించెదరుగాక ! ౧౯౧౯ వ సంవత్సరమున ఆఱవ గ్రంథాలయ సభ చెన్నపట్టణమున గూడినది. ఇందు బాలభటోద్యమ మెక్కువ ప్రాముఖ్యములోనికి వచ్చినది. కాని అధ్యక్షుల యుపన్యాసమునందు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి వలయు సాధనములు చక్కగా నిరూపింపబడినవి. అట్టి సాధనములలో

1. గ్రామములయందలి ధర్మాదాయములలోనుండి వచ్చు ఆస్తిలో కొంతభాగము నీ యుద్యమమున కుపయోగించుట.
2. ఆయా వృత్తుల నవలంబించు వర్తకులు మొదలగు వారేర్పఱచుకొనుచుండు ధర్మనిధులయందుండి కొంత ధనమును వినియోగించుట.
3. సహకార సంఘములవారి అఖిలజనోపకారకనిధి * నుండి కొంత సొమ్మును వినియోగించుట.
4. కోలగారపు పాటలు, కాల్వపాటలు మొదలగు వానివలన వచ్చు ఆదాయమును వినియోగించుట.
5. ఏకప్రాంతమందున్న గ్రంథాలయములన్నియు అన్యోన్యాశ్రయ భావమును గల్గియుండుట.
6. గ్రామములోని వివిధ స్థానిక సమస్యా నిర్ణయములకు గ్రంథాలయమును కేంద్రస్థానముగా జేసికొనుట.
7. వివాహ కట్నములు.
8. పైసాఫండు.

మొదలగునవి ముఖ్యములు. ఈ సభయందే ఆంధ్ర గ్రంథాలయ ముద్రణాలయ మేర్పాటగుటకు అంకురార్పణ యయినది. ఈ ముద్రణాలయము ఇంతదనుక ఆంధ్ర గ్రంథాలయముల కెవ్విధమున

* సాముదాయకనిధి.

త్రోడ్పడినదియు, ముద్రణాధికారులె తెలుపవలసి యున్నది. ఇంత వఱకును సుమారేడువందల గ్రంథాలయములు ఆంధ్రదేశమున నెల కొనినవి.

తరువాతి చరిత్రము

ఆర్యులారా! గ్రంథాలయోద్యమ మత్యుచ్చస్థానము నొందిన సమయమును స్మరించి తరువాత ముందుకు మఱి సాగక వెనుకబడి యుండిన పిమ్మటి యవస్థను మీకు దెలుప మది పొడమినందుకు నన్ను క్షమింతురు గాక! "దేశముయొక్క దృష్టి రాజకీయమువంక కే నాడు మఱలెనో ఆనాడే గ్రంథాలయోద్యమము వెనుకకు పోసాగి నది. తొలుత నుండియు గ్రంథాలయోద్యమము రాజకీయోద్యమ ముతో గలిసి యుండుట బట్టియే యీ యవస్థ సంభవించినదని యింతకుపూర్వము మనవి చేసియుంటిని. దీనిని గూర్చి ముందు సవిస్తారముగా విన్నవించెదను.

ప్రభుత్వము - ప్రజలు

ఇట్టి యుద్యమము (1) ప్రభుత్వమువలన గాని (2) ప్రజల వలనగాని (3) ఇద్దఱివలనగాని నిర్వహింపబడవలెను. మూడవపక్షి మత్యుత్తమమైనది. కాని, పరాధీనావస్థయందున్న మనదేశమున నట్లు జరుగుటకు వీలులేదు. ప్రభుత్వమునకును, ప్రజలకును మన దేశమున నెంతో యెడమున్నది. ఎన్ని శాసనములు చేసినను సంపూర్ణ స్వరాజ్యము వచ్చినగాని యీ యెడ యెక్కింతయు తగ్గదు. మా ప్రభుత్వము మా కొఱకు మాచేత నిర్వహింపబడు చున్నదను విశ్వాసము ప్రజలయందు పుట్టినగాని ప్రజల యుద్యమము పట్ల ప్రభుత్వమువారు సానుభూతిని చూపి సహాయము చేయబూను కొనరు. కావుననే పైన వివరించిన మొదటి సాధనముకూడ గ్రంథా లయోద్యమముపట్ల నుపయోగింపకున్నది. ౧౯౧౯ వ సంవత్సరపు ఇండియా ప్రభుత్వ శాసనమువలన దేశమునకు స్వరాజ్యము చేకూరక పోవుట యట్లుండ, దేశమునందు జాతికిని జ్ఞాతికిని, వర్ణమునకును

వర్ణమునకును, ఉపశాఖకును ఉపశాఖకును నిరంతర వైరమేర్పడి జనులయందు సౌమనస్యమునకుబదులు పరస్పర ద్వేషాగ్నిని రవులు కొల్పుచున్నది. ఈ శాసనమువలన నేకొలదిమందికో యున్నతోద్యోగములు లభించుటతప్ప వారు దేశ హితైక జీవితముకొఱకు తమ యుద్యోగమును వినియోగించుట తటస్థించినదికాదు. పూర్వ మున్నతాభిప్రాయముల గలిగి రాజకీయరంగమున విహరించిన యుదార పురుషులు సైతము, ఉద్యోగ స్వీకరణానంతరమున తృష్ణాబద్ధులయి తమ పూర్వచరిత్రమును, పూర్వాశ్రమములను మఱచి యెట్లట్లో తమ యుద్యోగములను నిలుపుకొనుటయందే తత్పరులై యున్నారు. తమకు ప్రజాహితముగ సంచరించు నవకాశములున్నను తమపైవారి మెప్పులకై యీ యవకాశమును వినియోగించుకొన జాలకున్నారు. ఇందుకు మన ఆంధ్ర మంత్రు లిద్దఱును ఉదాహరణములు. ప్రధాన మంత్రులు రామారాయనింగారు రాజమహేంద్రవరమున నధ్యక్షులుగను, పాత్రో మంత్రిగారు బారువా గ్రామమునందాహ్వాన సంఘాధ్యక్షులుగను ఆంధ్రగ్రంథాలయ మహాసభలలో చెప్పిన యున్యాసముల నొక్కసారిప్పుడు చదువుకొన్నయెడల - ప్రత్యేక వ్యక్తులుగ నుండిన నాటియు, మంత్రిపదవి నందిన నాటియు అభిప్రాయముల తారతమ్యములను స్పష్టముగ బోధపరచుకొనగలరు. వీరు గ్రంథాలయోద్యమమునకు సహాయ్యము చేయవలెనన్న చేయజాలరా? వారే యస్వాధీనులుగ నున్నారు. గ్రంథాలయములకు సంవత్సరమునకు కొంత సొమ్మిచ్చు చున్నాముగదా యని యనవత్తురేమో! బిచ్చము-బిసాదు - పదివేల రూపాయలవలన, అదియైన దుష్కరములైన విధానములవలన - ఆంధ్రదేశములో ఉద్యమవ్యాప్తి యగునని పాత్రో మంత్రిగారు తలంచియుండిరికాబోలును! బీదసాదలకు ఉచిత పాఠశాలలతోబాటు ఉచిత గ్రంథాలయములుగూడ నుండవలెనని వీరు వచించిన మాటలను ఉద్యోగవశమున మఱచియుందురు. కాని,

లోకము వీరి మాటలనుబట్టిగాక, ఆచరణమువలననే వీరిని గుర్తింప గలదని మంత్రిగారు యోచించుకొందురుగాక !

రాజకీయము - గ్రంథాలయోద్యమము

ప్రభుత్వమువారు ప్రత్యేకముగాగాని, ప్రజలును, ప్రభుత్వమును కలిసిగాని యీ యుద్యమమును నిర్వహింప వీలులేనప్పుడు దానిని ప్రజలు స్వయముగనే నిర్వహింపవలెను. మనకు రాజకీయముల యందుండు నుత్సాహము ఇతరోద్యమములపట్ల నుండదు. తక్కిన యుద్యమములయందు శ్రమ యెక్కువయున్నది. ప్రత్యేక వ్యక్తులకా శ్రమకు తగిన ఫలము అణాపైసలలో కనిపించదు. ఆత్మ తృప్తియే తమకృషికి ఫలమని సాంఘికసేవకులు తలంచి సంతోషింప వలసియున్నది. రాజకీయమునందును, సంఘ సంస్కారోద్యమము నందును మాటల ధోరణి యెక్కువ యుపయోగ పడుచుండును. గ్రంథాలయోద్యమము, సహకారము మొదలగు వానియందు కాయకష్టమెక్కువ యవసరము. ఇదిగాక బాలభటోద్యమాదులందు వలె గ్రంథాలయోద్యమమునందు వీధులవెంట తిరుగుట, చక్కని దుస్తులను వేసికొనుట అను చిన్న చిన్న వేషములను వేసికొనుటకు గూడ తావులేదు. ఇట్టి యనాకర్షకమగు నుద్యమమును ఆకర్షకములగు రాజకీయాది ఉద్యమములతో గలిపినగాని లాభములేదని కొందఱి యభిప్రాయము. కాని యిది యుత్త భ్రమగాని వేఱుగాదు. పని చేయువారు కొలదిమందియైనను, వారి నిరంతర నిరాడంబర ఉత్సాహపూరితమగు కృషిచేతనే, ఆత్మలాభములనుగోరక, పర సేవాభిలాషతో గూడిన కృషిచేతనే గ్రంథాలయోద్యమ మెన్నటి కయినను ముందుకు వచ్చును. కాని రాజకీయాది ఉద్యమములతో దీనిని కలిపినందువలన నెట్టి లాభమును లేదు.

గ్రంథాలయములు - ఆంధ్రసాహిత్యపరిషత్తు

ఆంధ్రసాహిత్య పరిషత్తువారేర్పరచిన లిఖిత పుస్తక భాండా గార మాంధ్రగ్రంథాలయోద్యమమునుండి ప్రత్యేకముగా నిలిచి

యున్నది. ఇందనేకములగు నమూల్య గ్రంథములున్నవి. వీనిని పరిషత్తువారు ప్రకటించిన నెంతయు సమంజసముగ నుండెడిది. కొన్ని గ్రంథములు ప్రకటితములయినవిగాని, పదునాలేండ్లనుండియు సాగుచుండిన పరిషత్తు విశేష ధన సహాయమును బడసియు నెక్కువ పనిని చేయజాలకుండుటయు ప్రత్యేకముగా నిలువబడి యుండుటయు శోచనీయము! నిరంతరాందోళనమునకు ఫలితముగ తుదకు పరిషత్తును కాకినాడకు మార్చుట కొంత శుభసూచకము. కాని దానిని రాజమహేంద్రవరమునకు మార్చుటవలన నాంధ్రదేశమునకు ఎక్కుడు లాభకారియై యుండి యుండును. కాకినాడ చేరినను పరిషద్గ్రంథాలయము చెన్నపట్టణము నందున్నట్లే యున్నది. కాని యెట్టిపనియు జరుగుచున్నట్లు కనబడదు. దానిని రాజమహేంద్రవరమునకు మార్చి యుపయుక్తమగునట్లు చేయుదురుగాక యని కోరుచున్నాను.

చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

(కానిమోరా గ్రంథాలయము)

ఆంధ్రులకు ప్రత్యేక విశ్వవిద్యాలయము వచ్చినది. ప్రత్యేక రాష్ట్రముగూడ నచిరకాలములో రావచ్చును. చెన్నపురమున నున్న ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముగాని, కాని మోరా గ్రంథాలయముగాని, చెన్న విశ్వవిద్యాలయ గ్రంథాలయముగాని యాంధ్రుల అందుబాటులో లేవు. కుమార్తెయగు ఆంధ్ర విశ్వవిద్యాలయమును ప్రత్యేక కాపురమునకై పంపినప్పుడు తల్లియైన చెన్న విశ్వవిద్యాలయము కొంత యరణముతో పంపుట యుక్తమై యుండును. కాని అరవతల్లికి తెలుగు కూతురిపై నెట్టి ప్రేమ యున్నట్లు కాన్పింపదు. కావున కూతురు తండ్రియగు ప్రభుత్వముతో చెప్పుకొని పై మూడు గ్రంథాలయములలోని ముఖ్య భాగములను ఆంధ్ర విద్యా పీఠమునకు తెచ్చికొనవలసి యున్నది. ఇదిగాక ప్రభుత్వమువారు గ్రంథాలయముల కోసము పదిలక్షల విరాళముల నిచ్చియున్నారు. ఈ సొమ్మంత

యు చెన్నపట్టణమునందే సున్నము కొఱకును, ఇటుకల కొఱకును వినియోగమగునని వినుచున్నాము.

ఇది యెంతయు శోచనీయము! ఆంధ్ర గ్రంథాలయోద్యమాభిమానులీ విషయమై శ్రద్ధ తీసుకొని అందు సగభాగమునైనను ఆంధ్రదేశమునకు వచ్చునట్లు ప్రయత్నించినగాని కార్యములేదు. రానివాని చేతిరాయివలె ప్రభుత్వమువారి చేతులనుండి కొంత సొమ్ము వచ్చినప్పుడు దానిని చెన్నపట్టణమువారే వినియోగించుకొనజూచుట వారి స్వలాభపరత్వము జూపును. శాసనసభయందలి ఆంధ్ర సభ్యులును, ఆంధ్ర మంత్రులును నీ విషయమై యెట్లు ప్రవర్తింతురో చూడవలసియున్నది.

ఆంధ్ర విశ్వవిద్యాలయము - గ్రంథాలయము

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు తక్కిన విశ్వవిద్యాలయములకువలె స్వంత గ్రంథాలయమే ముఖ్యాంగముగా నుండవలసి యున్నది. అద్దె కొంపలలో దేవులాడుచున్న ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు స్థాపింపబోవు గ్రంథాలయ మెట్లుపకరించునో యాలోచించుకొనవలసి యున్నది. భవనములకంటెను, గాలరీలకంటెను, ప్రొఫెసరులకంటెను, వైసుఛాన్సెలరులకంటెను చక్కని గ్రంథాలయమే యుత్తమ విద్యాపీఠము కాగలదు. "సద్గ్రంథ సముదాయమే గొప్ప విద్యాపీఠము" అని కార్లైలు వచించిన సూక్తిని విశ్వవిద్యాలయాధికారులు మనస్సునందుంచుకొందురుగాక!

మహాశయులారా! మన గ్రంథాలయోద్యమముతో సంబంధములేని కొన్ని గ్రంథాలయములగూర్చి ముచ్చటించినందుకు నన్ను క్షమింపుడు. అయినను, వాని యభివృద్ధినిగూడ మనము గమనించుచుండవలయును. అవి స్థిరవసతులుగలిగి స్థిరసహాయముగ నుండియు, సర్వజనోపయోగముగ నుండకుండుటచే వానినిగూర్చి ముచ్చటింపవలసి వచ్చినది.

గ్రంథాలయములు - వాని విభజనము

పరదేశములయందు ఆ యా వృత్తులవారికి ప్రత్యేకముగా తమ వృత్తులయందు సహాయభూతములగు గ్రంథాలయములుండును. ఒక్కొక్క రీతి పరిశోధకుల కుపయోగించుట కాయా శాస్త్రములకు సంబంధించిన గ్రంథాలయములుండును. కొన్ని ప్రత్యేకము రాజకీయ విషయములకు ప్రత్యేకముగ సంబంధించినవై యుండును. ఈ రాజకీయ గ్రంథాలయములయందు ఒక్కొక్క పార్టీవారి కనుగుణమగు గ్రంథరాజములు గలిగిన గ్రంథాలయములై యుండును. ఇంగ్లాండు నందు లేబరుపార్టీ, లిబరలుపార్టీ, యూనియనిస్టుపార్టీ, కమ్యూనిస్టు పార్టీ మొదలగు పార్టీలవారు తమ యభిప్రాయములను వెలువరించు గ్రంథముల నన్నింటి నొకచోచేర్చి చదువుకొనుచుందురు. ఇదిగాక సర్వజనోపయోగకరములగు గ్రంథాలయములుండును. కాని మన దేశమున ప్రత్యేక విషయములనుగూర్చిన గ్రంథాలయములు లేవు. ఉన్న గ్రంథాలయములైనను సర్వజనోపయోగకరములుగను లేవు. గ్రంథముల నొకచోట చేర్చునపుడు ఒక యూహా ప్రకారము మనము చేర్చుటలేదు. ఆ వేళ కెవ్వరేది యిచ్చిన అది యంతయు గ్రంథాలయములయందు చేర్చుచున్నాము.

మనకున్న గ్రంథ సంపత్తి

మన గ్రంథాలయములలో సాధారణముగా కనబడు గ్రంథములలో నవలలును, కథలును, నాటకములును నెక్కువగ నున్నవి. రైల్వే వాఙ్మయము పెచ్చుపెరుగుచుండుటచే నిట్టి గ్రంథములే గ్రంథాలయములలోని కెక్కుచున్నవి. ఠవ్వంత ఖరీదుగల గ్రంథము మిక్కిలి ముఖ్యమయినది ప్రకటింపబడిన యెడల ధనాభావముచే దానిని చేర్చుకొనుటకు జంకుచున్నాము కాని, వేలకొలది నిరర్థక గ్రంథములుగల గ్రంథాలయముకంటె కొలదివైనను ఉద్గ్రంథములు కల గ్రంథాలయమే అతి ముఖ్యమైనదని తలంపవలెను. అందుచేత మనము ఉద్గ్రంథప్రకటనమును ప్రోత్సాహపఱుపవలసి యున్నది.

ప్రత్యేక వృత్తులవారి యభివృద్ధికి తోడ్పడు గ్రంథరాజములను గ్రంథకర్త లాంధ్రమున రచించునట్లు సహాయము చేయవలసి యున్నది. ఇంగ్లీషు మొదలగు యూరపియను వాఙ్మయములో ప్రపంచమందలి జ్ఞానవిజ్ఞానమంతయు బ్రతిఫలించుచున్నది. ప్రపంచ మందేభాగముననైన నొకభాషలో నుద్గ్రంథము ప్రకటింపబడిన యెడల అది తప్పక యూరపియను భాషలలోనికి పరివర్తనము చేయ బడుచుండును. అట్లే మన గ్రంథకర్తలును ఆంధ్రేతర వాఙ్మయము నుండి యాంధ్రములోనికి ముఖ్య గ్రంథములను తెచ్చుకొనవలయును. మతము, వేదాంతము, ప్రకృతిశాస్త్రములు, చరిత్రము మున్నగు వానిలో ఆంధ్ర గ్రంథజాల మభివృద్ధి పొందవలసియున్నది. మన మతము మనకు చాలునని యూరకుండగూడదు. ప్రపంచములోని మూలమతగ్రంథములన్నియు తెలుగులోనికి రావలయును. ఈ యుద్యమమును తలపెట్టిన రాజమహేంద్రవరమందలి ప్రపంచ మత గ్రంథమాలవారి యాశయము కొనియాడదగి యున్నది.

ఈ గ్రంథమాలయందు చిలుకూరి నారాయణరావుగారు రచించిన "ఖురానుషరీఫ్" ఆంధ్రవాఙ్మయమున కమూల్యాలంకార ముగ నున్నది. నేటి భారతవర్ష విషమస్థితిని తొలగింప నీ గ్రంథము మిగుల తోడ్పడగలదు. గ్రంథాలయములన్నియు నీ గ్రంథమును తప్పక కొని చదువరులు పఠించునట్లు చేయవలసియున్నది. ఇట్లే పాశ్చాత్యుల వేదాంత విచారములను దెలుపు నుద్గ్రంథములను మఱియొకరు ప్రకటింపబూనుకొనవలెను. కీర్తిశేషులు కె. వి. లక్ష్మణ రావుగారారంభించిన విజ్ఞాన చంద్రికా గ్రంథమాలయందు ప్రకృతి శాస్త్రములను ప్రకటించుటకు గట్టిగ పూనుకొనవలయును. కవిత్వ మునకును, నవలలకును, నాటకములకును నేడు చెల్లుబడియున్నది గాని పైన వివరించిన గ్రంథములకు లేదు. అయినను దేశమునకు వాని ప్రాముఖ్యమును గమనించి యట్టి గ్రంథప్రకటనమునకు బ్రోత్సా హము కలుగ జేయవలెను.

## పల్లెటూరి గ్రంథాలయములు

మన దేశ సౌభాగ్యమంతయు వ్యవసాయము మీద ఆధారపడి యున్నది. దేశములోని వృత్తులన్నిటిలో వ్యవసాయవృత్తి నవలంబించినవారు నూటికి 75 మంది యున్నారు. వీరు తమ వృత్తిని పురాతనకాలమందువలెనే సాగించుచున్నారు. కాని ప్రపంచమందలి యితర దేశములందువలె వ్యవసాయపద్ధతుల నభివృద్ధి చేసుకొన నించుకంతయు ప్రయత్నించుటలేదు. నానాటికి వ్యవసాయదారులును తమ వృత్తిని విసర్జించి యుద్యోగాపేక్షచే పట్టణములకు జేరుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయముగా నున్నది. వ్యవసాయమువలన గలుగు లాభమును వారికి నచ్చజెప్పుచు వారు దేశ సౌభాగ్యమునకు మూలకందములను సంగతి వారికి నచ్చజెప్పి గ్రామములయందే వారిని నిలుపవలెను. వారి వృత్తికనువగు గ్రంథాలయముల నేర్పాటు చేయవలసి యున్నది. పల్లెటూరి గ్రంథాలయములందును ఎడ్డిపోలో వంటి నిరర్థక వాఙ్మయమే కనబడుచుండుట విషాదజనకముగ నున్నది. పల్లెటూళ్లయందుండు పుస్తకములలో వ్యవసాయవృత్తికి తోడ్పడు గ్రంథము లెక్కువగా నుండుట ముఖ్యావశ్యకము.

ఇట్లే తక్కిన వృత్తులును అభివృద్ధినొందుటకు వలయు గ్రంథరాజములు బయలుదేఱవలెను. శిల్పము, వడ్రంగము, కమ్మరము, ఇంజనీరింగు, వైద్యము, లలితకళలు - వాస్తుపశుచికిత్స - మున్నగు వానిని గుఱించి యెన్నియో గ్రంథము లాంధ్రములోనికి రావలసి యున్నది.

## గ్రంథాలయములు - గ్రంథకర్తలు

ఇట్టి యుద్గ్రంథములు తెలుగులోనికి వచ్చుటయే దుర్లభముగ నున్నది. అట్టివానిని వ్రాయు సామర్థ్యముగల విద్యాధికులే యరుదుగ నున్నారు. సమర్థతగల వారున్నను వారు గ్రంథములను వ్రాయుట లేదు. వ్రాయబడిన వానికైనను ప్రోత్సాహము లేకున్నది. గ్రంథాలయములు ప్రశస్తములగుటకు మనము తోడ్పడవలెనన్న నిట్టి

ప్రశస్త గ్రంథప్రకటనమునకు గ్రంథాలయములు తోడ్పడవలయును. సమర్థులును, విద్యావంతులు నగువారు వ్రాసిన యుద్గ్రంథములలో పెద్దవానిని ప్రకటించుటకు విశేష ధన మత్యావశ్యకముగనున్నది. గ్రంథకర్తల దారిద్ర్యము జగత్ప్రఖ్యాతమై యున్నది. అట్టివారు తల తాకట్టుపెట్టుకొని వానిని ప్రకటించినపుడు వారి గ్రంథములను గ్రంథాలయముల కుచితముగ నిండని కోరుటకంటె పాతకముండ బోదు. కావున నీ విషయమై నేనును చేయబోవు నీ క్రింది సూచనను తమరు శ్రద్ధగా నాలోచింతురుగాక !

ఉద్గ్రంథ ప్రకటనమునకు ప్రోత్సాహము

ఆంధ్ర గ్రంథాలయసంఘ మొకటి స్థాపింపబడియున్నది. ఇది కొన్నియేండ్లక్రిందట కొంత మంచిపనిచేసినది. కాని యిప్పుడు దానికి తగినంత పనిలేదు. ఆ సంఘమందొక యుపసంఘ మేర్పాటు చేయవలెను. అందయిదుగురు సభ్యులుండిన జాలును. వీరి నేటేట జరుగు ఆంధ్ర గ్రంథాలయ మహాసభలో నెన్నుకొనవలయును. గ్రంథకర్తలీ యుపసంఘమునకు తాము రచించిన గ్రంథముల మూడేసి ప్రతులను పంపుచు ఒక్కొక్క పుస్తకమునకు రూపాయి చొప్పున రిజిస్ట్రేషను రుసుమును చెల్లింపవలెను. ఈ యుపసంఘ సభ్యులు తమకుచేరిన గ్రంథములను సావధానముగ జాగ్రత్తగ జదివి అందేవి ప్రశస్తములయినవో నిర్ణయించి ప్రతి మాసమునందును గ్రంథాలయ సర్వస్వమునందును, ధర్మగ్రంథాలయ పత్రికయందును ప్రకటించుటయేగాక, ఆంధ్రగ్రంథాలయ సంఘమునకు చేరిన గ్రంథాలయములకు దమ యభిప్రాయములను బంపవలెను. ఈ యుప సంఘమువారు గ్రంథాలయములందుండదగినవని నిర్ణయించిన గ్రంథ ములను గ్రంథాలయముల వారందఱును నిర్బంధముగ కొనుచుండ వలెను. రిజిస్ట్రేషను రుసుము మూలముగ వచ్చిన సొమ్మును పోస్టేజీ కొఱకుపయోగింపవలెను. గ్రంథకర్తలు పంపిన మూడు ప్రతులలో ఒకదానిని ఆంధ్ర కేంద్ర గ్రంథాలయమందును, తక్కినవి గ్రంథా

లయ సంఘమువారు నిర్ణయించు మరి రెండు గ్రంథాలయముల యందును నుంచవలయును. ఆంధ్రదేశమున అంతరించిన గ్రంథాలయ లయములు అంతరించిపోగా 500 గ్రంథాలయములయినను మిగిలి యున్నవని నా నమ్మకము. కావున నా సూచన తమ కంగీకారమైన యెడల గ్రంథకర్త లుద్గ్రంథములను ప్రకటించుటకు ప్రోత్సాహము కలిగించిన వారమగుదుము. 500 ప్రతులైనను చెల్లునుగదాయని వారికి ధైర్యము కలుగును. ఆంధ్రదేశమున చక్కని మూడు గ్రంథాలయములు స్థిరముగ నిలుచుట కవకాశ మేర్పడును.

ఆంధ్ర గ్రంథాలయములు – ఆంధ్రభాష

ఆంధ్రభాషా గ్రంథముల నభివృద్ధి చేయుటయే ఆంధ్ర గ్రంథాలయ స్థాపనమునందు ముఖ్యోద్దేశ్యమయి యున్నది. కావున ఆంధ్రమున ప్రకటింపబడు సమస్త గ్రంథములను సేకరించుటయందు గ్రంథాలయములు శ్రద్ధ తీసికొనవలసియున్నది. ఆంధ్రదేశమున నే యే విషయములను గుఱించి యెట్టి గ్రంథములు కావలసియున్నవో ఆయా గ్రంథాలయములవారు తెలియజేయుచు తమకు ధనమున్నయెడల సమర్థులగు వారిని సరిగ సత్కరించి వారిచేత గ్రంథములను వ్రాయించి ప్రకటింపబూనుకొనవచ్చును. సమర్థులగువారిచేత ఆంధ్రాది వాఙ్మయములను గూర్చియు, శాస్త్రాది విషయములను గూర్చియు, నాంధ్రమున నుపన్యాసముల నిప్పించుట తమ విధియని యెంచుకొనవలెను. ఎన్ని అవకాశము లున్నవో యన్నిటిని వినియోగించి ఆంధ్రభాషాభివృద్ధికయి పాటుపడవలయును.

ఇతరభాషలు

అట్లని ఇతర భాషలయెడ ననాదరము చూపవలెనని నా యుద్దేశ్యము కాదు. మన వాఙ్మయ మితర వాఙ్మయముల మూలముననే చాల వఱకు నభివృద్ధి చెందవలసియున్నది. ఆంధ్రమున కెంత ముఖ్యస్థానము నిత్తుమో సంస్కృతమునకును నంతటి గౌరవ స్థానమునే చూపవలెను. భారతీయ విజ్ఞానమంతయు సంస్కృతమునం దణగి

యున్నది, సంస్కృత గ్రంథములను సేకరించుట - అందలి విజ్ఞానము నాంధ్రములో ప్రసరింపజేయుచేయని యెంచవలెను. సంస్కృతము తరు వాత ఇంగ్లీషు మనకు చాల ముఖ్యమయినది. ఇంగ్లీషు ప్రపంచభాష, జీవద్భాష. అందు ప్రతి క్షణమునను నెన్నియో యమూల్య గ్రంథములు బయలుదేఱుచున్నవి. అట్టి భాషమీది శ్రద్ధచేకాకున్న స్పర్ధచేత నైనను, ఇంగ్లీషు గ్రంథములను సేకరింపవలసియున్నది.

ఆంధ్రభాష - దాని ప్రస్తుత స్థితి

ప్రస్తుత కాలమున ఆంధ్రులయందు భావనాశక్తి విజృంభించుచు నుత్తమ కవిత్వము బయలుదేఱుచున్నది. చక్కని వచన గ్రంథములు, ఖండకావ్యములు బయలుదేఱుచున్నవి. చారిత్రక పరిశోధనము తల యెత్తుచున్నది. నీతి, మతగ్రంథములు పైకివచ్చుచున్నవి. శాస్త్ర గ్రంథ ములును నచ్చటచ్చట పొడచూపుచున్నవి. పత్రికా ప్రకటనము నెడల నమితోత్సాహము ప్రబలియున్నది. ఇది యంతయు శుభసూచకమై యున్నది.

ఆంధ్ర విశ్వవిద్యాలయము - ఆంధ్రభాష

ప్రజలలో స్వభాషాభిమాన మిట్లు విజృంభించుచున్న సమయ మున ఆంధ్ర విశ్వవిద్యాలయము స్థాపిత మయినది. ఈ విశ్వవిద్యాల యము యొక్క ప్రధానోద్దేశములలో

"To promote the development of Telugu, Kanarese, Urdu and Oriya and their use as media of instruction and examination" ఒకటి.

ఆంధ్ర విశ్వవిద్యాలయము ఆంధ్ర భాషాభివృద్ధికి తోడ్పడిన సంతోషమేకాని మన పనిని మాత్రము మనము వదలిపెట్టగూడదు. ఈ విషయమై గ్రంథాలయములు తమ కర్తవ్యమును మఱువక నిరంతర కృషిని సలుపుచుండవలయును. ఆంధ్ర విశ్వవిద్యాలయము ఆంధ్రమును ప్రోత్సహింపకయున్న "నేతి బీరకాయ" వలెను, బంగారు పిచ్చిక వలెను నిలిచి ప్రజల సొమ్మును దిగమ్రింగుటకు మాత్రము తోడ్పడునని చెప్పక తప్పదు. అదియు మద్రాసు విశ్వవిద్యాలయమువలె ప్రజలకు పనికిరాక

గులాంఖానా గ్రాడ్యుయేట్లను తయారుచేయు నొక యంత్రమువలె పని చేయుచుండును. అట్టి యంత్రముతో మన కేమియు పనియుండదు.

గ్రంథాలయ సభలు - తీర్మానములు

గ్రంథాలయోద్యమము ప్రారంభించినది మొదలు నేటిదనుక గ్రంథాలయ సభలు ఏటేట జరుగుచునేయున్నవి. ప్రతి సభయందును పెక్కు తీర్మానములు కావింపబడుచునేయున్నవి. కాని ఆ తీర్మానము లలో నెన్ని తీర్మానములు అమలులో పెట్టబడినవో యించుక యొకసారి యోచించినచో అందు నూటికి పదియైనను ఉండునో, లేదో సందే హింపవలసి యున్నది. ఇట్లనుటచే గ్రంథాలయ సభయందు తీర్మానములు చేయరాదని నా యభిప్రాయముగ మీరు తలంపకుందురు గాక! గ్రంథాలయ సభ సమావేశమయినప్పుడెల్ల కేవలము తీర్మానములు ఉపపాదించుటతోను, బలపఱచుటతోను, చేతుల నెత్తుటతోను కాలము వ్యర్థపుచ్చక సభకు విచ్చేసిన ప్రతినిధులు ఒకరితో నొకరు పరిచయము చేసికొని వారివారి గ్రంథాలయ పరిస్థితు లెట్లున్నవో అన్యోన్య ప్రసంగ ముల మూలమున ముచ్చటించుకొనియు, ఇప్పుడిప్పుడు గ్రంథాలయము లను తీవ్రముగ నెదుర్కొనుచున్న సమస్యలను గూర్చి ఉపన్యాసముల చర్చించియు, అనగా—

1. గ్రంథాలయము లెట్లుండవలెనో
2. అవి నిర్వర్తించవలసిన విధు లెట్టివో
3. అందెట్టి గ్రంథములకు ప్రాధాన్యమీయదగునో
4. గ్రంథ వర్గీకరణము
5. గ్రంథ నియమావళి
6. గ్రంథ భాండాగారికుని విధులు

మున్నగు ముఖ్యవిషయముల గూర్చి సమర్థులైనవారిచే ఉపన్యాసముల నిప్పించుట మున్నగు ఆచరణరూపములగు క్రియాభాగమునందు ఎక్కుడు లక్ష్యము నుంచదగునేకాని కేవలము తీర్మానరూపమగు సిద్ధాంత భాగమునందు కాలహరణము చేయుట శ్రేయము కాదు. గ్రంథాలయ

సభల నెక్కుడు ఫలప్రదముగ జేయవలయునన్న ఇప్పుడు జరుగుచున్న విధానమును సంపూర్ణముగ మార్చివేయవలయును. గ్రంథాలయ సభల రాజకీయ సభలతోగాని, మఱి యే యితర సభలతోగాని ముడి పెట్టక ప్రత్యేకము జరుపవలెను. అధమపక్షము రెండు సంపూర్ణ దినములు వీనికై వినియోగింపవలెను. మొదటినాడు ఉదయము ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసము, అధ్యక్షుని ఉపన్యాసమును మధ్యాహ్నము ప్రతినిధులు ఒండొరులతో తమతమ గ్రంథాలయ పరిస్థితుల గూర్చి సంభాషణ రూపమున ముచ్చటించుకొనుటయు విషయ నిర్ధారణ సభయు, రెండవనాడుదయము గ్రంథాలయ సమస్యలనుగూర్చి ఉపన్యాసములును, మధ్యాహ్నము తీర్మానములును జరుపవలయును.

గ్రంథాలయ సభలు - రాజకీయ సభలు

తొలుదొల్త ఈ గ్రంథాలయసభలు కొన్ని సంవత్సరములు ప్రత్యేకముగ జరుపబడినవి. పిదప నివి ఆంధ్ర సభలతోనో, మండల సభలతోనో, రాష్ట్రసభలతోనో జంటచేయబడుచు వచ్చినవి. ఆకారణముననే నీసభలు తమప్రత్యేకవ్యక్తిత్వమును గోలుపోయి తద్దినముపెట్టువాని తమ్మునివలె పరిహాసభాజనము లగుచున్నవి. రాజకీయసభల యందలి తీవ్రములయిన ఆందోళనములందును, సంఘర్షణములందును మనము పాల్గొని చిత్తములందలి స్వస్థతయు, ప్రశాంతిని వీడి ఏకాఫీ వేళనో, భోజనసమయ విరామమునో ఈ సభల నిర్వహించి, ఏవియో నాలుగు పొడిపొడి తీర్మానముల నల్లిబిల్లిగ నల్లి కేవలము తంతు నడుపుచున్నారము. సంస్థను స్వతంత్రముగను, సర్వజన సమాదరణీయముగను నొనరింప వలయునన్నచో - ఈ సభలను జాతిమత రాజకీయ సభలతో ముడిపెట్టక ప్రత్యేకముగ జరుపునేర్పాట్లు కావింపవలయును.

గ్రంథాలయములు - వానితో నితర సంస్థలు

రాజకీయాది సంస్థలతో గ్రంథాలయోద్యమమును లంకె వేసినచో గ్రంథాలయోద్యమమునకు ముప్పు వాటిల్లునని యింతకుమున్నె వచించితిని. ఇతర సంస్థలతో గ్రంథాలయములను చేర్చినచో నెట్లు దొసగు

వాటిల్లునో, అట్లే గ్రంథాలయములయందు ఇతర సంస్థలను చేర్చినచో తప్పక యనర్థము వాటిల్లునని నా యభిప్రాయము. ఈ యుద్యమారంభ దినములలో కొన్ని గ్రంథాలయములతో రాత్రి పాఠశాలలు, అన్నదాన సమాజములు, నాటక సమాజములు మున్నగు నితర సంస్థలు చేర్చబడుచు వచ్చినవి. గ్రంథాలయోద్యమముతో బాలభటోద్యమమును జేర్చుటను గూర్చి నా యభిప్రాయము నింతకు పూర్వమే చెప్పియుంటిని. పెక్కు వత్సరములక్రింద నే నొకసారి తిరుపతి కేగినపుడు అచట "శ్రీ వెంకటేశ్వర దీనాన్న వస్త్రదాన పుస్తక భాండాగారము" అను నామమున నొక ఫలకము వ్రేలగట్టబడియుండుట చూచితిని. తోడనే నేను లోనికేగి కార్యదర్శితో ఆ విచిత్ర నామమును గూర్చి ప్రశ్నింపగా ఇంతకుముందు ఇది వేఱువేఱు సంస్థలుగ నుండెననియు, గ్రంథాలయమునకు స్వంత భవనము లేకపోవుటచే అన్నదాన సమాజముతో జేర్చినచో గ్రంథాలయమునకు భవనము లభించుటయేగాక మునుపటికంటె నెక్కువ వృద్ధికరముగ నుండుననియు, కావున ఈ రెండు సంఘములను ఒకటిగ జేర్చి రెండు సంస్థల పరిపాలనము గ్రంథాలయము వారే నిర్వహించుచున్నారనియు జెప్పెను. పిదప మరిరెండు సంవత్సరములకు నేను మరల తిరుపతి కేగుట తటస్థించినది. అప్పుడు గ్రంథాలయమును గూర్చి విచారింపగా అన్నవస్త్రదానము లటుండగా, గ్రంథదానము మాత్రము విశేషముగ జరిగియుండుటచే గ్రంథాలయ మంతరించెనని వింటిని. పరస్పర సంబంధములేని భిన్నభిన్న సంస్థలు ఒకదానితో నొకటి కలిపి కలగూరగంప చేసినచో నిట్టి దుర్గతికి పాల్పడునని అప్పుడు నేను తలంచితిని.

గ్రంథాలయ వాఙ్మయము

Libraries are the Wardrobes of Literature, whence ornament, much for men properly informed might bring forth something for ornament, much for curiosity, and more for use.

—*J. Dyer*

The true University in these days is a collection of books.

*Carlyle*

Recorded thought is our chief heritage from the past, the most lasting legacy we can have to the future.

Books are the most enduring monuments of man' s achievements. Only through books can civilisation become cumulative.

— *Frederick Crundens*

When I enter a Library I feel as if almost the dead were present, and I know if I put questions to these books, they will answer me with all the faithfulness and fullness which has left in them.

— *John Bright*

A Library is itself a cheap University.

— *Sidgwick*

I would rather be a poor man in a garret with plenty of books than a king who did not love reading.

— Macaulay

I ever look upon a Library with the reverence of a temple.

— *Evelyn*

Riches have no charms compared to the charms of literature.

— *Ringlebergh*

I choose free Libraries as the best agencies for impoving the masses of the people, because they only help those who help themselves. They never pauperize. A taste for reading drives out lower tastes.

— *Andrew Carnegie*

ఒక జాతియొక్కగాని, సంఘముయొక్కగాని విజ్ఞానమును దెలిసికొనవలయునన్న వానిని గూర్చి వ్రాయబడిన వాఙ్మయమును బట్టియు, సామెతలనుబట్టియు తెలిసికొనదగును. పాశ్చాత్య దేశములందు గ్రంథాలయ నిర్మాణము - పుస్తక వర్గీకరణము - గ్రంథ నామావళి మున్నగువాని గూర్చి వందలకొలది గ్రంథములు రచింపబడినవి. గ్రంథాలయోపయోగములు గూర్చి తెలుపు సామెతలు, నిర్వచనములు కుప్పలు తిప్పలుగ నున్నవి. మన దేశమున నట్టివానిని గురించి వ్రాయబడిన గ్రంథములుగాని, సామెతలుగాని మందుకైనను గానరావు. దీనిని

బట్టి పాశ్చాత్య దేశములందలి గ్రంథాలయోద్యమముతో మన దేశము నందలి యుద్యమమును సరిపోల్చి చూచిన మనదేశ మీ విషయమున నెంత యధమస్థితిలో నున్నదో పరికింపవచ్చును. ఆంగ్ల భాషయందు గ్రంథాలయములను గూర్చి అచటి విజ్ఞాన సంపన్నులు వ్రాసిన సామెతలు, నిర్వచనములు మచ్చునకై కొన్ని దిఙ్మాత్రముగ ప్రదర్శించితిని.

ఇట్టి యుత్తేజకరములగు సామెతలు మన గ్రంథాలయ వాఙ్మయమున కొక్కటియేని గలదా? శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు భిక్షపెట్టిన "వాయు వెల్లరకు నెట్లు స్వాధీనమై..." అను సామెత యొక్కటియేగదా మన వాఙ్మయమున కెల్ల దిక్కు! పోనిండు, పుస్తక వర్గీకరణమును గురించిగాని, గ్రంథ నామావళి గురించికాని యింతదనుక నొక పుస్తకమైన వెలువడినదా? కడకు తమ గ్రంథ నామావళుల నచ్చొత్తించిన గ్రంథాలయములైన గలవా? అట్టి దింతదనుక గౌతమీ గ్రంథాలయము, హైదరాబాదు నందలి శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము తక్క నాకు తెలిసినంతవఱకు కొండొకటి గన్పట్ట కున్నది. ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయమని పేరుపెట్టుకొన్న రామమోహన గ్రంథాలయమునకే ముద్రిత గ్రంథ నామావళి లేనప్పుడు తక్కిన గ్రంథాలయముల మాట చెప్పనేటికి? ఇంతకు మనము గర్వపడవలసిన దెల్లను ఈ యుద్యమమును గూర్చి ప్రకటించు 2, 3 పత్రికలు కలవని మాత్రమే. అందు రెండు తెనుగునను, ఒకటి ఆంగ్లమునను ప్రకటింపబడుచున్నవి. ఆ తెనుగు పత్రికలు రెండును తగిన యాదరము లేక కొనయూపిరితో ప్రచారము చేయుచున్నవి. గ్రంథాలయ శ్రేయము నభిలషించి దాని యభివృద్ధికై పాటుపడుచున్న రెండు తెనుగు పత్రికల నయినను మనము పోషించుకొనజాలనినాడు మనకు ఈ సభ లేల? ఈ అట్టహాస మేల? ఈ పటాటోప మేల? ఈ సభలకై మనము వెచ్చించు ధనముతో నిట్టి పత్రికల నేల పోషింపరాదు?

ఓ గ్రంథాలయాభిమానులారా! ఏల యింకను దీర్ఘ నిద్రను వహించెదరు? ఏల యింకను శుష్కవచనములతోను, శూన్య హస్తములతోను టాలామాలపు తీర్మానములు గావించుటతోను ప్రొద్దు

గడపెదరు. లేచి నడుముకట్టుకొని గ్రంథాలయ వాఙ్మయము నెల్ల విధముల నభివృద్ధి పఱుపుడు. గ్రంథాలయములు సరస్వతీదేవి ఆలయము లనియు, జాతి మత సంఘ రాజకీయ విషయములతో నెట్టి సంబంధమును లేక లోకకల్యాణమునకై సర్వతోముఖముగ పాటుపడు నుత్తమ సంస్థ గ్రంథాలయోద్యమ మొక్కటియే యనియు, ఊరూర దిరిగి ఉచ్చైస్స్వనమున నుద్ఘోషింపుడు. "గ్రంథాలయములు గల నరకమున నైన నివసింప నిచ్ఛగింతునుగాని, గ్రంథాలయములు లేని స్వర్గమున నిముసమైన నివసింపనొల్ల" అను నిట్టి సామెతల వేనవేలు మీ వాఙ్మయమున నలంకరింపజేయుడు.

గాలి లేకున్న నెట్టిటో గడపవచ్చు,
గ్రాసమును లేక అవలీల గడపవచ్చు
గడపవచ్చునె మనమొక్క గడియయైన
గ్రంథ భాండారములు లేని కాలమందు.

అను భావములు గల గీతికలు వేనవేలు రచించి ముక్తకంఠములతో పాడుచుండుడు. అప్పుడు మన గ్రంథాలయోద్యమము పాశ్చాత్య గ్రంథాలయములతో పాటు తులదూగుచు మనము ప్రత్యేక జాతి, వ్యక్తిత్వము గలవారమను యశము నార్జించినవారమై, మన మాతృదేశమును భావ దాస్యశృంఖలములనుండి విడిపించి సాటి దేశములలో తలయెత్తికొని తిరుగగలవార మగుదుము.

ఇంతదనుక గ్రంథాలయ మహా ప్రబంధములోని మంగళ గీతికల నాలాపించితి. ఇంక విషాద గీతికల విలాపింపవలసిన యవస్థ వచ్చినది. ఇంతవఱకు గ్రంథాలయములు చిన్న చిన్న పాములనోట బడకుండ నిచ్చెనలనెక్కి గమ్యస్థానమునకు చేరువకు వచ్చినవి. ఇంతలో పెద్దపాము నోటబడి యధఃపతనము నొందనున్నవి. కులకక్షలచే కొన్ని గ్రంథాలయములు కూలనున్నవి. కొన్ని అప్పులలో మునిగి ముప్పులపాలు కానున్నవి. ఒక గ్రంథాలయము కోర్టున కీడ్వబడినది. ఒకటి వేలము వేయబడుటకు సిద్ధముగ నున్నది. గ్రంథాలయోద్యమమే తమ జీవితాదర్శముగ నిడుకొని, గ్రంథాలయ కార్యములే తమ యుచ్ఛ్వాస

నిశ్వాసములు కాగా దాని యభివృద్ధికై తను ప్రాణ మాన ధనముల ధారపోయుచు పాటుపడుచున్న గ్రంథాలయ దాసులు పత్రికారంగమున క్రూర నిష్ఠుర వాక్య బాణ పరంపరలకు గుఱియగుచున్నారు. ఇట్టి దుర్గతి గ్రంథాలయముల కేల పట్టవలయును? మిన్నువిఱిగి మీద పడినను ఒకరిజోలికి పోవక, జాతి మత రాజకీయ విషయములతో నెట్టి జోక్యమును గలిగించుకొనక, చేతనైనకొలది జనుల కుపకారము సలుపుచు, నిరాడంబరముగ ప్రొద్దులు పుచ్చుచున్న గ్రంథాలయములకా యిట్టి దురవస్థ! గ్రంథాలయములన్న ప్రజలకింత పలుచనయా?

గ్రంథాలయోద్యమము ఆంధ్రుల వ్యక్తిత్వ జీవనమున కొక చిహ్నముగా నున్నది. అనేక ముఖముల వ్యాపించి విజయయాత్ర సలిపిన ఆంధ్ర మహోద్యమ కల్పవృక్షమున నీ యుద్యమమొక శాఖగా నున్నది. ఈ శాఖయందు పూచిన పూవులును, కాచిన కాయలును, పండిన పండ్లును ఆంధ్ర మహాజనుల కతి ప్రీతికరముగ విలసిల్లినవి. ఈ కల్పద్రుమమునకు దోహదముచేసిన మహాపురుషు లందఱికిని మన కృతజ్ఞతా వందనము లర్పింపవలసియున్నది. ఇందు బనిచేసినవారిలో కొందరిపేర్లు పైకి వినబడినవి. కొందఱు నిరాడంబరముగా పనిచేసి యాత్మతృప్తి నొందియున్నారు. అట్టివారిలో యాతగిరి లక్ష్మీవేంకట రమణగారొకరు. ఇట్టి యుత్సాహవంతులగు యువకుల నిరంతర ప్రయత్నముల వలన కొండలు పిండికాగలవు. అట్లాంటిక్ మహా సముద్రమునకు వంతెన లేర్పడగలవు. అపవాద ప్రభంజనములు శాంతిల్లగలవు. ఆత్మశక్తియందు విశ్వాసము, విశ్వాసమునకు తగిన యుత్సాహము, ఉత్సాహమునకు తగిన యోర్పు, ఓర్పునకు తగిన కృషి, కృషికి తగిన ఫలాపేక్ష, ఫలాపేక్షకు తగిన కార్యసిద్ధి ఇవి యన్నియు నవీనాంధ్ర లోకమున విస్పష్టములయినవి. కావున ఆంధ్రు డధునాతన ప్రపంచమున తల యెత్తుకొని తిరుగుచున్నాడు. సాటివారిలో మేటి యగుచున్నాడు. ఇట్టి యీ గుణము లాంధ్రునియందు నిలిచియుండి యాతని మూలమున లోకమునకు మంగళము చేకూరుగాక! సర్వజనులు సుఖానుభూతిచే నలరారుదురుగాక! ఓమ్-తత్-సత్.



— శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి వ్రాతపతినుండి

# పదవునాడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## గుంటూరు

[28-7-1928]

### శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి

విద్యయనగా అక్షరజ్ఞానరూపమున చక్షురింద్రియ ద్వారమున గ్రహింపతగినది మాత్రమేకాదు. శాస్త్ర పురాణోపన్యాసాది శ్రవణ సాధనముచే శ్రోత్రేంద్రియద్వారమున గ్రహింపతగినదియు విద్యయే. మన స్సంస్కార సాధనములగు నీ యుభయాంశములలోను శ్రోత్రేంద్రియమూలకమగు రెండవ యంశమునకే ప్రపంచమున ప్రాచుర్యముకలదు. మన వేదములు, శ్రుతులు — మానవులలో అక్షరజ్ఞానరహితులగు వారి జ్ఞాన విజ్ఞానసంపత్తి యంతయు శ్రుతిమూలకమే. ఏదేశమందైనను సాక్షరులసంఖ్య పరిమితమే. మనదేశమున అట్టివారి సంఖ్య అత్యల్పము. ఇక నక్షరజ్ఞానములేక పెద్దవారైన గతియేమి? అరువది సంవత్సరముల వాని కక్షరాభ్యాసము దుష్కరము కదా! అట్టివారి జ్ఞానవిజ్ఞాన లబ్ధికి శ్రోత్రేంద్రియమే శరణ్యము. కావున ప్రతి గ్రామమునను కల్గిన వారి పిల్లల విద్యా సంస్కారమునకై పగటి బడులును, లేనివారి పిల్లలసంస్కారమునకయి రాత్రి బడులనేగాక, పెద్దల సంస్కారమునకయి గ్రామకూటములు కూడ నేర్పడియుండవలెను. గ్రామకూటము లన నేమో వివరింప వలసియున్నది. గ్రామములోని పెద్దలందరును జ్ఞానాభివృద్ధికయి యొకచోట సాయంసమయమున సమావేశమయి వారములో కొన్ని దినములు ప్రాచీన శాస్త్రపురాణాది శ్రవణ మూలమున తమ దేశీయ సంప్రదాయ విజ్ఞానమును, ఆత్మజ్ఞానమును - మరికొన్ని దినములు ఆధునిక శాస్త్రవార్తాపత్రికాది శ్రవణమూలమున ఆధునిక జ్ఞానమును సంపాదింపవలెను. ఇందులకై ప్రతి గ్రామమునను నొకమందిరము నిర్మింపబడియుండవలెను. ఇట్టి సంస్థలే గ్రామకూటములు. పిన్నల విద్యాభివృద్ధికి



శ్రీ నాళము కృష్ణారావుగారు



శ్రీ శరణు రామస్వామిచౌదరిగారు

పగటి బడులును. పెద్దల సంస్కారమునకయి గ్రామకూటములును ప్రతి గ్రామమునను ఏర్పడి, ప్రజలకుకొంత సంస్కారము కలిగించి, వారిని జ్ఞానగ్రహణోన్ముఖులను చేసిననేకాని, ప్రజాప్రబోధమునకై నేడు నానా ముఖముల సాగుచున్న ఉద్యమములెల్ల నిర్వీర్యములును, నిష్ఫలములు నగును. క్షేత్రము చక్కజేసినగాని బీజములు నాటుకొని అంకురించనేరవు. పైనచెప్పిన త్రివిధసంస్థలు లేనిచో మనవార్తాపత్రికలుగాని, ధర్మోపన్యాసములుగాని స్వదేశోద్యమముగాని, తదితర ప్రతిష్ఠాపనములుగాని ఫల ప్రదములు, జయశీలములును గానేరవు.

ఈ విషయమున గ్రామకూటములకు సహకారులై గ్రంథాలయములు చేయవలసిన పని యపారముగానున్నది. గ్రంథాలయముల వివరమును, అవి ఇప్పటికొనర్చుచున్న మహోపకారవిషయమును ఇక్కడ సమావేశమైన వారికెల్లను తెల్లమైనదే కావునను ఆవిషయములు తర్వాత నుపన్యసించు నధికృతులు సెలవిచ్చెదరు కావునను సంగ్రహముగా వివరించి విరమించెదను. గ్రంథాలయములనగా పైనజెప్ప బడిన జ్ఞానవిజ్ఞానముల మూలమున మనుజునకు గావలసిన సంస్కారములను అలవరచు గ్రంథసామగ్రిని సాకల్యముగ సేకరించియు, భద్రపఱచియు, ఆ గ్రంథములను జనోపయోగమునకయి యిండ్లకు బంపుచుండియు మహోపకారకములయి రాజమహేంద్రవరము, బెజవాడలో నగు పెద్ద పట్టణములలో నెలకొల్పబడిన మహాసంస్థలు. ఇట్టిగ్రంథాలయములు శారదా పీఠములు. అవియొకరీతికళాశాలలే, ఇట్టిసంస్థలమూలమున నమెరికా మొదలగు పశ్చిమదేశములలో జరుగుచుండిన మహోపకారమును గుర్తించియే లోకానుగ్రహ కాంక్షులగు మహాపురుషులు మనదేశములోనే అట్టి సంస్థలను ప్రతిష్ఠింపసాగిరి. దేశపురోభివృద్ధి పథమున నన్ని విషయములలోను అగ్రయాయియగు బరోడా మార్గదర్శి యయ్యెను. ఆ సంస్థానమున నిట్టి సంస్థలు ప్రభుత్వ యాజమాన్యమున సాగుచున్నవి. తక్కిన స్వదేశసంస్థానములు బరోడాచూపిన త్రోవయే పట్టుచున్నవి. ఆంధ్రదేశమున 1898 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున స్థాపింపబడిన వీరేశలింగ గ్రంథాలయము ఈ ఉద్యమ ప్రథమఫలము. ఇదియే

తర్వాత గౌతమీ గ్రంథాలయమయినది. 1899 లో భీమవరంతాలూకా కుముదవల్లి గ్రామమున వీరేశలింగ గ్రంథాలయము అనుపేరనొక గ్రంథాలయమును, 1911 వ సంవత్సరమున బెజవాడలో రామమోహన గ్రంథాలయమను పేరనొకటియును ప్రతిష్ఠింపబడియున్నవి. నేటికి స్వంత మందిరములును, కొంతయాస్తియుగల గ్రంథాలయములు ఆంధ్ర దేశమున సుమారు అరువదివరకును గలవు. నామమాత్రముగా నున్నవి కొన్ని వందలుగలవు. ఇవిగాక మునిసిపాలిటీ మొదలగు స్థానిక సంస్థలచే నెలకొల్పబడినవియు కొన్ని గలవు. కాని వీని సంఖ్యయు, చేయవలసిన పనియు కావలసినదానిని విచారించిన అత్యల్పమని చెప్పకతప్పదు. 1913 వ సం॥న నాంధ్రోద్యమము వచ్చినదాక యీసంస్థలు ప్రత్యేకవ్యక్తులుగ పని చేయుచుండెను. వీనికి సమిష్టిజీవిత మేర్పడి ఈ విషయమున సాగుచుండెడి ఉద్యమము యేకముఖమయి బలపడలేదు. 1914 వ సం॥న బెజవాడలో ఆంధ్ర గ్రంథాలయ సంఘమను పేర నొక సమిష్టి సంస్థ యేర్పడి గ్రంథాలయ సర్వస్వ పత్రికాముఖమున ఈ యుద్యమ ప్రచారము సాగించినది. ఆ కాలమున ఈ గ్రంథాలయోద్యమమును, వార్తాపత్రికోద్యమమును కొంత ప్రబోధము కల్గించినవి. కాని మన దేశమునకు పూర్వోక్తమైన ఈశ్వరోద్దిష్ట ప్రయోజనము సిద్ధించుటకై వలయు సంస్కార మలవరచుట అదృష్టశ్రుతపూర్వమగు మహాకార్యము. ఇట్టి కార్యభార నిర్వహణము కొనసాగించుటకు గ్రంథాలయము లుత్కృష్ట సాధనములు గాజాలియున్నవి. పైన చెప్పిన ప్రతి గ్రామ కూటమునకును అనుబంధముగా నొక్కొక్క గ్రంథాలయ మేర్పడి పనిచేసినచో నీ యుద్యమ బీజములు నలుదిక్కుల నాటుకొని, అంకురించి, కొనలు సాగి, శాఖోపశాఖలబెంచి దేశమును గప్పగలవు. పగటి పాఠశాలలకును, రాత్రి పాఠశాలలకును గ్రంథాలయములును, గ్రామ కూటములును అనుబంధములుగా నేర్పడి, అందు నేర్పబడు విద్య విషయమున పైన వివరింపబడిన కొదువలు తీర్చినగాని విద్యాబోధ సర్వతోముఖముగ సాగజాలదు. ఈ చతుర్విధ సంస్థల విషయమునను వానిలో వాని కుండవలసిన యన్యోన్య సహకార భావమును గురించియు కొన్ని విషయము లుపన్య

సింపవలసియున్నది. గ్రంథాలయమున కార్యదర్శియు, నధ్యక్షుడు నుండును. బడులలో కొంద రుపాధ్యాయు లుందురు. వీరుగాక గ్రామములోగాని, తత్పరిసర గ్రామములలోగాని ఆంధ్ర గీర్వాణములుగాని, యొక యాంధ్రమేగాని తెలిసిన పండితు డొక డుండకపోడు. మరియు నీ కాలమున ప్రతి గ్రామములోను ఆంగ్లభాషా జ్ఞానమును, ఆధునిక సంస్కారమును గల యొకరిద్దరు వ్యక్తులుందురు. వీరల సాహాయ్యమున పైన వివరించిన జ్ఞాన విజ్ఞానబోధ సాగించు పనిలో నపార సౌకర్యము లొదవును. గ్రామవాసులీ యుత్కృష్ట కార్యము నిర్వహించుటకుగాను మాసమున కిరువది రూపాయలు చందాల రూపమున చేర్చవచ్చును. కోర్టు దావాలు తగ్గించుకొని పంచాయతీలచే తగవులు దీర్చుకొని యందుకు ప్రతిఫలముగా కొంత మూలధనమును గూర్చిన నీ కార్యమున కెంతయు సాహాయ్యభూతమగును. లేదా లోకలు బోర్డులు మొదలగు స్థానిక సంస్థల భిక్ష నపేక్షింపవచ్చును. ఈ మొత్తములో మాసమునకు పది రూపాయల వేతన మేర్పరచిన పండితుడు దొరకును. అంతియ వేతనమొసంగిన ఆంధ్ర వార్తాపత్రికలను, ఆంధ్రములో రచింపబడిన యాధునిక శాస్త్రగ్రంథములను జదివి అందలి విషయములు గ్రామ కూటములో సమావేశమయినవారికి దెలుపగల యొక వ్యక్తి లభ్యమగును. అనేక సందర్భములలో బడులలోని యుపాధ్యాయులీ పనికి అమరియుందురు. ఇట్టివారి సాహాయ్యమున వారములో కొన్ని దినములు ఆరోగ్య శాస్త్రము, కృషి శాస్త్రములోను గాగల యాధునిక విజ్ఞానమును కొన్ని దినములుగాని, ప్రతి దినమును అరగంట కాల కాలముగాని లోకవార్తలను సమావేశమయినవారికి బోధింపవచ్చును. పైన చెప్పిన పండితుని మూలమున కొన్ని దినములు పురాణాది కాలక్షేపాదులచే సనాతన ధర్మోపదేశమును, పరమార్థవిషయ బోధయు సాగింపవచ్చును. గ్రంథాలయమున కనుబంధముగా కొన్ని యాంధ్ర వార్తాపత్రికల దెప్పించుచుండవలెను. అట్లయిన కావలసిన గ్రంథములకును, పత్రికలకును కొదువ యుండదు. గ్రంథాలయాధ్యక్షుడును, కార్యదర్శియు, గ్రామవాసులును గ్రామములో కొంత పలుకుబడియు, కొంత

సంస్కారమును గలవారై యుందురుగాన వారే గ్రామ కూటమున కధ్యక్షుడును, కార్యదర్శియునై యుండి, పైన చెప్పిన కార్యభారము నిర్వహింప దక్షులయి యుందురు. ఇట్టివారు విక్షేపము లేకుండ నిశ్చల దీక్షతో కార్యభారము నిర్వహింపగలుగుటకుగాను స్వతంత్ర జీవనులును, గ్రామ కక్షలలో జేరనివారును, పరోపకారరతులును, నయశీల సంపన్నులునుగా జూచి ఏర్పఱచుకొనవలెను. అట్టి వీ రప్పుడప్పుడు స్థలాంతర విద్యాధికుల నాహ్వానించి గ్రామస్థుల సమావేశము చేసి వారి జ్ఞానాభివృద్ధి కొఱకును, ఉద్బోధము కొఱకును ఉపన్యాసములను, చర్చలను జరిగించవలెను.

ఈ సందర్భమున ప్రజాప్రబోధమున కుత్తమ సాధనమగు ప్రచారకుల సంఘమునుగురించి కొంత చెప్పవలసి యున్నది. ఇది శాఖాచంక్రమణమేమోయని భ్రమపడుదురేమో. అట్టి భ్రమ అసాంపృతము. పైన చెప్పినదానినిబట్టి గ్రంథాలయము సర్వవిధములయిన జ్ఞానవ్యాపక సంఘములకును, ప్రచార సంఘములకును శరీరావయవసముదాయమునకు శిరమువలె నుత్తమాంగముగా నుండవలసినది. జ్ఞానవ్యాప్తికిని, ధర్మప్రచారమునకును సాధనభూతములగు సర్వసంస్థలకును, గ్రంథాలయములకును అంగాంగ సహకారభావముకలదు. గ్రంథాలయము ప్రధానాంగము. తదితరములు దానిపై పరామరికకులోనై అదిచేయుపనిలో దానికి సహకారులై దానిప్రాపున పోషణవర్ధనములనందునవై ప్రవర్తించవలెను. కావున బడులు, గ్రామకూటములు, గ్రంథమాలలు, వార్తాపత్రికలు, ప్రచారక సంఘములులోనగునట్టి సర్వసంస్థలను గురించిన విషయములకు గ్రంథాలయవిషయమున అనుప్రవేశముకలదు. కావున ప్రచారక సంఘ విషయమునకూడ నించుక చెప్పవలసియున్నది. ప్రజోద్బోధనమునకు ప్రచారక సంఘము లత్యావశ్యకములు. గ్రామ సంచారముచేయుచు పటములు, మాజిక్ లాంతర్లు మొదలగు పరికర సహాయ్యమున ఆరోగ్యశాస్త్రము, కృషిశాస్త్రము, రసాయనశాస్త్రము, ప్రకృతిశాస్త్రములోనుగాగల

యాధునిక శాస్త్ర విషయమున బోధ సాగించుట కనేక సంఘములు నెల కొల్పబడి పనిచేయుచుండవలెను. గ్రంథాలయ సంఘమిట్టి సంస్థల కన్నిటికిని శిరస్థానమై యుండవలెను. ఇట్టి సంస్థల నెలకొల్పి మన విద్యాధురీణులు ధర్మదీక్ష, కార్యోత్సాహము కలవారయి వారి మూపున నిల్చియున్న పైన చెప్పిన మహా కార్యభారము నిర్వహింప నప్రమత్తులయి నిరంతర పరిశ్రమకు గడంగుదురుగాక! సర్వ సదుద్యమా ధారుడగు పరమేశ్వ రుడు వారి యుద్యమముల సఫలము లొనర్చుగాక!

— గ్రంథాలయ సర్వస్వము, 7 సంపుటము 2 వ సంచికనుండి

# పదునైదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, బెజవాడ

[10-8-1933]

## శ్రీ భూపతిరాజు సీతారామరాజు

చిరకాలమునుండి విద్యాభివృద్ధికిని, విశ్వవికాసమునకును నుండెడి యభ్యంతరములను త్రోసివేసి స్త్రీ పురుష తారతమ్యముల నెంచక జాతిభేదమును పాటింపక, జనసామాన్యమైన ప్రజల కెల్లరకును జ్ఞానోదయము కలుగజేయు యత్నములు వర్తమానకాల ప్రయత్నములై యున్నవి. ఈ ప్రయత్నములు మనదేశమునందేగాక ప్రజాపరిపాలనా సౌకర్యములగు పను లెన్నియో కావించిన పశ్చిమ దేశములలో కూడ వర్తమానకాల ప్రయత్నములే. ఇది ఒక వింతకాదు. అనేక సంవత్సరములనుండి పశ్చిమ దేశీయులు ప్రజలపురోభివృద్ధికి అనేకోద్యమములు తలపెట్టి పాటుపడుచుండెడి వారైనను, మనవలె వారికిని స్త్రీ పురుష విచక్షణా జాతిభేదములు చిరకాలమునుండి నాటుకొనియుండిన కారణమున, జనసామాన్యమైన ప్రజల కందరకూ విద్యాభివృద్ధి కలుగ జేయు యత్నములు వర్తమానకాలముననేగాని, అంతకు పూర్వము ఆ దేశీయులవలనకూడ ఆమోదింపబడి యుండలేదు. ప్రజాపాలనా సౌకర్యములకు పుట్టినిల్లు అని చెప్పుకొనెడి ఆంగ్లేయ శాసనసభా ముఖమున, ఆంగ్లేయ రాజకీయ ధురంధరులు, జనసామాన్యమైన ప్రజలకెల్లరకును విద్యగరపుట శ్రేయస్కరమా కాదాయని యోజించుటయు, శ్రేయస్కరము కాదని అభిప్రాయపడుటయు కలదు. ఈ మధ్య 1918వ సం॥లో ఆంగ్లేయ శాసనసభలో విశ్వవికాసమునకుగా నుపపాదింపబడిన చట్టము గూర్చి చర్చించునపుడు హెచ్. యె. యల్. ఫిషర్ అను ఆశాసన సభ్యుడు అట్టి ప్రయత్నముకూడదని వాదించుసందర్భములో "ప్రజలందరు విద్య నేర్చిన గుర్రములకు పనియిచ్చువారెవరు, ఆవుపాలుతీయువారెవరు, గొర్రెలు కాచువారెవరు, పొలముమీద గెత్తము పఱచువానికి చదు



శ్రీ భూపతిరాజు సీతారామరాజుగారు



శ్రీ దాసు త్రివిక్రమరావుగారు

వేల ? " అని చెప్పెనట. అట్టి మహానుభావులున్నను, ఈ యుద్యమము అమెరికాదేశ వాస్తవ్యుడగు కార్నీజీ మహనీయుని ధనసహాయము వలన ఆంగ్లేయదేశములోకూడ చివరకు బలపడెను.

మనప్రభువుల స్వదేశమే యిట్టి అవస్థను ఇంతవరకు పొందియుండగా, ఆ దేశమునకు 200 సం॥లనుండి వశమైయున్న 'విద్య బ్రాహ్మణులదే' యనెడి మనదేశములో యీ ప్రయత్నములు ప్రారంభింప బడుటకును, వృద్ధిగాంచుటకును చాలాకాలము పట్టెననుట ఆశ్చర్యముకాదు.

ఈ నడుమజరిగిన యిరోపా మహాసంగ్రామానంతరమున పుట్టిన సమస్యలబట్టి ప్రతిమనుష్యునియందు ఒక విలువకలదనియు, దేశము యొక్క ఆర్థిక పరిస్థితి లెక్కించునపుడు ఆ దేశములోగల ప్రతిమనుష్యుడు దేశమునకు ఐవీజు అనియు, నాగరికత గలదేశములు జరుపుచున్న కృషి, వాణిజ్యసంబంధమైన సంగ్రామములో ప్రతిమనుష్యుడు ఒక బంటు అనియు, అతని సత్తువమీదనే దేశముయొక్క సత్తువ ఆధారపడియున్నదనియు, గనుకనే తాను విజ్ఞానవంతుడై యుండుట దేశమునకు ముఖ్యావసరమనియు, నాగరికతగల దేశములన్నియు ఈ యుద్యమమునందుగల యుపయోగములను కనిపెట్టి అనేక విధములగు ప్రయత్నములు చేసి బలపరచిరి. ఆ దేశపు ప్రభుత్వములుకూడ స్వయందక్షులు పుచ్చుకొని ఈ యుద్యమమును పెంచి వృద్ధిలోనికి తీసికొనివచ్చి యున్నారు. చదువు నేర్చిన వారికి పుస్తకములనిచ్చి విద్యాభివృద్ధి చేయుచు, అందుబాటు కాని మారుమూలప్రదేశములలో నుండెడివారికయిన పుస్తకములందజేసి గ్రంథసేవ చేయుటయేగాక, చదువనివారికి ప్రకటనలు, చిత్రపటముల మూలమునను, యింకను అనేకవిధములగు ప్రయత్నముల మూలమునను, ఆటలు నాటకములు మొదలుగాగల ప్రదర్శనముల మూలమునను జ్ఞానోదయము కలుగజేయుచున్నారు. దేశము వృద్ధిగాంచుటకు చేయు ప్రయత్నములలో నిది ముఖ్యమైనప్రయత్నముగా భావించి భక్తి విశ్వాసములతోడ పనిచేయ బూనిరి.

ఇంతగా జాతీయాభ్యుదయమునకు సహాయపడు ప్రజాసేవకులగు మన నాయకులకిది తెలియకపోలేదు. వారును రష్యాదేశ నాయకుడగు

లెనిను చెప్పినట్లు ప్రజలు విజ్ఞానవంతులు కానియెడల వారి ఆర్థిక స్థితి గతులు వృద్ధి పొందజాలవనియు, వారి సహకారము దుర్లభమనియు, క్రమమైన రాజకీయ ప్రయత్నములు కొనసాగనేరవనియు చెప్పిన యంశము గుర్తించి జనసామాన్యమైన ప్రజల కందఱకును, స్త్రీ పురుష తారతమ్య మెంచక జ్ఞానోదయము కలుగజేయు ప్రయత్నము లనేకము చేయ సమకట్టించుచున్నారు. మన దేశములోగల బ్రిటిషు రాజధానిలో యీ ప్రయత్నము మన ఆంధ్ర దేశములో శీఘ్రకాలములోనే ఆమోదింపబడి యుత్సాహముతో ప్రారంభింపబడెను. ఈ కాలములోనే ఆంధ్ర భాషాభివృద్ధి ప్రబలుటయు ఈ ప్రయత్నమునకు ఆ ప్రయత్నముకూడ సహాయపడుటంబట్టి ఈ యుద్యమము ఆంధ్ర దేశములో పూర్తిగా కొనసాగునన్న నమ్మకము కలిగెను. పండితపామరులందరు సహాయపడి పెంచిన యీ యుద్యమ మీసరికి యెంతయో వృద్ధిలో నుండవలసినది. కాని ఆంధ్ర దేశములో నీ సేవ చెయ పూనుకొనిన వారందరును అనేక స్థలములలో యువకులయి యున్నారు. ఈ యుద్యమమందు పనిచేయుచుండు కొందరు, దీనిని విరమించి రాజకీయాందోళనము లోనికి దిగి యుండక పోయినయెడల ఈ యుద్యమమింకను, విశేషముగా సత్వరాభివృద్ధిఁపొంది యుండెడిది. ఆంధ్రులలో స్త్రీ పురుషాదుల యందెల్ల, ఈ యుద్యమము నెడల కలిగిన అభిమానమువలన ఇంతవరకైన అభివృద్ధి కలుగుటకు కారణమయ్యెను.

ఈ రోజున నీ సభా సమావేశముచూడ, యీ రజతోత్సవము చూడ నీ ప్రయత్నమందు జీవికయు, ఆంధ్రులయందు ధీరత్వమును కలదని తెలియగలదు. జాతీయ నిపుణతగల ప్రయత్నములన్నియు ఒకదాని నొకటి అనుసరించుకొని, కలసికట్టుగా నుండుట కొంతవరకు అవసరమైయున్నను ప్రజలు కావించు ప్రయత్నము లన్నిటిని అనుమానాస్పద దృష్టితో చూచు అధికారుల మతము గుర్తించి రాజకీయ పురుష ప్రయత్నముల నీ ప్రయత్నములతో వేరుచేయుట ముఖ్యావసరము. ఆ విధమున నీ యుద్యమమునకు నెట్టి విఘాతము కలుగక రాజకీయ ప్రయత్నములలో సంబంధములేని వారి సానుభూతి పడయుటకు పూర్తి

యయిన యవకాశము కలిగి వృద్ధి పొందును. కేవలము విద్యాభివృద్ధినే కోరు యీ విజ్ఞానోపార్జన వ్యాపనము బాహుళ్యమైన ప్రయత్నమగుటం జేసి, ప్రజలందరి సహాయముతో పాటు మంత్రివర్గమువారి సానుభూతిని కూడ కోరుటవసరము. శాసనములుజేసి ధనసహాయముజేసి యీ యుద్యమమును పోషించు బాధ్యత మంత్రివర్గమునకును, స్థానిక సంఘము లకును కలదు.

గ్రామ గ్రంథాలయోద్యమము

మంత్రివర్గమువారి యొక్కయు, స్థానిక సంఘముల యొక్కయు సహాయము లెంతవరకు అవసరపడునో తెలిసికొనుటకు నీ విజ్ఞానోపార్జన వ్యాపనము మనదేశ స్థితినిబట్టి యెంత కష్టసాధ్యమైన పనియో యోజించి, యెంత బాహుళ్యముగా నీ ప్రయత్నము చేయవలసి యున్నదో తెలిసికొనవలయును. మనదేశ పురోభివృద్ధి అజ్ఞానులైన, వ్యవసాయదారుని స్థితిగతులమీద ఆధారపడి యున్నందునను, వారు విశేష సంఖ్యాకులై యున్న కారణమునను వారి కెల్లరకు జ్ఞానోదయము కలుగజేయు యత్నములీ యుద్యమమునకు ముఖ్యము. మన సాంఘిక ఆరోగ్య భాగములందు మాత్రమేగాక వానికి ఉపయోగపడు వారి జీవితమునకు ముఖ్యమై యుండు వ్యవసాయ సంబంధమైన జ్ఞానము ముఖ్యావసరమయి యున్నది. పంటలు వృద్ధిచేయు పద్ధతులు, వాటిని విక్రయించెడు మార్గములు, అందుకు సంయుక్తములగు నూతన యూహాలు కలుగజేసి వాటిని బలపరచి పెంచు మార్గమునకు ఉపదేశ ములు చేయుటవసరము. దారిద్ర్యములోను అజ్ఞానములోను మునిగి యున్న మన వ్యవసాయదారులు వృద్ధిపొందు మార్గములు కనిపెట్టు టలో కొంతవరకు విద్యనేర్చి, యంత్రసాధనములచేత అభివృద్ధిగాంచి యున్నతస్థితిలోనున్న కొందరు దేశీయులు తమ పురోభివృద్ధికి చేయు చున్న ప్రయత్నములు మనకు అంతగా ఉపయోగింపవు. మన దేశపు ప్రజలవలె అజ్ఞానులై, అనాగరికులై, పేదలై బహుళ సంఖ్యాకులుగా నుండెడి వ్యవసాయదారులుగల దేశములో జరుగుచున్న ప్రయత్నములే

మన కుపయోగపడును. చీనా దేశములోను, రష్యాదేశములోను నూటికి 80 మందికంటె హెచ్చుజనులు వ్యవసాయదారులై యున్నారు. మన వ్యవసాయదారులవలె వారు పేదలై అజ్ఞానులుగాను, అనాగరికులుగాను ఉన్నారు. అట్టి స్థితిలో చదువురాని వారికి పుస్తకములిచ్చుటగాని, గ్రంథాలయ సమస్యల యెడల మోదము కలుగజేయుటగాని ఉపయోగములైన ప్రయత్నములుకావు. ఇట్టి సందర్భములో చదువురాని కోట్లకొలది ప్రజలకు విజ్ఞానోదయము కలుగజేయు రష్యాదేశములో జరుగుచున్న ప్రయత్నములు మన దేశములో గల వ్యవసాయదారుల కుపయోగపడును.

ఆ ప్రభుత్వ సహాయమున విజ్ఞానకోశములు గ్రామ గ్రంథాలయములు, విజ్ఞానవ్యాప్తినిజేయు కేంద్రస్థానములు అంత విస్తీర్ణముగల దేశములోను, అంతటను స్థాపింపబడెను. ఈ కేంద్రస్థానముల కృషిమూలమున జ్ఞానోదయము, విద్యాభివృద్ధి అనేక విధములుగా వ్యాపింపజేయ బడుచున్నది. మారుమూలలనున్నను చదువు నేర్చినవారికి ప్రచారక గ్రంథ కోశముల మూలమున పుస్తకములందజేయుటయేగాక, చదువురానివారికి ప్రకటనల మూలమున చిత్రపటముల మూలమున ఆటలు, నాటకములాది ప్రదర్శనముల మూలమున వారి కుపయోగపడు అన్ని విషయములలోను జ్ఞానాభివృద్ధి కలుగజేయుచున్నారు. చిత్రపటములాది ప్రకటన పత్రముల మూలమున వ్యవసాయదారున కుపయోగపడు పనిముట్లు, యంత్రములాది వస్తువులయందుగల యుపయోగములు, వ్యవసాయమున కుపయోగపడు నూతన మార్గములు, విత్తులు, అందుగల మంచిచెడ్డలు ఉపయోగములు తెలిసికొని తరుణములో చల్లుటాది విషయములు, సాధారణముగా వచ్చు రోగములు, వాటిని నివారణచేయు విధము మొదలుగాగల అనేకాంశముల మీదనేగాక భాగవతములు, బొమ్మలాటల వంటి ప్రదర్శనముల మూలమున నీతులు, కథలు, లోక సమాచారము మొదలుగాగల విషయములందుకూడ జ్ఞానసంపద కలుగజేయుట కలదు. ఈ ప్రయత్నములన్నియు నీ యుద్యమమునకు ముఖ్యభాగములుగా గ్రహించిరి. చదువుకొనుటకు

సామర్థ్యము లేకున్నను వినుటకు ఆసక్తి గలవారికి పుస్తకములు చదివి వినిపించుటయు, నుపన్యాసము లిచ్చుటయు, నీ యుద్యమమును పెంచి వృద్ధిచేయుకృషి, కేంద్రస్థానముల మూలమున ఆ దేశములో జరుగు చున్నవి. మన దేశములో నీ యుద్యమము వృద్ధిచేయ బూనినపుడు, పై జెప్పిన అన్ని విధములగు ప్రయత్నములు చేయుటకు సిద్ధమై యుండ వలెను. మన దేశ స్థితిగతులనుబట్టి యీ యుద్యమమును వ్యాపింపజేయ వలెననగా, ఇంత ప్రయత్నమును మనమును జేయవలెనని భావింపవల యును. మన దేశములోగల పండితులకును, విద్యనేర్చిన స్వల్ప సంఖ్యా కులైన ప్రజలకును ప్రస్తుత సమస్యలమీద ఇతర భాషలలో వ్రాయబడ్డ గ్రంథములు ఆంధ్రీకరించుటకును కేవల ముపయోగపడు ప్రయత్నము లుగా మాత్రము ఈ యుద్యమమును తలపరాదు. ఆ ప్రయత్నములెంత యవసరమైనను, నుపయోగపడునవి అయినను, స్వల్ప సంఖ్యాకులకే ఉపయోగపడు ప్రయత్నము లగుటంజేసి. విశేష సంఖ్యాకులగు ప్రజలకు ముఖ్యముగా నుపయోగించునవే ఈ యుద్యమమునకు ముఖ్యమైన విగా భావింపవలయును. సామాన్య ప్రజలందరిలోను జ్ఞానోదయము పై చెప్పిన అన్ని విధములగు ప్రయత్నముల మూలమున జరుగవల యును. అట్టి ప్రయత్నములు సులభసాధ్యమైనవికావు. ఇందరకు జ్ఞానోదయము చేయుటయన విశేషముగా ప్రయాసపడి చేయు ఘన కార్యముగా తలంపవలయును.

ప్రభుత్వ సహాయము

ఈ ప్రయత్నమంతయు కేవలము కొన్ని సంఘములమీదను, కొందరు దేశ సేవకులమీదను మాత్రము ఆధారపడి యుండునదికాదు. వారెంత వ్యయప్రయాసలు పడినను, ప్రభుత్వముయొక్క ధనసహాయము చేతను, శాసన సహాయముచేతను తోడ్పడునపుడే యుద్యమము పూర్తిగా నెరవేరుట దుర్లభము. అట్టి సహాయము లేకున్నను ఆంధ్ర దేశములో నింత వృద్ధిలోనికి తీసికొనివచ్చుట శ్లాఘనీయము. ఇతర దేశ ములలో ప్రభుత్వము అన్ని విధముల తోడ్పడి యీ యుద్యమమును నిర్బంధ ప్రాథమిక విద్యతోబాటు జరుపుచున్నారు. మన దేశములో

స్వతంత్ర రాజుల పాలనక్రిందనున్న రాష్ట్రములజూడ, ఈ ప్రయత్నము బరోడా సంస్థానములో గైక్వారు ప్రభుత్వంక్రింద ప్రారంభవిద్యతో బాటే గ్రంథాలయోద్యమముకూడ ఆదరింపబడెను. ఆ ప్రభుత్వముయొక్క సహాయముచేతను, సానుభూతి చేతను ఈ గ్రంథాలయోద్యమము బలపడి వారి రాజ్యములో నూటికి 60 మంది ప్రజలు ప్రస్తుతము లాభమును పొందుచున్నారు. ఆ దేశములోగల ప్రజలందరకును విద్యాభి వృద్ధిచేయు ప్రయత్నములింకను పూనికతో బలపరుపబడుచున్నవి. స్వతంత్రరాజుల పాలనక్రిందనే యీ యుద్యమమంతగా వృద్ధిగాంచగా బ్రిటీషు పాలనక్రిందనున్న రాష్ట్రములలో ప్రభుత్వ సహాయమంతగా లేక వృద్ధిగాంచకుండుట శోచనీయము.

ఈ దేశమునకు ప్రజాపాలనా సౌకర్యము లొదవచేయ గూడదని ద్వేషభావము వహించిన చర్చిలు మొదలైన ఆంగ్లేయ నాయకులైనను నీ దేశములో అజ్ఞానులుగానున్న సామాన్య ప్రజల కందరకును జ్ఞానో దయముచేయుట యత్యావశ్యకమనిరి. సామాన్యప్రజలందరకు విజ్ఞానోద యము చేయు ప్రయత్నములందు భిన్నాభిప్రాయులు లేరుకదా! ఇంతగా జ్ఞానోదయమునకు పాటుబడు నీయుద్యమమునకు ప్రభుత్వమేల తోడ్పడ రాదు? ధనమా! ధనము లేదనరాదు. లాభమంతగా కనబడని ప్రయత్న ములందు వ్యయపరచుచున్న ఖర్చులలోను, ప్రజల సంరక్షణ కొరకనియే సేనలకు వెచ్చించు ఖర్చులోను నీ ఖర్చనగనెంత? ప్రాథమిక విద్యావిష యమై ప్రభుత్వము కోట్లకొలది ధనము ఖర్చుచేయుచున్నను ఆధనమం తయు వృథాగా వినియోగమగుచున్నదని కొంచెము యోజించిన తెలి యగలదు. ప్రతిబాలునకు 5 లేక 6 సంవత్సరములు విద్య కఱపిన మాత్రమున విద్యావంతుడు కాలేడు. అందువలన కలిగిన విద్య స్వల్పమై బడి విడిచిపెట్టిన మరొక 6 సం॥లలో పురోభివృద్ధికి అవకాశములు లేక క్రమముగా నశించుచున్నది. అబాలునికి 16 సంవత్సరములు వచ్చి జీవ యాత్ర స్వయముగా చేయబూను కాలమునకు తాను నేర్చిన విద్య నశించి, తాను పాఠశాలలో ప్రవేశించిన కాలమునకు తానెంత అజ్ఞాన

వంతుడుగా నుండెడివాడో అంత యజ్ఞాన వంతుడుగాను చివర కుండును. కనుక ప్రాథమిక విద్యాభ్యాసమందు వ్యయపడిన ధనమంతయు నీవిధముగా వృథా అగుచున్నదనుటలో సందియము లేదు.

ఇతర దేశములలో నీసంగతి కనిపెట్టి ఆప్రభుత్వములు నేర్చినవిద్య పోకుండుటకుగాను యీ యుద్యమమునకు సహాయపడినట్లు మన ప్రభుత్వముకూడ సహాయపడుట అవసరము.

స్థానిక సంఘముల సానుభూతి

మన దేశములో స్థానిక సంఘములు అన్ని చోటులను నెలకొల్పబడి యున్నవి. ప్రారంభవిద్య యీ సంఘముల యాజమాన్యము క్రింద నడుపబడు చున్నది. గ్రంథాలయోద్యమముకూడ యీ సంఘముల సానుభూతి బడయునేని యీప్రయత్నములు శీఘ్రకాలములో కొనసాగగలవు. ప్రభుత్వ సహాయము బడయునేని విద్యాశాఖ యొక్కయు ఆరోగ్యశాఖ యొక్కయు సహాయము బడయుటకు స్థానిక సంఘములు ఉత్కృష్ట సాధనములుగా నున్నవి. ఈ సంఘముల యాజమాన్యము క్రిందనున్న పాఠశాలలలో ప్రతి గ్రామమునందును స్వల్ప సంఖ్యగల గ్రంథములతో భాండాగారములు కలవు. పంజాబు రాజధానిలో గల స్థానిక సంఘములు తమ పాఠశాలలలో గల గ్రంథ కోశములు ఆయా గ్రామ ప్రజలు కూడ ఉపయోగించుకొనుట కవకాశము లిచ్చి యీ యుద్యమమునకు సహాయపడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. మన రాజధానిలో కొన్ని జిల్లా స్థానిక సంఘములు గ్రంథాలయ సేవ చేయబూనినట్లు తెలియుచున్నది. బాహుళ్యమైన మన దేశములో జిల్లాలుకూడ చాల విస్తీర్ణముగలవి గనుక జిల్లా కేంద్ర స్థానముల నాధరువు చేసికొని వ్యాపారము చేయుట కష్టము. ప్రతి తాలూకాలోను కేంద్ర స్థానము లుండుటయు, వాని పనిపాటు కనిపెట్టుటకు జిల్లా కేంద్ర స్థాన మొకటి ప్రతి జిల్లాకు అవసరము కాకపోలేదు. జిల్లా స్థానిక సంఘములకు గల ఆదాయము, ప్రచార సేవ మొదలుగా గల ప్రయత్నములకు వాటికి గల అవకాశములు, మంత్రివర్గముయొద్ద కలుగు పలుకుబడులు, ప్రభుత్వ సహాయము బడయుటకు వాటికిగల అవకాశ

ములు తగిన ఉద్యోగీయులను నియమించి జిల్లా స్థితిగతులంతయు గ్రహించు శక్తులు గలవన్న కారణమున జిల్లా సంఘముల సానుభూతి ముఖ్యావసరము. మరియు జిల్లా సంఘములు జిల్లా ముఖ్యపట్టణమందుండుటవలన ప్రజాసేవకుల యొక్కయు, సంపన్నులగు వర్తకుల యొక్కయు సానుభూతి సహకారములు బడసి వరిల్లిన యవకాశములు మెక్కు కలవు. ఈ వరకే కావలసిన ప్రయత్నములు శీఘ్రకాలములోనే ప్రారంభింపబడి వృద్ధిగాంచుగాక యని కోరుచున్నాను.

పట్టణ గ్రంథాలయోద్యమములు

ఈ విజ్ఞానోపార్జన వ్యాపనము గ్రామములందేగాక పటణముల యందుగూడ అవసరమైయున్నది. పట్టణములలో కూడ అనేకులు విద్యాభ్యాసము లేనివారు కలరు. విద్య నేర్చినవారికి పురోభివృద్ధి కవకాశము కలుగజేయు యత్నములును లేవు. కనుక గ్రామములలోవలె పట్టములలోకూడ సామాన్యప్రజల కందరకును జ్ఞానోదయము కలుగజేయుటకు పాటుపడవలసియున్నది. విశేష సంఖ్యాకులుగా నుండెడి పట్టణ వాస్తవ్యుల కుపయోగపడు ప్రయత్నము లనేకవిధములుగ నుండును. వీటికెని ప్రభుత్వముయొక్కయు, పురపాలక సంఘముల యొక్కయు సహాయము ముఖ్యావసరముగా నుండును.

గ్రామసేవకు కేంద్రస్థానముగానుండు పట్టణసంఘములు తమ పట్టణ ప్రజలకేగాక తమసేవజేయు గ్రామప్రజలకుకూడ ఉపయోగపడు ప్రయత్నములన్నియు చేయుటకుగాను పూర్తిగా తమ విధులు నెరవేర్చుటకుగాను విశేష ఆదాయముగల సంఘములుగానుండవలెను. అందరకు ఉపయోగపడు గ్రంథముల సమృద్ధియేగాక తగిన గ్రంథాలయోద్యోగీయులను- యీవ్యాపనమును సామర్థ్యముతో నడపువారును, ఉత్సాహముతో పనిచేయువారునునగు సేవకులను పోషించు సామర్థ్యముగల సంఘములుగా నుండవలయును. గ్రంథాలయ సమస్యలు తెలిసినవారు గ్రంథాలయోద్యోగీయులు విద్యావంతులు, నేర్పరులునై యుండుట అత్యావశ్యకమని చెప్పుచున్నారు. ఈ వరకు మన అభిప్రాయము సామాన్యముగా నీ యుద్యోగీయులు గుమస్తాలు అయిన జాలునని. కాని తెలిసినవారి ప్రస్తు

తాభిప్రాయము వారువిద్యావంతులై, గ్రంథముల యుపయోగములు తెలిసికొనినవారై, జ్ఞానోదయమునకు తగుయత్నములన్నియు చేసి గ్రంథాలయము లుపయోగములోనికి తీసికొనిరాతగ్గవారుగా నుండ వలెనని. వారిసామర్థ్యముమీఁదనే గ్రంథాలయోద్యమముయొక్క ఉప యోగము ఆధారపడియున్నదనికూడ వారుచెప్పుచున్నారుగనుక పట్టణ కేంద్రస్థానము లిన్ని విధములుగా ఉపయోగపడునట్లుగా నుండ వలయును.

పట్టణములలోను, పల్లెటిగ్రామములలోను జరుగు వివిధ ప్రయ త్నములు క్రమముగా జరుగుటకుగాను, ఒకదానికి మరొకటి ఆధారపడి కలసికట్టుగా నీ యుద్యమము నెరవేరుటకు రాష్ట్రీయ, భారతీయ గ్రంథా లయ సంఘములు నిత్యము కనిపెట్టి పనిచేయవలసి యున్నది. ఈ సంఘ ములు ప్రజలస్థానే యుండి జరిగినపనులు తెలిసికొని జరుగబోవుపనులు ఆలోచించి, కార్యక్రమము చక్కగా నెరవేరునుపాయము సదా కనిపె ట్టుచు, నీ యుద్యమమును పూర్తిగా నెరవేరుట కుపాయముల నాలో చించుటకు సభలుచేసి సహాయపడుట అత్యావశ్యకము.

—గ్రంథాలయ సర్వస్వము, 9 వ సంపుటము - 1 వ సంచికనుండి

తన జ్ఞానమును మనకు లభ్యముగావించిరి. గ్రంథము సేకరించుట కర్త వ్యమనియెంచి పాటుపడిరి. పురాతన దేశములలో చీనా, టిబెట్టు, భరత ఖండము, పారశీకము, బాబిలను, అస్సీరియా, ఈజిప్టు, గ్రీసు మొదలగునవి ప్రధానముగా పేర్కొనదగినవి. క్రీస్తుశకారంభమునకు తర్వాత యూరపు ఖండమునందలి వివిధ దేశములందు గ్రంథాలయస్థాపనమును, గ్రంథముల సేకరించుప్రయత్నమును ఎట్లు విజృంభించెనో తెలుపప్రయత్నించుట అనావశ్యకమని తలచి దానినిగూర్చి చెప్పదలచలేదు.

ఈ దేశమున ముఖ్యముగా ఉత్తర హిందూస్థానమున మత, వైజ్ఞానిక, శాస్త్రీయ, రాజకీయ విషయములనుగూర్చి గ్రంథబాహుళ్య ముండెననియు, అట్టి విజ్ఞాన భాగ్యమువలననే వీరపురుషులతోబాటు ధీబలసంపన్నులు పెక్కురు ప్రతిచోట ప్రబలియుండుటవలన దేశము దుర్జయముగ నుండెననియు నీదేశముపై దండెత్తిన మహమ్మదుగోరీ కనిపెట్టెను. పండ్రెండుసారులు దండెత్తివచ్చిన మహమ్మదుగజినీ దేశమునందలి ధన, కనక, రత్నసంపన్నతను చూరగొనుటతో సంతృప్తుడయ్యెను. మహమ్మదుగోరీ ధనమునపేక్షింపక ప్రజాజ్ఞానవృద్ధి సాధకములైన గ్రంథములను సంగ్రహించి వానిని దగ్ధముగావింపకుండిన పక్షమున ఈ దేశమున తామజేతలము కాజాలమను రహస్యమును గ్రహించి దానినే యవలంబించెను. ఆతని సైన్యముల ఘాతుక ప్రయత్నములబారినుండి తప్పించుకొనుటకు ఆకాలపు విద్యాసంపన్నులు తమ ధనధాన్య పశునిక్షేపముల మాటతలపెట్టక తమ గ్రంథైశ్వర్యములతో హిమవత్పర్వత ప్రాంతములకు నేపాళరాజ్యమునకుఁ బారిపోయి తమ యమూల్య ధనములగు గ్రంథముల నచట భద్రపరచిరని చరిత్రలందుదాహరింపబడియున్నది. ఈగ్రంథములసేకరణయందభిలాష బౌద్ధుల కాలమున నారంభమై దినదినాభివృద్ధియయ్యెను. బౌద్ధవిశ్వవిద్యాలయములందు అమూల్యమగు గ్రంథసముదాయము చేర్చబడినట్లు మనము చదివియున్నాము. క్రమక్రమముగా నార్యులు భరతఖండమున వేర్వేరు భాగముల నాక్రమించి యందు నివాసము లేర్పరచుకొనినపిమ్మట వేద

శా స్త్రాదులను సంస్కృత కావ్యనాటకాది కళలను భద్రపరచుచు దేశ భాషలకుగూడ ప్రోత్సాహమొసగి ఆ యా భాషలందును కావ్యరచనకు ప్రోత్సాహము నవకాశమునిచ్చిరి. ఒక్క ఆంధ్రభాషను తలపెట్టితి మేని మీమాంసాదిశాస్త్రములకు ప్రధానస్థానముగానుండిన గౌతమీ తటమున ఆంధ్రమహాభారత రచనకు నన్నయభట్టు యత్నించి ఆంధ్ర భాషకు గౌరవమునిచ్చుటే తార్కాణము. పదియవశతాబ్దారంభము మొదలు నేటివరకు సంస్కృత సాహిత్యమునందలి గ్రంథముల యాంధ్రీ కరణ ప్రయత్నము నిరాటంకముగ సాగుచున్నది. సంస్కృత గ్రంథ ములను తెనుగుకావ్యములను భద్రపరచుటకు ఆంధ్రులు పడినశ్రమ వర్ణనాతీతము. ఇనుప గంటమును చేబూని తాళపత్రములపై సంస్కృ తాంధ్ర లిపులలో మహాభారత రామాయణాది గ్రంథములనువ్రాయుట యెంతకష్టమో మనమూహింపజాలము. వర్ణింపజాలము. తెలుప జాలము. ఒక్కతాళపత్ర ప్రతినిజూచినయెడల మచ్చునకైన తుడు పులు గీతలు హంసపాదములు కానరావు. ఆ కాలమునాటి లేఖకులకు బలమగు వెలుగునిచ్చెడు విద్యుద్దీపములులేవు. ఇన్నిరకముల సులోచ నములులేవు. ఏయరుగుపైననో ఏచెట్టునీడనో గూర్చుండి వారాగ్రంథ ములకు ప్రతులు వ్రాయుటకు బూనినదీక్ష, పడినశ్రమ ఆశ్చర్యదాయ కములు. ఇప్పటి కాలమున నొక చిన్నపొత్తమును వ్రాయదలపెట్టితి మేని చిత్తుసాపులులేకుండ నడువదు. దాని నచ్చొత్తించునపుడు ఐదు ప్రూఫులు పది సవరణలు జరుగకుండ నెంతచిన్నిపొత్తమైనను మన చేతికందదు. శ్రీకారముమొదలు మంగళమువరకు నొక్కరీతిని అచ్చును మించిన లిపితో భిన్నప్రతులనువ్రాసి భద్రపరచి దేశమునకు, దేశభాషకు వర్ణనాతీతమైన మహోపకారమును గావించిన మనపూర్వుల శ్రమకును భాషాభిమానమునకును మనకృతజ్ఞతను దెల్పుటకు మనకు శక్తి చాలదు. వేదమునకును వేదభాష్యమునకును ప్రతినివ్రాసిన పండితు డొకడు తన తాళప్రతగ్రంథాంతమున నీ క్రిందిరీతిని తనతదనంతర వంశీ యుల ప్రార్థించుచు వ్రాసినట్లు చదివియుంటిని. "అయ్యలారా! ఈ ప్రతివ్రాత ముగియునప్పటికి నా చేయి పడిపోయెను. దృష్టిమాంద్యము

జెందెను. నడుమువంగిపోయెను. ఈ నడుమ కాలమున నేను కుటుంబవ్యవహారములు దలపోయలేదు. ఇట్టి పరిస్థితులలో వ్రాసిన యీ గ్రంథమును నా పుత్రులు పౌత్రులు వారి బిడ్డలు అమూల్యధనముగానెంచి కాపాడి నా యాత్మకు సంతోషముకలిగించునటులు నాయిష్టదైవ మనుగ్రహించు గాక!'' ఈ చొప్పున మన దేశమున బురాతన గ్రంథసంపాదనము త్రదక్షిణము జరిగెను. ఈ గ్రంథ సేకరణమునందు బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు సమాన శ్రద్ధవహించిరి. మా మండలమున నే నెఱిగినంతవరకు కమ్మశాఖలోని వారైన ఒభిళినేనివారు ఆంధ్ర మహాభారతాది గ్రంథములకు బ్రతులు స్వయముగా వ్రాసిరి. దానిలోని కొన్ని పర్వములను నేను చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకుఁ జాల కాలము క్రిందట సమర్పించితిని.

యూరపు ఖండమునందువలె మన దేశమున చరిత్రలు, ప్రకృతి శాస్త్రములు, యాత్రలు మొదలగు విషయములను గూర్చి వ్రాయబడిన గ్రంథములు కానరాకున్నను కడచిన వేయియేండ్లనుండి హిందూ మహమ్మదీయ ప్రభువులు తమ సంస్థానములందు పురాతనాధునిక గ్రంథ సంపాదనకు గొప్పప్రియత్నములు చేసి మన దేశమునకు మహోపకారమును గావించిరి. ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనము స్థిరపడనారంభించి వారిరాజ్యవిస్తీర్ణము హెచ్చనారంభించినకొలది మన దేశైశ్వర్యముతోపాటు ఉత్కృష్ట గ్రంథపలాయనముకూడ నారంభమయ్యెను. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, జర్మనీవారు, ఈ దేశపు టమూల్య పురాతన సంస్కృత గ్రంథసముత్కరములను సమస్త విధోపాయావలంబనముచే నిచట లేకుండ జేసిరి. తుదకు మనమిపుడు వాని ప్రతులు కావలసినయెడల పాశ్చాత్య దేశములనుండి తెప్పించుకొనవలయును. ధన కనక రత్నాభరణములు మనచేయి జారిపోయినట్లే మన దేశమునందలి పురాతనచిత్రములు, తాళపత్ర గ్రంథములు మొదలగునవికూడ అధికార బలము వలనను, కొన్నివేళల న్యాయమైకదూర మార్గావలంబనము వలనను పశ్చిమ ముఖమును బట్టినవి. సంశేరుజంగు బహద్దరు నేపా

శము నందలి 15 వేల తాళపత్ర గ్రంథములను బ్రిటిషు పుస్తక భాండాగారములకు బహుమానముగా నొసంగెను. బ్రిటిషు రెసిడెంటు వానిని వందనములతో స్వీకరించి రవానా చేసిన విషయము ప్రకటింప బడినపుడు అట్టి పురాతన నాగరక వాఙ్మయమును గోలుపోవుటకన్న అర్ధరాజ్యమును ధారవోసియున్నయెడల దేశమునకట్టి విపరీత నష్టము సంప్రాప్తము కాకుండునని దూరదృష్టిగల దేశాభిమానులు కొందర పుడు వ్రాసియుండిరి. ఈ దేశమునుండి మన వాఙ్మయముతొలగిపోయిన విధములు వర్ణించుటకు ప్రత్యేకోపన్యాస మావశ్యకమై యుండును. దానినిచ్చట సంగ్రహముగనేని వివరింప ప్రయత్నించినయెడల గ్రంథ విస్తరము తప్పనిసరియగును.

సంస్కృతభాషా పునరుద్ధారణముకొరకు జీర్ణగ్రంథ పరిశోధనము కొరకును ఆంగ్లేయ విద్యావిధానానుకూలముగ సంస్కృతము నేర్పుటకు ప్రభుత్వమువారు దొరకొనినప్పుడు వారు చాలవరకు జర్మనీ, ఆస్ట్రేలియా దేశములనుండి ఆచార్యులను నియమించుచుండిరి. ఈ యాచార్యులు తమయుద్యోగముతోపాటు పురాతనగ్రంథసంపాదనకు దొరకొని దానికొరకవలంబించిన మార్గములు విషాదమును, వింతను, మోసమును స్ఫురింపజేయును. తంజావూరు సంస్థాన భాండాగారము నెలకొల్పుటకు శరభోజీమహారాజు పడినశ్రమ, చూపిన యోరిమి, వెచ్చించిన ధనము తెలిసికొనినయెడల ఆశ్చర్యసంతోషములు మన హృదయసీమల జనింపకమానవు. ఈ చొప్పుననే బ్యాంకిపూరులో ఖుదాబక్షు స్థాపించిన పుస్తక భాండాగార గ్రంథసంపాదనమున కాతడు పడిన కష్టములు, పొందిన నిరాశలు మనము మరువతగినవి కావు. రంగూను, కలకత్తాలు మొదలు డెమాస్కసు, ఏప్యామైనరు వరకు అతని ఏజంట్లు ఉత్తమ గ్రంథసంపాదనార్థము చూపిన కౌతూహలము ప్రతివానికి ననుసరణీయము. దానికొర కాతడు సమర్థులైన ఏజంట్లను నియమించి వారికి విరివిగ ధనమిచ్చి యొక్కొక్క గ్రంథము చొప్పున సంపాదించెను. ఈ గ్రంథసంపాదకులు "ప్రాతపుస్తకాలు

కొంటాము. ప్రాతకాగితాలు కొంటాము." అనువంటివారుగా నుండదగ రుకదా? వారు, ప్రముఖులగువారియింట చిత్తుకాగితపు ప్రోవులను శ్రద్ధతో పరిశీలించి గులకరాళ్ళలోనుండి మణులనేరినట్లు ఆ గ్రంథా లయమునకు పుస్తకముల సంపాదించిరి. ఖుదాబక్షు కొన్నియేండ్లు శ్రమ పడి సంపాదించిన రెండు పార్సీ గ్రంథములను పాట్నా జిల్లాజడ్జి చదువు కొనుటకయి పుచ్చుకొని తాను ఉద్యోగము చాలించుకొని స్వదేశము నకుబోవుచున్నపుడు పొరపాటున తన యితర సామగ్రితో పంపివేసితి నని చెప్పి ఆగ్రంథముల హరింపదలచెను. విదేశమునకేగుచున్న యూరోపియను చేజిక్కిన యేవస్తువు సామాన్యముగ యజమానునకు మరలదక్కుట యపూర్వవిషయమగుటచే ఖుదాబక్షు ఖిన్నుడయ్యెను. తాను తనదేశమునుజేరినపిమ్మట నా గ్రంథములను పంపుదునని దొరగారు పొరబాటున్నైన నుదాహరించలేదు. కొన్నాళ్ళకు ఖుదా బక్షుగారి లాహోరు ఏజంట్లు అచ్చట పాతపుస్తకము లమ్మువాని దుకాణమున రెండు విలువగల పురాతన గ్రంథములుగదోచిన వానిని కొని బ్యాంకిపూరు లైబ్రరీకి పంపిరి. ఆ రెండును దొరగారు హరింప దలచిన గ్రంథములయ్యెను. దొరవారు తమ సామాగ్రిలను, గ్రంథ ములను పెట్టెలలో బస్తాబందీచేయుట కాజ్ఞాపించినపుడు ఈ శిథిల గ్రంథములు పనికిరాని కాగితములక్రింద నెంచి వానిని విడిచిపెట్టి నిగ నిగలాడుచు ముద్రింపబడిన రెండు మాసపత్రికలను వాని స్థాన మున నమర్చిరి. స్వదేశమునకేగిన పిమ్మట వానికొరకు వెదుకగ, అవి కాన్పించక దొరవారు ఖిన్నులై యుండుట నిశ్చయము. దైవము తన పాలిటనున్నాడనియు, మోసము సర్వదాజయము పొందదనియు ఖుదా బక్షు నమ్మియుండును.

హైందవ విజ్ఞాననిలయమని చెప్పదగకున్నను కలకత్తా యింపీ రియల్ లైబ్రరీ, అడయారుగ్రంథాలయము, మనదేశమున బేర్కొన దగిన గ్రంథాలయములు. బొంబాయి, కలకత్తా ఏషియాటిక్ సొసై టీల లైబ్రరీలు మనదేశ సాహిత్య సామగ్రికి ముఖ్యనిలయములు.

సర్వకళాశాలలున్న ప్రతి స్థలములందును గ్రంథాలయాభివృద్ధికి ఉత్తమ గ్రంథ సంపాదనకు ప్రయత్నములు ప్రస్ఫుటము లగుచున్నవి. ఇక వేర్వేరుపట్టణములందును, గ్రామములందును స్థాపింపబడిన గ్రంథాలయములందు గ్రంథసంఖ్యను హెచ్చుగ చూపుటయే ప్రధానముగనెంచి రైళ్ళలో విక్రయింపబడు రూపాయికి 30 గ్రంథముల వంటి వానివలన గ్రంథబాహుళ్యమేకాని చదువరులకు లేశము లాభము కలుగకున్నది. యూరపుఖండమందలి సుప్రసిద్ధ గ్రంథాలయములందు నూరేండ్లక్రింద భద్రపరుపబడిన గ్రంథములలో నూటికి 70 వరకు నశింపుచేయబడదగినవనియు, కచ్చేరీలలోని రికార్డులవలెనే గ్రంథాలయములోని గ్రంథములను సంఖ్యాబాహుళ్యముకొరకు భద్రపరుపదగనివనియు, దీనిని గుర్తించుచు నడుపబడుచున్న గ్రంథాలయములే లోకోపయోగకరములుగనుండుననియు, అవిజరుగనినాడు ప్రకృతిశాస్త్ర సిద్ధాంత ప్రస్తుతానుభవ విషయ విరుద్ధములగు విషయములతో నిండియున్న గ్రంథపఠనమువలన కాలమువ్యర్థమగుటయు, నిష్ప్రయోజన జ్ఞానముతో మనసు నింపబడుటయుదప్ప లాభముండదనియు నొకానొక సమయమున లార్డురోజుబరీ చెప్పియున్నాడు. ఇది ముమ్మాటికి నిజము. ఈ సంగతిని ప్రతిగ్రంథాలయపాలకులు గమనించుట విధాయకము.

పాశ్చాత్య దేశీయులు పురాతనగ్రంథములు, వ్రాతప్రతులు, శిల్పములు, చిత్తరువులు, శాసనములు, మొదలగువానిని సంపాదించి వానిని లోకోపయోగముకొరకు గ్రంథాలయములకు, చిత్రవస్తుప్రదర్శనశాలలకు, కళాభవనములకు, విశ్వవిద్యాలయములకు సమర్పించుచుందురని మనము తరచుగ పత్రికాముఖమున దెలియుచున్నాము. వీనికొరకచట విద్యాభిమానులు కళాభిమానులు వెచ్చించు ధనము వెర్రివానిచేతిలోని రాతివలె కాన్పడును. ఒక్క పురాతన గ్రంథకర్త యొక్క గద్యకావ్యమునుగాని పద్యకావ్యమునుగాని సంపాదించుటకు వారు పరకాష్ఠ సంపాదనమునకు పడవలసినంత శ్రమ పడుదురు.

రష్యాలో సోవియట్ ప్రభుత్వమువారి వశమందున్న "కోడెక్సు సినెయిటికస్"ను (Codex Cinaiticees) నాల్గవ శతాబ్దము నాటి బైబిలు వ్రాతప్రతిని బ్రిటీషు మ్యూజియమునకు సంపాదించుటకు విశ్వ ప్రయత్నము చేసి లక్ష పౌండ్లకు దానిని కొని తెచ్చిరని గత డిసెంబరు 27 తేదీన తంతి వార్తలలో నుదహరింపబడెను. ఈ యపూర్వ వ్రాత ప్రతిని సంపాదించుటకు రాజు మొదలు రెడ్డి వరకు విరాళము లిచ్చుచున్నారు. చూచితిరా వారి భాషాభిమానము! దేశమున భాగ్యాభివృద్ధి కాంక్ష! గ్రంథముల విలువ నెరుగని బండిత కుటుంబముల సంతతివారు తమ పూర్వు లతిశ్రమలకు లోనై సేకరించి భద్రపరచిన తాళపత్రములను సంక్రాంతి భోగిమంటలకు సమర్పించిన వారు కలరు. ఒక యున్నత పాఠశాల యందిపుడు సంస్కృత పండితుడుగ నున్న విప్రుడు కొంతకాలము క్రిందట తన బందుగు లింటికి చుట్టము చూపుగ బోయి రాత్రి పరుండినపుడు వారాతని తలగడకు మారుగ వారింట మిగిలియున్న యొక లావైన తాళపత్ర గ్రంథము నిచ్చిరి. ఆ రాత్రికి దానినాతడు తన తలగడగ నుపయోగించి మరుసటి యుదయమున దాని సూత్రమును విప్పిచూడగ నది శంకరభాష్య మయ్యెను. మనదేశ దురదృష్ట మిట్లుయ్యెను. అథర్వణ వేదము నిండుప్రతి కొరకు ఆస్ట్రియా పోవలసి వచ్చెను. విజ్ఞాన సర్వస్వమువారు శివాజి ప్రతిమను ప్యారిసునుండి తెప్పించిరి. అక్కన్న మాదన్నగారి ఛాయాపటము ఆంగ్లదేశమునుండి రావలసివచ్చెను. లోక సౌభ్రాతృత్వము సాధ్యమై లోకకళ్యాణము సమకూడిననాడు మన దేశమునుండి దేశాంతరములకు బలాత్కారముగ గొనిపోబడిన గ్రంథములు, శిల్పములు, చిత్రములు లోనగునవి మరల పూర్వాభిముఖములగునని నే నూహించుచున్నాను. పరమేశ్వరుడది సమకూర్చుగాక! ఆంధ్ర మండలము లందలి చాల వ్రాత ప్రతులు చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము చేరినవి.

కడచిన 10, 15 యేండ్లలో కొన్ని జర్మనీ యింగ్లండు దేశముల కేగినవి. శ్రీ పిఠాపురం మహారాజాగారు, కీర్తిశేషులైన చెలికాని లచ్చారావుగారు వ్రాతప్రతులను చాలవరకు సంపాదించిరి. ఆంధ్ర సాహిత్య పరిషత్సభవారి వద్దను మంచి గ్రంథసముదాయమున్నది. వీనిలో నూటికి 50 వంతున ముద్రితములని కనబడుచున్నది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము స్వయంభువు. ఇది కేవల ప్రజాపోషణమువలన నిలిచి యున్నది. దీనికి ప్రభుత్వాదరణము సున్న. దేశాంతరములందువలె పట్టణములందు గాక నిచట నీయుద్యమము గ్రామములం దారంభమయ్యెను. ఆంధ్రోద్య మారంభముతో గ్రంథాలయ స్థాపన ప్రారంభమయ్యెనని చెప్పదగును. దీనికి మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులయ్యవార్లంగారు పితామహులుగా కనబడుచున్నారు. పిమ్మట పులివెందల, ఒంగవోలు, విజయనగరము, కుముదవల్లి, ఉండి, కొల్లూరు, గుంటూరు, రాజమహేంద్రవరము, హైదరాబాదు, విజయవాడ, కాకినాడ లోనగు ననేక పట్టణము లందు గ్రామములందు గ్రంథాలయములు స్థాపింపబడి చాంద్రాయణ వ్రతదీక్ష నడుపుచున్నవి. ఈ యుద్యమము మాట తలపెట్టునపుడు శ్రీయుత అయ్యంకి వేంకట రమణయ్యగారును, కీర్తిశేషులైన సూరి వెంకట నృసింహశాస్త్రి గారును తలపునకు రాక మానరు. భీష్ముని యెదుట శిఖండివలెగాక అర్జున సారథి యగు శ్రీకృష్ణుని వలె వేంకట రమణయ్యగారు మన మహా సభా రథమును నడపుట కిపుడు మనమధ్యనున్నారు. గోత్ర నామములుచెప్పిపాదములు సోక మ్రొక్కుటను అభివాదనమందురు. పాదములు సోకుటమాట నటుండనిచ్చి,ఏకార్షేయ శౌనక సగోత్రోద్ధవులైన అయ్యంకి వేంకటరమణశర్మగారికి మన కరయుగములను లలాటస్థలమున చేర్చి యభివాదన మొనర్చుటకు నిచట సమావేశమైన గ్రంథాలయాభిమానులభ్యంతరము చెప్పరని తలచుచున్నాను

• జనసామాన్యమును జ్ఞానవంతులను చేసి వారి కన్యోన్య స్నేహ సహకారభావమును పెంపొందింపజాలిన ప్రతిష్ఠాపనము ధర్మ గ్రంథాలయము. గ్రామ జీవనమున కది కేంద్ర స్థానము గావలయును. జాతి పరిజ్ఞానాభివృద్ధుల కేది సాక్షీభూతమో, గ్రామము యొక్క సమస్త వ్యాపార పరిష్కృతి కది కూడలి స్థలము. అట్టి పవిత్ర ప్రదేశము నందును జ్ఞాన సంపాదన ప్రయత్నము దాని యుద్దేశ సంకల్పముల నేమరి, చీట్లపేకాట చతురంగములతో నచట పౌరులు జానపదులు కొన్నిచోట్ల ప్రొద్దులు పుత్తురని తెలియుట శోచనీయము. మన దేశ శ్రేయమును సర్వదా కోరుచుండు నెవరెండు సందర్భండు చీట్లపేకాటను గూర్చి ప్రబుద్ధ భారతి పత్రికలో వ్రాసిన దాని నిచట భాషాంతరీకరించి పొందుపరచుచున్నాను.

"ఉపయోగమునుబట్టిగాకున్న పేకముక్క లితర కాగితపు అట్ట ముక్కలవలెనే ప్రమాదకరములుగావు. వానిని నిరాక్షేపణీయ విధముగ నుపయోగించవచ్చునని మన మెరుగుదుము. వానిని గూర్చి రెండు మూడు విషయములు మాత్రము చెప్పవలసియున్నది. అవి జూదమున కుపయోగించు సామాన్యసాధన సామాగ్రియై యున్నవి. ఒక యువకుడు మంచి ఆటకాడైన పక్షమున దాని మూలమున కాతని నవలీలగ జూదమాడు నలవాటు పట్టుబడగలదు. ఇంతేగాక పేకాట వలన ఆటకానికి దేహ పరిశ్రమమున కవకాశ ముండదు. టెన్నిసు మొదలగు ఆటలవలె నది వెల్లడిగ గాలిలో నాడుకొనునదికాదు. ఆ యాటవలన వ్యర్థమగు కాలము అమితము. అది తల చూపినచో బుద్ధి వైశద్య ప్రయత్నముకల్ల. ఈ దేశపు (అమెరికా దేశపు) ఉత్తర దక్షిణ భాగములందు వందలు వేలకొలది సంఘములు మానసిక విషయ చింతన మెరుగని మరణావస్థ యందున్నవి. బుద్ధికౌశలము చూడవలసిన కార్యమునకు వాని బురికొల్ప శక్యముకాదు. దీనికి కారణము పేకాట వ్యసనమే? యూకరు మొదలగు నితర పేకాట కూటములకు జనులుగుంపులు గుంపులుగ పోవుచుందురు. అట్టివారి కితర ఘన కార్యాచరణాపేక్ష

కలిగించుట సాధ్యముగాదు. పేకాట యందీ చెడులక్షణము లిమిడి యుండుటవలన నిది ప్రమాదకర వ్యసనమని గ్రహించి దాని దరికి జేరకుండుటయే శ్రేయస్కరము."

ఆమడలకొలది దూరము పోవు ఫిరంగి గుండ్లతో, వాయు విమానములతో విషవాయువులతో జలాంతర్గాములతో లోక సంహారము చేయుచున్న క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధమత రాజ్యములు విజృంభించియున్న యీ కాలమున – నిరాయుధులైన హిందువులు చతురంగ సైన్యములను గ్రంథాలయములందు, పఠన మందిరములందు, క్లబ్బులందు, వ్యాయామ ఫలకమునందుగాక వేరువిధమున నడిపించుట సాధ్యము గాకుండుటవలన, వారి కాల హరణ క్రీడలు సమ్మతములనబడదగినను, దేహపరిశ్రమ కుపయోగించు క్రీడలకు దొరకని చతురంగముకూడ పేటికాంతర్గతము గావించుట వివేకలక్షణమని తెలుప సాహసించుచున్నందులకు నన్ను మన్నింప వేడెదను.

లండన్ నగర భాగమగు బ్లూమ్స్బెరీలో జాతీయ కేంద్ర గ్రంథాలయ మిపుడు నెలకొల్పబడియున్నది. అది ప్రపంచమందలి గ్రంథాలయ సంస్థలలో నుత్కృష్టమైనదని చెప్పుట యతిశయోక్తి కాదు. దానియందిపుడు 50 లక్షల పుస్తకములు కలవు మన తెలుగు జిల్లాలన్నిటిలోగల గ్రంథములను లెక్కపెట్టినను వానిలో సగమైన నుండునని తోచదు. అందలి గ్రంథములను చదువుట కచటకెవ్వరును వెళ్ళరు. ఆ గ్రంథాలయాధికారికి పాఠకముఖ సందర్శనలాభము చేకూరదు. అందలి గ్రంథములను చదువువారు పెక్కండ్రు, గ్రంథాలయమెచ్చట నున్నదో యెరుగరు. వారందలి గ్రంథములను టపాద్వారా తెప్పించుకొని చదివి మరల పంపి వేయుదురు. విజ్ఞానలోకమునగల సర్వవిషయముల గురించిన గ్రంథములు బ్రిటీషు దీవులలోని పుస్తక భాండాగారములకు ప్రతి

దినముచటనుండి కట్టలుగ టపాలో పంపబడును. ఆ కేంద్ర గ్రంథా
లయము బ్రిటీషు దేశమునకు జాతీయ విశ్వవిద్యాలయము వంటి
దైనది. అది ఉచిత పుస్తక భాండాగారమగుటచే దేశమునందలి
అన్నిభాగములవారు తమ స్థానిక గ్రంథాలయముద్వారా అందలి
గ్రంథములు తెప్పించుకొని తమ స్వస్థలముననే వానిని చదువ
గల్గుచున్నారు. ఒక స్థానిక గ్రంథాలయమున పాఠకులు కోరిన
గ్రంథమందు లేనిపక్షమున దాని నిర్వాహకులు దానికొరకు కేంద్ర
గ్రంథాలయమునకు వ్రాయుదురు. అచ్చటకూడ నది లభ్యము
కానిచో వెంటనే దాని యధికారులాపుస్తకమును గురించి వాకబు
చేయుటకు సాహిత్యాన్వేషణ శాఖవారికి తెలిపి (Literary detective department) వారిద్వారా సంపాదించి పంపుదురు. ఈ
చొప్పున నాశాఖవారు బ్రిటీష్ దీవులందు తదితర బ్రిటీషు రాజ్య
భాగములందుగల 132 లైబ్రరీలతో వ్యవహరించుచూ నసంఖ్యాక
ములయిన తమ గ్రంథరాజములను సులభముగ నితరులకు హస్త
గతము గావించుచున్నారు. ఈ గ్రంథ సముదాయమున నవలలు
(Novels) లేవు. వాని పఠనము చీట్లపేకాటవలె నిష్ప్రయోజక
మని యధికారులు తలపోసి వానినందు చేర్చలేదేమో? దీనికొరకు
నూత్నముగా నిర్మింపబడిన భవనమున మన జార్జి సార్వభౌముడు
1933 సంవత్సరము నవంబరు 27 తేదీని ప్రవేశమహోత్సవము
జరిగించెను ఆ భవనము నందింకను, పదిలక్షల గ్రంథము లుంచు
టకు చోటుగలదు. అందలి పుస్తకములకొరకు దేశపు నానా
భాగములనుండి దినమునకు సగటున 400 దరఖాస్తుల చొప్పున
వచ్చుచుండును. అట్టి దరఖాస్తులమీద గతవత్సరమున 61, 630
పుస్తకములు టపాద్వారా యితరచోట్లకు బంపబడెను. పుస్తక
ముల నడుగక సంజాయిషీ మాత్రము కోరుచూ వ్రాసిన ఉత్తరము
లందు తరచుగ క్లిష్టప్రశ్నలుండును. వానికిని సత్వరముగ ప్రత్యుత్త

రము పంపుదురు. సంజాయిషీ కోరిన విషయములు కొన్ని గ్రాహ్యములు. (1) పగిలిపోయిన పింగాణీ సరకులను మేకులతో బిగించు టెట్లు? (2) బార్జెసు (Barges) రకము పడవలను కట్టుటను గురించిన గ్రంథములెవ్వి ?

(3) సోల్జరు బొమ్మలను చేయు విధము నేర్పు గ్రంథములు.

(4) నెపోలియన్ బోనపార్టి యుద్ధకాలపునాటి ఆయుధ వివరము.

(5) జంతు కంకాళమును భద్రపరచు విధము.

(6) స్లావోనికు భాషా వ్యాకరణము

(7) దక్షిణ సముద్రద్వీప వృక్ష సముదాయము.

(8) వస్తువులలో కల్గిన మార్పుల క్రమము దెల్పు గ్రంథములు. స్థలాంతరమునకు పంపబడు గ్రంథముల వెల హెచ్చైనవియైనను, అవి పోయినవి కనబడలేదను వాదము వినబడుటయరుదు. ఇతరులకు పంపబడిన పుస్తకములు శిథిలమైనను, మురికియైనను, దానికి ప్రతిగ్రహీతలు బాధ్యత వహింతురు. ఈ చొప్పున వారిరువురపై నార్థిక సంబంధ భారము దామాషాగా నుండుటచేసి నష్టమల్పముగ నుండును. నిత్యము రవానా చేయబడు పని బాలికలకు నేర్పుదురు. గ్రంథములను తెప్పించుకొనుటకు తిరిగిపంపుట కయ్యెడు తపాలా వ్యయమంతయు ప్రార్థకులు వహింతురుగాన కేంద్ర గ్రంథాలయమునకు వ్యయమల్పము. ఇందలి గ్రంథములు జీవములు, నిర్జీవములని రెండు విధములుగ విభజింపబడియున్నవి. నిత్యమును తఱచుగా కోరబడు గ్రంథములు సజీవ భాగమునందు చేర్చబడియున్నవి. ఎప్పుడో, ఎన్నడో కోరబడు గ్రంథములు నిర్జీవ గ్రంథ భాగమున నుండును. 1916 వ సంవత్సరమున స్థాపింపబడిన యీ జాతీయ విశ్వవిద్యాలయ ప్రదాత ఆండ్రూ కార్నెజీ నూటికి 10 మందియైన చదివినవారులేక, వేయి

సంవత్సరములనుండి దేశ భాగ్యము తొలగిపోవుచున్న యీ దేశము నం దట్టి గ్రంథాలయము తలమాపుటకు కొన్ని శతాబ్దములు పట్టునేమో!

బరోడా రాజ్యమున సంచార గ్రంథాలయములు గలవు. వానినిగూర్చి మీకు ప్రత్యేకముగ దెలుపబడును. ఇతర పట్టణము లందు కాపురమున్న సభ్యులకు చెన్నపురి లిటరరీ సొసయిటీవారు గ్రంథములను పంపుచుండిరి. అది నే నెరుగుదును. ఒక్క పట్టణ మున వివిధ భాగములందు జనసామాన్యమున కుచిత వార్తాపత్రికా పఠన మందిరములుండుటయు విజ్ఞాన ప్రదీ్తకి సాధనభూతము. సూరతు పట్టణము నాల్గుదిశల నట్టి మందిరములనే జూచితిమి. అవి యింకను వర్ధిల్లుచున్నవని నే దలచుచున్నాను. ఈ సందర్భమున కలకత్తా మునిసిపల్ కార్పొరేషన్‌వారి ప్రయత్నములు శ్లాఘా పాత్రములు. 1919 సంవత్సరము మొదలు కార్పొరేషన్‌వారు ప్రజాయత్త గ్రంథాలయములకు ధనసహాయము చేయుచు ప్రతి యేట రు 58,000 వెచ్చించుచున్నారు. నగర వివిధ భాగము లందున్న 146 లైబ్రరీల కాధనము పంచిపెట్ట బడుచున్నది. భాండాగారములం దిపుడు 5 లక్షల సంపుటములున్నవి. ప్రతి గ్రంథాలయము సగటున 50 పత్రికలను కొనుచున్నది. ప్రతి గ్రంథా లయమునకు సగటున దినమునకు 200 పాఠకులు వచ్చుచున్నారు. ప్రతి లైబ్రరీనుండి మొత్తంమీద 500 మంది పుస్తకముల నెరవుగ గొనుచున్నారు. అట్లు ఎరవుగ గొన్న గ్రంథములు మొత్తం ప్రతి లైబ్రరీకి 2500 అయ్యెను. పాఠకులందు గ్రంథముల నెరవు గొనువారియందు హూణవిద్య నెరుగనివారు విశేష సంఖ్యాకు లున్నారు. ఇందుమూలమున ప్రతి లైబ్రరీ గ్రంథ సముదాయము నందు నూటికి 70 వంతులు బంగాళీ గ్రంథములున్నవి. కార్పొ రేషను వారొసగు సహాయ ద్రవ్యమంతయు పుస్తకములను, వార్తా పత్రికలను కొనుటకే వినియోగింపవలయును. మరియు నా మొత్త

మున కనీసము 10 వ వంతు ఆరోగ్యము, పారిశుద్ధ్యము, దేహ పరిశ్రమలను బోధించు ప్రచురణములను - 15 వంతు మతము, నీతి, దేశయాత్రలు, చారిత్రాత్మక విషయ గ్రంథములను - అధమ మైదవవంతు దేశీయ పునరుద్ధరణ ప్రజ్వాలన బోధకములగు గ్రంథ ముల కొనుటకు వినియోగింప వలెనను నియమము కలదు. ఆయా వార్డుల కౌన్సిలరు లందలి లైబ్రరీ కమిటీలలో గౌరవ సభ్యులుగ నుందురు. లైబ్రరీ నెలకొల్పబడిన గృహము దానికి సంబంధించిన పనులకే వినియోగింపబడ వలయును. (అచ్చట పేకాట చతు రంగము కూడుననికాని కూడదనికాని నిర్ణయింపబడలేదు.) ఈ చొప్పున సాలీనా నియామకముగా నిచ్చు గ్రాంటుకు అద నముగ చిరస్థాయియైన లైబ్రరీకి ప్రత్యేక విరాళము లిత్తురు. కాకినాడ పట్టణమున మ్యునిసిపలువారు పురమందిర మందలి పుస్తక భాండాగారమునకు, గాంధీ(?) రామారావుపేట భాండాగారమునకు ద్రవ్య సాహాయ్యము నిచ్చుచున్నారు. రామచంద్ర వెంకట కృష్ణ రాయ పుస్తక భాండాగారమునందు వార్తా పత్రికల నేర్పాటు చేయక పోవుటవలన నా పఠన మందిరము ప్రజారంజకము కాక పోవుట సరియేకదా; క్రమముగ దిగజారుచున్నదని నేను విన్నవింప సాహసించుచున్నాను. జిల్లాలోని పుస్తక భాండాగారములందు వాసి కెక్కియున్న పోలవరం జమీందారుగారి పుస్తక భాండాగారమున వార్తా పత్రికా పఠనమున కేర్పాటు చేయుటకును, తెలుగు గ్రంథ ముల నింకను విరివిగ తెప్పించుటకును, పాఠకులు రాత్రి కొంత కాల మచట నిలిచి చదువుకొనుటకును, బహిరంగసభలు పాఠకుల కడ్డము రాకుండ ప్రత్యేక స్థల మేర్పాటు చేయుటకును, ఆ లైబ్రరీ కార్యనిర్వాహకులను వేడుచున్నాను.

ఇప్పుడు పట్టణములందు పెద్ద గ్రామములందు లోకల్ బోర్డులవారు, మునిసిపల్ సంఘమువారు ప్రత్యేక పుస్తక భాండాగారములను స్థాపించుటో, ఉన్నవానికి ధన సహాయ

మొసగుటో, లేక తమతమ పాఠశాలలలో లైబ్రరీ గ్రంథము
లనబడువాని నమర్చి యుంచుటో వాడుకయైనది. క్రమ
ముగ ప్రతి సంవత్సరము కాకున్నను కొన్నియేండ్లనుండి దొర
తనము వారు రాజధాని యాదాయమునుండి లైబ్రరీల పోషణము
నిమిత్తము కొలదిపాటి ద్రవ్య సహాయము చేయుచున్నారు. ఆ
ద్రవ్య ప్రదాన విధానము సంకట మార్గ ప్రయాణమువలె నున్నది.
"చెరిసగాయ స్వాహా—అలాగైతే మాభాగ్యదంన మమ" అను
హాస్య గ్రామోక్తి కనుగుణ్యముగ నీ ద్రవ్య ప్రదానము నడచు
చున్నది. ఆ సాహాయ్యము బడయుటకు ముందు స్థానిక పరిపాలన
సంఘమువారి యనుగ్రహాభిమానముల బడయవలయును. కొన్ని
స్థలములందు వారి యనుగ్రహము భాండాగార నిర్వాహకుల జాతి
కులములను బట్టియు వారి స్థానిక రాజకీయ సంబంధములపైనను
ఆధారపడియుండును. చాల విలువ కలిగిన పుస్తకములతో నిండి
యుండి విశాలమైన భవనమున నెలకొల్పబడి పనిచేయుచున్న
గ్రంథాలయములకు, ప్రెసిడెంటు చైర్మను ఎన్నికలలో తోడ్పడిన
వారు నడుపుచున్న నామమాత్ర పుస్తకాలయముల కిచ్చినంత
విరాళమునైన ననుగ్రహింపని నిదర్శనములు కలవని చెప్పుదురు.
ఇది సత్యము కావచ్చును. ఇది యట్లుండ, దొరతనమువా రొసగిన
విరాళముతోను, స్థానిక పరిపాలనా సంఘములు భాండాగార నిర్వా
హకులు సమకూర్చిన ద్రవ్యముతోను కొనవలసిన గ్రంథములను
జిల్లా విద్యాశాఖాధికారులు ముందుగ నామోదించవలెను. వీరిలో
రకరకముల తత్త్వములవారున్నారు. భాండాగారాధికారులు నిబంధ
నానుసారముగ సిద్ధము చేసి పంపిన పుస్తకముల జాబితాలోని
గ్రంథము లన్నింటిని వీరు చదివి యుండుట యసాధ్యము. టాల్
స్టాయ్ గ్రంథముల కొనగూడదను అధికారి యొకడు, బెర్నార్డుషా
గ్రంథములు కూడదను వాడొకడు, రివరెండు చార్లెసు ఆండ్రూసు
ప్రకటనములను నిషేధించువా డొకడు, మహాత్మాగాంధిని గూర్చిన

పుస్తకములు గ్రంథాలయములలో నుండగూడదని అభ్యంతరము చెప్పువా డింకొకడు. ఇట్టి చిత్త విభ్రమము కలవారితో భాండాగార నిర్వాహకులు కలిసిమెలిసి తిరుగుచు కృతకృత్యులు కావలసి యున్నది. ఈ కష్ట నివారణోపాయమునకు దాన భేదోపాయములు రెండును సహాయభూతములగుచున్నవి. సామాన్యముగ పల్లెటూళ్ళలోని గ్రంథాలయములలో జానపదుల వ్యవసాయాది గ్రామవృత్తుల వృద్ధికి తోడ్పడగల గ్రంథజాలము లేదు. ఎక్కడ చూచినను రామాయణము, భారతము, భాగవతము, అధ్యాత్మరామాయణ కీర్తనలు, రామదాసు చరిత్ర మొదలగు పురాణ విషయబోధకములగు గ్రంథములు మాత్రమే కానవగును. గ్రామవాసులకు హరికథలు, ఉపన్యాసరూపమున బోధింప తలపెట్టితిమేని కుచేలోపాఖ్యానము, సీతాకళ్యాణము, ప్రహ్లాద చరిత్ర, గరుడ గర్వభంగము, ద్రౌపదీ వస్త్రాపహరణము, సావిత్రీ పరిణయము మొదలగు పురాణగాథలే ప్రత్యక్షమగును. అంతటితో సంతుష్టిపడిన లాభములేదు. నవీన శాస్త్రజ్ఞానము గూడ వారికి లభింపజేయవలెను. ఆలమూరు గ్రామ పునర్నిర్మాణ సంఘము వారివలె మూడు నాల్గు పరిస్థితులు చేజిక్కియుండి కొంత స్థిరాదాయము కూడ కనబడుచుండినప్పుడే ప్రజాక్షేమకరమగు పని సాధ్యమగును.

జానపదములందు లైబ్రరీలు సర్వవిధ వ్యాపారములకు చేయూతగనుండి తోడునీడ గావలెనని పెద్దలు బోధించుచు పాశ్చాత్య దేశములందలి యాదర్శములను మన మనోనేత్రముల యెదుట విప్పిచూప యత్నింతురు. స్వపరిపాలనముగల రాజ్యములోని ధర్మములు, ఆ చరణములు మనకెట్లు సాధ్యమగును?

కర్షకులకు, ప్రకృతి శాస్త్రపరిశోధకులకు, సాహిత్య చిత్రకళా చరిత్రాభిమానులకు, గ్రామ సాంఘిక ఆర్థిక పారిశ్రామికాభివృద్ధి కుతూహలులకు గ్రామభాండాగారములు తోడ్పడవలసిన రీతిని

తెల్పు గ్రంథములను చదివి లాభము పొందించవలెనని — రాజధాని నగరముల నుండియు విశ్వ విద్యాలయములనుండియు విచ్చేసిన వక్తలు, ఆచార్యులు మనకు తరచుగ బోధించుచుందురు. వారి యుపదేశ వాక్యములు మబ్బులోని మెరపులవలె తాత్కాలికముగ మనదృష్టికి మిరుమిట్లు కొలిపి వెంటనే మనల నంధకారమగ్నుల గావించును. జాతి మత శాఖాభేదములు, మన రాజకీయ వ్యవహార నాట్యరంగమున పాత్రలై యున్నంతకాలము మన పుస్తక భాండాగారములును ఇతర ప్రయత్నములవలెనే వృద్ధిని గాంచనేరవు. ఏ బరోడా మహారాజువంటివాడో పూనుకొని, తన నైజ విద్యాభిమానమును, స్వప్రజాభివృద్ధ్యౌత్సుక్యమును విజృంభింప జేసిననాడుగాని శ్రేయస్కరమగు నీ యుద్యమము అచిరకాలమున దేశమున కొనరింపవలసినంత మేలును చేకూర్చజాలదు. విద్యాధికులు, విద్యాభిమానులు తమ తీరిక కాలమున నిష్ప్రయోజకములగు విషయములందు వ్యర్థపఱచక సాధ్యమైనంత సహాయమును జనబాహుళ్యమున కొనర్చి అయ్యంకి వెంకటరమణయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి ప్రభృతు లారంభించి సాగించుచున్న యీ యుద్యమమును సార్థకము గావించి ఆంధ్రదేశమునకు వన్నె దెత్తురుగాక !

— గ్రంథాలయ సర్వస్వము, 9 వ సంపుటము 2 వ సంచికనుండి

# పందొమ్మిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, మద్రాసు

[ 1934 డిసెంబరు 24, 25 ]

## శ్రీ దాసు త్రివిక్రమరావు

ఈ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమేర్పడిన పిమ్మట నీ 20 యేండ్లలోను ఆంధ్రదేశ వాఙ్మయ విజ్ఞాన చరిత్రలో చాల ముఖ్య విషయములు జరిగినవి. గ్రంథాలయముల ద్వారా సమస్త ప్రజలలోను విజ్ఞానాభివృద్ధిని కలిగించుటకు యత్నింపబడెను. ఇది ఎంత వరకు సఫలమైనదో చరిత్రకారులే వివరింప నర్హులు.

తెలుగుభాషను మాట్లాడునట్టి రెండు కోట్లమంది ప్రజలలోను 1920 నుండి 100 కి 100 వంతున చదువుకొనినవారి సంఖ్య అధికమగుటయేగాక దేశాభివృద్ధికి సహాయకములగు నన్ని ఉద్యమములతోను ప్రజలకు సంబంధముగూడ చాలఅధికమయినది. ఆంధ్రభాషలో చాల పత్రికలు బయలుదేరినవి. చవుకరకము గ్రంథములు చాల వెలువడినవి. ముద్రాశాలలు చాల హెచ్చినవి. స్త్రీలును, పురుషులునుగూడ గ్రంథములను మిక్కిలి హెచ్చుగా చదువుచున్నారు. ప్రజలలో విజ్ఞానప్రబోధము సాంఘిక, రాజకీయ, మతసారస్వతాది సకల విషయములలో గూడ స్థిరముగా నేర్పడినది.

భారత జాతీయత ప్రబలతమము. దాని వికసన మన్ని విధములుగ గోచరించుచున్నది. ఈ జాతీయోద్యమమున కనుబంధమగు గ్రంథాలయోద్యమాభివృద్ధికి కొందరు ఆంధ్రదేశమున తమ జీవితములను వినియోగించుచున్నారు. ఇటీవల ప్రారంభింపబడిన సంఘ సంస్కరణోద్యమము లన్నిటిలోను నిది ప్రబలతమము. వీరు దీనికి ప్రారంభకులు—శ్రీయుతులు సూరి నరసింహశాస్త్రి,

అయ్యంకి వేంకట రమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, వి. వి. శ్రేష్ఠి, నాళం కృష్ణారావుగార్లు మున్నగువారు పెక్కుమంది గ్రంథాలయోద్యమాభివృద్ధి కత్యధికముగా కృషిసలుపుచున్నారు. ఈ ఉద్యమము బాగుగా కొనసాగినచో మన దేశము నందలి కోట్ల కొలది ప్రజల స్థితి చాల అభివృద్ధి నొందును. కాన నిది ముఖ్యమగు ప్రజాసేవయే యగును. ఐరోపా మహా సంగ్రామము ముగిసిన పిమ్మట కొంతకాలము వరకు ప్రపంచ మున శాంతి కలుగకపోవుటచే ప్రపంచమునందంతటను విజ్ఞాన, రాజకీయ ఆర్థికాది విషయములను గూర్చి ప్రబలతమమగు నాందోళనము తల సూపినది. వివిధ దేశములవారు కలసి ఆలోచించి పనిచేయుటకు అవసరమగు సమత్వమును కలిగించుటకు చాల మంది నిరంతరాయముగా పనిచేయుచున్నారు. ఒకరినొకరు చంపుటకు మాత్రమేగాక నూతన విధమగు స్వాతంత్ర్యము బడయుటకు గూడ వివిధ జాతులవారు తపించుచున్నారు. ఈ నాటకము నందు మనముగూడ చాల ఆసక్తిని కలిగియున్నాము. ఏలననగా మన భావి చరిత్రకు మార్గదర్శక మగునని పవిత్ర భావమును మనము కాపాడుకొన గోరుచున్నాము. భావికాలమున ధర్మసమ్మత మగు సాంఘికవిధాన మేర్పడగలదని తలంచుచున్నాము. దానిలో మన సాంఘిక ఆశయములును, ఆధ్యాత్మికరత్నములును చేర్పబడ గలవు. అట్టి విఖ్యాతమగు నాగరికతయొక్క లాభమును మనము గూడ పూర్తిగా బడయగోరుచున్నాము. కాని అతినీచములు, హాని కరములు అగు సాంఘిక దురాచారములను ముందుగా మనము తొలగింప వలసియున్నది. ఈ విషయమున గ్రంథాలయోద్యమము చాల పనిచేయవలెను. సత్యనిరతులై వివేకముతో పనిచేయుచు ధర్మనిరతులగుపౌరులుగానుండి మానవసేవ చేయగల్గు నట్టి స్త్రీలును, పురుషులును చాల మంది ఏర్పడుటకు తగిన విధానమును ఈ ఉద్యమ నాయకులు సిద్ధపరుపవలెను. సంఘమునకు మేలు కలుగు

నిమిత్తము వ్యక్తులు స్వార్థత్యాగ మొనరించుట ముఖ్య సిద్ధాంతము. అటుపైని సంఘము నందు అన్ని తెగలవారికిని సరియైన న్యాయము జరుగవలెను. ఇపుడున్న అగ్ర అంత్య విభేదము లంతరింపవలెను. ప్రస్తుతము మన దేశమున సాంఘిక సమస్య క్లిష్టరూపమును దాల్చినది. సంఘసంస్కరణము చేయవలెననిన విద్యా విధానముతో గూడ మార్పులు జరుగవలెను. జాతీయ బాధ్యతలను గుర్తించిన దేశములవారు అతిశీఘ్రముగానే సంఘస్థితిని సవరింపగలుగుదురు. రష్యా దేశమున సంఘ సంస్కరణముతోపాటు విద్యా సంస్కరణము కూడ జరిగినది. అటులనే ఇటలీ, జర్మనీ దేశములలో గూడ విద్యా విధానమున చాల మార్పులు జరిగినవి దేశముననున్న ప్రజలకందరికి సమాన అవకాశ మొసంగుటే నవీన సాంఘిక ఆశయము. ఇందులకు ప్రజలందరు పనిచేయవలెను. మానవ సంబంధములు మారవలయును. "ఇటుపైని ప్రపంచము నివాస యోగ్యముగానుండునట్లు విద్యా విధానము విద్యార్థులకు బోధించుట ముఖ్యతమము" అని కొలంబియా విశ్వవిద్యాలయము నందలి డీన్ రసెల్ గారు నుడివిరి. ప్రజలందరికిని జ్ఞానమును గలుగజేయుటే గ్రంథాలయముల ముఖ్య కర్తవ్యము. ప్రజలలో నూతన జాతీయజీవనము, విజ్ఞానము, నాగరికత మున్నగునవి వృద్ధి నొందవలెను. ఇప్పుడు మనకు అనుభవముగలదు. ప్రజలతో కలసిమెలసి తిరుగుటకు అవకాశములు గలవు. జ్ఞానమును బడయుటకును, సంఘసేవ చేయుటకును చాల అవకాశములు లభించునుగాన మనము సంఘ పునర్నిర్మాణమును చేయగల్గుదుమను గట్టి నమ్మకముతో పనిని ప్రారంభింపవలెను.

గ్రంథాలయములకు పుస్తకములు, పత్రికలు చేర్చినంత మాత్రమున వెంటనే మనము కోరిన ఫలితము కలుగదు. మనుష్యులకు సహజమగు విజ్ఞానసంపదను వారు తెలిసికొనగల్గుటకు తగు విధానమును మనము బాగుగా యోచించి నిర్ణయింపవలెను.

అందులకు గ్రంథాలయములవారు చేయవలసిన పనులువ్యాప్తి చెందవలెను. ప్రజలకు గ్రంథాలయములవద్ద పుస్తకముల నిచ్చుటయేగాక వీలున్నంతవరకు ప్రజలలో సద్వర్తనము కలుగ జేయుట ఇపుడు ముఖ్యావసరమైయున్నది. ఇందులకు గ్రంథాలయ ములసంఖ్య చాల అధికము కావలెను. గ్రంథములు, ఉపన్యాస ములు, మాజిక్ లాంతరులు మున్నగువాటివలన ప్రజలలో జ్ఞాన మును అత్యధికముగా వ్యాపింపజేయవలెను. ఆంధ్రదేశము నందున్న 12జిల్లాలలోను ప్రాథమిక పాఠశాలలలో గ్రంథాలయముల నేర్పరచి ఆరీతిగా వాటి నుపయోగించు కొనవలెను. 12 జిల్లా లలో 10,000 ప్రాథమిక పాఠశాలలున్నవి. కావున 10,000 గ్రంథాలయమున నేర్పాటు చేయవచ్చును. పాఠశాల ఉపాధ్యా యులు గ్రంథాలయోద్యమమును సరిగా నిర్వహింపగలుగుటకు వారికి తగిన అభ్యాసమును కలుగజేయవలెను. ఈ గ్రంథాలయ ముల పరిపాలన బాధ్యతను జిల్లా బోర్డులకే వశపరుపదగును, ఇటుల గ్రంథాలయ వ్యాప్తికి ప్రాథమిక పాఠశాలలను పునాదులుగా చేసుకొని క్రమక్రమముగా దాని నభివృద్ధి నొందింపవలెను. సంఘ సేవకు సంబంధించిన ఉద్యమములకు కావలసిన ధనమును సమ కూర్చుటకు వ్యక్తులపై ఆధారపడగూడదు. ప్రభుత్వము వారు పన్నులను వసూలు చేయుచున్నారు. కావున విద్యావిషయముననను, శారీరక విషయముననను వారు ఎక్కువసేవ చేయవలసియున్నది. పాఠశాలలో చదువతగిన వయస్సుగలవారికి మాత్రమేగాక పెద్ద వారికిని, మిక్కిలి చిన్నవయస్సు వారికినిగూడ జ్ఞానమును కలుగజేయుట విద్యాశాఖవారి కర్తవ్యమైయున్నది. ప్రస్తుతము దొరతనము వారిటులచేయుటలేదు. కావున ఆంధ్రదేశము యొక్క ఆవశ్యకమునుబట్టి గ్రంథాలయములను పోషించుటకు కావలసినంత ధనమును దొరతనమువారిచ్చునట్లు గ్రంథాలయోద్య మము వారును, శాసన సభ్యులును, సంఘ సంస్కర్తలు గూడ దొరతనము వారిని నిర్బంధింపవలెను. ఇప్పుడు చెన్న రాష్ట్రము

మొత్తముమీద కొన్ని వేలు మాత్రమే యిచ్చున్నారు. కొన్ని లక్షలు కావలెను. వారటులు చేయువరకును ఎక్కువ పట్టుదలతో దేశసేవకు నిర్భయముగా తీవ్రమగు ఆందోళన జరుపుచునే యుండవలెను. శాసనసభ్యులు గ్రంథాలయ ఉద్దేశములను, అవకాశములను తెలిసికొనిన తర్వాతనే తగిన చిత్తు చట్టములను సిద్ధపరుపవలెను. విదేశములలో చేయబడుచున్న చట్టములను అంధప్రాయముగా అనుసరించుటవలన మనకెట్టి లాభము కలుగదు ప్రభుత్వమువారు ధన మొసంగనియెడల చట్టముచేయుట వలన ప్రయోజనములేదు. కొన్ని సంవత్సరములలో గ్రామమునకు కనీస మొక గ్రంథాలయమైన నేర్పడునటుల ప్రజానాయకులను, ప్రభుత్వమును ప్రోత్సాహపఱచు నిమిత్తము ఉద్యమమున పనిచేయు నాయకులు దీక్షగా పనిచేసెదరా? ఇది అసాధ్యమని మన నాయకులు త్రోసిపుచ్చెదరేమో. వారటుల చేసినచో ప్రజల లాభమును తృణీకరించిన వారే యగుదురు. వీరధర్మములను సరిగా ప్రజలందరు నెరవేర్పవలెననినను దేశమునకు కావలసిన విషయములను బలపఱుపవలెననినను ప్రజలు విజ్ఞానవంతులుగా నుండవలెను. లేనిచో జాతీయ పునర్నిర్మాణము కొనసాగదు. కావున అందులకు కావలసిన చట్టములు చేయబడుట గ్రామములలోనున్న ప్రాథమికపాఠశాలలు గ్రంథాలయములుగా చేయబడుట, గ్రంథాలయములనిమిత్తముకావలసిన ధనము దొరతనము వారొసంగుటమన దేశము నందలి స్త్రీలను, పురుషులను గ్రంథాలయోద్యమమునందు తమ బాధ్యతను గుర్తించి, ఎక్కువ శ్రద్ధతో పనిచేయుటమున్నగు విషయములనుగూర్చి మనమిపుడు దీక్షగా పనిచేయవలెను. దొరతనము వారు తమవిధులను నిర్వర్తించువరకు మనము మిన్నకుండ వలెనని నా ఉద్దేశముకాదు. ఈలోగా మనము చేయవలసిన పనిహెచ్చుగా నున్నది. ఇప్పుడు మండలసంఘములు, తాలూకాసంఘములు చాలచోట్ల నున్నవి. కొన్నిచోట్ల పనిచేయుచున్నవి. మరికొన్నిచోట్ల పనిచేయుటలేదు. కొన్ని మండలములలో వందల

కొలది గ్రంథాలయములున్నవి. మరికొన్నిటిలో చాల తక్కువగా నున్నవి. కొన్నిటికి ధన మెక్కువగా నున్నది. మరికొన్ని నిరాధారస్థితియం దున్నవి. అనుభవజ్ఞులును, నిపుణులు నగు వారు కొన్నింటిని పరిపాలించుచున్నారు. కాని అధిక సంఖ్యాకములగు సంఘముల పరిపాలన సరిగా జరుగుటలేదు. కావున అభ్యాసమును బడసిన గ్రంథాలయాధికారులను నియమింపవలసి యున్నది. రాష్ట్రీయసంఘము వారి సూచనల ప్రకారము రాష్ట్రములోని సంఘము లన్నియు సహకార సామరస్య భావములతో కలిసి పనిచేసిననే గాని సరియైన ఫలితము కలుగదు. కావున ఒక సంవత్సరముపాటు చేయవలసిన పనిని మనమిపుడు నిర్ణయించి దానిని దీక్షగా నిర్వహింపవలెను. అప్పుడప్పుడు గ్రంథాలయములను పరీక్షించుచుండవలెను. నాయకులతో ఉత్తర ప్రత్యుత్తరములను జరుపవలెను. తఱచుగా మండల, తాలూకా గ్రంథాలయ సభలను జరుపుచుండవలెను. అటులచేసినచో ఉద్యమము సరిగా నుండును. ఇందులకు నిపుణులు కావలెను. వారు తమ ప్రాంతములలో సమగ్రాభివృద్ధి కొరకు పనిచేయవలెను. గ్రామ పునర్నిర్మాణముగూడ గ్రంథాలయోద్యమమున ఒక భాగముగా నుండవలెను. అమెరికా వారి పద్ధతిని అనుసరించుటవలన మంచి ఫలితము కలిగినది. మనదేశములోకూడ ప్రతి గ్రామము వారు తమ ప్రాంతములలో సరిగా పనిచేయు నెడల మన యాశయ మీడేర గలదు. ప్రజాప్రభుత్వాశయములను వృద్ధి నొందించుటయును, లాభకరములగు పనులను చేయించుటయును గ్రంథాలయ సంఘముల వారి సేవకుల ముఖ్య లక్షణములు. మానవ సంఘాభివృద్ధికి సంబంధించిన తక్కిన అన్ని ఉద్యమములతో కలసి గ్రంథాలయముల వారు ఉదారభావముతో సాంఘికాభివృద్ధికి పనిచేయ వలెను. ప్రజలలో విద్యయును, పాండిత్యమును,

వినోదమును కలుగజేయవలెను. ఇందులకు ప్రజలు ప్రభుత్వము కూడ ఉద్యమమునకు తోడ్పడవలెను. ఇది జాతి కంతకును అధిక మగు లాభమును కలుగజేయు నట్టిది. కాని వ్యక్తి లాభమును కలుగజేయునది కాదు. జాతి విజ్ఞానము, ప్రజల సద్వర్తనము, సుఖ జీవనము వీనినిబట్టియే జాతి ఆధిక్యత యేర్పడును. ప్రాచీనులగు ఆంధ్రులు జ్ఞాన విజ్ఞాన సంపన్నులై యుండి మనకు విజ్ఞాన మొసంగి నను ఇప్పుడు ఆంధ్రులు దానిని సరిగా వినియోగించుకొనలేదను నపఖ్యాతికి మనము పాల్పడ గూడదు.

—గ్రంథాలయ సర్వస్వము - ౧వ సంపుటము, ౩వ సంచికనుండి

# ఇరువది రెండవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## రాజమహేంద్రవరము

[1941 జనవరి 14-16]

### శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

కడతఱుల యెల్లలను మించి, కడ యెఱుఁగని
యెఱుకయే పొడగాఁ దగి, ఎల్ల యెడలఁ
తన్నె కనుఁగొనుచున్, హాయిఁ దనరుచుండు
తాలిమి వెలుంగుఁ గొలుతుఁ డెందంబునందు.

నేనేమో పొత్తపుగుడి కొలువు కొంత చేసితినని, ఈ పేరోలగమున— సుమారు వేయియేండ్ల క్రిందటనే తెనుఁగునాటి మన్నన పట్టు లన్నిటిలో కన్నాకై— వన్నెకాంచి—ఇప్పటికిని ఆవాసి పీసరపోవక వెలయుచున్న రాజమహేంద్రవరమున, నన్ను గద్దె యెక్కించిన మీ కెల్లరకును మేలుమఱవమి కేలోడ్పులు! తొలి గ్రంథాలయమహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు తమ ఉపన్యాసమున, రాజమహేంద్రవరమందలి వీరేశలింగ గ్రంథాలయమునకు తా మధ్యక్షులుగా ఉండుటచే తమకా అధ్యక్షపదవి లభించినది కాఁబోలు నని తెలిపియున్నారు. నే నేమనుకొనవలయునో! నాకు హెచ్చుగా మనికిపట్టుగా ఉండు విశాఖపట్టణము తెనుఁగునాటి మొదటి మన్నన పట్టులలో ఒకటిగా పేరొందకున్నను, మన యీ పొత్తపుగుడి కడంకకు అదే నిక్కమగు మొదటి మనికిపట్టు. అది తొలుతనుండియు పొత్తపుగుడులకు పేరుపొందిన పట్టణమే. అందుచేతనే అందలి ఆర్ష గ్రంథాలయమును బట్టి కీ. శే. మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులుగారు ఆంధ్రదేశ గ్రంథాలయ పితామహులేమో! అని

అనుకొనినారు శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుపంతులుగారు. ఆపట్టణపు గొప్పదనమునకు ముఖ్యకారణ మొకటి కలదు. అది ఏమందురా? వినుఁడు. విశాఖపట్టణమందే పడమటి తీరున సరిగా తెనుఁగునాటి మొట్టమొదటి పొత్తపుగుడి బయలుదేరి, ౧౮౮౯ నుండి ౧౯౦౭ వఱకు ఇరువదియేండ్లు కట్టుదిట్టముగా పనిచేసి, కీ. శే. కొక్కొండ వేంకటరత్నశర్మగారు మొదలగువారి మెప్పుపొందుటయే అట్టి పొత్తపుగుడి కొన్ని కారణములచే ఎంతయు సన్నగిల్లినను రూపుమాయనీయక దానిని మా ధర్మాశ్రమమునకు చేర్చి, నిలువఁబెట్టితిని. పొత్తపుగుడి కడంక మేలుబంతిగా సాగింపవలయు ననుతలంపున మాక్రొత్త హిందూపఠనమందిరము కట్టుటకు ప్రేరకుండనై పాటుపడితిని. చిన్ననాఁట నుండియు తెనుఁగు పొత్తముల మీఁద మక్కువ ఎక్కువగుటచే పొత్తపుగుడి కొలువులో విశాఖపట్టణముజిల్లాలోనే కాక తక్కినచోట్లకూడ వానిపై మక్కువ చూపుచు, తోడివారికి హెచ్చరికచేయ కడంగుచుంటిని. ౧౯౧౮లో ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ జరిగినపుడు దానికి కార్యదర్శిగా ఉంటిని. కాంగ్రెసుపనిలో చిక్కియుండినప్పుడుకూడ వీలగునెడల పొత్తపుగుడి పనిచేయుచుంటిని. మొదటి విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయమహాసభకును, స్థాయిసంఘమునకును, నాతోడి కొలువరులు నన్నే అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. ఈ నడుమ నేను బెజవాడలో ఉండవలసివచ్చినపుడు సుమారు 3 ఏండ్లు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యనిర్వాహక సంఘమునకు అధ్యక్షుఁడనుగా ఉండి, గ్రంథాలయ సర్వస్వము ప్రకటించుట, గ్రంథాలయ యాత్రలు చేయుట, సభల కధ్యక్షత వహించుట మొదలగు పనులలో పాల్గొంటిని. ఇపుడు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున ఒక ఉపాధ్యక్షుఁడనుగాను, మరల విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షుఁడనుగాను ఉన్నాను. కాన, నా కొలువును గూర్చి తెలిసిన నాతోడి పొత్తపుగుడి కొలువరులు నాకు ఈమన్నన

ఇపుడు చేసినారనుకొందును. ఇందువలన మన్నన తెచ్చునది కొలువే అని గుర్తింపనగును. కాని, మీరు నాకిచ్చిన యీ పెద్దతి కపు కొలువు మీ తోడ్పాటుతోడనే కాని సరిగా కానేరదు. కావున, మీలో ఒకఁడనగు నాకు తోడ్పడి, జరుగవలసిన పని చక్కఁగా జరిపించెదరుగాక ! అని మిమ్మందఱను వేఁడుకొనెదను. నా నుడి విక మొదలిడుటకు ముందు మిమ్ము మరొక కోరిక కోరు కొనెదను.

"ఏ నెఱుంగదీనిఁ; ఇది అందుచేఁకల్ల.- అనెడుమాటలెపుడుఁ
అనకుఁడీరు; ఎఱుఁగఁ చదువవలయు; ఎఱుఁగవలె గ్రహింప;
నిగ్గుతేల్చుకొనఁగ నేర్వవలయు,"

ఇది నారదమహర్షి భావము. దీనిని బ్లావట్‌స్కీ అమ్మగారు 'దివీల్ ఆఫ ఇసిస్' అను పొత్తముతుదిని చేర్చిరి. అదే నేనిపుడు విన్నవించితిని. మనకు తెలిసినది మిక్కిలితక్కువ; తెలియనిది మిక్కిలి యెక్కువ. కాన, తెలియనిది తెలిసికొనుటకు ఎన్నోపొత్త ములు చదువవలె; కాని, అవి అన్నియు మనకుదొరకవు; దొరకినవి చదివినను చదివినదైన ఆకళింపునకు తెచ్చుకొనఁగలిగియుండవలె; అందలినిగ్గు తేల్చుకొనఁగలిగియుండవలె. అపుడుగాని కొంతయేని మనకు తెలియదు. అట్టిచో, ఉన్నపొత్తములుకూడ చదువకయే, అవి చదివినవారివలన తెలిసికొనకయే ఏదికాని కల్ల అనరాదు.

ఎఱుక మనకు ఎట్లు కలుగును ?

౧ గురువులవలన; ౨ స్వయంకృషివలన; 3 అనుభవము వలన. నోటితో చెప్పినవారే కాక, ఎఱుక కలిగించు పొత్తములు వ్రాసినవారును మనకు గురువులే. దేశాటనము, పరిశోధనము మొదలగునవి పైవానిలోనే చేరును. అనుభవములో, ఆధ్యాత్మి కానుభవము మిక్కిలి గొప్పది., అదే నిక్కపు టెఱుకపట్టు. నిజము నకు తక్కిన వన్నియు దానికి మెట్లే. ఎరుక గడింపఁదలఁచువారు గురువుల కొరకు అరయుదురు; కాని, తగినవారు దొరకుట అరిది.

దేశాటనముగాని, పరిశోధనముగాని, అందరును చేయఁజాలరు! ఆధ్యాత్మికానుభవము కోటిలో ఒక్కరికేని కలుగునో! కలుగదో! కాన స్వయంకృషివలన సులువుగా అందరకును ఎరుక కలిగించు వెరవులు పొత్తపుగుడులే. పలుపలుకులేల? ఎరుకయే ఎన్నరానిపస. ఎరుకయే ఎల్లప్పుడు నుండు కలిమి; ఎరుకయే ఎడతెగని హాయి. అట్టి అప్పసపు టెరుక సమకూర్చెడి యీవి ప్రమాఁకులు పొత్తపుగుడులు గాక మరి ఏవి?

శ్రుతి, స్మృతి, సిద్ధులదివ్యదృష్టి, సజ్జనుల సత్ప్రవర్తనము- అను నాలుగు ఎరుకదొనలని మనువనె.

ఎరుక కలిగించుటలో సులువగు మేటి వెరవులు పొత్తపుగుడులె అయినపుడు వానినిగూర్చి బాగుగా ఎరుంగనగు.

పొత్తపుగుడి కడంక

ఇది క్రొత్తదికాదు; ఎప్పుడో పుట్టినది; పెరిఁగినది. నడుమ తగ్గినది; మరల తల యెత్తినది; ఇపుడు పడమటి నాడులలో బాగుగా సాగుచున్నది; ఇండియాలో బరోడా సంస్థానమున ప్రశస్తముగా జరుగుచున్నది; మన తెనుఁగునాటను కొంతవరకు పనిచేయుచు, కొంత మేలు చేకూర్చుచున్నది. అయినను, ఇంకను మన పెద్దలు పలువురు దీనికి వలయు సాయమీయకున్నారు; దొరతనమువారి తోడ్పాటును కడు తక్కువగా ఉన్నది. అందువలన మన పొత్తపుగుడి కడంక రావలసినంత పైమెట్టునకు రాఁజాలకున్నది. చేయవలసినంత మేలు చేయఁజాలకున్నది. ఇట్టిచో, ఈపాటి మంచి ఉనికిలోనికేని తెచ్చి, దానిని నిలువఁబెట్టుచున్న నాతోడి పొత్తపుగుడి కొలువరుల కెల్లరకును-ఈపేరోలగమున ఉన్న మీకును, ఇక్కడకు 'రాఁజాలని వారికినిగూడ — జేజేలుచేసెద. అందు, మందిమేలుకోరి, తెనుఁగునాటిపేరు కోరి —తమకును పేరు తెచ్చుకొన కోరిన కోరియుందురుగాక! — తెనుఁగునాటి పొత్తపుగుడి కడంకకే కాక-ఇండియా పొత్తపుగుడి కడంక కెల్ల మేటిప్రాపై

కీ. శే. సూరి నరసింహశాస్త్రిగారి తోడ్పాటుతో తొలుత ఎంతో పాటుపడి, పిదప ఎక్కటిబంటుగా సైతము డబ్బును-ఉసురును ధారపోసి, ఇపుడు కొంతవిశ్రాంతి కొనుచున్న శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి తమకడంక నెగ్గించుటకు వలయు ఆయురారోగ్యవైభవములు సమకూర్ప ఎల్ల తేనిఎల్లమొనల వేఁడెద. ఆం. దే. గ్రం.సం. కార్యనిర్వాహకులనుగూర్చియు, గ్రంథాలయ నిర్వాహకులనుగూర్చియు అటులే వేఁడెద.

తెనుఁగుతోడి పొత్తు

పొత్తపుగుడికడంకకు నాటిపలుకుతోడిపొత్తు హెచ్చుగా కావలె. ఏనాటివారికి ఆ నాటిపలుకులో వ్రాసినపొత్తములవలననే ఎఱుక కలిగించి, హాయిపొందువెరవు చూపవలె. కాన, తెనుఁగు నాట గ్రంథాలయోద్యమము ఫలవంతమగుటకు తెనుఁగుతోడ్పాటు కావలె. కావున, మనపలుకు తల్లిని మనమందఱమును మన్నించి, మంచిస్థితిలోనికి తెచ్చుటకు ప్రయత్నింపవలె. తెనుఁగు వ్రాఁగమికి లోటు లేనిదను పేరు తేవలె. తెనుఁగుతల్లిని తక్కిన మేటిపలుకులతో పాటుగద్దెనెక్కింపవలె. వలయుపొత్తములన్నియు వ్రాయవలె; వ్రాయింపవలె: అందు తెనుఁగుతనమునకు పెద్దరికమీయవలె- అనఁగా తప్పని సరిగా కావలసినపుడే పెఱపలుకులనుడులు వాడవలెఁగాని, అక్కఱలేని చోట్లకూడ అవి వాడరాదు. అప్పుడే తెనుఁగు సరిగా తెనుఁగనిపించు కొనఁదగియుండును. సంస్కృతము, ఇంగ్లీషు మొదలగు అక్కఱ మాలిన నుడులతోనిండిన పొత్తములలోని తెనుఁగు తెనుఁగనిపించు కొనదగదు.

పొత్తపుగుడి నుడులు

ఏ ఉద్యమమేని బాగుగా పనిచేయునపుడు దాని వ్రాఁగమియు బాగుగా పెరుఁగును. అందు క్రొత్తనుడులు వచ్చును. మన పొత్తపుగుడి కడంక అట్టిదే. దీనితో కొంతవిడి వ్రాఁగమి ఏర్పడినది. అందు ఎవరికితట్టిన నుడులు పేరు వాడినారు. వానిలో కొన్ని

నిలిచియున్నవి; కొన్నిపోయినవి. నేనుపొత్తపుగుడి కొలువరినైనను, అంతకంటె హెచ్చుగా తెనుఁగు పలుకు తల్లికొలువరిని. కాన నా నుడివికలో నా కట్టడనుబట్టి సంస్కృతపు నుడులకుమాఱు నాటినుడులకు కొంతవఱకు పెద్దఱికమిచ్చెదను. ఇంతకుముందు ఎవరును ఇటు చేయకపోవుటచే ఇదిమీకు క్రొత్తగానుండును. అందులకు తెనుఁగు పెంపు కోరవలసిన మీరు నన్ను మన్నింతురుగాక ! మచ్చుగా నేను వాడిన నాటి నుడులు కొన్ని తెలిపెద.—పొత్తపుగుడి = గ్రంథాలయము; పేరోలగము = మహాసభ; కడంక = ఉద్యమము; నుడివిక = ఉపన్యాసము; మనుగడ = చరిత్ర; పలు = కుభాష; కొలువరి = సేవకుఁడు; తెల = విషయము; మేలెఱుక = దివ్యజ్ఞానము; వ్రాగమి = వాఙ్మయము; గుట్టుచదువు = గుప్తవిద్య.

వ్రాఁతమనుగడ

పొత్తపుగుడులకు పొత్తములతో పొత్తు తప్పదు. పొత్తములకు వ్రాఁతతో పొత్తు తప్పదు. కాని, దాని మనుగడ యిప్పటికిని సరిగా తెలియరాకున్నది. ఇప్పటి తూర్పుపడమర నెఱవాదులలో పెక్కురువ్రాసిన వ్రాఁతలంబట్టి,వ్రాఁత ఏడెనిమిదివేల యేండ్ల నుండియే వాడుకలోఁకి వచ్చినట్లు కానవచ్చును. కాని, సరిగా పరికించి చూచుచో, వ్రాఁత చిరకాలము క్రిందటనే ఉండినట్లు తేటపడును. అంతేకాదు; అది మానిసితోడనే పుట్టినట్లు "నుదుటన్ వ్రాసిన వ్రాఁతకన్నఁగలదా నూఱేండ్లు చింతించినన్" అనుమాటగేసే చాటుచున్నది. నుదుటి వ్రాఁతబ్రహ్మలిపి; అది మనకు తెలియదుకదా ! అని ఎవరేని అనవచ్చును. కాని మనకు తెలియదను కారణముచేత మాత్రము, అది వ్రాఁత కాకపోదు.అదే అననేల ? మనలో మిక్కిలి తెలివిగలవారికికూడ తెలియని వ్రాఁతలు పెక్కులు కలవు.

వ్రాత ౧ బొమ్మలవ్రాత, ౨ గుర్తులవ్రాత, ౩ వ్రాలవ్రాత- అనియు తెలియును. అందు మఱికొన్ని మార్పులును ఉండును. బొమ్మల వ్రాతయే వ్రాతకు మొదటిరూపమని పాశ్చాత్య పండితులు పలువు రనుచున్నారు. కాని వేల్పులే మందికి వ్రాలు నేర్పినట్లు తెలియవచ్చుచున్నది. అవి నానాటికి మాఱి, ఇపుడు పలుపలుకు లకు గుర్తులుగా ఉన్నవి.

యూరపువారికి గ్రీకులు తొలిగురువులు. వారు ఫోయినీషియా వారివలన వ్రాలు నేర్చుకొని, అవి వారే కనిపెట్టినారని తలంచిరి. కాని, తరువాత పరిశోధింపఁగా వారికంటె ఎంతోముందే ఈజిప్టువారు, అక్కడులు మొదలగువారు వ్రాత కనిపెట్టినట్లు తెలియవచ్చినది. అది నిజమునకు ఇండియానుండియే పైకి వెళ్ళినది. అట్లాంటియనులకు వ్రాత బాగుగా వాడుకలో ఉండినట్లు మేలెఱుక వారు తెల్పుచున్నారు.

తెనుఁగువ్రాత

ఇండియాలో హెచ్చుగా వాడువ్రాత బ్రాహ్మివ్రాత; దానినుండి గుహవ్రాతపుట్టినది; దానినుండి చాళుక్యులవ్రాతయు, వేంగివ్రాతయు ఏర్పడినవి. వానినుండి వరుసగా పడమటి చాళుక్యుల వ్రాతయు, తూర్పుచాళుక్యుల వ్రాతయు పొడమినవి. వాని కలగలుపు వ్రాతనుండి ప్రాఁత తెనుఁగు వ్రాతయు, దానినుండి ఇప్పటి తెనుఁగు వ్రాతయు పుట్టినవి. పైకలగలుపు వ్రాత నుండియే కన్నడపు వ్రాతయు పుట్టుటచే, దానికిని మన తెనుఁగు వ్రాతకును పొత్తు కానవచ్చుచున్నది. ఇప్పటి తెనుఁగువ్రాలు గుండ్రపాటివి. చేయి బాగుగా నలఁగినవారు తాటాకుల మీఁదఁ గాని కాగితముల మీఁదఁ గాని పట్టివ్రాసిన తెనుఁగు వ్రాలు ముత్యాలకోవలవలె ముద్దులు మూటఁగట్టుచుండును. కాని, ఇపు

డట్లు వ్రాయఁగలవారు ఎక్కడనో కాని కానరారు. మన వ్రాఁత చక్కఁ బఱుచుకొనుటకు ఇపుడేని మనము కడంగఁదగదా ?

  

పొత్తపుగుడి మనుగడ

తలఁపులను తెలుపుటకు పలుకులవలెనే వ్రాఁతయు ఒక వెరవని మన మెఱుంగుదుము. గుర్తులు వ్రాఁతలోనివే అనియు మనకు తెలియును. కాన, మొట్టమొదటి పొత్తపుగుడి ఎల్లతేఁడే పెట్టినాఁడననగు. జన్పొత్తమే గుర్తుల పొత్తముగుచో ఎల్లతేని పొత్తపుగుడిలోని పొత్తములు గుర్తుల పొత్తములగుట వింతకాదు. ఒక్కొక చుక్క ఒక్కొక పొరట; కొన్ని చుక్కలగమి ఒకపొత్తము; అట్టి పొత్తముల మొత్తమే ఎల్లతేని చుక్కల పొత్తపుగుడి. అందలి పొత్తములు చదువఁగలవారికి జగము మనుగడ కంటఁగట్టినట్లు కానవచ్చును. కాని, అట్టివారు మనలో ఏరీ? కాన, అది మందికి పనికివచ్చునది కాదు.

నింగిమీఁద ఎట్లో నేలమీఁదను అట్లే- అను హెర్మెస్‌మాట మగఱాలమూట ఎఱుక హెచ్చిన కొలఁదిని దాని విలువయు హెచ్చుగా ఎఱుఁగ వీలగును. మొదట మింటిమీఁద జరుగని దేదియు మంటిమీఁద జరుగదని అది తెలుపుచున్నది నిజమునకు నింగివలెనే నేలయు ఎల్లని పొత్తపుగుడియే ఒక్కొక వస్తువు ఒక్కొక పొరట;ఒక్కొక తెఱంగు ఉరువులగమి ఒక్కొక పొత్తము; అట్టిపొత్తముల మొత్తమే కడలితోడి నేలపొత్తపుగుడి; ఇది అరయిక పస గలవారికి బాగుగా పనికివచ్చును; తక్కినవారికి అంతగా తోడ్పడదు.

అయినను, ఇట ఒకమాట చెప్పవలె. ఎల్లతేని నింగినేల పొత్తపుగుడులు కొంచెముగానో హెచ్చుగానో వాడుకొని అందలి పొత్తపు తీర్పరుల తోడ్పాటుకూడ పొంది, ఎఱుక గడించుకొనిన

వారు వ్రాసినవే మన మేలిపాత్రములగుటచే, మనలో కొందఱేని తగినవారు అటుచేయకడంగుట కడుంగడు మంచిది.

ఇఁక, మందిపాత్రపుగుడులను గూర్చి పరికింతము ఇందు, మొదట పెఱనాడుల వానిని గూర్చియు, పిదప ఇండియావానిని గూర్చియు, తుదకు తెనుఁగునాటివానిని గూర్చియు ముచ్చటించుకొందము. అందు వాని ప్రాఁతమనుగడ తొలుత కైకొందము. ఈమనుగడ తెలుపుటలో చరిత్రతోపాటు, పెద్దలమాటయు ప్రమాణముగానే గ్రహింతును– అని మీరు గుర్తింతురుగాక!

★ ★ ★

ఇండియా పాత్రపుగుడి మనుగడ - ప్రాఁతది

ఇండియా అనఁగా సేతువునకు హిమవత్పర్వతమునకును నడుమనుండు దేశమని మనమిప్పు డనుకొనుచున్నాము. దీనినే ఆర్యులు భరతఖండమనిరి. ఇది భరతవర్షములోని దనియు, అది జంబూద్వీపములోని దనియు, సంధ్యావందనము చేయువారికి తెలియును. కాని, ఇండియా ఎప్పుడును ఇట్లే ఉండెననుకొనుట పొరపాటు. మొట్టమొదట వింధ్యము ఉత్తరపుటెల్లగా ఉండు దక్షిణదేశము మొదలుకొని బొంబాయిరాష్ట్రమును– సప్తసింధు దేశమును చేరినదే ప్రాఁతయిండియా. అపుడు క్రొత్తయిండియా లోని తక్కిన వాటా అంతయు కడలియే; మంచుకొండయు నాఁడు లేదయ్యె. సింహళ మపుడు దక్షిణదేశముతో కలసియుండెడిది. నిజమునకు ప్రాఁతయిండియా దక్షిణ లెమూరియాఖండపు నడుమ ఉత్తరముగా ఉన్న వాటా. కాన, అది ప్రాఁతయిండియానుండి విడిపోయిన పిదప అక్కడ లెమూరియనులలో ఏడవపిల్ల తెగవారు ఉండెడివారు. వారు ప్రోల్లుకట్టిరి; కాన, నాగరకులు. వారిలో భాషయు కొంతవరకు పెంపొందె. లెమూరియాఖండము నానాఁటికి తగ్గిపోవు నపుడు వింధ్య పర్వతమునకు ఉత్తరమునను – తూర్పునను ఉండిన

కడలినుండి నేలపైకి రాఁదొడఁగె; మంచుకొండయు దానితోడిదే. నేల ఒకవైపున కడలినుండి లేచునపుడు మఱొకవైపున అది కడలిలోకి పోవును. కాన, అట్లాంటిస్ ఖండము బాగుగా పైకివచ్చునప్పుడికి లెమూరియాఖండము బాగుగా మునిఁగిపోయె. ఇప్పటికి ౮-౧౦ లక్షల యేండ్లనడుమ ఉత్తరహిందూస్థానము పైకివచ్చె; మంచుకొండ మరింత పైకివచ్చె. అట్లాంటిస్ ఖండము విస్తరించియుండినపుడు ప్రాఁతయిండియా దానిలో చేరియుండె. ఇప్పటికి సుమారు ౨ లక్షల యేండ్లక్రిందట ఉత్తరహిందూస్థానము మంది ఉండుటకు తగిన ఉనికిలోనికివచ్చె. దక్షిణదేశమునుండి సింహళము విడిపోయె.

లెమూరియాఖండము మునిఁగిపోయినపుడు మిగిలిన తూర్పుదీవులనుండి లెమూరియనులు కొందఱు ఉత్తరహిందూస్థానముచేరి, మంచుకొండల వరుసను వ్యాపించిరి. వారిలో కొందరు ఇప్పటి సంతాలు పరగణాలపట్టున రాచఱికముచేసిన జాడలు కానవచ్చుచున్నవి. ఈ తెగకు చెందిన వారినే ఆర్యులు నిషాదులనిరి; వీరిని పడమటి నెఱవాదులలో మొదటివారు కోలారియను లనఁగా, ఇప్పటివారు ముండాలనుచున్నారు. అట్లాంటియనులలో రెండవపిల్ల తెగవారగు త్లవత్లీలు సముద్రము మీఁదుగావచ్చి, దక్షిణదేశమున ప్రవేశించి, అక్కడి లెమూరియనులతో నానాఁటికి కలసిపోయిరి; ఆ రెండు తెగలవారిబిడ్డలే తొంటిద్రావిడులు ఇఁక, అట్లాంటియనులలో మూఁడవ పిల్ల తెగవారును, త్లవత్లీల కంటెను నాజూకుతనము గడించినవారునగు తొల్తెక్కులు ఇప్పటి ఆఫ్ఘన్‌స్థానము మీఁదుగావచ్చి, ఇండియాలో చొచ్చి, దక్షిణదేశమువరకును వ్యాపించి, అచ్చటి తొలిద్రావిడులతో కలసిపోయిరి.

తొలిద్రావిడులు తమ పుట్టిపట్టగు దక్షిణదేశమున రాజ్యము చేయుచు, పిదప ఉత్తరదేశమంతయు లోఁబఱుచుకొని, అప్పుడు మంచుకొండకు ఉత్తరమున ఉండిన కడలివఱకు ఏలిరి; వారే ఇండియాలో మొట్టమొదటి సామ్రాజ్యము స్థాపించినవారు.

హారప్పా, మహేంజోదారోల నాగరికత దానిలో చేరినదే. సర్ జాన్ మార్షల్ పండితుఁడు రెండవదాని నాగరికత ద్రావిడులదని ఊహించె; అది నిజమే. ఆ మహాసామ్రాజ్యములో నిషాదులరాజ్యములును, తొల్తెక్కల రాజ్యములును చేరిపోయె. వారు సుమారు ౫౦ వేల యేండ్లు, ఆర్యులు తమ్ము ద్రోసిరాజుచేయువఱకును ఇండియాను ఏలి, తమ నాగరికతయు-తమ భాషయు కన్యాకుమారినుండి కాశ్మీరమువరకును నెలకొల్పిరి. అందుచేతనే, భరతఖండపు తొలి భాష ద్రావిడభాష అంటిని; అనుచున్నాను; అనఁగలను. సంస్కృతము భరతఖండపు తొలిభాష అనుకొనుట వట్టి భ్రమ; అది ఎల్ల భాషలకును తల్లి అనుట అతిశయోక్తి; నిజమునకు, సుమారు ౨-౫ వేల యేండ్లక్రిందట ఏర్పడినభాష అది; అది వేదభాషనుండి పుట్టినది; అది సుమారు ౨౦ వేలయేండ్ల క్రిందటిది కావచ్చును ఇఁక తొలి ద్రావిడభాష అన్ననో సుమారు రెండులక్షల యేండ్ల క్రిందటనే ఏర్పడి, తమిళము-తెనుఁగు మొదలగు పలుకులుగా విడిపోవువరకును తన జెండా ఎగురవేయుచుండిన మేటిపలుకు. ప్రాకృతము లనుపేరను, దేశభాష లనుపేరను వాడుకగు పలుకులెల్ల దాని బిడ్డలు. అది తొలుత వేదభాషకును, పిదప సంస్కృతమునకును తోడుగా ఉండె సంస్కృతము పెంపొందిన పిదప ఉత్తర దేశభాషలు దానినుండి పుట్టిననుడులతో నానాఁటికి నిండిపోయినవి; అయినను, వాని యెముకలగూఁడు కన్నతల్లి యిచ్చినదే. పలుకులకు గీటురాయి మాట యేర్పాటు. అది యిండియాలోని అన్ని పలుకులలోను ఒక్కతీరుననే కానవచ్చుచున్నది. కావుననే, నానెయ్యురు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ద్రావిడ భాషలనుగూర్చి గాలిలో మేడలుకట్టి, తుదకు తమ సిద్ధాంతము సత్యముకానిచో, ప్రాకృతములనెల్ల ద్రావిడభాష లాక్రమించినవనియు- అవి ద్రావిడభాషలనుండి పుట్టినవనియు సిద్ధాంతము చేయవలసియుండునని వ్రాయవలసివచ్చినది ప్రాకృతములు ద్రావిడ

భాషలనుండియే పుట్టినవనియు, సంస్కృతము వాని నాక్రమించిన
దనియు పైన నేను తెలిపినదానినిబట్టి తేట తెల్లమే. రావుగారే
నిజము తలక్రిందుచేయుటకు ఎంతో పాటుపడి, తెనుఁగు మనుగడ
తారుమారు చేసినారు. ఆంధ్రవిశ్వకలాపరిషత్తువారు అట్టి మను
గడను అచ్చువేయించి, తెనుఁగువారికి మేలుచేయుచున్నామను
భ్రమతో డబ్బు దండుగపెట్టుకొనుటకు తోడు, తెనుఁగుపలుకు తల్లికి
ఎంతో కీడుచేసిరని చెప్పవలసివచ్చినందుకు మిక్కిలి వగచు
చున్నాను. దీనికి బాధ్యులెవరో! మనకు కావలసినదానికి రాకు
న్నను, అక్కరలేనిదానికి డబ్బువచ్చుననుటకు ఇది ఒక నిదర్శనము.
అయినను, దీనినిగూర్చి విరివిగా చర్చించుటకు ఇది తఱికాదు.

సుమారు ౨౦ వేలయేండ్లనుండి ఆర్యులు జట్టు జట్టులుగా
గోబీకడలిదగ్గఱనుండి రాఁదొడఁగి, ఇండియాలో అప్పుడు ఏలుచున్న
తొలిద్రావిడులతో పోరి, తొల్తెక్కులతో కొందఱితో పొత్తుకలిపి,
తుదకు గెలుపొంది, హెచ్చుగా ఉత్తరమునను- తక్కువగా దక్షిణ
మునను స్థిరపడిరి. ఉత్తరమున స్థిరపడిన వారు రాజ్యములు చేసిరి;
మొదట గీర్వాణవాఙ్మయమును, పిదప సంస్కృతవాఙ్మయమును
పెంపొందించిరి. దక్షిణమునకు వచ్చినవారు రాజులదగ్గఱచేరి,
పెద్దఱికము చేసిరి. వారిలో కొందఱు చోళదేశస్థులతో కలసి-చాల్డి
యాకును, పాండ్యదేశస్థులతో కలసి ఈజిప్టునకు వెళ్ళి, అచ్చట
సామ్రాజ్యములు స్థాపింప సాయపడి, పడమటినాడులవారికి తెలివి
అట లబ్బుటకు దారిచూపిరని మనకు తెలియును, దక్షిణపు
టిండియానే కొందరు పడమటి వ్రాఁతకారులు తూర్పు-ఎథియో
పియా అనిరి. తొంటి పడమటి గ్రంథకర్తలకు ఇండియా అనఁగా
భరతవర్షముకాని, భరతఖండముకాదు. భరతవర్షమనఁగా పెద్ద
యిండియా; దానిలోని వటూలకు పై యిండియా, క్రింది యిండియా,
పడమటియిండియా అను పేర్లు వాడెడివారు. పడమటి యిండియా

అనగా పారసీకము. టిబెట్టు, పెద్దతార్తరి, మంగోలియా దేశము
లును పెద్ద యిండియాలోనివే.

తొంటి ద్రావిడ సామ్రాజ్యసమయమున దక్షిణదేశము చదు
వులకు పట్టుకొమ్మగా ఉండెడిది. అందు అన్ని తెలలనుగూర్చి
తెలుపు మంచిమంచి పొత్తము లుండెడివి. ఆర్యులు మొదటిసారి
వచ్చినపుడు ఉత్తరదేశమున పోదిష్వరు అను ఱేఁడును, దక్షిణ
దేశమున హురయందు (లాహిరి) అను చక్రవర్తియు ఏలుచుండి
రఁట! ఆర్యులా చక్రవర్తిదగ్గఱకు చేరి, చనువుగడించి, మెల్ల
మెల్లఁగా అచ్చటి యెంపుడు పొత్తములు తాము సంగ్రహించిరి.
మహాసామ్రాజ్యము వెలయునపుడు పొ. గుడు లుఁడుననుకొనుట
తప్పుకానేరదు. ఏమందురా? తమకు తెలియనివెల్ల కల్లలను-
ఇప్పటి నెరవాదులును- మేలెరుకవారును వ్రాసిన పొత్తములు
పెక్కులు చదివి, అందలి తెలలు చేతనగునంతవఱకు తరిచి, తేల్చు
కొనిననిగ్గే నేనిప్పుడుమీకు తెలుపుచున్నాను. అందలి పొరపాటు
లెవరేని చూపినదిద్దుకొందును.

అట్లాంటిస్ ఖండము పోయినపిదపకడలిపాలుగాక మిగిలి,మునుపే
కాక ఇపుడును నాజూకు నాడులని పేరొందినవ నిలో మొట్టమొద
టిది ఈజిప్టని భ్రమపడిన పడమటి నెరవదులు పదంపడి చాల్డియా
అనిరి. నిజమునకు అదియు భ్రమయే. చాల్డియాకంటె
ఈజిప్టే మొదటి నాజూకునాడు. కాని, దాని నాగరకత
మూఁడుసార్లు పోయినది. మరల దానికి నాగరకత ఇచ్చినది ఇండి
యాయే. పెక్కుమాటలేల? నాగరకతకు నిలుకడపట్టు ముమ్మాటి
కిని ఇండియాయే;-అది ఒకప్పుడు ప్రాఁత యిండియాయో, మరొ
కప్పుడు పెద్దయిండియాయో, ఇంకొకప్పుడు క్రొత్త యిండియాయో
అయిన అగుఁగాక!

"ఇప్పటినేల మానిసిమేనుగా కైకొనుచో, యూరపు దాని
కుడి సగము; ఆసియా ఎడమ సగము; ఇండియా గుండెకాయ.

ఊరన్‌కొండలు ముక్కు-దూలము; ఆఫ్రికా కార్జము; ఆస్ట్రేలియా ప్లీహము; రాకీకొండలవరుస వెన్ను; బ్రెజిలు పిరుదులపట్లు. గుండె నుండియే మేనిలోని నలుగడలకు నెత్తురుపోవునట్లు, ఇండియా నుండియే అన్నినాడులకు ఎరుకపోవును; ఇది తెలిసినవారు కావు ననే నేల పెద్దలు- మనువు మొ. వారు- తొలి ఆర్యులను ఇండియాకు చేర్చినారు" అని మేలెరుకవారు చెప్పుట ఎంతయు ఒప్పియున్నది.

> "అత్రాపి భారతం శ్రేష్ఠం। జంబూద్వీపే మహామునే
> యతోహికర్మభూరేషా। తతోఽన్యాభోగ భూమయః॥
> అత్రజన్మ సహస్రాణాం। సహస్రేఽపి సత్తమ
> కదాచిల్లభతే జంతు। ర్మానుష్యం పుణ్యసంచయాత్."

"జంబూద్వీపమునందలి నవవర్షములలో కర్మభూమి అగుటచే భారతవర్షమే శ్రేష్ఠము; తక్కినవి భోగభూములు; భారతవర్షమున పుట్టుట దుర్లభము; మనుష్యజన్మ మెంతో పుణ్యము చేసికొన్నఁగాని కలుగదు" అని పెద్దలు చెప్పియున్నారు. ఇది నిజమని ఆస్తికులు నమ్మెదురు. కాని, ఇది అరయుచో, ప్రాఁతముచ్చట. అరండేలుగారు చెప్పినట్లు ఇండియా తొల్లి ఋషులది; ఇపుడు నవనాగరకులది. అపుడు సత్యమునకు ఆటపట్టు; కాన, ఎంతో మహిమతో ఒప్పుచుండెడిది. ఇప్పుడో ఆస్థితి మాఱినదనక తప్పదు. మతములోనేమి! రాజనీతిలోనేమి ,చదువులోనేమి, పాటలోనేమి, పనులలోనేమి,తుదకు నడతలోనేమి,నిక్కపుతనముపోయికకూృత్రిమ బలసి, నాగరకతలని పైనాడులవారనుకొను దొంగవాలకములోనికి దిగిపోవుటచే, అప్పటి నిక్కపు పస చాలవరకు తగ్గినది; తమనాఁడు తనకుతానే పెద్దగా ఉండునట్లు చేయుటకుమాఱు దానిని ఏపైనాటికో భానిసగా చేయ జూచు కూళలు ఇక్కడను కొందరు బయలు దేఱినారు. వారు తమ తల్లి వైపుచూడక తక్కిన అన్నివైపులను చూచెదరు! ఆమెముక్తి ఆమెలోపలనే కలదని వెదుకక పైని

అంతటను వెదకెదరు. సరిగా అరయునెడల, ఇండియామేలు
ఇండియాలోనే కలదు. కాని. ఆమేలు చేకూరుటకు మన దొంగ
వాలకము పోవలె; తమ మేలే తాము చూచుకొనుజబ్బు వదలవలె;
అందరును తమవారే అను ఎఱుక పాదుకొనవలె; కలసి కట్టుతన
మబ్బవలె; నిజము పాటింపవలె; వలయుచో ఉసుఱయిన ఒసంగఁగల
తెగువ కలుగవలె; ఎదుటివచ్చుచూచి-సంతసించు మంచితెలివి
అబ్బవలె. అపుడు, ఇండియామేలేకాక, అన్నినాడుల మేలును
ఇండియాలోనే కానవచ్చును. కాని, అట్టినాఁడెప్పుడు వచ్చునో!

కోల్‌బ్రూక్, సర్ విల్లియమ్‌జోన్స్, లాస్సెన్, వెబర్, బర్
నాఫ్ మొదలగువారి వలెఁగాక, ఇండియాలోని పండితుల సాయము
గొని పరిశోధించిన జాకొల్లియట్ పండితుఁడు, ౬ వేల యేండ్ల
క్రిందటనే ఇండియా తన పాండిత్యముద్రను-నాగరకతాముద్రను,
ఈజిప్టు-పెర్ష్యా-జ్యూడియా- గ్రీసు-రోములమీఁద వేసెననియు,
అవి తమముద్రలను తక్కిన యప్పటి పడమటి నాడులమీఁద వేసెన
నియు చాటుచున్నాఁడు. ఇది ఎవరు కాదనఁగలరు?

ఇంత ఏల? తొంటి నిషాదద్రావిడుల యెఱుక నిగ్గంతయు
వారినుండి తేనెటీఁగలు తేనెపూలనుండి వలె నేర్పుగా కైకొని-
కూర్చిన తేనె పెఱవంటి సంస్కృతపువ్రాగమివంటి వ్రాగమి, నేల
నాలుగు వైపులను మేటి నాగరకతకు మానాడులే ఆటపట్టులని
ఇపుడు బోరలు విఱుచుకొని విఱ్ఱవీగెడివారిలో ఎవరుగాని మానాట
పుట్టినదని చెప్పఁగలరా?

ఎల్లయెడల నిండియుండెడి యెల్లఁడు తమ యుల్లముననే
కలఁడని యెఱింగిన మేటియెఱుకచే ప్రకృతిని బానిసగా చేసికొనఁ
గలిగిన మహర్షులుగదా మొట్టమొదటి నడపొత్తపు గుడులు! ఏరీ
వారికి సాటివచ్చువారు? ఎవరి నోళ్ళ పలుచదువులను వెలువఱుచు

గ్రామఫోనులు!! వేదములు, శాస్త్రములు, స్మృతులు మొదలగునవి పెక్కులు వారికి కంఠస్థములే !!!

అలెగ్జాండ్రియా గ్రంథాలయ మేర్పడకముందు ఎఱుకగడింపఁగోరు పడమటినాడుల వారెల్లరును ఇండియాకే వచ్చెడివారు. పైథాగొరసు (బుద్ధగురువు) ఇక్కడనుండి జ్ఞానము సంపాదించుకొని వెళ్ళినవాఁడే; ఏసుక్రీస్తు మొదలగువారు ఇక్కడ యెఱుక గడించుకొన్నవారే.

ఋషులు నడపొత్తపు గుడులయినంతమాత్రమున నిలుకడ పొ. గుడులు లేవనుకొనరాదు. స్వరముకొరకు వేదములు నోట చెప్పుకొనినను, అవి వ్రాఁతలో ఉండకపోనక్కఱలేదు. అట్టిచో తక్కిన వానిమాట చెప్పనక్కఱలేదు. దశరథుని కాలమున అయోధ్యలో చదువురానివారు లేరని రామాయణము తెలుపుచున్నది. కొంత అతిశయోక్తి అనుకొన్నను అంతయు కానేరదు. కాన, తొంటిరాజుల కాలమునను, తరువాతి యేండ్లతటిని, పొ. గుడులుండె ననుటకు సందియపడ నక్కఱలేదు. అటుకానిచో, అలెగ్జాండరు దండెత్తివచ్చి తిరిగి పోవునపుడు పొత్తము లెన్నో యిక్కడనుండి ఎట్లు పోయియుండును? అప్పటికి- ౨,౨౬౫ ఏండ్ల క్రిందట - సంస్కృతపువ్రాఁగమి మింటి కొప్పంటుకొనెడి ఉనికి వచ్చుచుండె.

తత్త్వబోధలు, పురాణపఠనము, గ్రామస్వరాజ్యపద్ధతుల చర్చలు మొదలగు వానివలన చదువురానివారును ఎఱుకగలవారగుచుండిరి.

బౌద్ధజైనులు, పాలిప్రాఁగమియు- ప్రాకృతవాఙ్మయమును పెంపొందించిరి. కాన, వారికిని పొ. గుడులు ఉండెనని వేరే చెప్పనక్కఱలేదు. తమిళనాటిలోతమిళప్రాఁగమి పెరుఁగుటచే అక్కడను పొ. గుడులు వెలయుచుండెననియే తలంపనగు.

రాజులును, రాజబంధువులును, పండితులును, ఒజ్జలును పా. గుడులు కూర్చెడివారు. బౌద్ధసన్న్యాసులకు మత గ్రంథములు వ్రాయుట విధి; జైనభిక్షులకును పొత్తములు కాపాడుట విధి. ఇందు వలన నగరి పా. గుడులు. గుడి పా. గుడులు మొదలగునవి వెలసినవి.

తక్కిన పా. గుడులకంటె విశ్వవిద్యాలయ పీఠముల పా. గుడులు మిక్కిలి పేరుపొందినవి.

నలంద-ఇందలి విద్యాపీఠమునకు ఆసియాలోని అన్ని దేశములనుండియు విద్యార్థులు వచ్చెడివారు. అక్కడ 'రత్నోదధి'— అను మేటి పా. గు. ౯ అంతస్తుల మేడలపై వెలయు చుండెడిది. హుయ్యాన్ త్సాంగ్-అను చీనాయాత్రికుడు ౬౩౭లో వచ్చి, చదువుకొని, కావలసిన పొత్తములు పెక్కులు వ్రాసికొని,తీసికొని పోయినాడు. అట్టి పా. గు. బౌద్ధభిక్షుకులు తమలో తాము దెబ్బలాడుకొని, మంటపాలు చేసినారట! ఇంతకంటె మొఱకుతనమునకు తార్కాణ ఏమి కావలె?

తక్షశిల-౬ శతాబ్దిని ఇందలి విద్యాపీఠమున ౧౮ విద్యలును నేర్పెడివారు; అచ్చటికి దూరపువారు పెక్కురువచ్చి చదువుకొనుచుండిరి. అట్టిచో అక్కడ ఎట్టిమంచి పా. గు. ఉండెడిదో!

ఉదంతపురి-నలందలో విద్యాపీఠము క్షీణించునపుడు మగధ రాజు దీనిలో విద్యాపీఠ మేర్పరిచె. ఇందలి పా. గుడి ౧౨౦౨ లో భక్తియార్ ఖిల్జీ బీహారుదేశము మీదికి దండెత్తివచ్చినపుడు కాల్పించె. ఇచ్చటి కొన్ని పొత్తములు నేపాళము చేరినవి.

విక్రమశిల-ఇక్కడికూడ ఉదంతపురియందు వలెనే విద్యాపీఠమును, గ్రంథాలయమును ఏర్పడి వానివలెనే పోయినవి. ఇందలి పొత్తములు కొన్ని టిబెట్టు దేశము చేరినవి.

దూపాంగ- ఇందలి విద్యాపీఠ గ్రంథాలయము బౌద్ధులకు ఎంతయు పనికివచ్చుచుండె.

పాటలీపుత్రము-ఇచ్చటి విద్యాపీఠమున మంచి పా. గు. ఉండెడిది. అందు చీనాయాత్రికుఁడగు, ఫాహియాను 3 ఏండ్లుండి, సంస్కృతమును బౌద్ధమత గ్రంథములును చదువుకొని, కావలసిన పాత్రములు పెక్కులు వ్రాసికొనిపోయె.

కాశి-ఇది గొప్ప విద్యాపీఠము. ఇందు అన్ని విద్యలునేర్పు మహాపండితు లుండెడివారు. ఇట్టిచో పా. గుడులుండకున్న మఱి యెక్కడ ఉండును?

కంచి- ద్రవిడ దేశమున రాజధానిగా ఉండి పేరుపొందిన యీ నగరమున మంచి విశ్వకలాశాల ఉండెడిది. కాన, దానితో పాటు మంచి పా. గుడియు ఉండుట నిశ్చయమే.

మధుర-ఇది పాండ్య దేశ రాజధాని. దీనిలో పండిత సంఘ ముండి, తమిళ పాత్రములను పరికించుచుండెడిది. కావున ఇందు పా. గుడి వెలయుచుండుటలో వింత లేదు.

చీనాయాత్రికులవలెనే ఆయా విద్యాపీఠములలో చదువుకొన వచ్చినవారు పలువురు తమకు కావలసిన పాత్రములకెల్ల నకళ్ళు వ్రాసికొని తమనాడులకు కొనిపోయి, అక్కడ ఎఱుక పెంపొంద చేసికొను చుండిరి.

గుప్తరాజులు ఉత్తరహిందూస్థానమున క్రీ. వె. 300 మొదలు ౬౫౦ వఱకును పాలించిరి. పిదప ఎంతో కాలమునకు వచ్చిన ఎలిజబెత్తురాణి రాజ్యకాలము ఇంగ్లాండున కెట్టిదో, గుప్త రాజ్యకాలము ఇండియా కట్టిదని విన్సెంట్‌స్మిత్తు పొగడినాఁడు. అపుడు చదువు మిక్కిలి హెచ్చె. పా. గుడులు దానితోడివే. గుప్తరాజులలో విక్రమాదిత్యుఁడు పేరుపొందిన చక్రవర్తి. అతని సభలోని సమ్యులు విద్యానిధులఁట! అతఁడు పా. గుడులు పెట్టి పోషించుట వింతయా? పిదప గుప్తసామ్రాజ్యము చీలిపోయి, చిన్నచిన్న తేండ్లపాలయ్యె. కాని, వారును పా. గుడులు, పెట్టించి, పెట్టి

వ్రాతపొత్తములు పోకుండ కాపాడిరి. అవి తాళ-భూర్జ పత్రముల మీఁద ఎంతో ఓపికతో వ్రాసెడివారు.

౭ వ శతాబ్దిని హర్ష చక్రవర్తి ఉత్తరదేశమును, చాళుక్య రాజగు రెండవ పులకేసి చక్రవర్తి దక్షిణాపథమును పరిపాలించు నపుడు గ్రంథాలయములు ఇండియాలో అంతటను వ్యాపించి యుండును.

౧౧ శతాబ్దిని భోజరాజు పండితుఁడగుటచే గ్రంథాలయము స్థాపించె. చాళుక్యులు మాళవదేశమును జయించినపుడు ఆపొత్తపు గుడిలోని పొత్తములు తీసికొనిపోయిరి.

చాళుక్యులలో విశాలదేవుఁడు పొ. గుడులకొఱకు సొమ్ము హెచ్చుగా వెచ్చించెనఁట. అతని గ్రంథాలయములోని రామాయణము జర్మనిలోని బోన్ విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు చేరెన దందురు.

౧౨ వ శతాబ్దిని మహమ్మదుఘోరి ఇండియాపై దండెత్తి వచ్చినపుడు ఉత్తరహిందూస్థాన రాజ్యములలో పొ. గుడులు హెచ్చుగాఉండి, మంది తెలివితేటలు గలిగి, వాని నెదిరించి, ఓడించిరి. అదిచూచి, పిదప అతఁడు పొ. గుడులెన్నో పాడు చేయించెనఁట! అతఁడు త్రొక్కిన త్రోవనే కొందరు తురుష్క దండయాత్రికులును త్రొక్కిరి. గ్రంథాలయములు పాడుచేసిరి. బౌద్ధ భిక్షుకులు కొన్నిపొత్తములు వారికి చిక్కకుండ నేపాళదేశమునకు కొనిపోయిరి. కాని, ఏమి లాభము? అవి అచ్చటి రాజ మంత్రుల మనోదౌర్బల్యము వలననో, ఆంగ్లేయుల ప్రోద్బల ప్రోత్సాహ నైపుణ్యమువలననో, అక్కడనుండి తరలిపోయి, లండను నగరము చేరినవి. ఇప్పటి గోరిల్లా మంటలపోరులలో అవి ఏమయినవో! ఏమి కానున్నవో! ఎవరు చెప్పగలరు?

తురుష్కుల దాడులలో ఉత్తర దేశ గ్రంథములు నేపాళమునకు, టిబెట్టు దేశమునకు చేరినట్లు, మధ్య దేశమందలి గ్రంథములు విద్యానగర సామ్రాజ్యమునకు చేరెనందురు. కాని, ఆ సామ్రాజ్యమును తురకల దాడికి లోనయ్యె అపుడు ఎన్ని పోయినవో! ఎన్ని మిగిలినవో! సరిగా చెప్ప వీలులేదు.

భోటాన్ పట్టణమున బౌద్ధవిహారపుపట్టు త్రవ్వినెడ గ్రంథాలయ మొకటి బయలుపడె. తురుష్కులదాడికి వెఱచి, అది పాతిపెట్టియుందురని డాక్టరు సైన్‌గారు వ్రాసిరి. అందు ౭ భాషలలో వ్రాసిన ౪ వేల పొత్తములు కలవు. అది సమగ్ర దేవాలయ గ్రంథాలయమని తేలినదంట! అనంగా ఒక్కొక విషయమునుగూర్చి ప్రత్యేకముగా ఒక్కొక గ్రంథాలయ మేర్పరుచుట మంచిదని యిప్పుడు మనమనుకొనుచుండ ఆపద్ధతి మన పూర్వులే వాడుకలోనికి తెచ్చినట్లు దీనివలన తేటపడినది.

కొందరు మహమ్మదీయులు పొత్తములు కాల్చివేసి, పొత్తపుగుడులు పెక్కులు పాడుచేసినారు. కాని, కొందరు పొత్తములను కాపాడి, పొ. గుడులుపెట్టి పోషించినారు. తుగ్లక్ ఫిరోజిషా చక్రవర్తి ౧౪ వ శతాబ్దిలో జ్వాలాముఖి దేవాలయమున ౪ వేల పొత్తములున్నట్లు తెలియవచ్చినపుడు, అవి ఢిల్లీకిచేర్చి, అందలి ముఖ్య గ్రంథములను అరబ్బీ-పారసీ భాషలలోనికి తర్జుమాచేయించె. మొగల్ చక్రవర్తులలో హుమయూన్ ౧౬ వ శతాబ్దిని గ్రంథాలయములు స్థాపించి, పోషించెనంట! అతని కొడుకగు అక్బరుమాట చెప్పనక్కఱయేలేదు. ఆయన గ్రంథములను చదివించి, వినుచుండెడివాఁడు; ముఖ్యగ్రంథములు రెండు మూఁడుసార్లుకూడ వినెడివాఁడంట. భారతము, రామాయణము, అథర్వవేదము, లీలావతీ గణితము తేజకమను జ్యోతిషగ్రంథము, ౪ వేల యేండ్ల కాశ్మీర చరిత్ర, హరివంశము, నలచరిత్ర మొ. పొత్తములు పార్సీలోనికి మార్పించె, కొన్ని క్రొత్తపొత్తములు వ్రాయించె. ఆయన గ్రంథాల

యము మఱొకచో దొరకని పొత్తములతో ఒప్పుచుండె. దానిలో ఒక భాగము రాణివాసమున స్త్రీలకొఱకుండినను, హెచ్చుభాగము సభాభవనమున బహిరంగముగానే ఉండెడిదఁట. ఆ పొ. గు. లోని భారతము ఉత్తర జయపుర గ్రంథాలయము చేరినది. దానిలో చక్కనిబొమ్మలును, వానిపైని ఉల్లిపొరవంటి లేడి తోలుకప్పులును కలవఁట. ౧౭ వ శతాబ్దిని జహంగీరు షాజహానులును గ్రంథాలయ పోషకులే. యూసఫ్ జులెయి–అను పొత్తము వ్రాసిన నూరల్లీకి జహాంగీరు ౧,౦౦౦ మొహరీలు కానుకచేసెనఁట! షాజహానుచక్రవర్తి పెద్దకొడుకు దారా తన ముత్తాత అగు అక్బరువలె విద్యాప్రియుఁడే గాక, కృతికర్త; పెక్కు పొత్తములువ్రాసె; ఉపనిషత్తులలో కొన్ని భాగములు పార్సీలోనికి తర్జుమాచేసె. అట్టిచో, అతఁడు గ్రంథాలయ ప్రియుఁడగుటలో వింత ఏమున్నది? ఔరంగజేబు గోలకొండ— హైదరాబాదులు జయించి, అందు వ్రాఁతపొత్తములు ఢిల్లీ గ్రంథాలయమునకు చేర్చె. కాన, ఢిల్లీ గ్రంథాలయ మపుడు మిక్కిలి గొప్పదయి ఉండవలె.

అప్పటి వ్రాఁతపొత్తములలో చిత్రకారులు బొమ్మలు చేర్చి, వాని వాడుక హెచ్చించుచుండిరి. ఎన్నో పొత్తపుగుడులలో విడిబొమ్మల పొత్తములుకూడ ఉండెడివి. చక్రవర్తుల పోషణమున ఎంతో పెంపొందిన ఢిల్లీ పొ. గు. మొగల్ సామ్రాజ్యము నాశనముతో నశించెనని తెలియవచ్చినపుడు గ్రంథాలయాభిమానుల డెందములు కుందకుండుటెట్లు? ౧౮ వ శతాబ్దిలో ఢిల్లీ పొ. గు. లోని పొత్తములు పెక్కులు అయోధ్యనవాబు పొ. గుడికిచేరె. కాని, ౧౮౫౬ లో అయోధ్య ఆంగ్లేయులకు లోఁబడినపుడు అచ్చటి పొత్తములు చాలవఱకు కలకత్తాకు చేరినవి; కొన్ని లక్నోకుచేరినవి. ౧౮౫౭ లో జరిగిన సిపాయీల తిరుగుబాటులో ఢిల్లీ-లక్నో నగరములు పాడైనవి; అపుడు పొ. గుడులును పాడయ్యెనని

వేఱె చెప్పనేల? లక్నో ముట్టడిలో కిటికీల కడ్డుపెట్టుకొనుటకు పొత్తములు వాడిరి. అది ముగిసిన పిదప అవి సిపాయీలకు వంట కట్టెలుగా పనికివచ్చినవి! ఏలమువేయఁగా కొన్ని ఏష్యాటిక్ సొసైటీ వారు కొనినారఁట! అపుడు రామపుర నవాబు అరబ్బీ పార్సీ పొత్తములెన్నో కొని, తన పొత్తపుగుడి పెంచెనఁట. ఆ పొ. గు. లోని అరబ్బీ పొత్తములు ౮,౮౬౭; పార్సీపొత్తములు ౮,౨౫౩ బ్యాంకిపుర సంస్థానమందును పోగా మిగిలిన మొత్తములు భద్ర పఱచిరఁట.

ఉత్తరదేశమున ఖుదాబక్షును, దక్షిణదేశమున తంజావూరిలో శరభోజీమహారాజును పొ. గు. కడంకలో మిక్కిలి పాటు పడిరి.

నేపాళము, జమ్మూ, బికనీరు, ఆళ్వారు, మైసూరు, నైజాము మొ. సంస్థానములవారు గ్రంథాలయములు పెట్టి పోషించిరి. టిప్పు సుల్తాను మంచి పొ. గు. కూర్చె; అందలి పొత్తములుకొన్ని ఇంగ్లాండు చేరె; కొన్ని విల్లియమ్‌కోట కాలేజీకి చేరె.

ఆల్వారు పొ. గుడికి భానుసింగు మహారాజు ఎన్నో పొత్తములు చేర్చెనఁట. పదునైదు దినములకు ఒక పొరటచొప్పున అఘామీర్జా వ్రాసిన 'గుల్‌స్థాన్' పొత్తము, దీనిలో తలదాఁచుకొనినది. ఇందు ఎన్నో వన్నెకెక్కిన బొమ్మలుగలవు. దీని అంచులపై నగిషీలు, గులాము ఆలీఖాను- బలదేవు- అను పనివాండ్రు చేసిరఁట! ఇది తయారగుటకు లక్షరూపాయలై యుండునఁట! ఒక ఆల్వారు ప్రభువు రు ౩ వేలును, కొసరు మంచి దుస్తుల కానుకయు ఇచ్చి, చక్కని ఖురాను వ్రాఁతపొత్తము కొనెనఁట! మూలము ఊదా సిరాతోను, టీక ఎఱ్ఱ సిరాతోను వ్రాసినారఁట!

మొగల్ సామ్రాజ్యము రూపుమాసి దేశ మరాజకమైన పుడు, అప్పటికే మన దేశమున చేరి—కొంత అధికారమును పలుకు బడియు గడించిన పలుతెగల తెల్లవారు - పోర్చుగీసు వారు, ఒలాం దులు, డేనులు, ఫ్రెంచివారు, బ్రిటిషువారు- తమకు నచ్చిన ఫొత్త ములను ఎట్లో సంగ్రహించి, తమ తమ దేశములకు చేర్చిరి. అవి యూరపుఖండములోని - ఆయానాడులలోని గ్రంథాలయములకు అలంకారములయ్యె. ఇట్లు మన యిండియానుండి కలిమి చెలిమియె కాక, పలుకు వెలంది యు తన కొన్ని రూపులతో వెడలి, వెఱ నాడులపాలై పుట్టిననాటికి జంట బీదతికము సమకూర్చె. ఇందు వలన ఇండియాలో పుట్టిన ఫొత్తములుకూడ పైకిపోయి మన ఫొ. గు. కడంకకు కొఱంత కలిగె. ఒక అరిది జైనలిఖిత పుస్తకము అమెరికాలోని స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూట్‌వారు రంగులతో వెల్లడించిరి ! శివాజీపటము పారిస్సు చేరె !! అక్కన్న, మాదన్నల పటములు అమ్‌స్టెర్‌డము చేరె !!!

ఈ కొఱంత ఏల కలిగెనని తలపోయుచో, భరతఖండము లోని వారికి అప్పటికే ఏర్పడిన కలసికట్టు తనములేమి- ఎదుటి పచ్చచూచి ఓర్వలేమి - సోమరితనము - తొలితెగువ - వెనుకతీంత మొదలగు గొట్ల వలననే అని తేలును. ఇంతవల? మన బానిసతనమే ఇది నిజమని చాటుచున్నది. దీనికంటె మఱి వేరు తార్కాణ మేమికావలె?

**ఇండియా ఫొత్తపుగుడి మనుగడ - ఇప్పటిది**

ఢిల్లీ సామ్రాజ్యము నశించిన పిదప ఏర్పడిన సంస్థానము లలోను- జమీందారీలలోను నష్టశేషములగు గ్రంథాలయము లును, తెల్లతెగలవారి సంబంధమువలన వారి వారి భాషల ఫొత్తములతోడి ఫొ. గుడులును దేశమున వెలసె. సర్వకలాశాలలు,

కలాశాలలు మొదలగు విద్యాసంస్థలలో ప్రత్యేకగ్రంథాలయములు బయలుదేఱె. గృహస్థపండిత గ్రంథాలయములు మరికొన్ని ఏర్పడె.

కలకత్తాలోని 'ఇంపీరియల్ లైబరీ'యును (సామ్రాజ్య గ్రంథాలయమును), ప్రస్తుతమిది 'నేషనల్ లైబ్రరీ'(జాతీయగ్రంథాలయముగ వ్యవహరింపబడుచున్నది. చెన్నపురిలోని కానిమరా లైబ్రరీయును అడయారు దివ్యజ్ఞానసమాజ గ్రంథాలయమును, పూనాలోనిభండార్కరు లైబ్రరీయును, ఇంకను మఱికొన్నియును మాత్రమేఒక మోస్తరు పెద్ద గ్రంథాలయము లనఁదగును.

నేపాళమున రతాన్‌పురమున ౮౦ పెట్టెల వ్రాఁత పొత్తములును, జసల్మీరునందలి పరశురామ గ్రంథాలయమున వేలకొలఁది వ్రాఁత పొత్తములును, ఇట్లే కనరాజిల్లాలోని మురచిద్రిలోని జైన గ్రంథాలయమందును, అహమ్మదాబాదు- నద్యాను- సూరతు- కాంబే- తరాదు- భట్నీరు గ్రంథాలయములందును వేలకొలఁది పొత్తములు కలవని తెలియవచ్చుచున్నది.

౧౯౧౦లో అమెరికా పద్ధతినిబట్టి బరోడాలో బయలుదేఱిన పొ. గు. కడంక అచ్చటి దొరతనమువారి తోడ్పాటుతో బాగుగా జరుగుచున్నదని ఇదివఱకే అనుకొంటిమి అదే ఇండియాకెల ఆదర్శముగా ఉన్నది. అచ్చటి పొ. గుడులలోని పొత్తము లిపుడు సుమారు ౮ లక్షలుండును

బంగాళా- పంజాబు-చెన్నపురి-బిహారు- బొంబాయి రాష్ట్రములలో గ్రంథాలయోద్యమము ఒక మోస్తరుగా పనిచేయుచున్నది. కొన్ని పట్టణములలోను- కొన్ని పల్లెలలోను పొ. గు. పని కొంతవఱకు జరుగుచున్నను, జరుగవలసిన పని దీనికి ఎన్నోరెట్లు హెచ్చనక తప్పదు. పట్టణములలోని పని ఇప్పటికంటె బాగుగా ప్రయత్నించుచో కొంతవఱకేని తృప్తికరముగా జరుగవచ్చును కాని, పల్లెలలో పనినిగూర్చి అట చెప్ప వీలులేదు.

ఏమందురా ? మన పట్టణములు ౨,౫౦౦;మన పల్లెలు ౭,౫౦,౦౦౦! కాన, మనదేశమున పల్లెలలో పని బాగుగా జరిగినపుడే మనము సంతసింపవలసి యుండును. దీనికి తోడు మన ఇండియా పౌ. గ్ర. కడంకకును, పైనాడుల పౌ. గ్ర. కడంకకును ఎంతో తేడాకలదు. చదువుకొనినవారికి తోడ్పడునది అక్కడిది; చదువు వచ్చిన కొలది మందితో పాటు చదువురాని పెక్కుమందికి తోడ్పడవలసినది ఇక్కడిది; అక్కడ చదువుకున్నవారు ౧౦౦ కి షుమారు ౯౦ మంది; ఇక్కడ ౮ మంది. ఈ తేడాకు కారణము, పైనాడులలో మంది చదువుకొనుటకు సొమ్ము హెచ్చుగా వెచ్చించుచుండ, మన నాటమిక్కిలితక్కువగావెచ్చించుటయేదీనికొకతార్కాణ.-లండను లోని ౮౮ లక్షలమందికి చదువు ఖర్చు రు ౧౭ కోట్లు;ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వము క్రిందనున్న సుమారు ౨౭ కోట్లమందికి చదువు ఖర్చు సుమారు రు ౧౭ కోట్లు- అనఁగా అక్కడ తల ౧ కి చదువు ఖర్చు రు ౩౮; ఇక్కడ తల ఒకటికి సుమారు ఎనిమిది అణాలు ! ఇట్టి స్థితిలో ఇండియాలో పౌ. గ్ర. పని సరిగా జరుగకుండుట వింతగాదు చేయవలసినది ఎంతో పెద్దపని. ప్రభుత్వమువారి వలనఁగాని, ధనవంతులవలనఁగాని తెలివి తేటలు పొందవలసినవారి వలనఁగాని వచ్చు సాయము మిక్కిలి తక్కువ. అర్థబల మిటుండ అంగబలము మఱింత తక్కువగా ఉన్నది. కాన, పౌ. గ్ర. పని చేయువారు ఎదురీఁత యీఁదవలసి వచ్చుచున్నది. కాన, కలుగవలసినంత పెంపు కానరాకున్నది. నూటికి ఇద్దఱకుకూడ పౌ. గ్ర. తోడ్పడుటలేదు.

విద్యావిధానమున మార్పులు సూచించుటకు ఏర్పడిన సంఘములలో ఏదియును గ్రంథాలయముల ఆవశ్యమునుగూర్చి ఎత్తి యుండలేదు పౌ. గ్ర. తోడ్పాటు లేనిచో తొలిచదువుకొనుటకు వెచ్చించిన సొమ్మంతయు బూడిదలో పోసిన పన్నీరే-అని ఆసంఘ సభ్యులకు తట్టకుండుట ఎంతయువింత!

బరోడా సంస్థానములో జరుగుచున్నంత ప్రశస్తముగాఁ గాకున్నను, మైసూరు, పుదుకోట, నైజాము మొదలగు సంస్థానములలో గ్రంథాలయోద్యమము కొంతవఱకు సాగుచున్నది. కొచ్చిను సంస్థానమున గ్రంథాలయాభిలాష తక్కువ అందురు. తిరువాన్కూరు సంస్థానమునకూడ పొ. గు. కడంక సరిగా జరుగుట లేదఁట బ్రిటిషిండియాలో ౧౦౦ కి చదువుకొన్న పురుషులు ౧౪ గురును, స్త్రీలు ౨ రు కాఁగా, తిరువాన్కూరు సంస్థానమున చదువుకొన్న పురుషులు ౪౧ మంది; స్త్రీలు ౧౭ గురు. ఇట్టిచోట పొ. గు. కడంక వెనుకఁబడుట వింతయే. ఇప్పుడైన అచ్చటివారు వలయు శ్రద్ధ తీసికొందురుగాక !

చెన్నరాష్ట్రములో రాజధాని అగు చెన్నపట్టణమున పొ.గు కడంక కొంతవఱకు బాగుగానే జరుగుచున్నను, ద్రవిడదేశమునఁ గాని, కర్ణాటకదేశమునఁగాని కేరళదేశమునం గాని గ్రంథాలయోద్యమము వ్యాపించినట్లు కానరాదు.

తెనుఁగునాటి పొత్తపుగుడి మనుగడ—ప్రాఁతది

తెనుఁగునాడు మొదట తొంటి ద్రావిడ సామ్రాజ్యమున చేరియుండి, పిదప విడిపోయె. పిమ్మట దానిలో కొంత ఆంధ్రదేశమయ్యె. నిజమునకు, కళింగమును- ఆంధ్రమును- త్రిలింగమును తెనుఁగునాటిలోనివే. ఇపుడు, 'ఆంధ్రదేశము'— అనునుడి 'తెనుఁగునాడు'- అను నుడికి మాఱుగా వాడుచున్నారు, కాని, రాజకీయవిషయమున 'ఆంధ్ర' పదము వాడినను, తక్కిన యెడల 'తెనుఁగు' 'తెలుఁగు'నుడులే వాడుట ఎంతయు ఒప్పును.

తొంటి ద్రావిడ సామ్రాజ్యమున చేరియుండినపుడు తెనుఁగునాటి తొల ద్రావిడభాషలో వ్రాసిన పొత్తము లుండి యుండుననుట నిక్కువము; పొత్తములతోడివే పొత్తపుగుడులు కదా.

పిదప, ఆర్యులతో వారిగీర్వాణపుస్తకములును, తరువాత సంస్కృత పుస్తకములు చేరియుండును. తెనుఁగు పాత్రములపుడు లేకుండును గాక! పా. గుడులు మాత్రము లేవనరాదు.

† భారతయుద్ధము సుమారు 3,౮౦౦ ఏండ్ల క్రిందట జరిగినది. అప్పటికి కళింగ - ద్రవిడ - పాండ్య - కేరళ దేశము లేర్పడినవి. కళింగదేశరాజు తన చుట్టములతోను - సైన్యముతోను వెళ్ళి, భారతయుద్ధమున కౌరవపక్షమున పోరెను. కళింగ దేశస్థులు తెలుఁగువారే. కాన, అప్పటికి తెనుఁగు పాత్రములు కొన్నియైనిపుట్టియుండునేమో!

తెనుఁగువారు, ఇప్పటికి సుమారు 3000 ఏండ్లక్రిందట బంగాళములోని టిప్పెరాకును, అక్కడనుండి బర్మాకును-ఇండో-చీనాకును వెళ్ళి, రాజ్యములు చేసినట్లు తార్కాణములు కానవచ్చుచున్నవి. వారు కళింగమునుండియే వెళ్ళిరనుట నిశ్చయము మఱి కొందరు కళింగమునుండి ఓడఁ మీఁద జావా మొదలగు దీవులకు వెళ్ళిరనుటకు 'క్లింగ్' నుడియే పెద్ద నిదర్శనము. అప్పుడే 'తెలుఁగు' 'తెనుఁగు' నుడులు వాడుకలో ఉండెననుటకు ఇప్పుడు బర్మాలో వాడు 'తెలైంగ్,' 'తౌన్గుథు' అను నుడులేసాక్ష్యము ఇందు ౧౯౩౧ జనాభా లెక్కలనుబట్టి మొదటి తెగవారు 3,౦౫,౨౯౮ గురుసు, రెండవ తెగవారు ౨,౨౭,౭౧౮ గురును కలసు. పెఱనాడులకు వెళ్ళి, రాజ్యములు చేయఁగలుగు స్థితిలో ఉండినపుడు తెలుఁగువారికి పాత్రములును, పా. గుడులును ఉండియుండవా? కాని, నన్నయభట్టుకాలమునకు పూర్వముండిన పాత్రములే మనకిపుడు దొరకనపుడు, అంతకుముందు సుమారు ౨ వేలయేండ్ల క్రిందటి వెట్లుదొరకును? అయినను, చీనావారు పుస్తకప్రియులు

---

† ఇది చరిత్రకారులు చెప్పుమాట. జ్యోతిష్కుల లెక్కనుబట్టి సుమారు ౫ వేల ఏండ్లక్రిందట జరిగినది.

కాన వారి ప్రాంత పొ. గుడులలో ఏవేని ఉండునేమో! కాని, వానికిని ఎన్నో యిక్కట్టులు వచ్చినవి; ఎన్నో పొత్తములు పోయినవి. ఏమైనను, వీలున్నచో వానికొఱ కరయనగును.

సూత్రకారులగు బోధాయనుఁడును - ఆపస్తంబుఁడును ఆంధ్రులనుచున్నారు. అట్టిచో వారి కాలమున పొ. గుడులుండుట వింతకాదు. ఆంధ్రులు తెనుఁగునాటిని లోఁబఱుచుకొనినపుడు వారితో ప్రాకృత పుస్తకములు వచ్చినవి. అపుడు బౌద్ధజైనమతములు తెనుఁగునాట వ్యాపించుటచే పాలిపొత్తములును, అర్ధమాగధీ పుస్తకములును చేరినవి. నాగార్జునుఁడు తన పేర నొప్పు కొండమీఁదనుండి ౨౮ గొప్ప బౌద్ధగ్రంథములు వ్రాసె; దిజ్ఞాగుఁడను ఆంధ్ర బౌద్ధాచార్యుఁడు ప్రమాణసముచ్చయమను ప్రమాణతర్కపుస్తకము కూర్చె. ధాన్యకటకము ఆంధ్రులకు రాజధానిగా ఉండినపుడు, అచ్చట విశ్వకలాశాల ఉండెడిది; అందు చదువుకొనుటకు చీనా-బర్మా-సింహళము మొ॥ చోట్లనుండి విద్యార్థులు వచ్చుచుండెడివారు. కాన, అక్కడ అపుడు పొ.గు. ఉండెనని వేఱె చెప్పనక్కర లేదు. అట్లే బౌద్ధవిహారములయందును, జైనమఠములలోను, ఆంధ్రరాజుల నగరులలోను, పండితులదగ్గఱను పొ. గుడులు ఉండియుండును.

ఆంధ్రుల తరువాత, పల్లవులు-చాళుక్యులు- కాకతీయులు- విద్యానగరరాజులు- రెడ్లు-వెలములు-క్షత్రియులు మొ. వారందందు రాజ్యము చేసిరి. విద్యానగరరాజ్యము సామ్రాజ్యము సైతమయ్యె. దండయాత్రలలో కొందరు పొ. గుడులు కాల్చివేసెడివారు. వేఁగినాఁడను పేరందుచేతనే వచ్చెనందురు. అట్టిచో, తెనుఁగునాటి పొ. గుడు లుండెననుట నిస్సందేహము. వాడి దగ్గఱి నాగై గ్రామమున దొరకిన శాసనమునుబట్టి- రాయనారాయణ అను చాళుక్యరాజు సేనానాయకుఁడు మధుసూదనుఁడేర్పఱిచిన

వసతికలాశాలలో ఇద్దరు వేదాధ్యాపకులతోను, ముగ్గురు శాస్త్రోపాధ్యాయులతోను, ఆరుగురు పొత్తపుతీర్పరులుండిరని తెలియ వచ్చును.

తెనుఁగువారికి పొ. గు. మీఁద మక్కువ ఎక్కువ అనుటకు ౧౭ శతాబ్ది మొదట తంజావూరిలో తెలుఁగు నాయకులేర్పఱచిన పొ. గుడియే తార్కాణ.

తుదకు బ్రిటిషువారి యేలుబడి వచ్చినది. జమీందారీలు పెక్కులు బయలుదేఱినవి. జమీందారులలో విద్యాప్రియులు పెక్కురు గ్రంథాలయములు పెట్టిరి. పండితులును, భాషాభిమానులును, పొ. గు. లేర్పఱచిరి. సుమారు ౧౮౦౦ ప్రాంతమున విశాఖపట్టణమున శ్రీ పరవస్తువారు పొ. గు. ఒకటి పెట్టిరి; అది ఇపుడు 'ఆర్ష గ్రంథాలయము' అను పేర వెలయుచున్నది. ౧౮౨౮ లో ఇండియా సర్వేయర్ జెనరల్‌గా ఉండిన మెకంజీదొరగారు తయారుచేసిన తూర్పు వ్రాఁతపొత్తముల జాబితాను హెచ్. హెచ్. విల్సన్‌దొరగారు వెల్లడించిరి. అందు, తెనుఁగుపొత్తములు ౧౪౬ లెక్కకువచ్చె. ౧౮౩౪ లో తెనుఁగుపొత్తములచ్చుపడ మొదలిడె. అప్పటినుండి పొ. గుడులు పెరుఁగఁదొడఁగె ౧౮౬౮ నవంబరు ౩ తేదీని సంస్కృతపు వ్రాఁత పొత్తములనుగూర్చి ఇండియా దొరతనమువారుచేసిన తీర్మానమునుబట్టి చెన్నపురి దొరతనమువారు నియమింపఁగా గస్టవ్-ఆపర్ట్‌దొరగారు దక్షిణదేశమున సంచారముచేసి - వెల్లడించిన ఆ పొత్తముల జాబితాలలో ఆయన చూచిన పొ. గుడులనుగూర్చి తెలిపియున్నారు. అందు విశాఖపట్టణముజిల్లాలోనివే ౩౦ లెక్కకు వచ్చె. అట్టిచో తక్కిన తెనుఁగునాట ఎన్నో ఉండియుండును. అవి అన్నియు సరిగా పడమటితీరున మంచి పొత్తపుగుడులు కాకున్నను కొన్నియేని కొంత వఱకేని మంచి పొ. గుడులనఁ దగియుండును.

తెనుఁగునాటి పొత్తపుగుడి మనుగడ - ఇప్పటిది.

ఇఁక, పడమటితీరున సరిగా ఎట్లు మన పొ. గు. కడంక మొదలై - సాగుచున్నదో తెలిసికొననగు. మనవారు కొందఱు ఇది ఆంధ్రోద్యమముతో ఆరంభమైన దనుకొనుచున్నారు. వారి తలంపు తప్పు. గ్రంథాలయోద్యమము పాశ్చాత్యపద్ధతిని ౧౮౮౬ లో ప్రారంభమయ్యె; ఆంధ్రోద్యమము ౧౯౧౩లో శ్రీ. శ్రీ. జొన్నవిత్తుల గురునాథముగారు మొదలగువారి ప్రయత్నమున పైకివచ్చె. అప్పటికే తెనుఁగునాట పెక్కు మంది గ్రంథాలయము లేర్పడినవి. ౧౯౧౨ లో అవి ౮౫; ౧౯౧౩ లో ౧౨౩ లెక్కకువచ్చె. నిజమునకు గ్రంథాలయోద్యమము వేఱు; ఆంధ్రోద్యమము వేఱు; దాని సభలు వేఱు; దీని సభలు వేఱు. ఆంధ్ర మహాసభలు జరుగకున్నను గ్రంథాలయమహాసభలు జరుగుచున్నవి. రెండును ఎప్పుడేని ఒక్కచోట కలసిన కలయికగాక! నిజమునకు బరోడాలోని పొ. గు. కడంకవలెనే ఆంధ్రోద్యమము తన తొలి దినములలో గ్రంథాలయోద్యమమునకు ప్రోత్సాహము కలిగించుటకు తోడ్పడినది.

  

మన పొ. గు. కడంక, నగరములలోను పట్టణములలోను పల్లెలలోను సాగుచున్నది. అందు మొదటి రెండింటిలో మొత్తము మీఁద మనయిప్పటి దేశపరిస్థితులనుబట్టి పని ఒకవిధముగా బాగుగనే జరుగుచున్నదనవచ్చును. ఇఁక పల్లెలలో అన్ననో కొన్నిటిలో పనిబాగుగనే జరుగుచున్నది. కాని, మొత్తముమీఁద చూచినచో, నగరములగూర్చియు- పట్టణములనుగూర్చియు చెప్పినట్లు చెప్ప వీలులేకున్నది. కుముదవల్లి మొదలగు కొన్ని పల్లెలలో కొన్ని పట్టణములలో కంటె పని బాగనిపింపవచ్చును. అయినను, పొ. గు. పనిలో మనకు గీటురాయి పల్లెలలోని పనియే. కాన, మనము

దానికే పెద్దత్రికమీాయనగు. ఏ ఉద్యమమునుగాని ఫలవంతమగుటకు అంగబలమును, అర్థబలమును కావలె. మన దేశమిపుడు బీదవగుటచే అర్థబలము చాలకున్నది. ఇఁక, మందికి లోటులేకున్నను - అంగబలమును చాలకున్నది. ఏమందురా? మనలో చదువుకొనినవారు చాలతక్కువ; విద్యావిధానమందలి లోపముచే ఉన్నవారికిని తగిన శిక్షణములేదు. శిక్షణమునకు లోఁబడు తలంపుగలవా రెవరేని ఉందురేని, అట్టివారికి బీదతిక మడ్డువచ్చును. ఆఅడ్డు లేక పాటుపడుటకు పూనుకొనువారు కడునరిది. ఇందువలన, తగిన పొ. గు. కొలువరులు వలయునంతమంది దొరకకున్నారు. డబ్బుసాయమును, త్యాగమును, సమర్థతయు గ్రంథాలయోద్యమమునకు అవశ్యకములు. కాన ఇవి లభించుటకు వలయు వెరవులు చూడనగు. గ్రంథాలయోద్యమము, నిజమునకు, విద్యాశాఖలోనిదే. అయినను, దొరతనమువారు దానిపనికి పూనుకొనమిచే మనమే ఆపని చేయవలసివచ్చినది. హెచ్చుపొత్తము లుండుటచే పొ. గు. గొప్పదనిపించుకొనునని మనలో కొందఱికను తలంచుచున్నట్లు కానవచ్చుచున్నది. ఆతలంపు సరిఅయినది కాదు. ఉన్నపొత్తములు తక్కువయే అయినను అవి దేనిలో బాగుగా వాడుకలోనికి వచ్చి చదువరులకు మేలుకలిగించునో ఆ పొ. గుడియే గొప్పది. పొత్తములు వాడుకలోనికి వచ్చుట అనఁగా పొ. గుడికి చదువరులు వచ్చి వాడుకొనుటయో, అవి ఊరిలోని చదువరులు ఇండ్లకుతీసికొనివెళ్ళియో - రప్పించుకొనియో వాడుకొనుటయో కాదు; చదువరు లెక్కడనున్నను పొత్తములువారి దగ్గఱకుచేర్పఁగా వారు వాడుకొనుటయు అగును; నిజమునకు అదేమిన్న. పొ. గు. కడంక బాగుగా సాగునాడులలో పొత్తము లిట్లువాడుకలోనికి వచ్చుటకే హెచ్చుగా కడంగుచున్నారు. ఇంతేకాక, ఎవరు ఏ బోగట్టా కోరినను పొ. గు. వారు వారికి అది తెలుపఁగలుగుటయు

పా. గుడికి గొప్పఁదనము తెచ్చును. కాన, ఇవి పా. గుడులు నడుపు వారు బాగుగా గుర్తింపనగును. ఇంతయేల ? కలవానికి వలెనే పాత్రపుగుడికిని ఇచ్చుటవలననే గొప్పదనము వచ్చునుగాని, దాఁచుకొనుటవలన రాదు.

మఱొకమాట. పా. గుడి చదువుకొనిన వారికే పనికివచ్చుట చాలదు; అందు, నూటికి తొంబదిమందికి పైఁగా చదువురాని వారున్న మననాట అది బొత్తిగా చాలదు. చాలక పోవుటయే కాదు. చదువురాని వారికి పనికిరాని పా. గుడి పనికిరానిదే అని పించుకొనును. అందువలన, చదువురాని వారికి చదువుచెప్పియు, పురాణములు చదివించుట - ఉపన్యాసములిప్పించుట - బొమ్మలు చూపుట మొదలగు పెక్కు వెరవుల వారికి ఎఱుక కలిగించియు, పా. గుడులవారు పాటుపడనగును. కొన్ని పా. గుడులలో ఇట్టిపని కొంతజరుగుచుండుట సంతోషకరమే. కాని, ఉన్న అన్నింటిలోను ఇప్పటికంటె హెచ్చుగా ఈపనిజరుగవలసి యున్నది. అటు జరుగనిచో అవి మంచి పా. గుడు లనిపించుకొనఁ జాలవు. రైతులను బాగుచేయుట మంచి పా. గుడిపని. మన రైతులకంటె తెలివి గలవారు కాని రష్యామాజిక్కులను అచ్చటి మంచి పా. గుడులు సేద్యములో మంచి నేర్పరులుగా చేయఁజాలినవి.

పా. గుడులు సరిగా పనిచేయుటకు పాత్రపుతీర్పరి గట్టివాఁడు కావలె; అతఁడు తన పా. గుడిలోని పాత్రము లన్నియు చదివి, వాని సిగ్గు తెలిసికొనఁగలవాఁడై ఉండవలె; కోరినబోగట్టా చెప్పఁ గలిగి యుండవలె; పాత్రము లెట్లమర్పవలెనో గుఱ్ఱెఱింగి యుండ వలె. కాని, అట్టి పాత్రపు తీర్పరులు చాల తక్కువగా ఉన్నారు. చదువుకొనినవారును, ఓర్పుగల వారును, తోడివారి మేలుకోరు వారును మాత్రమే పాత్రపు తీర్పరులుగా ఉండుటకు తగినవారు. వారు చదువరులను పిలిచి విందుచేయుటమేలు; చదువరుల యిండ్ల

లోనే విందొనరించుట మఱింతమంచిది; వారు ఇంటివారు కావలెం గాని కావలివారు కారాదు.

నిలుకడ పొ. గుడులేకాక సంచార గ్రంథాలయములును అవిలేనిచోట పనిచేయవలెను. ఆలమూరిలోను, కుప్పములోను నడ పొ. గుడులు పనిచేసినట్లు తెలియవచ్చినది. బెజవాడలో ఈ నడుమ హనుమంతరాయ గ్రంథాలయమువారు నడ పొ. గు. పని చేయ మొదలిడినారు. కాని, జరుగవలసిన దానిలో ఇది చాల తక్కువ.

**ఉత్సవములు - సభలు - మహాసభలు**

గ్రంథాలయములు వార్షికోత్సవములు, సభలను జరుపు చున్నవి. తాలూకా మహాసభలును, జిల్లామహాసభలును, ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలును జరుగుచున్నవి. సంతోషమే; కాని, వీనితో మనము తనియరాదు. సంవత్సరము పొడుగునను పొ. గు. పని పట్టణములలోను-నగరములలోను-ఏవోకొన్ని పల్లెల లోను మాత్రముగాక, ఉన్న పొ. గుడులన్నింటిలోను చదువు కొనిన వారికిని, చదువుకొనని వారికిని, దగ్గఱివారికిని దవ్వుల వారికిని - పనికివచ్చునట్లు పని జరుగునప్పుడే మనము తనియ నగును. మన పరిస్థితులను బట్టి మన పొ. గుడులట్టి స్థితిలో నికి ఇప్పటికిని రాలేదని మనమెఱుంగుదుము. కాని, మన బాధ్యతగుర్తించి, మన పొత్తపు గుడులను మంచి స్థితిలోనికి తెచ్చుటకు ప్రయత్నించుట మనధర్మము. ఆధర్మము మనలో ఎవరికి వీలగునంతవఱకు వారేదోచేయుటతో పూర్తికాదు. మన గ్రంథాలయోద్యమమునకు ఆం. దే. గ్రం. సంఘము ఆధారము. దాని కార్యనిర్వాహకులకు-అందు ముఖ్యముగా కార్యదర్శికి-తక్కిన గ్రంథాలయాభిమానులెల్లరును తోడ్పడవలె. అట్టి తోడ్పాటు

ఇంతకుముందు మొదటినుండియు మొన్నమొన్నటి వఱకును కార్య దర్శిగా ఉండిన శ్రీ వేంకటరమణయ్యగారికిఁ గాని, ఇప్పుడు కార్య దర్శిగాఉన్న శ్రీ నాగభూషణముగారికిఁ గాని, కలిగినదనిగాని, కలుగుచున్నదనిగాని, సంతసింపఁజాలము. అట్టితోడ్పాటుకలుగుచో 'గ్రంథాలయసర్వస్వ'మేలపోవును? 'ఆంధ్ర గ్రంథాలయ' మేలసరిగా సాగకుండును? ఇది గుర్తింతుముగాక! ఇప్పటినుండియేని మన ధర్మమును పాటించి, మన తల్లిసంఘ కార్యదర్శిగారికి శక్తికొలఁది తోడ్పడి, దానివలన మేలొందుదుముగాక!!

చేయవలసినపని

"గుండెలో ఎల్లఁడెపుడు మేల్కొనునో! అపుడె, వాని పైపిలుపుల విన వచ్చుమనకు" అని ఎఱుకగలవారందురు. పై పిలుపు మనకు వినవచ్చునపుడే మనతోడివారికి మనము ఇంతోఅంతో మేలుచేయఁజాలుదుము. కాని, ఆపిలుపు మనలోపలనున్న పరమాత్మ మేల్కొనునప్పుడుగాని-మనకు ఎఱుకకలిగినఁగాని-వినఁబడదఁట! నిజమే. మనలోపలను-వెలుపలను ఒక్కపరమాత్మయే ఉన్నట్లు తెలిసినపుడే, ఎల్లఉసుఱులు మనవంటివే అనియు అందఱును మనవంటివారే అనియు, వారు మనవారే అనియు తెలియవచ్చును. మనవారిపిలుపు మనకు వినవచ్చుట వింత కానేరదు; మనము వారికి మేలుచేయుట అంతకంటె వింత కానేరదు. కాని, పైని తెలిపిన ఎఱుక — నిండెఱుక — కలుగుట ఎట్లు? మొత్తముమీఁద మన తలిదండ్రులుగాని, మన ఒజ్జలుగాని, మన పీఠాధిపతులుగాని, అట్టిఎఱుక మనకు కలిగించుట లేదు. ఎప్పుడో ఎవరో మనకు ఎఱుక కఱపినను, అది దానిగుంటలోని కుక్కకు కలుగు ఎఱుకవంటిదే అగుచున్నది. ఎవరికో ఒకరికి ఎఱుక నాటునుగాక! అందఱకును అది నాటుటలేదు; దానివలన

జరుగవలసినపని జరుగుటలేదు. దానికి కతము ఎఱుక మనలో పాదుకొనునట్లు చేయుటకు వలయు ఏర్పాటు లేమియే. దాని కతము మనబానిసతనమే. మనలో ఇది తెలిసినవారు ఏదో సంఘము వలన తోడివారికి ఎఱుకఅబ్బుటకు ఎడతెగక పాటుపడవలసి యున్నది. అందుకొఱకే కొన్ని సంఘములు మనవారు కొందఱు పెట్టినారు. కాని, అవియు అనుకొన్నపని పెక్కుకారణములచే చేయఁజాలకున్నవి. హోదాలమీఁద మనకున్నంత మోజు పనిమీఁద లేకున్నది. అందుచేత చేయఁదలఁచుకొన్నపని వదలివేసి, జపము విడిచి లొట్టలు వేసినట్లు, జట్టీలలో పడిపోవుచున్నాము. పొ. గు. లోని పొత్తము వాడుకొనక పాడుచేయునట్లే మన కబ్బిన ఎఱుకను కూడ కొఱమాలినదానినిగా చేయుచున్నాము. విందులలోను, సభలలోను, ఫోటోలు తీయించుకొనుటలోను మనము హెచ్చుగా కనఁబడుదుము గాని, పనిచేయవలసివచ్చినపుడు కొందఱమే కనఁబడుదుము; ఒక్కరమే అనుమందురా? ఒక్కొక్కప్పుడు అదియు జరుగక పోవుటలేదు. కాని, మొత్తముమీఁద కొందఱము కనఁబడుట జరుగుచున్నది. పెక్కురము కనఁబడుటలేదనియే మనవగపు. అందుచేతనే అంగబలము మనకు చాలకున్నదనియు, తక్కిన లోటులతోపాటు ఈ లోటును తీర్చుకొనుటకు వెరవులుచూడనగు ననియు అనుకొనినారము.

పుదుకోట మహారాజకాలేజి పొత్తపుతీర్పరి అగు శ్రీ ఆర్. అనంతనారాయణన్‌గారు దారి పొ గు. యేర్పాటునుగూర్చి మాటలాడుచు, ఇల్లును-పొత్తములునుగాక, మంచిపనికారులు-పని చేయువారు-ఇప్పటిఉనికినిబట్టి మారుమేలుకోరని వారు కావలెనని పించనుదార్లును, చదువుకొన్న నిరుద్యోగులును, విద్యార్థులును, పట్టభద్రులును, గ్రామోపాధ్యాయులును తగినవారుకాన, వారిని పొ. గు కొలువరులుగా చేర్చుకొనవచ్చుననిరి. కొందఱు గ్రామ పంచాయతిపనియు-సహకారసంఘపు పనియు చేయ[illegible]

చిరి. కవులను-పండితులనుకూడ ఈజట్టులో చేర్పనగును. చదువు కొన్న నిద్యోగులలో కలవారును, బీదవారును ఉందురు; ఇట్టి బీదలకు వీలున్నంతవఱకు ఏదోముట్టఁజెప్పవచ్చును. అయిన, వారు తమంత తాము వచ్చుట అరిది. కాన, గ్రంథాలయాభిమానులు-తాముస్వయముగా పనిచేయవీలులేనివారు-పైని పేర్కొనినవారిలో తగినవారినిఎంచి, వారిని ప్రోత్సహించి, వారిచేత పనిచేయింపవలె; వారు మాటకారులును-వ్రాఁతకారులునైన మఱియు మేలు. తామును వీలున్నంతవఱకు వారికే తోడ్పడవలె. వీరు తమమేలు లెక్కింపక తోడివారిమేలే చూచునపుడు వారిప్రయత్నము నెఱవేరుటకు హెచ్చువీలుండుననియే మనము గుర్తింపనగును. పొ. గు. కడంక ముఖ్యముగా చదువురాని వారికొఱకే-అనుమాట మఱవరాదు. ఉన్న పొ. గుడులు సరిగా పనిచేయునట్లు చూచుట మనకు మొదటిపని. పోయినవి ఏలపోయినవో! పేరునకు ఉన్నవి ఏల పని చేయుటలేదో! పిదప కనుఁగొని, వానిని లేవనెత్తి, పనిచేయునట్లు చేయుట రెండవపని; క్రొత్తవి పెట్టించుట మూఁడవపని; వాని కన్నింటికిని నిలుకడయు, పెంపును, తగినవాడుకయు కలిగించుట నాలుగవపని. ఈ నలుతెఱఁగుపని జరుగుటకు మఱెంతో చేయవలసి యున్నది. చూడుఁడు.

(౧) ఎన్ని యేండ్లనుండియో చిన్న పెద్ద పొ. గుడులలో ఉండవలసిన యెంపుడుపొత్తముల జాబితాలు తయారుచేయవలెనని తీర్మానించుచున్నను, నేఁటివఱకును ఆపని జరుగలేదు. కాన, ఆంధ్ర వాఙ్మయసూచిక సాయమునుబట్టియు, అనుభవమును బట్టియు, ౧౦౦, ౨౦౦, ౩౦౦, ౪౦౦, ౫౦౦, ౬౦౦, ౭౫౦, ౧౦౦౦ చొ॥పొత్తములజాబితాలు త్వరలో తయారుచేయవలెను. వీనిలో మంచివారిమనుగడలు, నాటిమనుగడలు, ప్రకృతిశాస్త్రములు, వృత్తులపొత్తములు, చరిత్ర నవలలు, నీతికథలు, ఎంపుడు కావ్య

ములు, నాటకములు మొదలగునవి చేర్పవలెను; అవి ముగించిన పిమ్మట ఆ మీఁది మొత్తములవి సిద్ధపఱుపనగును. ఈ జాబితాలలో దివ్యజ్ఞానసమాజమువారి పొత్తములు చేర్పనగును.

(౨) పనికిమాలిన పొత్తములను, చెడునడతలను గూర్చి తెలుపు పొత్తములను, పత్త్రికలను తొలగింపవలెను.

(౩) సేద్యము, నేఁత మొదలగు వృత్తులనుగూర్చియు, నేల–నీరు–గాలి–మెఱపుబలిమి (ఎలెక్ట్రిసిటి) – నాజూకుతనము–ఓర్పు–గరగరిక–పొదుపు–కలసికట్టుతనము–తెగువ–నిబ్బరము–అడఁకువ–పెట్టుపోఁతలు–ప్రోపుకాపులు– కనికరము – బంటుతనము – తల్లిపలుకుమన్నన–తల్లినాటిమన్నన – పెఱలమన్నన – కొలువుమన్నన–గ్రామచరిత్ర మొదలగు తెలలనుగూర్చి తేటతెనుఁగున పొత్తములు వ్రాసి, వ్రాయించి, అచ్చొత్తించి, తగిన వెలలకు పొ. గుడులకు చేర్ప వలెను.

(౪) రాతి – రాగిశాసనములు, ప్రాఁతనాణెములు, ప్రాఁత రాతిబొమ్మలు, ప్రాఁత వ్రాఁతపొత్తములు, ప్రాఁతపనిముట్లు, వింతముట్లు, మొదలగునవి చేర్చి, వానిని భద్రపరుపవలెను.

(౫) పొత్తపుగుడితో పొత్తుగలవారికెల్ల మంచి అలవాట్లును, మర్యాదలును, అడఁకువ–నెమ్మది మొదలగు సుగుణములును అబ్బునట్లు చేయవలె.

(౬) బొమ్మలాటలును – భాగవతములును – వీథినాటకములును ఆడించినపుడు మోటుహాస్యమునకుఁ గాని, మోటుమాటలకుఁ గాని తావీయకుండ చూడవలెను; పురాణములును, హరికథలును చెప్పించునపుడును, ఉపన్యాసము లిప్పించునపుడును విరసపు వెక్కిరింపులు రాకుండ మెలఁకువ చూపవలెను.

(౭) ఊరి ఉమ్మడి రాబడినుండియు, దేవాదాయ ధర్మాదాయములనుండియు, పరపతిసంఘములు మొ. వానినుండియు,

ధనికులగు దాతలనుండియు, స్థానికసంస్థలనుండియు, దొరతనము
వారి నుండియు, బిడ్డలులేనివారి ఆస్తులనుండియు, పా. గుడులకు
డబ్బు రాబట్టవలెను.

(౮) ఊరిపాత్రపుగుడు లొండొంటికి తోడ్పడుచు, పెంపు
చెందుటలోను—మేలుచేయుటలోను పోటీపడి పనిచేయవలెను.

(౯) వానకొలఁతయు—వేఁడిమికొలఁతయు—గాలి ఉనికియు
తెలుపు పనిముట్లును, గ్రామఫోను—మేజిక్‌లాంతరులును, ప్రమాద
ములకు తొలిసాయము చేయుటకు వలయు పనిముట్లు—మందులు
మొదలగునవియు సేకరింపవలెను; వీలగునెడ రేడియో ఏర్పాటు
చేయనగును.

(౧౦) రాత్రిబడులును, వేసవిబడులును పెట్టించి, వయసు
మీఱినవారికి చదువు చెప్పింపవలెను; దొరతనమువారు మన
సొమ్మంతో వెచ్చించి—చెప్పించిన చదువు, మనవారు మఱచిపోయి—
అది బూడిదలో పోసిన పన్నీరుగాకుండ నిలిచి, పెంపొందునట్లు
చేయవలెను.

(౧౧) పిల్లలకు బొమ్మలుచూపియు, కథలు చెప్పించియు,
వారితో ముచ్చటించియు, వారిచే ఆటలాడించియు—వారికి ఎరుక
కఱపవలెను; వారికి తగిన పాత్రములు చేర్పవలెను.

(౧౨) ఆఁడువారికి తగిన పాత్రములు విడిగాచేర్చి ఇండ్లకు
పంపియు, ఉపన్యాసము లిప్పించియుఁ, వారికి మంచి యెరుక కలి
గించి, వారు తమ పిల్లలకు ఎరుక కఱపునట్లు చేయవలెను.

(౧3) అన్ని భాగ్యములలో ఆరోగ్యభాగ్యము ముఖ్యము
గాన, అది ఊరివారికి లభించుటకు సాముగరిడీలు పెట్టింపవలెను.
సామునేర్చుకొన్నవారు తమ ఆరోగ్యమునేకాక, తమ ఊరినికూడ
కాపాడుకొనఁగలవారగుదురు.

(౧౪)మత సహనమును-సమబుద్ధియు-లోకజ్ఞానమును సత్ప్రవర్తనమును గలపండితులచే మతబోధయు,నీతిబోధయు చేయింపవలెను; తెనుఁగునేర్పింపవలెను; మంచి భక్తులచే భజనలు చేయింపవలెను.బొబ్బిలిపాట మొదలగు పాటలు పాడింపవలెను.

(౧౫) నడత మంచిదికానివారిని ఎవరినేని పొ. గు. పొంతకు రానీయకుండుటకు మెలఁకువ పడవలెను.

(౧౬) పొ. గు. కడంకలో పనిచేయువారు చేతనగునంత వరకు ఊళ్ళలోని కక్షలు మాన్పింపవలెను; ఏదో ఒక కక్షివారితో ఎప్పుడును చేరక తటస్థముగా ఉండవలెను; అందఱను సమబుద్ధితో చూడవలెను; మఱచిపోయిన గ్రామస్వరాజ్యకళను మరల నేర్పవలెను.

(౧౭) పొ. గు. లేని ఊళ్ళలో జిల్లాబోర్డువారి బడిఉన్నచో ఆబడిలోనే వారు పొ. గు. పెట్టి-ఊరివారికి పనికివచ్చునట్లు చేయవలెను.

(౧౮) బడికూడలేని ఊళ్ళవారికొరకు జిల్లాబోర్డువారు సంచారగ్రంథాలయము లేర్పాటు చేయవలెను.

(౧౯) పొత్తములలో మంచిపొత్తము లెంచినట్లే పత్రికలలోను మంచిపత్రికలేవో ఎంచవలెను. వానిలో 'గ్రంథాలయసర్వస్వము'నకుమారుగా ఇపుడు వెలువడుచు, 'ఇండియన్ లైబ్రరీజర్నల్' పనియుకొంతవరకుచేయుచున్న 'ఆంధ్రగ్రంథాలయం' పత్రికయు, జ్ఞానదాయకమగు 'దివ్యజ్ఞానపిక'యు చేర్పనగును.

(౨౦) పొత్తపుగుడులు పడమటితీర్పున నడపఁగలుగునట్లు పొత్తపుతీర్పరులను తయారుచేయవలెను.

(౨౧) పైని తెలిపిన పనులును-మనదేశ సంస్కృతికి అనుకూలముగా చేయవలసిన తక్కిన పనులను చేయుటకు, ఆంధ్రదేశ

గ్రంథాలయసంఘమువారును, అఖిలభారత ప్రజా గ్రంథాలయ సంఘమువారును (ఆల్ ఇండియా పబ్లిక్ లైబ్రరీ అసోసియేషన్), జిల్లా గ్రంథాలయసంఘముల వారును, తాలూకా గ్రంథాలయసంఘముల వారును, పనిచేయుచున్న గ్రామగ్రంథాలయముల వారును, నగర గ్రంథాలయముల వారును, జిల్లాబోర్డుల వారును, మ్యూనిసిపాల్టీలవారును, పంచాయితీబోర్డుల వారును, దేవాదాయ ధర్మాదాయ సంఘముల వారును, ఊరిపెద్దలును, ప్రభుత్వ విద్యాశాఖవారును, కాంగ్రెస్సు వారును, జస్టిస్‌పార్టీ వారును, తక్కిన పార్టీల వారును, పీఠాధిపతులును, విద్యాసంస్థల పెద్దలును, దేశాభిమానులము - పెద్దలము - అనుకొనువారందరును పనిచేయవలెను, తక్కినవారు ఊరకున్నను గ్రంథాలయములవారును. గ్రంథాలయ సంఘముల వారును పనిచేయక తప్పదు. అందు, తక్కిన గ్రంథాలయ సంఘములపై పెద్దఱికము చేయుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారుతక్కినవారికి దారిచూపవలెను.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

ఈ సంఘము ౧౯౧౪లో ఏర్పడినది; ఇండియాలోని రాష్ట్రములలో నేమి, సంస్థానములలో నేమి ఏర్పడిన గ్రంథాలయసంఘములన్నియుదీని తరువాతపెక్కేండ్లకుఏర్పడినవే. కాన,ఇండియా అంతటిలోను మొట్టమొదట ఏర్పడిన పెద్దగ్రంథాలయసంఘము- ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమే; ఇది కొన్నియేండ్లు కీ. శే. సూరి నరసింహశాస్త్రి- శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగార్ల యిద్దర పెద్దఱికమునను, కొన్నియేండ్లు ఒక్క వేంకటరమణయ్యగారి పెద్దఱికమునను పనిచేసినది; పేరు తెచ్చుకొన్నది; ఇపుడు శ్రీ పాతూరి నాగభూషణముగారి పెద్దరికమున పనిచేయుచున్నది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సంఘాధ్యక్షులు కదా? ఇట్లందువేమి?

అని ఎవరేని అందురేమో! అది ఎఱుఁగక నేననలేదు. అధ్యక్షుల పెద్దరికము సభాసమయముననే; తక్కినపుడెల్ల పెద్దరికము కార్యదర్శిదే; అంతేకాదు; సభాసమయమునకూడ కార్యదర్శి చేసిన పనికి మొత్తముమీఁద అధ్యక్షుడును- తక్కిన సభ్యులును అంగీకరింపక తప్పదు. కాన, ఏ సంఘమునకుఁగాని నిక్కపుపెద్ద కార్యదర్శియే

సంఘప్రధానమగు మన గ్రంథాలయోద్యమములో నరసింహశాస్త్రిగారు మింటితిల్లికవలె మెఱసినారు; దారిచూపినారు; పేరొందినారు; పొగడికలందినారు; మన దురదృష్టమున అకాల మృత్యువు వాతఁ పడినారు. ఆయన ఆత్మ తెనుఁగునాట - అంతేకాదు - ఇండియాలో గ్రంథాలయోద్యమము బాగుగా వ్యాపించి- పూచి- పండి- తన్ను నమ్ముకొన్నవారిని ఆపంటచే తనుపుదనుక తనియదు. కాన, ఆయన ఇప్పటికి తెనుఁగునాట ఎక్కడనో పుట్టియుండును; పుట్టనిచో త్వరలో పుట్టుఁగాక! కొఱఁత తీర్చి తనియుఁగాక!

ఇఁక, వేంకటరమణయ్యగారు; ఈయన ఉత్సాహమునకు మేరలేదు; పట్టుదలను పట్టుటకు పగ్గములులేవు; ఈయన గ్రంథాలయోద్యమమునకు ప్రాణము; అంతేకాదు; గ్రంథాలయోద్యమమే ఈయన. తనదే గ్రంథాలయోద్యమమనియు- తానే గ్రంథాలయోద్యమమనియు- పడరానిపాట్లు పడి, కావలసినంత డబ్బు నీళ్ళవలె వెచ్చించి, వెళ్ళరానిచోట్లకు వెళ్ళి, ఎందఱకో జాబులువ్రాసి, తంతివార్తలిచ్చి, బుజ్జగించి, ప్రోత్సహించి, చెప్పి, అడిగి, వేఁడి, బతిమాలి, పొ. గుడుల ఉత్సవములు- సభలు-మహాసభలు- ప్రదర్శనములు పెట్టించి, యాత్రలు సాగించి, ఉపన్యాసములుచెప్పి, చెప్పించి, వ్యాసములు వ్రాసి-వ్రాయించి, పాటలు- పద్యములు- పొత్తములు వ్రాయించి, బండ్లమీఁద- రైళ్ళమీఁద.

కారులమీఁద, బస్సులమీఁద పరుగులెత్తి- గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశముననేకాక, ఇండియాలో నిలువఁబెట్టి, ఆం. దే. గ్రం. సం. కార్యదర్శిపదవి యీనడుమ వదలివేయువరకును తదేక దీక్షగా పనిచేసిరి. 'గ్రంథాలయోద్ధారక' 'గ్రంథాలయశాస్త్ర విశారద' బిరుదములందిన మహావ్యక్తి- గ్రంథాలయోద్యమమూర్తి ఈయన. ఈయనపేరు పా. గు. గ్రామములో పైనాడులలోకూడ నెలకొనినది. ఈయన ఎందఱిస్తోత్రములకో పాత్రమయ్యె. అందు, రావ్ బహద్దరు ప్రణతార్థిహరయ్యరుగారు వేంకటరమణయ్యగారి పట్టుదలనుగూర్చి చెప్పిన మాటలు మఱవరానివి — "నావయస్సునుబట్టి నేను కొంతకాలమునుండి ప్రజోద్యమములలో పాల్గొనుట లేదు కాని, ఆం. దే. గ్రం. సం. ప్రాణమగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు అన్ని నిరోధములను అతిక్రమించి - జయించు తమ ఉద్యమమందలి అనివార్యోత్సాహములో ముసలితనమును సైతమును పాటించువారుకారు. మూఁడుసార్లు నన్ని పని చేయవేఁడుచు నాదగ్గఱకు వచ్చినారు; ప్రతిసారియు నేనిందుల కంగీకరింపఁజాలనని నా అశక్తిని తెలిపితిని. కాని 'తప్పిపోవుట' అను ముక్క వేంకటరమణయ్యగారు తమ నిఘంటువులోనుండి తొలగించినారు. 'బ్రూసు- సాలీఁడు' కథలో సాలీఁడు చేసిన ప్రయత్నములవలె; నాల్గవసారి ఈయన నన్ను ముట్టడించినపుడు, ఆంధ్ర మిత్రులయెడల నాకున్న అభిమానమునుబట్టి నేను లొంగిపోతిని. ఈయన పట్టుదల విజయమందినది." అని ఆయన సెలవిచ్చిరి.

ఇట్లు తమపట్టుదలవలన ఈయన ఎందఱనో లొంగఁదీసికొని తమ సంఘమే బ్రిటిషిండియాలోని పా. గు. కడంకమేనికి గుండెకాయగా చేయఁగలిగినారు. అది తనకు 'నాది' అని చెప్పుకొనుటకు విడిగా ఇల్లులేక, ఈయనయింటనే ౧౯౩౬ ఆగస్టు ౮ వ తేది

వఱకును తలదాఁచుకొన్నది. నాఁడు నన్నీయన కార్యనిర్వాహక సంఘమునకు అధ్యక్షునిగా ఎన్నుకొనఁజేసినపిదప, కార్యస్థానము నేనుండిన ఖద్దరుసంస్థాన గాంధివిలాసభవనములోనికి మారినది. ౧౯౩౮ లో శ్రీ పాతూరి నాగభూషణముగారిని కార్యదర్శిగా ఎన్నుకొనినపిమ్మట, అది పటమటలంకకు చేరినది. ఇప్పుడు అక్కడనే ఉన్నది; 'నాయిల్లు' అని చెప్పుకొని - అందుండు అదృష్టము ఎప్పుడుపట్టునా! అనియు, గ్రంథాలయోద్యమాభిమానులగు మీమనస్సులు ఎప్పుడు కరగునా! అనియు, పటమటలంకలోని గాంధి గ్రంథాలయమున తపస్సుచేయుచున్నది. గ్రంథాలయసంఘ లేర్పఱుచుటకు అమెరికా సంయుక్తరాష్ట్రములలో ఆండ్రూకార్నెజీ వెలసె. మనకు తోడ్పడుటకు కోటీశ్వరులు లేరు; లక్షాధికారులును లేరు. కాని, దైవానుగ్రహమున గ్రంథాలయోద్యమాభిమాని అగు వేలపెద్ద ఒకరు దొరకినారు, ఆయన పటమటలంకవారు; శ్రీ కొమ్మా సీతారామయ్యచౌదరిగారు; తమ ఊరిదగ్గఱ కార్యస్థానమేర్పాటుచేయునెడ నివేశస్థలము కొనుటకు రు ౧౦౦౦లు విరాళమిచ్చెదనని మాటయిచ్చినారు; ఇచ్చినారు. దానికితోడు.రు ౮౦౦లు అప్పుచేసి, నాగభూషణము గారు బెజవాడ బందరు రోడ్డు ప్రక్కను, పటమటలంకదారికి ఎదురుగానున్న యెకరముభూమి కొనినారు; డబ్బీయకముందే దానిలో శంకుస్థాపనము చేసినాము; అప్పుతీర్చుటకు సరిపోవుసొమ్ము కొందరిచ్చెదమనినారు; అందు కొంత వసూలైనది; కొంతవసూలుకావలె; అదియు వసూలగుననుకొందము; అప్పుతీరుననుకొందము. ఇఁక, కార్యస్థానభవనము మాటయేమి? అదిఇప్పటికి కాగితముమీఁది కెక్కినది; మీరు చూడ వచ్చును. దానికి ఐదువేలరూపాయలు కావలె. గ్రంథాలయోద్యమాభిమానులగు మీరు పూనుకొనుచో స్వహస్తపరహస్తములచే ఈకొలఁది మొత్తముచేర్చుట కడిందిపని కాదు. కాన, మీరందఱును సాధ్యమగునంత త్వరలో ఇపుడు

కాగితముమీఁదనున్న భవనమును నేలమీఁద నిలుపుదురుగాక ! ఆం. దే. గ్రం. సంఘమును ఒకయింటిదానిని చేయుదురుగాక ! మీరింతమాత్రము చేయుదురేని, మన కార్ణీజీగారు తామిప్పుడిచ్చిన దానికంటె కొన్నిరెట్లు హెచ్చువిరాళమిచ్చు నిశ్చయముతో ఉన్నారని తెలియవచ్చుచున్నది. ఇట్టి అవకాశము గ్రంథాలయాభిమానులు పోఁగొట్టుకొనవచ్చునా ? త్వరపడుఁడు ! త్వరపడుఁడు ! విరాళములు వసూలుచేయుఁడు ! భవనముకట్టింపుఁడు ! అందు ప్రవేశింపుఁడు ! అది ఆం. దే. గ్రం. సం. కార్యస్థానముచేయుఁడు ! మనకార్ణీజీగారిని మెప్పింపుఁడు! ఆయనకు తగినంత ఉత్సాహము కలిగింపుఁడు ! అపుడు, ఆయన దానశౌండత్వము చూడుఁడు ! ఆలస్యముమీదే; ఆయనదికాదు. ఆయన యీవి తెగువచూచి, తక్కిన గ్రంథాలయాభిమానులును తమతమ యీవి తెగువచూపక పోరు. అపుడు, నాగభూషణముగారు సంచారకార్యదర్శి సాహాయ్యమును- వలయు తక్కినసాయమును పొందగలిగి పైని మనము ఊరిపాఠపుగుడులనుగూర్చి చేయవలయుననుకొనిన పనులును, పట్టణనగరగ్రంథాలయముల పనులును, నగర పట్టణ గ్రంథాలయ సంఘములపనులును, జిల్లా తాలూకా ఫిర్కా గ్రంథాలయ సంఘముల పనులును, ఇప్పటికంటె ఎంతో బాగుగా సాగించి, తమ సంఘాధ్యక్షోపాధ్యక్షులయు- సభ్యులయు- సాయముతోడను- ముఖ్యముగా గౌరవసభ్యులగు శ్రీ వేంకటరమణయ్యగారి తోడ్పాటుతోడను- తెనుఁగునాటి గ్రంథాలయోద్యమము క్షీణదశలో ఉన్నదన్నవారిచేతనే అది ఉచ్చదశలో ఉన్నదని పొగడునట్లు చేయఁగలుగుదురు. అట్టిస్థితిలోనికి వచ్చుటకు ప్రయత్నించుట మనధర్మమని మనలో ఎఱుఁగనివారెవరు ? కాన, మనపనికి అంతకును ఆధారమగు కార్యస్థానభవనమును కన్నులవిందుగా శ్రీ సీతారామయ్యచౌదరిగారికి చూపుఁడు ! ఆయనకు గ్రంథాలయోద్యమ మందుంగల అమితోత్సాహమును సార్థకపఱుపుఁడు!!

**ఆంధ్రదేశ కేంద్రగ్రంథాలయము**

రామమోహన గ్రంథాలయము బెజవాడలో నెలకొల్పిన శాస్త్రి- పంతులుగార్లు దానినే ఆం. దే. కేంద్ర గ్రంథాలయముగా చేయ తీర్మానింపఁజేసిరి. కాని, దానికి ఏదో అడ్డువచ్చె. అందు వలన క్రొత్తఁగా మరల ప్రయత్నము చేయవలసివచ్చినది. ౧౯౩౭ లో ప్రయత్నము చేసితిమి. అయినను, అదియు ఫలింప లేదు. ఇపుడు, ఆం. దే. గ్రం. సంఘమునకు నివేశనస్థలము లభించినది; కార్యస్థానభవనము నిర్మింప ప్రయత్నము చేయు చున్నాము. అది త్వరలోనే పూర్తి కాకతప్పదు. అప్పుడు మనము చేయవలసిన మేటిపని కేంద్రగ్రంథాలయము నెలకొల్పుటయే. అట్లని ఇపుడు మనము మిన్నకుండరాదు. పని అప్పుడు వడిగా జరుగుటకు ప్రయత్న మిప్పటినుండియు చేయవలె.

**కాలికి ముక్కలు**

మనము తెనుఁగువారము, తెలుఁగువారము, ఆంధ్రులము-అని అనుకొనుచున్నాము. కాని, తెనుఁగు తనము, తెలుఁగుతనము-ఆంధ్ర త్వము—— అనునది మనయందు కానవచ్చుచున్నదా? జుట్టు- బొట్టు- కట్టులలో, తెనుఁగుతనము పోవుచున్నది. పేర్లలో తెనుఁగు తనము పోవుచున్నది; పేర్లకు, సంతకములకు, జాబులకు తెనుఁగు వ్రాలు పనికిరాకున్నది. ఇంగ్లీషుమీఁదనో, హిందీమీఁదనో ఉన్న మోజు కొందఱకు తెనుఁగుమీఁద లేకున్నది. పైవారిమీఁదనున్నంత గౌరవము తోడి తెనుఁగువారిమీఁద కనఁబడకున్నది. పైనాడుల మీఁదనున్న మన్నన తెనుఁగునాటిమీఁద కానరాకున్నది. ఇఁక, తెనుఁగుతన మెక్కడ? ఆంధ్రరాష్ట్రము కావలెనని ఆంధ్రోద్యమము మొదలుపెట్టినాము; ఎప్పుడు? ౧౯౧౩ లో. ఇప్పటికిని రాష్ట్రము రాలేదు; కాని, ఉన్నదానిలో కొంతఊడినది. అది రాఁబట్టు

కొనుటకుసైతము మనకు చేతఁగాకున్నది. ఇట్టిచో, ఆంధ్రత్వ మెక్కడ ?

అయిన, తెనుఁగుతనమునకు తిలాంజలిగేనా ? అందురేమో ఎవరేని ! తొందరపడక వినుఁడు. తెనుఁగునాట గ్రంథాలయోద్యమము పెద్దల పెద్దఱికమున ప్రారంభము కాలేదు. పెద్ద పరీక్షలిచ్చి-బిరుదులు గడింపని ఒక ఒజ్జ—ఆదినారాయణమూర్తి— వ్యక్తి ప్రధానముగా మొదలుపెట్టె; నిజముగా ఆయనపేరు శ్రీ చల్లపల్లి రాజుగారొకసారి చెప్పినట్లు, లిఖించువారున్న, సువర్ణాక్షరములలో లిఖింప వలసినదే, అట్లే పరీక్షా బిరుదములులేని ఒక తెగువరి— వేంకటరమణమూర్తి- సంఘప్రధానముగా బయలుదేరిన ఆ ఉద్యమపు బరువు నెత్తిమీఁదవేసికొని, సాయమున్నను - లేకున్నను వేసరచెందక, వివిధబాధలుపడి దానిని నిలువఁబెట్టె; ఈయనపేరు మనము సువర్ణాక్షరములతో లిఖింపవలదా ? మనమటుచేసినను- చేయకున్నను, అది పొ. గు. కడంక పొత్తములలోను-తక్కిన వ్రాఁతలలోను ఇండియాలోనేకాక - పైనాడులలోకూడ, ఎక్కినది. ఈయన ప్రోపువలన పొ. గు. కడంక మొక్క తెనుఁగునాట వేరునాటి, పాదుకొనినది; అందుచేతనే, అనకాపల్లిలో శ్రీ శారదా గ్రంథాలయవార్షికోత్సవసభకు అధ్యక్షతవహించిన కవిసార్వభౌమ బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే నిరుడు "ఆంధ్రులు మొదలు పెట్టిన ఉద్యమములలో స్థిరపడి-పనిచేయుచున్నది గ్రంథాలయోద్యమమే" అని మెప్పు పొందగలిగినది. ఇట్లు మన పొ. గు. కడంక నిలుచుటకు కారణము ఎల్లవేని కనికరమో, మొదలుపెట్టినవారి పేర్లబలిమియో, పనిచేయుచున్నవారి స్వార్థత్యాగపు పసయో, కావలె; ఏదో ఒకటియే అననేల ? అన్నియునని తలఁపనగు. మనవారు కొందరనుకొనునట్లు తెనుఁగువారికి అచ్చిరాని 'ఆంధ్ర' పదము మన ఉద్యమనామమున చేరకపోవుటయు కారణమగుఁగాక ! కాకపోవుఁగాక ! ఎటులైననేమి ?

మన ఉద్యమము మననాట పాదుకొనుటయేకాక, కొంతఫలించి, పై నాడులలోకూడ తన విత్తనములు మొలకలెత్త, చెన్నరాష్ట్రశాసనసభలో హి. గు. బిల్లుకూడ తెచ్చునట్లు చేయగలిగినది.

కాన, తెనుఁగుతనము- ఆంధ్రత్వము- నిలువఁబెట్టుటయు మన ఉద్యమములోనిదే! అనిమీరు చెప్పఁబోవుచున్నారా! అందురా? అవును; అదే చెప్పఁబోవుచున్నాను. కాని, ఆవులించిన ప్రేగులు లెక్కఁబెట్టఁగల మీరు నాకట్టిఅవకాశమిచ్చెదరా? నేను చెప్పకముందే మీరే అది చెప్పివేసినారు. అటునేను చెప్పఁదలంచుటకు కారణము చెప్పవలెఁగదా! ఆలకింపుఁడు. నిజమునకు, తెనుఁగునాట పెద్దరికముచేయవచ్చువారందరును తెనుఁగుతనము నిలుపుటకేకాక, పెంపొందించుటకు కూడ పూనుకొనవలసినవారే. కాని, వారటుచేయుటలేదు. కాంగ్రెస్సుపెద్దలదృష్టి స్వర్గమున నున్న స్వరాజ్యముమీఁదికే కాని, నేలమీఁదనున్న తెనుఁగుతనము మీఁదికి దిగుటయేలేదు. జస్టిస్‌పార్టీవారిచూపా? ఉద్యోగములపైకే ఎప్పుడును పోవునుగాని దీనిపైకివచ్చుటలేదు. ఇఁక ఆంధ్రమహాసభవారు ఎప్పుడో ఎట్లో ఎచ్చటనో సభ అయినపుడే కానవత్తురు; ఆదికాఁగానే ఎవరియిండ్లకువారు పోదురు; ఎవరిపనివారు చూచుకొందురు. ఆంధ్రమాతకుజే! ఆనాఁటితోనేసరి! తీర్మానముల కాగితములయినను మరల దొరకుట అరిది. సభలరికార్డు ఎక్కడ నున్నది? అనిన చెప్పువారెవరు? ఇట్టిస్థితిలో వారేమి చేయుదురు? మరి మిగిలిపోయినవారెవరు? తెనుఁగునాటి పీఠాధిపతులు, వారికి భిక్షులపని, మోక్షుపుపని మొదలగు ఎన్నోపనులు కలవు; కాన, వారికి తీరిక ఎక్కడ? ఉన్నను, ఐహికవిషయములతో మాకు పనిలేదందురేమో! అనుకొంటిని. అందుచేత, ప్రారంభోత్సవములకో, వార్షికోత్సవములకో, తాలూకాసభలకో, జిల్లాసభలకో, ఆంధ్రదేశగ్రంథాలయమహాసభలకో, యాత్రలకో, మరిదేనికో, పట్టణములకే

కాక- పల్లెలకును హెచ్చుగా వెళ్ళుచు, చేసినను- చేయకున్నను అందఱిసాయము కోరుచు, శక్తికొలఁది పాటుపడుచున్న గ్రంథాలయసేవకులే సంఘబలము కొంత కలవారగుటచే, తెనుఁగుతనము నిలువఁబెట్టుటకును వారే పూనుకొనఁదగునని చెప్పఁదలఁచితిని. అది నేను చెప్పకముందే మీరు గుర్తించితిరి కాన, దానికి పూను కొందురుగాక! తెనుఁగుతనము నిలువబెట్టుటలోనే పా. గు. కడంక పని అంతయు ఇమిడియున్నది. అట్లగుటచే అది మనకు స్వధర్మమే కాని పరధర్మము కాదు. ఇంతకు, మనము తెనుఁగువారి అందఱి మేలును కోరి పనిచేయునపుడు అందఱిసాయమును కోరుదుము. కొందఱేని మనకు తోడ్పడకపోరు. ఎవరెంతవఱకు తోడ్పడిన అంతవఱకే మనము సంతసింపనగు. అందఱును అన్ని తెఱంగుల పనికివచ్చుట అరిది. ఇది గుర్తించి మనము కలసి కట్టుతనముతో పనిచేయుచు, ఎవరియెడలను విరోధబుద్ధిలేక, ప్రేమచే మనసు కరఁగించి, వీలగునంతమందిని మనలోచేర్చుకొనవలె. అపుడు మన ఉద్యమము తప్పక ఫలించును.

భేదబుద్ధి ఎరుకలేమి; సమబుద్ధి ఎరుక- అనఁగా బొంది వేరు గాని అందుఁగల ఆత్మ ఒకటియే అని గుర్తించుటయే ఎరుక. అట్టి ఎరుకకు మన పా. గు. ఆటపట్టు. అందుచేతనే, "అది (పా. గు.) మన నాగరకతలో ఆధ్యాత్మిక కేంద్రము." అనె హెచ్. ఏ. ఓవర్‌స్ట్రీట్ పండితుఁడు. తక్కిన గుడులలో భేదబుద్ధికి తావుండుఁగాక! మన పా. గుడిలో దానికి తావులేదు. మతభేదముతో మనకు పనిలేదు; జాతిభేదమును చర్చింపము; పార్టీ భేదమును పాటింపము; గొప్పకొద్ది గొడవ కొండాడము; హక్కులకై కక్కుర్తి పడము; బాధ్యత ఎఱిఁగి పాటుపడుదుము. ఇట్టి కట్టడలతో పనిచేయు కొలువరుల కోరికలు తీర్పకున్నను, తీర్పమని ఎవరనఁగలరు? ఎన్నాళ్ళు తీర్పకుండఁగలరు?

కాన, మేలుచేయు తలంపుతో ఎల్లతెనినమ్మి పాటుపడుదుము గాక ! అన్నికడంకల విత్తనములును పొ. గు. కడంకలో ఇమిడియున్నవని తోడివారికి తెలిపి దానికొఱకు పాటుపడి వారికి మేలు చేకూర్తుముగాక !! అందఱమును కలసి, తెనుఁగుపలుకు తల్లిని తెనుఁగునాటి తల్లిని గద్దె ఎక్కింతుము గాక !!!

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ మేర్పడినపుడు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారితోపాటు కార్యదర్శిగా ఉండి ౧౮౯౮ లో గ్రంథాలయ మొకటి స్థాపించి, దానిని నానాఁటికి తెనుఁగునాట పెద్ద గ్రంథాలయమనిపించుకొనునట్లు గౌతమీ గ్రంథాలయముగా పెంపొందించిన శ్రీమధురకవి నాళము కృష్ణారావుగారి షష్టిపూర్తి మహోత్సవ సమయమున – ఆయనచేసిన గ్రంథాలయ సేవను గుర్తించి గౌరవించుటకు ౨౨ వ ఆం. దే. గ్రం మహాసభ మన వేంకటరమణయ్యగారి ప్రోత్సాహమున ఇచ్చట జరుపఁగలిగినందులకు మనమెంతయు సంతసింపవలయును. శ్రీకృష్ణారావుగారు మనకు చేసిన ఆదరణమునకు మనము వారికి ఎంతయు కృతజ్ఞులము; తక్కిన మానవసేవతోపాటు మనకు తోడుగా ఉండి గ్రంథాలయ సేవ చేయుటకు పరాత్పరుఁడు వారికి చిరాయురారోగ్యైశ్వర్యము లొసంగుఁగాక!

నేనిందు తెలిపిన తెలలు పెక్కులు పెక్కురవ్రాఁతలుచదివి, కైకొంటిని. ఆవ్రాఁతకారులకు ఎల్లఁడు మేలు కూర్చుఁగాక !

మంది తామెల్లయెడల నెమ్మదిగమనుత ।
నేలపండుతఁ పాడిమై నేలఱేండ్లు ।
ఆలుఁబాఁడులుఁ ఎప్పుడున్ మేలుకనుత ।
ఎల్లజగములకున్ హాయిఎసఁగుఁగాక ।

—ఆంధ్ర గ్రంథాలయం, 2 వ సంపుటము 12 వ సంచికనుండి

# ఇరువది మూడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ
# పెదపాలెము

[1942 మే 27–28]

## శ్రీ సురవరము ప్రతాపరెడ్డి

ఆదికాలములో ప్రపంచానికంతా మొట్టమొదట జ్ఞానభిక్ష పెట్టినవారు ఆర్యులు (హిందువులు) కల్దూలు (ఖాల్డియనులు) బాబిలీలు (బాబిలోనియనులు) అసురులు (అసీరియనులు) ఖేటులు (ఖట్టి, హట్టి హెట్టయిటులు) ఫణికులు (ఫనీకియనులు) మిశ్రులు (ఈజిప్టువారు) చీనులు—వీరు తప్ప ఇతరజాతులు ఈ సందర్భములో కానరారు. గ్రీకులు లిపిని, నౌకావిద్యను ఫణికులనుండి నేర్చుకొనిరి. ఈరానీలు (పారసీకులు) వైదికార్యులనుండి విద్యల నేర్చిరి.

ప్రాచీనమందు బండలు, గుండ్లు, లోహములు, ఇటికెలు, గోడలు, స్తంభాలు, కట్టెపలకలు, చెట్ల నారలతో సిద్ధమైన పటములు, భూర్జములు, తాటియాకులు, చర్మములు వ్రాతకు సాధనములై యుండెను.

కల్దూ (ఖాల్డియా) దేశమందు పచ్చి యిటికలపై గంటముల వంటి లేఖినులతో వ్రాతను వ్రాసి వాటిని కాల్చి భద్రపరచుచుండిరి. క్రీ. పూ. 3800 నాడు ఖాల్డియాను ప్రథమసర్గాన్ అను రాజు పాలించెను. అతడు ఇటిక గ్రంథాలను సేకరించి సొంత గ్రంథాలయమును స్థాపించియుండెను. ప్రపంచమందు ఇంతకన్న పూర్వముండిన గ్రంథాలయము మన కింతవరకు కానరాలేదు. ఈజిప్టు దేశమందు క్రీ. పూ. 4000 ఏండ్లకంటే ముందుగానే లిపి ఏర్పడెను. వారినుండి ఫణికులు వ్రాయుట నేర్చుకొనిరి. ఫణికుల

నుండి గ్రీకులు నేర్చుకొనిరి. ఆ లిపి భేదమే యిప్పుడు యూరపు ఖండ మందంతటను వ్యాపించియున్నది.

ఋగ్వేదమందు వాక్కును, చూచుటను, వినుటను వర్ణించినారు. అనగా ఋగ్వేదకాలమునకు పూర్వమే వైదికార్యులు లిపిని ఎరిగియుండిరి. క్రీ. పూ. 2800 ఏండ్లకు పూర్వమే ఆర్యులు లిపిని ఎరిగియుండిరని కౌంట్ జోర్సుజెర్నా ( B jorsjerna) గారు వ్రాసిరి. మొహన్‌జోదారోలో అతి ప్రాచీనవస్తువులు బయలు పడినవి. అందు లిపికల పలకలు చాల దొరికినవి. ఆ లిపిని ఇంత వరకు చదువలేకున్నారు. ఊహలు చేయుచున్నారు. ఇంకా బహు పరిశోధనల తర్వాత అది సాధింపబడునేమో. మొహన్‌జోదారో క్రీ. పూ. 3000 ఏండ్లనాటిదనియు, మరికొందరు క్రీ. పూ. 4000 ఏండ్లనాటిదనియు అభిప్రాయపడుచున్నారు. అక్కాడులు (అగాదె లేక అక్కేడియా దేశమువారు) ఆర్యశాఖవారు. వారినుండియే ఖాల్డియావారు లిపిని నేర్చుకొనిరందురు. ఇదంతయు 5000 ఏండ్ల కన్న పూర్వపు ముచ్చట

క్రీస్తుపూర్వము 650 ఏండ్లక్రిందట అస్సీరియాలో అసురబనిపాల అనురాజు రాజ్యము చేసెను. అతడు వేనవేల ఇటికగ్రంథాలను వ్రాయించెను. తన రాజ్యమందన్ని ప్రాంతములకును పండితుల బంపించి గ్రంథముల సేకరించెను. ప్రాచీన కాలములో ఇంతటి మహోన్నత గ్రంథాలయము ప్రపంచమందు మరెచ్చటను కానరాలేదు. ఏషియా మైనరులోని మైసియా అను దేశమునకు ముఖ్యపట్టణమైన పర్గామస్ అను పట్టణములో రెండు లక్షల లిఖిత గ్రంథములు కల గ్రంథాలయ ముండెను. ఇది క్రీ. పూ. 5వ శతాబ్దమునాటి మాట.

తక్షశిల, నలందా విద్యాపీఠములందలి గ్రంథాలయములను గురించి విద్యావంతు లందరును ఎరిగియేయున్నారు. నలందాలో

తొమ్మిది అంతస్థుల దేవాలయముండెను. అందలి గ్రంథాలయ
మును "ధర్మగంజ" అని వ్యవహరించిరి. ఓదంతపురి విహారములో
వేలకొలది హిందూ బౌద్ధగ్రంథములుండెను. కర్నూలు జిల్లాలోని
శ్రీశైలమందు పర్వతసంఘారామములో నొక గొప్ప గ్రంథాలయ
ముండెను. జగద్విఖ్యాత ప్రాచీనాంధ్రుడగు నాగార్జునుడు తన
యవసానకాలమం దచటనే నివసించెను. కాకతీయ గణపతి
రుద్రదేవుని కాలములోని శైవమఠములే విద్యావ్యాపకస్థానములై
యుండెను. ఆ మఠాధిపతులు 3 లక్షల గ్రామాలలో విద్యావ్యాప
కము చేసిరట. బొంబాయి రాజధానిలోని కన్హేరీ గుహలలో బుద్ధ
సంఘానికి గ్రంథములను కొనుటకై దానములు చేసినట్లు శాసన
ములు చెప్పుచున్నవి. అదేవిధముగా వలభిలో ఒక విద్యామఠ
ముండెను. అందు గ్రంథములుంచి గ్రంథాలయములను నడపుటకై
దానము లిచ్చుచుండిరి.

చీనాదేశమువారు విద్యాప్రియులు. వారి పూర్వరాజులు
అనేక గ్రంథములను దేశమందు వ్యాపింపజేసిరి. హిందూస్థానము
నకు మొట్టమొదట చీనాయాత్రికుడగు ఫాహియాన్ క్రీ.శ. 399 లో
వచ్చెను. పాదచారియై వేలమైళ్ళు ప్రయాణముచేసి హిందూస్థాన
మునుండి నూర్లకొలది గ్రంథములను తన దేశమునకు తీసికొని
పోయెను. మన దేశమునుండియు చీనాకు పండితులు వెళ్ళుచుండిరి.
అందు సుప్రసిద్ధుడైనవాడు కుమారజీవుడు. అతనికాలమందు చీనా
లోని చక్రవర్తి కుమారజీవుడు తన దేశమునకు మంచిమాటలతో
రాడని తెలిసి క్రీ. శ. 382 లో 7000 చైనా సైన్యమును సిద్ధము
చేసి అతనిని పట్టుకొని రావలసినదని ఆజ్ఞాపించెను. ఇది బలీయ
మైన సరసత. కాని బలవంతమునకు విద్వత్తు విముఖతచూపును. ఆ
చీనాచక్రవర్తి క్రీ.శ. 384లో చనిపోయిన తర్వాత చీనీల ప్రార్థ
నపై కుమారజీవుడు చీనాకు వెళ్లెను. అతడు సంస్కృత, పాలీ

భాషలనుండి అనేక గ్రంథములను చీనాభాషలోనికి పరివర్తన చేసెను. అతడు చీనాలో 30 ఏండ్లు నివసించి అందే చనిపోయెను. అతనికి దహనక్రియలు చేయగా శరీరమంతయు భస్మమయ్యెను. కాని నాలుక మాత్రము కాలనేలేదట! అతని శక్తిలో చీనీల కంతటి గాఢభక్తి యుండెనన్నమాట. క్రీ. శ. 7వ శతాబ్దములో ఇత్సింగ్ అను మరొక చీనా యాత్రికుడు హిందూస్థానమందు సంచారముచేసి నూర్లకొలది గ్రంథాలను తీసుకొని సుమత్రా, జావా ద్వీపాలకు వెళ్లెను. జావాద్వీపములో తాను భారతదేశము నుండి తీసుకొనివెళ్ళిన గ్రంథముల ప్రతులు చాలవరకు దొరికె నట! ఇట్టి గ్రంథాలను ఇత్సింగు సమర్థులచే చీనాభాషలోనికి పరివర్తన చేయించెను. హిందువులు జావాలో ఎంత పూర్తిగా తమ మతమును, వాఙ్మయమును, ఆచారములను వ్యాపింపజేసిరో దీనివలన విశదమగుచున్నది. నేటికిని ఈ జాడలు జావాలో కని పించుచున్నవి.

ప్రాచీన హిందువులు విద్యావ్యాపకమందు కావించిన పరి శ్రమను సూచనమాత్రగా తెలిపినాను. తెలంగానా సీమయు కొంత సేవ జేసెను. శైవ మఠముల ద్వారా కాకతీయుల కాల మందు విజ్ఞానము, మతము వ్యాప్తినొందెను. ప్రతాపరుద్రుని కాల ములో వీరశైవ పురాణములు భక్తులకు దేవాలయములందు చదివి వినిపింపబడుచుండెను.

వాడీస్టేషను సమీపములో "నాగాయి" అను గ్రామమున్నది. అందు కొన్ని చాళుక్యశాసనము లున్నవి. అవి క్రీ.శ. 1100–1200 ప్రాంతములోనివి. వాటివలన మనకు చాల విషయములు తెలియ వచ్చినవి. త్రైలోక్యమల్లుని సేనానియైన కాళిదాసయ్య పేర అతని కుమారుడు మధువ అనువాడు భూదానము చేసెను. దాని ఆదా యమునుండి చతుర్వేదము లెరిగిన 400 మంది బ్రాహ్మణులను

పోషించవలెననియు, 200 మంది వేద పాఠకులకు పాఠములను, 52 మందికి శాస్త్రములను, భాట్ట, న్యాయ, ప్రాభాకర దర్శనములను బోధించుటకును, ఆరుగురు సరస్వతీభాండారికులను-అనగా గ్రంథపాలకులను (Librarians) పోషించుటకును పై సంఖ్యకంతయు అశనమును, వసనమును ఇచ్చుటకును ఏర్పాటు చేయబడెను. ఈ పనికై 1000 మర్తురు* (నివర్తనము అను కొలత)భూమిని దానముచేసెను. ఒక్కొక్క ఉపాధ్యాయునికి, ఒక్కొక్క సరస్వతీ భాండారికునికి 30 నుండి 45 వరకు "మర్తురు" భూమిని యిచ్చునట్లు శాసించెను. ఇట్టి విద్యాపీఠమున్నూ, గ్రంథాలయమున్నూ సక్రమముగా నడచుటకై గడియలు కొట్టే 'ఘటికాప్రహారి'ని ఏర్పాటు చేసెను. వానికిని 30మర్తురు భూమిని దానము చేసెను. ఇది వైదికనైయాయికుల విద్యాపీఠముగా నుండెను. అదే నాగాయిలో చావుండ అను మరొక మంత్రి ఒక కళాశాలను స్థాపించెను. అందు 400 మంది విద్యార్థులు చదువ నవకాశము కల్పించెను. శుక్రాది నీతిశాస్త్రములు, వ్యాసాది పురాణములు, మన్వాది ధర్మశాస్త్రములు చెప్పించు ఏర్పాటు చేసెను. పై విషయములనుబట్టి నాగాయి (ప్రాచీన నామం నాగవాపి)లో ఒకవిద్యాశ్రమపీఠము (Residential University) ఉండెననియు అందు 1000 వరకు విద్యార్థులు విద్యార్జనము చేసుకొనుచుండిరనియు ఆరుగురు గ్రంథ పాలకులచే (శాసనమందు సరస్వతీభాండారికులు అని వ్యవహరింపబడినవారిచే) అచ్చట ఒక గొప్ప పుస్తక భాండాగార ముండెననియు స్పష్టమగుచున్నది.

ఇస్లాముమత వ్యాప్త్యనంతరము అరబ్బులు మూడుఖండములలో చెలరేగిరి. వారు జయించిన ప్రతి స్థలమందును మొట్టమొదటి కార్యముగా మసీదును, గ్రంథాలయమును ఏర్పాటుచేయుచుండిరి. బాగ్దాద్, కైరో, కార్డోవా నగరాలు మూడు ఖండాలలో

*మర్తు లేక నివర్తము అనగా 40,000 చదరపు మూరల భూమి

విద్యా కేంద్రములుగా అరబ్బుల సామ్రాజ్యములో ప్రసిద్ధి గాంచెను. మూడవ సుల్తాన్ అబ్దుర్రహిమాన్ అనునతడు స్పెయిన్ లోని కార్డోవా నగరములో రాజ్యము చేయుచుండెను. అతడు కార్డోవా ఖలీఫాగా వ్యవహరింపబడుచుండెను. అత డొక స్వంత గ్రంథాలయమును స్థాపించెను. అందు 4 లక్షలకు మించిన గ్రంథాలుంచబడెను. ఒక్క స్పెయిన్ దేశమందే అరబ్బులు 70 గ్రంథాలయములను స్థాపించిరి.

హిందూస్థానమును క్రమక్రమముగా ముసల్మానులు ఆక్రమించుచు వచ్చిరి. హిందువులు స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుచు వచ్చినను తమ విజ్ఞాన తృష్ణను మాత్రము వదలుకొన లేదు. అల్లావుద్దీన్ ఖిల్జీ కాలములో నుండిన అమీర్ ఖుస్రూ అను సుప్రసిద్ధ ముస్లిం సూఫీ యిట్లు వ్రాసెను: "విద్య హిందువులలో సర్వత్ర వ్యాపించినది. ప్రపంచభాషల నన్నిటిని హిందువు లెరిగియున్నారు. బ్రాహ్మణులు విదేశాలకు వెళ్ళరు కాని ప్రపంచమందలి వివిధ ప్రాంతాలనుండి జ్ఞానపిపాసులు వారివద్దకు వచ్చి నేర్చుకొనుచున్నారు. బలఖులో నుండిన అబూమ అషర్ అను మౌల్వీ కాశీలో 10 ఏండ్లుండి బ్రాహ్మణులవద్ద జ్యోతిషమును నేర్చుకొనెను. "అస" అను బ్రాహ్మణుడు గణిత శాస్త్రమును కనిపెట్టెను. అందుచేత మేము దానిని హిందస అని యనుచున్నాము. పంచతంత్రాది కథలను, చతురంగమును మొదట కనిపెట్టినది హిందువులే. హిందువుల సంగీతము సర్వ ప్రపంచమును ముగ్ధము కావించినది." ఈ విధముగా ఇంకను అనేక విషయాలను అతడు వ్రాసియుంచెను. విజయనగర చక్రవర్తుల కాలమందును బగ్దాదు మున్నగు ప్రాంతాల నుండి ముస్లిములు విజయనగరమునకు వచ్చి విద్యను, ముఖ్యముగా వైద్యమును నేర్చుకొని వెళ్ళుచుండిరి.

హిందూస్థానమందు అనేక ముస్లింసుల్తానులు పార్సీ భాషను జనులపై మోపవలెనను దురాగహము లేనివారై దేశీ భాషలకే ప్రోత్సాహ మిచ్చిరి. బెంగాలీ భాషకు ముస్లింసుల్తానులే దోహదమిచ్చిరి. అవధీభాష జాన్‌పూర్ సుల్తానుల మూలమున ఉన్నతదశకు వచ్చెను. మలిక్ మహమ్మద్ జయాసీ అను ముస్లిమే అవధీభాషలో మొదటికవి. యూసుఫ్ ఆదిల్‌షా మరాటీని కచ్చేరీ భాషగా ఏర్పాటుచేసెను. ఖుతుబ్‌షాహీ సుల్తానులు తెనుగు భాషను పోషించిరి. ఫీరోజ్ తొగ్లాఖ్, సికిందర్ లోడీ అను ముస్లిం రాజులు సంస్కృతమునుండి వైద్యాదిశాస్త్ర గ్రంథములను, ఫార్సీలో నికితర్జుమా చేయించిరి. హుమాయూన్ చక్రవర్తి తనగ్రంథాలయము నుండి క్రిందికి దిగివచ్చుచు జారిపడి చనిపోయెను. అక్బరుచక్రవర్తి వేలగ్రంథాలను చిత్తరువులతోగూడా వ్రాయించి యుంచెను. ఔరంగజేబు చక్రవర్తి బిడ్డయగు జేబున్నిసా అరబ్బీ, ఫార్సీ గ్రంథములను వేలకొలది వ్రాయించిపెట్టెను టిప్పుసుల్తాను వద్ద 3000 వరకు ఉత్తమ లిఖితపుస్తకాలుండెను. ఔధుసుల్తానువద్ద తుదిమాట మొగలుచక్రవర్తులు సంపాదించిన ఉత్తమ గ్రంథాలుండెను. అతనితోబాటు ఆగ్రంథాలును ధ్వంసమయ్యెను. ఈ విధముగా వివిధప్రాచీన నాగరికదేశములందు పుస్తకభాండాగారములు స్థాపితమగుచుండెను.

గ్రంథాలయములను ధ్వంసముచేసిన మహనీయులును ఉండిరి. మతముపేర ఈ దౌర్జన్యము జరుగుచువచ్చెను. ఈజిప్టు దేశములో అలెగ్జాండ్రియా నగరములో జగద్విఖ్యాతగ్రంథాలయముండెను. జూలియస్ సీజరుకాలములో అందలి కొన్ని గ్రంథాలు ధ్వంసమయ్యెను. అరేలియస్ చక్రవర్తికాలములో మరికొన్ని ధ్వంసముచేయబడెను. క్రీ. శ. 391 లో థియోడోసియస్ కాలములో ఇంకాకొన్ని-ఇంచుమించు మిగిలినవన్నీ కాల్చివేయబడెను.

క్రైస్తవమతమునకు భిన్నించిన గ్రంథాలుండగూడదనియే వారి పట్టింపు. మెసడోనియా రాజగు అలెగ్జాండరు జగద్విజేత అని ప్రఖ్యాతికాంచినాడు. అతని ఘనతను చరిత్రకారులు పొగడు చుందురు. కాని నిజముగా అతడు కామి, మహాక్రూరుడు, ముక్కోపి. ఇంచుమించు సప్తవ్యసనాలన్నింటిలో తగులుకొన్నవాడు. అతడు ఈరాన్‌లోని మాగీజాతిని చాలా హింసించెను. వారి దేవాలయములను పడగొట్టించెను వారి గ్రంథాల నన్నింటిని వెతకించి తెప్పించి కాల్పించెను. క్రీ. పూ. 221 లో చీనాదేశమును "చీన్" వంశపురాజు ఆక్రమించుకొనెను. తనకన్న పూర్వములో ఉండిన గ్రంథాలనన్నింటిని అతడు కాల్పించెను. క్రీ. శ. 1212 లో బఖ్తియార్ ఖిల్జీ సేనానియగు మహమ్మదు బిన్‌సాం అనునతడు ఓదంతపురమందలి గ్రంథాలనన్నింటిని కాల్చివేసెను. అన్‌హల్వాడా పట్టణములోని ప్రసిద్ధ గ్రంథాలయమును అల్లావుద్దీన్ ఖిల్జీ కాల్చివేసెను. "కోహాన" అను పట్టణములోని సంస్కృత గ్రంథాలను పీరోజుషాతొగ్లాకు కాల్చివేసెను. హిందువుల పుస్తకాలు ఎక్కడకనబడితేఅక్కడ వాటిని ఔరంగజేబు కాల్పించు చుండెనని సయ్యదు గులాంహుస్సేన్ అను నతడు తన 'సైరుల్‌ముత ఖయ్యరీన్' అను గ్రంథములో వ్రాసెను. చిత్తోడ్ పతనమయినపుడు అందలి పుస్తకాలనన్నింటిని ముసల్మాను విజేతలు లూటీ చేసుకొని వెళ్ళిరి. టిప్పూపతనానంతరము అతని గ్రంథాలయము ఇంగ్లీషువారి వశమయ్యెను. 1857 నాటి సిపాయివిప్లవములో ఔధ్ నవాబు గ్రంథాలు తుపాకిగుండ్లచే నాశముకాగా మిగిలినవి సోల్జర్ల తేనీటికి ఇంధనములయ్యెను. ఈ విధముగా అందందు సర్వ కాలములందును గ్రంథములను అత్యంత భక్తితో సమకూర్చువారుండగా, మహాక్రోధముతో వాటిని నాశనముచేసి విజ్ఞానమునకు తీరని నష్టమును కలిగించినవారును ఉండిరి.

ఇదంతయు ప్రాతకాలపు ముచ్చట. ఇప్పుడు అమెరికా, యూరపుదేశాలదే పుస్తకపోషణములో పైచేయి. అచ్చు వృద్ధియైన తర్వాత గ్రంథాలయ ప్రాముఖ్యతయు ఎక్కువయ్యెను. లండన్, ప్యారిస్, బర్లిన్, బోస్టన్, మాస్కోవంటి నగరాలలోని ప్రజాహిత గ్రంథాలయములలో ఒక్కొక్కదానియందు 30 లక్షలనుండి 1 కోటివరకు గ్రంథాలున్నవని చెప్పుదురు. అమెరికాలో ఆండ్రూ కార్నెజీ అను మహాదాత ఇంచుమించు 7 కోట్ల రూపాయలను గ్రంథాలయాలకును, విద్యాసంస్థలకును దానముచేసెను. హిందూస్థానములో 2 లక్షలకన్న మించిన గ్రంథాలుగల ఒక గ్రంథాలయముకూడ లేదు. బరోడాసంస్థానము గ్రంథాలయోద్యమములో అగ్రస్థానము వహించినది. రెండవస్థానము ఆంధ్రరాష్ట్రానికి చెందినదని ప్రతీతి. హైదరాబాదు రాష్ట్రములో 20 ఏండ్లనుండియు ఈ యుద్యమము సాగుచున్నది. రెండుమూడు గ్రంథాలయములు 40 ఏండ్లకుముందునుండి నేటివరకు నడుపబడుచున్నవి. మొదట మొదట 100 గ్రంథాలయములకు మించియుండెను. ఇప్పుడందు 30 వరకైనా నశించినట్లు తెలియవచ్చుచున్నది. తక్కినవైనను సరిగా సాగుటలేదు, పట్టుమని పది గ్రంథాలయములవరకు సొంత భవనములు కలిగి అవిచ్ఛిన్నముగా సాగుచున్నవి. ఆంధ్రులు స్థాపించిన తెలంగానా గ్రంథాలయములలోనెల్ల ప్రాచీనమైనవి వరంగల్లులోని రాజరాజనరేంద్ర గ్రంథాలయమున్నూ, హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయమున్నూ. ప్రసిద్ధికివచ్చిన దీరెండవదే. ఏమిన్నీ ప్రకటనలేకుండా 10,000 ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూభాషలలో గ్రంథములను సమకూర్చినది హైద్రాబాదు నగరమందలి రెడ్డి గ్రంథాలయము. హైద్రాబాదులో ఆంధ్రులవి కాకున్నను పేర్కొనదగిన గ్రంథాలయములు కొన్ని కలవు. అందొకటి ప్రభుత్వమువారు స్థాపించిన ఆసఫియాలైబ్రరీ.

దాని స్వర్ణోత్సవము రెండుమూడు నెలల క్రిందటనే జరుపబడెను. అందు 50,000 వరకు గ్రంథాలుకలవు. విశేషముగా ఉర్దూ, ఇంగ్లీషు గ్రంథాలు కలవు. తెనుగు, మరాటీ, కన్నడ, సంస్కృతభాషలలో ఒక గ్రంథముకూడ లేదనవచ్చును. వివిధ ప్రజాసభలలో ఈ 20 ఏండ్లనుండియు పై భాషలలో గ్రంథాలను తెప్పించి పై ప్రభుత్వ గ్రంథాలయములో నుంచుటకై తీర్మానించుచు వచ్చినారు. ఇంత వరకు కోరిక ఫలించలేదు. హైద్రాబాదునగరంలో రెండు ప్రైవేటు (సొంత) గ్రంథాలయాలున్నవి. ఒకటి నవాబు సాలార్జంగుబహద్దరు గారి గ్రంథాలయము. ఇందు ఉర్దూ, ఫార్సీ, అరబ్బీ వ్రాత పుస్తకములు ఎన్నికలవో లెక్కింపలేము కాని అవి యుంచబడిన బీరువాలు మాత్రము ఇంచుమించు 39 ఉన్నట్లు నాకు జ్ఞాపకము. మరి ముద్రితాంగ్ల గ్రంథములు 10 వేల వరకున్నవి- పైగా నవాబుగారు అద్వితీయులగు కళారాధకులు. లక్షలువ్యయముచేసి వేలకొలది ప్రాచీనచిత్రములు, ఖడ్గములు, అరుదగు వస్తువులు సేకరించినారు. నవాబుగారొకమారు లండన్ మ్యూజియమును దర్శించుకొనగా అక్కడిపాలకుడు వారినివాసస్థానము మాత్రము విచారించుకొని 'అయితే మీరు సాలార్జంగుగారు సేకరించిన వాటిని చూచియుందురు. అటుపై దీనిని చూచే అవసరమేమున్నది?' అని అన్నాడట! రెండవ గ్రంథాలయము రాజాశ్యామరాజ బహద్దరువారిది. వారును పై నవాబుగారివలెనే ముద్రితాముద్రిత గ్రంథాలను కూర్చువారును, చిత్రములను, తదితర కళావస్తువులను కొనువారును నైయున్నారు. వారివద్దకూడ 10,000 కు మించిన గ్రంథాలున్నవి.

ఆంధ్రోద్యమము తెలంగానాలో గ్రంథాలయోద్యమముతో ప్రారంభమయ్యెను. గ్రంథాలయ సభలే మొదటి కాలములో భాషాసాంఘికరాజకీయ సభలుగా ఉండెను. తర్వాత "నిజాం

రాష్ట్ర మహాసభ" అను పేరుతో 15 ఏండ్ల క్రిందట స్థాపిత మయ్యెను; నాటినుండి గ్రంథాలయములు వేరుపడెను. ఇప్పుడవి శుద్ధ భాషాసంస్కృతివాదుల పాలిటపడినవని తలపవచ్చును.

ఈ మద్రాసు రాజధానిలో చేరిన ఆంధ్రజిల్లాలలోని గ్రంథాలయోద్యమము తెలియవచ్చినంతవరకు ప్రశంసనీయముగా సాగుచున్నది. ఆంధ్రదేశములో 26 ఏండ్ల క్రిందట గ్రంథాలయ సంఘము స్థాపితమయి, ఆనాటినుండియు పనిచేయుచున్నది. గ్రామ గ్రంథాలయములను ఆంధ్రదేశమందే మొదట స్థాపించినట్లు కానవచ్చుచున్నది. అంతేకాదు బరోడా సంస్థానంలోవలె సంచార గ్రంథాలయములనుగూడా నడుపుచున్నారు.

క్రీ. శ. 1886లో విశాఖపట్టణమందు మొట్టమొదట ఆంధ్ర దేశ గ్రంథాలయము సరస్వతీ గంథాలయమను పేర స్థాపిత మయ్యెను. ఇప్పుడు ఆంధ్రదేశమందు 800 కు పైగా గ్రంథాలయా లున్నవని వినుచున్నాను.

ఇదంతయు కేవలము ప్రజాభిమానముచేతనే జరిగినది. క్రీ. శ. 1920 నుండి బ్రిటిషిండియా ప్రభుత్వమువారు లెక్కకు రాని అల్పద్రవ్యముతో కొన్ని గ్రంథాలయాలకు సహాయము చేయుచువచ్చినారు. కాని అధిక వ్యయమును ప్రజలే భరించి నడపు చున్నందులకు ప్రశంసాపాత్రులు. ఈ రాజధానిలోని ఆంధ్ర సీమలో కూడ పూర్వాంధ్రసీమలోనే యీ యుద్యమము చాల వృద్ధికి వచ్చినట్లు కానవచ్చుచున్నది. రాయలసీమలో ఇంత విపులముగా ఈ యుద్యమము సాగుచున్నట్లు కానరాలేదు. వారి కన్నను తక్కువస్థితిలో తెలంగానావారున్నారని వారు సంతసింప వచ్చును.

తెలంగానములోకాని, రాయలసీమలోకాని, పూర్వాంధ్ర సీమలోకాని మనము చేయుచున్న సేవ చాలదు. నేను కొన్ని

సూచనలు మీతో మనవి చేసుకొనుచున్నాను. అవి మీకు తెలిసినవే. అయినను మరల జ్ఞాపకము చేయుటలో పునరుక్తి దోషముండ నేరదు.

మనలో వ్యావహారిక భాషావాదము ప్రారంభమై 30 ఏండ్లు దాటిపోయెను. పూర్వకాలపు కూలంకషపాండిత్యము అంతరించు చున్నది. క్రొత్తది పట్టుపడలేదు. మనపూర్వ దేశికవితను ఉద్ధ రించక పోయితిమి. ప్రతిదేశానికి దాని పల్లెకథలు (Folk-tales దానిపల్లెపాటలు (Folk songs) చాల ముఖ్యమైనవి. హిందీ వారును, బంగాలీలును, మహారాష్ట్రులును, కర్ణాటకులును పల్లెపదాలను కథలను సమకూర్చి ముద్రించినారు. హిందీలో రామనరేశత్రిపాఠీగారు 'కవితాకౌముది' అనుపేరుతో అయిదు సంపుటములలో పల్లెపదాలను సేకరించి ముద్రించినారు. బేంద్రే గారు కర్ణాటకములో 'హళ్ళియపదగళు' అను పేరుతో కన్నడ పల్లె పాటలను ముద్రించినారు. సత్యార్థిగారు బంగాళీపదాలను సమ కూర్చుచున్నారు. మనలో ప్రతిప్రాంతమందును, పల్లెలలో మంచి మంచిపాటలు, తందానకథలు, పల్లెకతలు, కైఫీయత్తులు మున్నగు నవి యెన్నియో కలవు. మహారాష్ట్రులలో ఆంగ్లవిద్యావంతు లైనవారు మనజంగమకథలవంటి పోవాడాలను స్వయముగా నేర్చు కొని ప్రచారముచేయుచున్నారు. కాని మనభావకవులలో చాల మందికి అటు పాతగ్రాంథికముమోటే. ఇటు తందానకథలవంటివి కూడ మోటే అయిపోయినవి.

మన జనసామాన్యములో వైజ్ఞానిక రుచులు అంతగా మారలేదు. మాప్రాంతములో ఇటీవల బాలనరసింహస్వామి ఒక గ్రామములో అవతారమెత్తెనని జనులు చెప్పుకొనిరి. బాలనరసింహకీర్తనలు అను ఒక చెత్తపుస్తక మచ్చయ్యెను. దానిప్రతులు 1 లక్ష అమ్మబడెను. కాని ఆధునికగ్రంథాలలో ఒక టైనను 2000 ప్రతులైనను అమ్మలేదు. జనులకు తత్వాలు,

మంత్రోపదేశాలు మహిమలుమున్నగు వాటిపైకల వ్యామోహము ఇతరమందు కానరాదు. పండరిభజనలకు మనదేశములో ఉన్న ప్రచారము దేశీయకీర్తనలకు లేదు. గుజరీలోదొరకు 'నృసింహ శతకా'నికున్న ప్రజావలంబనము 'ఆంధ్రప్రశస్తి'కి లేదు.

మన దృక్పథము మారవలెను. ఇంగ్లీషుసాహిత్యములో ప్రపంచములోని అన్నిభాషలను గురించి, అందలివాఙ్మయమును గురించి, అన్నిజాతులనుగురించి ఏదికోరితే ఆవస్తువునుగురించి మనము తెలుసుకొనగలుగుచున్నాము. విజ్ఞానశాస్త్రీయగ్రంథములు (Sciences), భూగోళచరిత్రలు అపారముగా వృద్ధియైపోయినవి. ఇవన్నియు మనభాషలో ఎక్కడున్నవి? కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు ప్రారంభించిపోయిన విజ్ఞాన సర్వస్వము అట్లే నిలిచిపోయినది. మనతరువాత మహారాష్ట్రిలును, హిందీవారును వాటిని పూర్తిచేసుకొనిరి. ఏదైనాసరే ఒక విజ్ఞానకోశమును (ఎన్‌సైక్లోపీడియా) తెనుగులో పూర్తిచేసినట్లైన ముందు దానిపై అభివృద్ధికాగలదు. మన జమీందారులెవరైనా ద్రవ్య సహాయముచేసి దీనిని సాగించిన బాగుండును.

ఎందరో పిచ్చిపుస్తకాలను వ్రాయుచున్నారు. వాటిని ముద్రించుటకెందరో దాతలు విచక్షణలేక పైకమిచ్చుచున్నారు. ఉత్తమగ్రంథములలో నొక్కొక్కదానికి ఏటేట 500-00 రూపాయల ప్రకారమైనను బహుమతులిచ్చుటకు మన జమీందారులు, రాజులు, మహారాజులు, ధనికులు సహాయపడవచ్చును గదా! అట్టిబహుమతులకై పైవారుమూలధనమును (Endowments) ఇయ్యరాదా? నోబెల్‌మహాశయుడు గొప్పగాదానముచేసి పోతే మన ధనికులు చిన్నగానయినను భాషాభివృద్ధికై దానముచేయ రాదా?

మనలో ఇప్పుడు మంచి పరిశోధకులు, కవులు, భాషా సేవకులు బయలుదేరుచున్నారు. ఇంకను ఇట్టివారిసంఖ్య చాల పెరుగవలసి యున్నది. పరిశోధకులపైననే మన అభివృద్ధి మనప్రతిష్ఠ ఆధారపడి యుండును. మనలో ప్రేమచందులు, టాగోరులు, జగదీశబోసులు, ప్రఫుల్లచంద్రులు, గాంధీలు బయలుదేరవలెను. మన కుమారిలులు, నాగార్జునులు, జగన్నాథులు మళ్ళీమనలో జన్మమెత్తవలెను. మనపత్రికాప్రచారము సరియగుపద్ధతులపై జరుగుటలేదు. తెనుగుపత్రికలు ఇంగ్లీషుపత్రికలకన్న మించిన శక్తిని ప్రకటించువరకు వాటిని ప్రజలు చదువుటకు కాంక్షించరు. వారపత్రికలు, మాసపత్రికలు కొన్ని ఎందుకును పనికిరానివయి యున్నవి. మనకు ఇంగ్లీషు దినపత్రిక ఒక్కటైనను లేకపోయెను. ఆంధ్రులలో శక్తిసంపన్నులగువారు హిందుస్థానములోని సుప్రసిద్ధమైన ఇంగ్లీషు దినపత్రికలలో సంపాదకులుగా పనిచేయుచున్నారు. కాని ఆంధ్రరాష్ట్రములో మాత్రము మనకు ఒక ఇంగ్లీషుపత్రికయైనను లేకపోవుట విచారకరము.

ఆంధ్రభాషకు సేవచేయదలచినవారు సోదరభాషలగు కన్నడమును, తమిళమును నేర్చుకొనవలెను. వాటిని నిరసించుట సంకుచితదృష్టి కలిగియుండుటయేకాక మన భాషకును సరిగా సేవ చేసినవారము కాజాలము.

గ్రంథాలయములు కేవలము గ్రంథసంపాదనముతో తృప్తి పడగూడదు. పల్లెటూరిగ్రంథాలయములను నడుపువారిలో చాల మందికి ఏగ్రంథాలుమంచివో ఏవి తెప్పించవలెనో సరిగా తెలియదు. మన గ్రంథాలయములో ఉండతగిన మంచి గ్రంథాలపట్టికను, వాటివివరణను తెలుపుచు ఒక లఘు పుస్తకమును ప్రకటించవలెను. మనదేశమందు విద్యవచ్చిన వారి సంఖ్య నూటికి 14 వరకున్నది. మా హైదరాబాదు రాష్ట్రి

ములో నూటికి 7 మందికి లోగానే అక్షరాస్యులై యున్నారు. అందులోను హిందువులసంఖ్య మరీతక్కువ. వారిలో ఆంధ్రుల సంఖ్య యెట్టిదో ఇంతవరకు తెలియరాదయ్యెను. ఇట్టి అల్పసంఖ్య గ్రంథాలయోద్యమమునకు ప్రబలనిరోధకమైయున్నది. గ్రంథాలయమనగా ఒకభాషాసేవఅని మాత్రమే తలచుటవలన నష్టము కలుగును. మనపూర్వులు ఆవిధముగా ఆలోచించినవారు కారు. ఋష్యాశ్రమములలో బ్రహ్మచారులకు శబ్దజ్ఞానము మాత్రమే కలుగువిద్యను చెప్పినవారు కారు. విద్యార్థులనైతిక శక్తికి, సంఘసేవానురక్తికి, మతభక్తికి తోడ్పడుచుండిరి. దేవాలయములు నిర్మించినపుడు వాటిని పూజకుమాత్రమే ప్రత్యేకించియుండలేదు. వాటి ఆవరణలలో సత్రములుకట్టి పరదేశికులకు సౌకర్యము కల్గించిరి. బళ్ళనుపెట్టి విద్యచెప్పించిరి. దేవాలయమందే గ్రామసభలను, పంచాయతీ తీర్పులను చేయుచుండిరి. పురాణశ్రవణానికి హరికథలకు, పండుగల సమావేశములకు అవే ఆశ్రయములై యుండెను. అదేవిధముగా ఈనాడు గ్రంథాలయములు గ్రామజీవనమున కంతయు కేంద్రములుగా నుండవలయును. కొన్నిసంవత్సరముల వరకు వయోజనవిద్యను ఉచితముగా నేర్పుటకు సిద్ధపడువారే గ్రంథాలయాధికారులుగా నేర్పడుట మంచిది. వయోజనవిద్యతో పాటు గ్రామజనులలో ఆరోగ్యవిధులు, పరిశుభ్రత, సహకారము, పంచాయతీపద్ధతులు వ్యాపింపజేయవలెను. పత్రికాపఠనముద్వారా భూగోళము, చరిత, మహాపురుషుల జీవితములు, విజ్ఞానశాస్త్రపద్ధతులు మున్నగునవి వారికి బోధింపవలెను. కొన్ని గ్రంథాలయములలో చిట్టిఆటలు(Indoor games)ఏర్పాటుచేసిరునా. వాటితో పాటు వ్యాయామశాలలను ప్రతిగ్రంథాలయమున కనుబంధముగా నాపింపవలెను. ఈవిధముగా చేసినట్లయిన మనము అచిరకాలము

లోపలనే మన గ్రామములను అనుకొనునంతటి రీతిగా ఉద్ధరించిన వారముగుదుము.

త్యాగములేనిది భోగములేదు. బలహీనదేశములను కబళించి వాటిని భోగాల కుపయోగపడునట్లుగా చేయుటకేకదా ప్రపంచ మహాసంగ్రామము జరుగుచున్నది. పరులను దాసులనుగా, బానిసలనుగా చేసికొనుటకై యుద్ధతులు ప్రాణాల నవలీలగా అర్పించుకొను చున్నారు. ధనమును గంగాప్రవాహమువలె పారించి వ్యయము చేయుచున్నారు. శత్రువులనుండి ఆత్మరక్షణము చేసికొనుటలో తమ దేశాలను, తమ పంటలను, తమ యావదాస్తిని, తమ వారధులను, యంత్రాలయములను, నూనెబావులను అన్నింటిని ధ్వంసముచేసికొనుచున్నారు. అట్టి త్యాగమును మనము చేయుచున్నామా? అందు శతసహస్రాంశమునకైనా మనము సిద్ధముగా ఉన్నామా? లేకున్న మనము ఈ దుష్టకాలములో దేశదేశములను ముంచివేయు కాలప్రవాహములో కొట్టుకొనిపోక నిలద్రొక్కుకొనగలమా? బాగా ఆలోచించండి. "వీరభోజ్యా వసుంధరా" యని మనపెద్దలు చెప్పిపోయిరి.

ప్రతిదేశమందును కాలానుగుణ్యముగా నూతన సిద్ధాంతములు బయలుదేరుచున్నవి. కాలముననుసరించి మనకు లాభకరమగునంతవరకు మనమును మార్పును చెందవలసియుండును. దీనిని గమనించియే శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులు ఇట్లు బోధించిరి.

"దేశేకాలే నిమిత్తేచ యోధర్మోభవతి
సఏవ దేశకాల నిమిత్తాంత రేష్వధర్మోభవతి."

—ఆంధ్ర గ్రంథాలయం, 2 వ సంపుటము 1-2 వ సంచికనుండి

# ఇరువది నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ
# హిందూపురము

[1942 డిసెంబరు 29 - 31]

## రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్ *

ఆధునికలక్షణాలుగల గ్రంథాలయోద్యమం మనదేశంలో ఇటీవలనే ప్రారంభమైందనవచ్చును. అత్యంత ప్రాచీనకాలంనుండి కూడ మనదేశంలో గ్రంథాలయాలున్నమాట నిజమే. కాని ఇంతవరకు చరిత్రకారులు వీటి చరిత్రను వివరంగా వ్రాయలేదు. ఆ చరిత్ర లిఖింపబడినప్పుడు ప్రస్తుత గ్రంథాలయోద్యమానికంటె ఎన్నో అంశాల్లో అదిపూర్తిగా భిన్నంగా ప్రత్యేక వ్యక్తిత్వం కలదిగా కన్పిస్తుందని నావిశ్వాసం. నేటి గ్రంథాలయోద్యమంలో ఎన్నోలక్షణాలున్నాయి. వాటిలో కొన్ని మనదేశంలోని వివిధ రాష్ట్రాల ప్రత్యేకవ్యక్తిత్వాన్ని వెలిబుచ్చేతీరుగా ఉన్నాయి. ప్రభుత్వమే గ్రంథాలయోద్యమానికి అండగాఉండి నిర్వహించిన రీతి మనకు బరోడా రాజ్యంలో కన్పిస్తుంది. అక్కడ నూరింట తొంభై పల్లెలలో గ్రంథాలయాలు నెలకొల్పబడ్డాయనీ, నూరింట ఎనభై ముగ్గురికి అవి అందుబాటులో ఉన్నాయనీ లెక్కలవల్ల తెలుస్తూఉంది. ఈ శతాబ్దంలోనే బరోడా రాజ్యం ఇట్టి ప్రగతినే సాధించింది. తర్వాత అనతికాలంలోనే పంజాబు రాష్ట్రంలో గ్రంథాలయోద్యమంలోని మరొకవిశిష్టలక్షణం వ్యక్తమైంది. ఆ రాష్ట్రంలోని విద్యాసంస్థలే ఈ ఉద్యమానికి హృదయంవంటివై కీలకస్థానం వహించాయి. పంజాబు విశ్వవిద్యాలయమే భారత

* ప్రారంభకులు



శ్రీ యస్. ఆర్. రంగనాథన్‌గారు

దేశంలోని విశ్వవిద్యాలయాలన్నింటిలోనూ ఈ మార్గానికి మార్గ
దర్శకమైంది. ఆంధ్రదేశంలోని గ్రంథాలయోద్యమం వీటికి
పూర్తిగా భిన్నమైన పంథాననడిచింది. ఇక్కడి ఉద్యమం ప్రభుత్వ
వ్యవహారంకాదు. విశ్వవిద్యాలయంయొక్క పర్యవేక్షణలో సాగే
టందుకు అప్పుడు ఆంధ్రవిశ్వవిద్యాలయమే యేర్పడలేదు. ఇక్కడి
ఉద్యమం కేవలం ప్రజలకార్యోత్సాహ ఫలితంగా ప్రభవించింది.
ప్రజలకృషివల్లనే బలపడింది. ప్రజాసామాన్యంయొక్క విజ్ఞాన
తృష్ణయే ఆంధ్రదేశంలోని గ్రంథాలయోద్యమానికి ప్రేరకమైంది.

గ్రంథాలయోద్యమంలోని ఆయారీతులవల్ల ఉద్యమానికి
కొంతలాభమూ కొంతనష్టమూ కలిగాయి. బరోడారాజ్యంలో ఈ
ఉద్యమం ప్రభుత్వకార్యకలాపాలలోని అంశం అవడంచేత దానితో
మనకేమి ? అనేఅలసత్వం ప్రజలలో పొటమరించింది. దీన్ని
ఎదుర్కొనేటందుకు ప్రభుత్వం, ప్రజలు తమవాటాసొమ్మునూ
కృషినీ చూపిస్తేనే ప్రభుత్వంతోడ్పాటు గ్రంథాలయాలకు లభి
స్తుందనే నియమాన్ని ఏర్పాటుచేయవలసిన అగత్యం కలిగింది.

పంజాబులో ఉన్నతవిద్యావేత్తలు పరిశోధనల కావశ్యకమై,
వివిధశాఖలతో పరిపుష్టమైన సర్వతోముఖ గ్రంథాలయాన్ని
రూపొందించడం అక్కడ ఉద్యమానికి నాయకత్వం వహించిన
విశ్వవిద్యాలయానికి తప్పనిసరి అవసరమూ అయింది. అందుకొరకు
వారు అమెరికాలోని గ్రంథాలయ విధానాన్ని యథాతథంగా
దిగుమతి చేసుకొని అమలుచేయసాగారు. అమెరికాలోని పరిస్థితుల
కదియెంత అనుగుణమైనా మనదేశంలోని స్థితిగతులకది అనుకూల
మైనది కాలేదు. కాని ఉద్యమనాయకులు దేశకాల పాత్రాను
గుణమైన విధానాన్ని రూపొందించుకొనే ఓర్పులేక ఆత్రపడి ఆ
విదేశ విధానాన్నే అమలుచేయసాగారు. ఇక ఆంధ్రదేశంలోని
గ్రంథాలయాలకు ప్రత్యేక విధానం అవసరమన్న భావానికే అవ

కాశం లేకపోయింది. ఇక్కడి గ్రంథాలయాలు-ఇవి సుమారు
వెయ్యిపల్లెటూరి గ్రంథాలయాలుంటాయి-సర్వసామాన్యంగా అన్నీ
చిన్నవి. ఏవో కొన్నిమాత్రం చెప్పతగిన ప్రమాణాన్ని, స్థాయినీ
అందుకొన్నాయి. అల్పప్రమాణంలోగల సమస్యల్ని పరిష్కరించే
టందుకు ప్రత్యేకవిధానాల అవసరం కలదనేసత్యం విస్పష్టమే.
చిన్న చుట్టుగుడిసె నిర్మించేటందుకు ఇంజనీరుకావాలని ఎవరూ
అనరుకదా! కాని, ఒకహాలు కట్టాలంటే ఇంజనీరూ, ఆతని
కౌశల్యమూ అవసరమవుతాయి. ఏదైనా పెద్దకట్టడం నిర్మించా
లంటే ఢిల్లీలాంటినగరాన్ని రూపొందించాలంటే ఇంకా ఎక్కువ
నేర్పూ శక్తీ లేకపోతే సాగదు. అందుచేత ఆంధ్రదేశంలోని
గ్రంథాలయోద్యమం ఏ ప్రత్యేకవిధానాలపట్లా ఆసక్తిచూపించ
లేదంటే ఎవరూ ఆశ్చర్యపడనక్కరలేదు.

ఇప్పుడు నాకు ప్రత్యక్షంగా సంబంధంఉన్న మదరాసు
గ్రంథాలయ సంఘంయొక్క ప్రసక్తివస్తుంది. ప్రత్యేకంగా
భారతదేశానికి అనుగుణమైన గ్రంథాలయశాస్త్ర విధానాన్ని
రూపొందించడమే ఈ సంఘంయొక్కలక్ష్యం. ఇది గ్రంథాలయ
శాస్త్రాన్నిగురించి శ్రద్ధవహించేటందుకు అనేక కారణాలున్నాయి
విదేశీయవిధానాలు మన అవసరాలకు సరిపడవన్న విషయమే
మొదటికారణం. గ్రంథాలయ విధానాలలోకూడ స్వదేశదృక్పథం
ఉండవలెనన్నది రెండవకారణం. విదేశాలనుంచి దిగుమతిచేసు
కొన్న సరుకుతో-అది గ్రంథాలయశాస్త్రమైనాసరే-మనం తృప్తి
పడకూడదు. మూడవకారణం యీరెండింటికంటె గంభీరమైనది
దేశాలమధ్యకూడ ఆత్మగౌరవమనేది ఉంటుంది. ఆత్మగౌరవంకల
ఏదేశంకాని విజ్ఞానసంపదను ఇతరదేశాలకేమీ, ఎప్పుడూ ఇవ్వ
కుండా చెయిచాచి వాటిదగ్గర పుచ్చుకొనడమే వృత్తిగా చరించే
టందుకు ఉత్సహించదుకదా! జార్జిబెర్నార్డుషా మర్యాదస్థుల

లక్షణాన్ని ఏవిధంగా నిర్వచించాడో మీకు జ్ఞాపకముందనుకుంటాను. తానితరులకు ఇవ్వగలిగినదానికంటె ఎక్కువ గ్రహించనివాడే మర్యాదస్థుడనీ, ఆమాటకువస్తే ఇతరులకెప్పుడూ విరివిగా ఏమగు పాడితే ఇవ్వగలిగినవాడే మర్యాద తెలిసినవాడనతగుననీ ఆయన కచ్చితంగా సూచించాడు. మదరాసు గ్రంథాలయసంఘం మన దేశపు గ్రంథాలయ శాస్త్రసంపదను పెంపొందించే విషయంలో మర్యాద తెలిసినవారిలా వ్యవహరించాలనే కోరుతుంది. ఈవిష యంలో యీసంఘం ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం చేస్తున్న కృషికి చేదోడువాదోడుగా నడుచుకొంటూ ఉంది. ఎంతోకాలంగా కృషిచేస్తూఉన్న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి, వయసులో చిన్నదై ఇప్పటికి 14 సంవత్సరాలపాటుమా తమే కృషిచేసి, నిన్న గాక మొన్న కళ్ళుతెరచిన సంఘం సహకరిస్తూఉందనీ, ఆసరా అవుతూఉందనీచెపితే నామిత్రుడు శ్రీహరిసర్వోత్తమరావు గర్వోక్తు లుగా భావించవచ్చునని నేనెరుగుదును. కాని కొంతకాలం కలసి మెలసిపెరిగినప్పుడు వయసులోని తేడాలు లెక్కలోకిరావు. ఒకతండ్రి తన 30 వ యేట ఒకకొడుకునుకన్నాడనుకోండి, తండ్రికి 90 యేళ్లు వచ్చేటప్పటికి కొడుకు 60 ఏళ్ళవాడవుతాడు. అప్పుడు ఇద్దరినీ ముసలివాళ్ళనేఅంటాము కాని కొడుకును కుర్రవాడనముకదా! మనదేశంలోని గ్రంథాలయోద్యమంలో పరస్పరసహకారంవల్లా ఒక సంఘం చేసేపనికి అనుషంగికంగా మరొకసంఘం కృషిచేయడం వల్లా మన రెండుసంఘాలూ ఎంతో అభివృద్ధిని సాధించగలవంటే ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారు నన్నపార్థం చేసుకోరను కుంటాను.

పాశ్చాత్యదేశాలలో అమలులోనున్న గ్రంథాలయశాస్త్ర విధానాలను పోలినవానినిగాని, కొన్ని కొత్తవిధానాలనుగాని రూపొందించడంమాత్రమేకాదు. ప్రపంచంలోని ఇతర దేశాలవారు

మనభారతదేశంనుండి ఆశించేది. కోలన్ వర్గీకరణంగాని, విషయానుగుణమైన కేటలాగులతయారీకాని మనదేశంలోని అవసరాలకు ఎంత ఉపయుక్తమైనప్పటికీ గ్రంథాలయోద్యమ ప్రగతికీ, భారత దేశపు ప్రత్యేకకృషిని వెల్లడించేటందుకూ చాలవు. అయితే భారతదేశం చేయగలిగినసేవ యేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే మనం గ్రంథాలయ నిర్వచనంతో చర్చను ప్రారంభించవలసి యుంటుంది. గ్రంథాలయం విద్యావ్యాప్తికి సాధనమన్న విషయం మనం జ్ఞాపకముంచుకోవాలి. ముఖ్యంగా అది విద్యా సాధనలో స్వయంకృషికి ఆధారభూతమైనది. కొంతవయసుమళ్ళిన మనబోంట్లము ఇతోధిక జ్ఞానసముపార్జనకు ఇతరులపై ఆధారపడి యుండడం సాధ్యంకాదన్న విషయాన్ని అంగీకరిస్తారుకదా! నామిత్రుడు రావుబహద్దరు యం. లక్ష్మీనారాయణరావు* మనం యావజ్జీవమూ ఆయనశిష్యులుగానే ఉండిపోవాలని కోరడనుకుంటాను. ప్రతియొక్కరి జీవితంలోనూ ఎప్పుడోయొకప్పుడు గురుపాద సన్నిధిని సాగే విద్యాభ్యాసం ఆగిపోయి స్వయంకృషి ప్రారంభంకాక తప్పదు. అప్పుడువిద్యాలయంస్థానాన్ని గ్రంథాలయం ఆక్రమిస్తుంది. అదే అనుకూలమైన, శాశ్వతమైన విద్యాసముపార్జన సాధనము. పాఠశాలలలో కళాశాలలలో చదివేచదువుకు అవధిఉంది. కాని విద్య అంతులేకుండా సాగిపోతూఉండవలసిందే. ఊయెలలో పరుండునప్పటినుండి ప్రారంభమై శరీరంకట్టెలపాలయ్యే వరకూ ఇదిసాగుతూనే ఉంటుందన్నవిషయం జగద్విదితమే. ఏతావాతా గ్రంథాలయం సార్వజనీన, శాశ్వత స్వయంశిక్షణ సాధనమని చెప్పవచ్చును. ఇది అందరికీ సమానావకాశాలను కల్పించే ఏకైకసాధనం. అందుకనే దీనిని ఎన్నటికీ ప్రతిఫలం కోరకుండా సేవచేసే సంస్థగా యేర్పాటుచేశారు. గ్రంథాలయోప

---

*సభాధ్యక్షుడు జిల్లావిద్యాశాఖాధికారి, చాలకాలం ఉపాధ్యాయవృత్తిలోనుండినవారు.

యోగం మనకున్న ధనాన్నిబట్టిగాక దానిని మనముపయోగించుకో గల శక్తినిబట్టి నిర్ణయమవుతుంది.

ఈదృష్టితో పరిశీలిస్తే పాశ్చాత్యదేశాలవారు గ్రంథాలయ మేతీరుగా ఉండాలో ఆలోచించి, నిర్ణయంచేసి దీనినెంతో ప్రయోజనవంతమైనదానినిగా తీర్చిదిద్దుకున్నారనే అనాలి. ఈ స్థితిలో భారతదేశం ఇంకా యేవిధంగా ఈఉద్యమానికి మెరుగులు దిద్దగలదో తెలుసుకోవాలంటే మనం అత్యంత ప్రధానమైన విష యాన్ని గురించి చర్చించాలి. గ్రంథాలయంవిద్యావ్యాప్తికి సాధన మైనప్పుడు మంచికిగాని చెడుకుగాని దానిలో అణగియున్న సమస్త శక్తులను తెలుసుకొనవలెనన్నమనం విద్యఅంటేయేమిటో కొంచెం పరిశీలించాలి.

'విద్య మానవుని పూర్ణపురుషునిగా రూపొందించే సాధనం. 'సంపూర్ణత్వం' అన్నవిశేషణంలో ఒకచిన్నసంగతి ఇమిడిఉంది. పాశ్చాత్యులదృష్టిలో సంపూర్ణత్వం రెండువిషయాలకు శారీరక మానసిక వికాసాలకుమాత్రమే పరిమితమైంది.

అట్టి దృక్పథంవల్ల వారు ఎట్టిశోచనీయమైనస్థితికి వచ్చారో మీకుతెలుసు. పాశ్చాత్య దృక్పథానుసారియైన విద్యారంగంలో కన్పించే అసంతృప్తి జ్వాలలు భస్మాసురకృత్యాన్ని జ్ఞప్తికి తెస్తుంటాయి. భగవంతుడు అడ్డుపడిరక్షిస్తేనేతప్ప ప్రపంచమంతా 'విద్య' ఫలితంగానే భస్మీపటలమయ్యే ప్రమాదం ఉంది. ఇట్టిపరి స్థితికి కారణం ఏమిటి? పాశ్చాత్యులు మానవునిలో దేహానికీ, మనసుకూ అతీతమై ప్రాధాన్యంవహించి 'ఆత్మ' అనే మూడవ అంశంకలదని గుర్తించకపోవడమే అనాలి. ఆత్మవిజ్ఞానంకూడ పరిపుష్టమైతే, దేహమూ మనసూ వాటికి ఉచితమైన స్థానాల్లో అదుపులో ఉంటాయి. ప్రస్తుతం వారు 'ఆత్మ' యొక్క ఉనికినే గుర్తించనందువల్ల దేహమూ మనసూ పిచ్చిపట్టినట్లువిశృంఖలంగా

విహరిస్తూ ప్రమాదాలకు కారణమవుతున్నాయి. ఇటీవల (1941 మేలో) ఇంగ్లండులో ప్రపంచంలో మాటిమాటికి యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లకుండా ఆపాలంటే మనవిద్యావిధానంలో ఆత్మజ్ఞానాన్ని వృద్ధిచేసే అంశాలను చేర్చాలంటూ కౌంటర్‌బరీ పీఠాధిపతి ప్రతిపాదించిన ఒక తీర్మానాన్ని రెండురోజులపాటు చర్చించినప్పుడు ఈవిషయాన్ని ప్రభువులసభ వారు గుర్తించారు. పాశ్చాత్య దేశాలు ఎందుచేత పరమాత్మవిషయిక విజ్ఞానవ్యాప్తిపట్ల అశ్రద్ధవహించి మానవజాతిని పదేపదే యుద్ధజ్వాలలకాహుతిచేస్తున్నాయన్న విషయం ఆశ్చర్యకరంగాఉంది. ఇది నామట్టుకునాకు అనంతమైన కాలంలో బహుశా భగవంతుడు కావిస్తున్న పరిశోధనలో ఒక భాగమేమో అనిపిస్తుంది. ఆత్మవిజ్ఞానాసక్తిలేకుండా కేవలం దైహిక, మానసికశక్తులు అభివృద్ధిచెందిన సందర్భంలో మానవ సమాజం ఏరీతిగా పరిణామం చెందుతుందో చూదామనేకుతూహలం కలిగిన భగవంతుని లీలావిశేషమా ఇది అని అనతగినట్లుంది. తన పరిశోధనలకొరకు భగవంతుడు పాశ్చాత్య దేశాలను ఎన్నుకొన్నాడు. అక్కడ అయిదుశతాబ్దాలపాటు ఆత్మను సూర్చావశము కాపించి దైహిక,మానసికశక్తులను విజృంభింపజేసి ఒకరకం మానవజాతిని తయారుచేశాడు. అది అదుపులోనుంచి తప్పిపోకుండా కళ్లెంలాగిపట్టేటందుకు భారత దేశంలో దైహిక, మానసిక వికాసాన్ని ఉన్నరీతిగానిల్పి, ఆత్మవికాసానికి ప్రాధాన్యమిచ్చే మానవ సమాజాన్ని సృష్టించాడు. అందుచేతనే మనదేశంలో మానసిక వికాసం ఈ అయిదుశతాబ్దాలపాటూ గుంటపూలు పూయసాగింది. భగవంతుడు చేస్తూఉన్న పరిశోధన పూర్తికావచ్చినట్లు కన్పిస్తూ ఉంది. భారతదేశం అలసత్వాన్ని విడిచిపెట్టి తాను దైహిక' మానసికపరిణతిని సాధిస్తూ, ప్రపంచానికి ఆత్మవికాసాన్ని ప్రసాదించి సుస్థిరక్షేమాన్ని స్థాపించవలసిన సమయం ఆసన్నమయింది. ఈ ఆశయాన్ని ఎన్నిమార్గాల్లో వీలైతే అన్నివిధాలా ముఖ్యంగా

గ్రంథాలయాలద్వారా సాధించాలి. అందుకోసం రెండువిధాల పాటుపడాలి,

1. నశించకుండా మనం శతాబ్దాలతరబడి కాపాడుకొన్నవీ, అత్యున్నతస్థాయికి చెందినవీ అయిన వేదాంతగ్రంథాల్ని అన్ని దేశాల వారికీ అందజేయాలి.

2. పాఠకునిలో వేదాంతవిజ్ఞానాసక్తిని వృద్ధిచేసేరీతిగా మన గ్రంథాలయాల నిర్వహణలో నూతన పద్ధతులను సాధించాలి. ఆ విధానం ఏరీతిగా ఉంటుందో స్పష్టంగా చెప్పడం సాధ్యం కాదు. కాని ఊహామాత్రంగా అది గ్రంథభాండాగారి తత్వంతో సంబంధించిన అంశమనిమాత్రం సూత్రప్రాయంగా భావించవచ్చును. ఆత్మకుసంబంధించిన విషయం అనిర్వచనీయం. నేర్చిన గ్రంథస్థవిషయాల్ని జీవితంతో సమన్వయం చేసుకొంటేనే ఆత్మ వికసిస్తుంది. మంత్రద్రష్టలైన మనఋషులు ఆత్మవికాసంకోసం ఒకవిధానం అవలంబించారు. మనసాంఘిక వ్యవస్థలో సన్యాసాశ్రమం స్వీకరించి పీఠాధిపతులైన ఆచార్యుల్ని గుర్తించడం, గౌరవించడం విధ్యుక్తమైన ఆచారంగా ఉంది. ఆశ్రమపాలనం సరిగా చేసేవారొకరుంటే వారితోపాటు లోకంలో భ్రష్టులై, శిష్యుల్ని తప్పుదారి పట్టించేవారు వెయ్యిమంది సంచరిస్తూ ఉండవచ్చు. పాశ్చాత్య దేశాలలో వారందరినీ మాంత్రికతాంత్రికులనీ, ప్రమాదకారులనీ తలచి, కట్టగట్టి సజీవంగా కాల్చిచంపారు. అందుచేత మంచి మతబోధకులూ, నీచదేవతోపాసకులూ అగ్నిదేవుడికి హోఅయిపోయారు. కాని స్వాభారతదేశంలో అలా జరగలేదు.

నిజమైన మంచిసన్యాసులకు ఎన్నటికీహానికలుగకూడదనే తత్వంతో ఆవేశంతో చెలామణీఅయే మోసగాండ్లనుకూడమనం సహించాం. అందుచేతనే మనకు మతాచార్యులబోధనలన్నీ నశించిపోకుండా గ్రంథరూపంగా లభిస్తున్నాయి. భారతదేశంలోని గ్రంథాలయ శాఖ (Libraryprofesicon) ఆచార్యులు అవలంబించిన విధానాల ననుసరించి ప్రపంచంలోని ఇతరదేశాలవారితోపాటు ఈ వేదాంత విజ్ఞానసుధను పంచుకొని అనుభవించాలి. అదే భారత దేశం ప్రపంచంలోని గ్రంథాలయోద్యమాభివృద్ధికి విధిగా చేయగలిగినదీ, చేయవలసినదీ అయిన సేవయని నేను భావిస్తున్నాను.

ఈపని జరిగిననాడు స్వర్గధామంతో సమానమైన మరో ప్రపంచం ఆవిర్భవిస్తుంది. మానవులలోగల తేడాలను దేహమూ మనసూ వ్యక్తంచేస్తాయి. మనదేహములు ఇతరులకు మనకూ గల తేడాలను మాటిమాటికీ జ్ఞాపకంచేస్తాయి. వ్యక్తులమధ్యగల విపరీతమైన భేదాన్ని మనసు ఎప్పటికప్పుడు ప్రకటిస్తూఉంటుంది. దీనికి భిన్నంగా ఆత్మ మానవజాతిఅంతా – ఒక్కమానవజాతే కాదు, సృష్టిలోని ప్రాణికోటి మొత్తం ఒక్కటేనని నొక్కిచెపుతుంది. ఆత్మ విజ్ఞానవికాసంతో వసుధైకకుటుంబం సాధ్యమవుతుంది. ఈ మహాసభను ప్రారంభించేముందు మరొకసారి మన ప్రాచీనులు ప్రవచించిన శారీరక, మానసిక విజ్ఞానాన్నధిగమించిన ఆత్మబోధనావశ్యకతను, ఆత్మైక్యతను మీదృష్టిపథానికి తెస్తున్నాను. సక్రమంగా, సంపూర్ణంగా వికాసంచెందిన మనోంబుజములే ఈ సభయొక్కఫలం కావాలనీ, మానవుని శారీరక, మానసిక విభిన్నతలను మరపింపజేసి అందరమూ పరమాత్మయొక్క అంశములమే అనే ఐక్యతను చాటగలమని ఆశిస్తున్నాను.

సం గచ్ఛధ్వం సంవదధ్వం సం వో మనాంసి జానతామ్।
సమానో మంత్రః సమితిః సమానీ సమానం మనః
సహచిత్తమేషామ్॥

సమానీవ ఆకృతిః సమానా హృదయానివః।
సమానమస్తు వో మనః యథావః సుసహా సతి। *

అన్న వేదప్రవచనమే సర్వదా మీకు ధ్యేయం అగుగాక!

— 24 వ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభ సంచికలోని
ఆంగ్లోపన్యాసమునకిది తెనుగుసేత.

---

*పరస్పరం కలుసుకోండి; మాట్లాడుకోండి; సరిగాఅర్థంచేసుకోండి; కలసి ప్రార్థనచేయండి; పనులు సాధించండి; ఆలోచించండి; మీకోరికలు ఒకేరకంగా ఉండుగాక। మీభావనల మధుర సంయోగంద్వారా మీమధ్య సంపూర్ణమగు ఐక్యత నెలకొనుగాక।

# పదునాలుగవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, గుంటూరు

[1931 జూన్ 30]

## డాక్టరు టుర్రా శేషగిరిరావు

హూణశకాబ్దములు 1914 వ వత్సరమున విజయవాడలో శ్రీ రామమోహన గ్రంథాలయయాజమాన్యమున బ్ర॥ శ్రీ॥ సూరి నరసింహశాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్యగార్లు ప్రారంభించిన ధర్మగ్రంథాలయోద్యమమును బరోడా రాజ్యమందు చెలగియుండిన విధమున మన యాంధ్రరాష్ట్రములో వ్యాపింపజేయ సమకట్టిన నాటనుండియు నీ యుద్యమమునకు నామనఃపూర్వకసానుభూతి నొసంగినవాడనైతిని. ఇంతేకాక మా కళింగమండలమున నాంధ్రోత్కళ సాహితీ సమానపోషకులని వినుతికెక్కిన శ్రీ మందసా రాజ్యాధిపతు లగు శ్రీ శ్రీనివాస రాజమణి రాజదేవు వారి పోషకత్వమున బారువా శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయము కార్యస్థానముగా నీయుద్యమమును నడపుచున్న మ॥ రా॥ రా॥ శ్రీ తిత్తి బలరామయ్య, జగన్నాథ పాఢీ ఖడంగా, పొట్నూరి స్వామిబాబు, పార్నంది ఈశ్వరప్ప, గిడుగు వెంకటసీతాపతి, మండపాక పార్వతీశము, బెన్నూరి నాగేశ్వరరావు, త్రిపురాన సూర్యప్రసాదరావు, శ్రీ రామచంద్రకవి, తూర్పాటి సన్యాసియమ్మగారు మొదలగు గ్రంథాలయోద్యమ ప్రచారకులతో కలిసి గ్రామ గ్రంథాలయములు నెలకొల్పుటలోను, గ్రంథాలయసభలు జరిపించుటలోను, గ్రంథాలయములకు గ్రంథములు సంపాదించుటలోను, తాళపత్రగ్రంథములు వెదకి యందలి విశేషాంశముల నుపన్యసించి జానపదులకు తమ తమ గ్రామములం దభిమానము

స్థిరపరచుటలోను, బాహాబాహీగా పనిచేసియున్న గ్రంథాల యోద్యమ ప్రచారకుడనుగూడ నగుటచేత నీ యవసరమున మీ సమాదరణముచే నేడు నాకు ప్రాప్తించిన యీ గౌరవమును మా కళింగమండల ప్రచారకులకు కలిగినట్లేభావించి సంతసించు చున్నాను.

ఇట్లగుటంచేసి నాకుకలిగిన యీ యవకాశమును ప్రస్తుతము మన రాష్ట్రములో కొంత వెనుక బడియున్న యీ సదుద్యమమును దృఢపరచి పూటుచేసి జనోపయోగకరముగా నడిపించుటకై నా యల్పబుద్ధికి తోచినమార్గములను సూచించుటకై వినియోగింప ననుజ్ఞ వేడెదను.

మన గ్రంథాలయోద్యమము ప్రస్తుతము కొంత మందగించి యున్నదనుటకు సందేహము లేదు. ఒక్క మనయుద్యమమే యన నేల? ఇతర సాంఘికోద్యమము లెన్నో మందగించినవి. భుక్తికి సాధనమగు వాణిజ్యము మందగించినది. చదువులు మందగించినవి. జీవితములే మందగించునట్లున్నవి. మనదేశమున గత పదిసంవత్సర ములనుండి ప్రబలమగుచువచ్చిన రాజకీయ యజ్ఞములో దీక్షితు లగు వారిమాట యటుండగా, నీ యజ్ఞము వారును, దానిని యౌను కాదని విత్కరించువారును నందే లగ్నభూతచేతస్కులై జీవితములను పరధ్యానముగా గడుపుచుండిరి. ఇదియు నొకమంచికే కలిగిన దని కొందరందురు. ఇట్లుగాకున్న నీ వత్సరపు విజయ విశ్రాంతి కలిగే యుండదని కొందరందురు. కావచ్చును. కాక పోవచ్చును. కావచ్చుననియే తలంచినను ఇట్టి యమోఘమగు విశ్రాంతిని శాంతికపౌష్టికములకు వినియోగించుటయే సంప్రదాయ సిద్ధము. ఇట్టి క్రియలలో దేశీయవస్తు, వస్తునిర్మాణకౌశల, ప్రదర్శన ములతో సమాన గౌరవమును గ్రంథాలయోద్యమమున కీయవలసి యున్నది.—— ఈయతగియున్నది గనుక నీ యాంధ్రసభలలో

నీ గ్రంథాలయ మహాసభ జరుపుటయు సమంజసమనియే తోచును.

మూలసూత్రములు

పురాణశకాబ్దములు 1923 లో గ్రంథాలయసంఘమువారు బ్ర॥ శ్రీ యాతగిరి లక్ష్మీవేంకటరమణగారిచే రచియింపించి ప్రకటించిన "గ్రంథాలయోద్యమము" అను గ్రంథములో మన ఈయుద్యమధర్మములు సూచించువాక్యములు కొన్ని గలవు వాటిలో ముఖ్యమయినవి జ్ఞాపకముచేయ సాహసించుచున్నాను.—

(1) సృష్ట్యాదినుండియు నేటివరకు వికసించిన జ్ఞానము గ్రంథములందు దాచియుంచబడినది. అట్టి ముద్రితాముద్రిత గ్రంథముల నొకచో జేర్చినది గ్రంథాలయ మగును. ప్రతిష్ఠి గ్రంథాలయమును ప్రతిగ్రామమునను స్థాపించి తన్మూలమున జల జ్ఞానవంతులుగా నొనరించవలెననే సంకల్పముననే గ్రంథాలయోద్యమ మందురు.

(2) మనుజుని జ్ఞానవంతునిగానొనరించి జీవయాత్ర పవిత్రవంతముగను పురుషార్థ ప్రాప్తిసాధకముగను చేయుటయే యీ యుద్యమముయొక్క ప్రాప్యము.

3. ఇతరజాతీయోద్యమసిద్ధాంతములకు విరోధములేకుండ నడుపవలసిన భారము తదుద్యమనాయకులపై నిలిచియున్నది.

4. ఆంధ్రగ్రంథాలయోద్యమము పల్లెటూళ్ళే పునాదిగా గలది.

5. గ్రంథాలయము సర్వజనులయొక్క సర్వకళాశాల.

బరోడారాజ్యమం దమెరికాలోవలె గ్రంథాలయోద్యమమును స్థాపించిన శ్రీ శాయాజీరావు గయక్వాడ్ మహారాజా వారి యమూల్యోపదేశ మీ గ్రంథములో నుదాహరింపబడినది. ఎట్లన్నను—

“జనసామాన్యమున తగినంత జ్ఞానము లేదనియు నట్టిది విజ్ఞానము చూవశ్యకమనియు మనము గ్రహించవలెను. గ్రంథములను వారు ప్రేమించునట్లు పురికొల్పవలెను. గ్రంథపఠనము వారి జీవితమునం దొకభాగముగా పరిగణించునట్లొనర్పవలెను. అప్పుడు గ్రంథాలయములు వినోదములుగాక జీవితావసరములుగా నెంచబడును.”

పై వాక్యములో గల యట్లు పల్లెటూళ్ళపై నాధారపడి జానపదులను జ్ఞానపరులుగా దిద్ది వారి జీవితముల కాశయోద్దీపనను కలిగింప నెంచెడి యీ యుద్యమాభివృద్ధిలో నీ యుద్యమ వ్యాప్తికలిగిన గ్రామములం దెల్ల యెడలను శక్తిత్రయ శక్తిద్వయ సంపన్నులగు యువజను లెందరో నరనారీవతంసులు ముందుకు వచ్చి తాము తరించుచు నితరుల తరింపజేయ యత్నించుచు వచ్చిరనుట ప్రఖ్యాతమును ప్రశంసనీయమును శుభప్రదమును నైయున్నవి. వారలందరును మహానుభావులే. వారందరికి ననేకవందనములు గాని గ్రంథాలయోద్యమమును ప్రతిష్ఠించి, ప్రాప్యమును చెందజేయవలసిన వీరలే తదితర జాతీయోద్యమములోను. అందును, ముఖ్యముగా రాజకీయాందోళనములోను తమకుగల సహజ శౌర్యౌదార్యాతిశయములచే దుమికి మునుగలయుట తటస్థమాయెను. అందుచేత నీయుద్యమ సాఫల్యమునకు పాటించవలసిన యొకధర్మ మతిక్రమించబడినది. ఇతర దేశీయోద్యమములకు వ్యతిరేకించకుండా దీనిని నడుపుట యటుండగా, నితర దేశీయోద్యమమునకును, అందును రాజకీయోద్యమమునకును దీనిని లోబరుచుటతో సరిపుచ్చక దీనికి స్వస్తి చెప్పవలసి వచ్చినది. దానంజేసి యాయా గ్రామములలో నడిపించు నభిమానులు చాలక గ్రంథాలయోద్యమము వెనుక బడిపోయినదనుట యతిశయోక్తి కానేరదు. ప్రజలపైననే యాధారపడి స్వచ్ఛందసేవకుల

యుత్సాహముతో నడుపబడవలసిన యీ సముద్యమమునకు యువజనుల మంత్రోత్సాహశక్తులే జీవిక. అవి మందగించినపట్లు, అవి యన్యోద్యమాక్రాంతమైనపట్లు నీయుద్యమము గతిలేని యనాథ బాలిక కాక తప్పదు. గనుక నీ యుద్యమమునకై ప్రత్యేకముగా జీవితముల నర్పింపగల విద్యాభిమానులు కావలసియున్నారు. అట్టివారిని సేకరించుటకును, వారి నీయుద్యమ నాయకత్వమువహించు నట్లొప్పించుటకును వలయు మార్గముల నేర్పరచి వాటి నమలులోనికి తెచ్చు ప్రణాళికను విచారించుట ఈ మహాసభకు కర్తవ్యమై యున్నది.

ఒక మహత్తరమగు నుత్తమాశయప్రాప్తికి జీవితముల నర్పించి తదేకదీక్షగా పనిచేయుచు జానపదు లాబాలగోపాలమును నట్టిదీక్షకు సమకట్టునట్లుచేయుటలో మనజాతీయోద్యమనాయకులు చూపిన ప్రతిభయు, పరాకాష్ఠయు, ధీరత్వమును, శాంతియు, ఔదార్యమును ప్రజలకు మూఢవిశ్వాసమేగాక బుద్ధివికాసము కూడా కలిగించి తన్మూలమున వారిమానసములం దిప్పుడు నాటుకొనిన జాతీయతాంకురములను వర్ధిల్ల జేయుటలో చూపుట శాంతిక పౌష్టికక్రియ యనదగదా? ఇట్టి క్రియాకలాపమునకు గ్రంథాలయ ప్రాబల్యముతప్ప వేరొక యచంచల సాధనములేదని మనయాంధ్రావళి జాతీయోద్యమ ప్రారంభములో గ్రహించిన మూలసూత్రమును మరువదగునా ?

గాంధీమహాత్ములవారును మాళవ్యాపండితవర్యులును జాతీయోద్యమ ప్రచారకులను గ్రామములలో బీటులు వేసుకొని జానపదులను చేర్చి నూలువడకుటకు తోడుగా విద్యాబీజవిన్యాసములు నేర్పవలెనని ఘూర్జరప్రాంతములో హెచ్చరించుచున్నారు గదా! నేటికి పదిహేను సంవత్సరములకు పయిగా నాంధ్రోద్యమ ప్రారంభములోనే గ్రంథాలయములే "సార్వజనీనములగు సర్వకళాశాల"ల

నే మూలసూత్రమును గ్రహించి యీ గ్రంథాలయోద్యమమును లేవదీసిన ప్రముఖులేమి, తదితరజాతీయోద్యమ నాయకులేమి, ప్రస్తుతపు పునర్నిర్మాణ కార్యక్రమములో జ్ఞానభాగముగా నీ యుద్యమమును పట్టుదలతో నిర్వహింప జనదా? ఈయర్థ మీమహా సభలో సమర్థింపబడుగాక యని నా ప్రార్థన.

**మందగింపు కారణములు**

మరియొకసంగతి. ఈయుద్యమము ప్రారంభించినరోజులలో ఒకరినిమాచి ఒకరుగా పలుతావులలో గ్రంథాలయములు స్థాపించిరి. క్రీడాసంఘములు, విలాసపు కబుర్లక్లబ్బులు, యువజనసంఘములు, నాటకకూటములు, మొదలగు విలాసలాలససమాజము లేర్పడినట్లే అదియొక విలాసముగానో, నాగరికతాసూచికగానో, మరియొక వ్యాసంగమో, వ్యాపారమో, లేక నలుగురిలోనూ పెద్దలనిపించు కొనవలె ననియో ధనికులగు కొందరజ్ఞానులు పెట్టుబడి పెట్టి యచ్చటచ్చట గ్రంథాలయ స్థాపనమునకు తోడ్పడి వార్తకెక్కిరి. అంతటితో నంతవరకు వారిజీవితములు ధన్యతగాంచినవి. కాని యట్టి గ్రంథాలయములు జ్ఞానపరులగు నియంతలులేక శీఘ్రముగా క్షీణించినవి. దానంజేసి యజ్ఞానులగు ధనికులవలని యార్థిక ప్రోత్సాహమీయుద్యమమునకు సన్నగిల్లినది. ముచ్చటకొరకు తెరువబడిన గ్రంథాలయములు కొన్నికొన్నినాళ్లు విలాసవంతులగు యువజనులకు పేలారంగములై చిక్కియు చిక్కుచును వన్నె దక్కియున్నవి. ఇట్టివే "రిక్రియేషనుక్లబ్బుల" కబుర్లక్లబ్బుల యధీనములోనున్న గ్రంథాలయములు. అవి జీవచ్ఛవములై కొన్ని గ్రామములలో కలహకారణములు గూడ నగుచున్నవి. గ్రామమందలి మైక్యతయు విశిష్టతయు తమ జ్ఞానవిన్యాస విధానముల వలన కాపాడి పెంపుచేయగల గ్రంథాలయములే వాటికి భంగము వాటిల్ల జేయుట గలచోట నట్టి గ్రామాభిమానులు తగినచర్య తీసికొని వాటిని ఖిలపరచుటయే యుత్తమమని తోచకమానదు.

అట్టి ప్రయత్నములో గ్రంథాలయోద్యమ కార్యకర్తలును సాయముచేయుట ఘనకార్యమే. ఇంత కఠినముగా నీయవసరమున నేలచెప్పసాహసించితిననగా కొన్ని గ్రామములలో ప్రభుశక్తి యుతులగు పెద్దలిట్టి కలహకారణములుగా గ్రంథాలయములను దించియుంచుట నాస్వానుభవములోనికి వచ్చినదిగనుక. కాగా గ్రంథాలయములను జనోపయోగకరములుగా చేయగలుగుట వాటిని స్థాపించువారి భావనలు, ఆశయములు, ఉత్సాహము, కార్యదీక్ష, జ్ఞానపరత్వము మొదలగు గుణగణములపై నాధారపడి యున్నది. జ్ఞానపరతలేని పాలకవర్గము చేతిలోనున్న గ్రంథాలయ ముండినను లేకుండినను నొక్కటేయగును. "ప్రజయార్తి మెరుగని ప్రభువు దూరమునుండి వచ్చెనే మచ్చోట చచ్చెనేమి" యన్నట్లు "ప్రజలధీశక్తుల ప్రకటింపజాలని పుస్తకాలుండేమి పోయెనేమి" యనవలసివచ్చును. లైబ్రరీసంఘముల నేర్పరచు మార్గములను గూర్చియు పుస్తకసంపాదన విధానములనుగూర్చియు గ్రంథపట్టికలు తయారుచేయుటనుగూర్చియు లైబ్రరీ వార్షికోత్సవాతిథ్యములను గూర్చియు నుపన్యసించుటలో జూపిన కౌశలములో నొక పదియవ పాలైనను మనగ్రంథాలయోద్యమనాయకులు యేగ్రంథమెట్లు చదివిన లాభించునో ఏగ్రంథమందేమి చూడదగియున్నదో, చదువ దగినవని ప్రఖ్యాతిగాంచిన కావ్యములలో నెట్టి వివిధజ్ఞాన విశేష ములు గలవో బోధించుటలో వినియోగపరచి యుండినచో మన గ్రంథాలయోద్యమము ప్రస్తుతపు జీవన్మృత స్థితికివచ్చి యుండక పోవును. గ్రామీణులకీయుద్యమమువలని లాభములు తేటపడి యుండును. కాని పోగామిగిలియున్న గ్రంథాలయములలో రాట్నపు ధ్వని వినబడుచున్నదిగదా! కాలచక్రమగు నీ చరఖాచక్ర పరి భ్రమణములలో తిరిగీ మనగ్రంథాలయోద్యమమున కుచ్ఛదశ రా గూడదాయని కొందరు జాతీయోద్యమవాదు లనవచ్చును. నిజమే. మన చరఖా కాలచక్ర సూచకమే కావచ్చును. కాని కాలచక్ర

పరిభ్రమణమునకై వేచియుండుట యంత పౌరుషమైన పనికాదు. ధైర్యసాహసౌదార్యవంతమైన జ్ఞానవంతముగాని మూఢవిశ్వాసమగు జనసామాన్య మధికారబలమును లోకకళ్యాణకరమగు సమత్వముతో నుపయోగింపగలుగుట నేటికిని ప్రపంచచరిత్రలో నరుదైయున్నది. కాన జానపదులలో దృఢపడుచున్న జాతీయతను జ్ఞానవంతమును జ్ఞానసహాయమును చేయవలెను. తఖిలీచరఖాలమూలమున హైందవ జాతీయతను ఆర్థికమార్గమునకు త్రిప్పినట్లే గ్రంథాలయ నామక విద్యావిన్యాసోద్యమమూలమున నాశయోద్దీపితము గావించి పవిత్రపరుపవలెను. ఇదియే జాతీయోద్యమసాఫల్యమునకు గావలసిన శాంతికరక్రియ. శాంతివాతావరణమునే దట్టపరుపవలెనను సంకల్పము మనకు నిజముగా నున్నయెడల స్వస్తిచెప్పబడిన యీ సదుద్యమమునకు పునరావృత్తులు ప్రారంభింపవలెను. శాంతియందు కాంతియు వీరత్వమును దాంతియును గూడ సమరమునందుకన్న నెక్కుడుగా మెరయింపననువగు నను నార్షేయ మతమును సూచించుటకే యుపనిషచ్ఛాంతి వాక్యములతో నీ ప్రసంగమునకు 'మంగళాచరణ మొనర్చితిని.* విద్వేషకారణములని చదువులుగాని విలాసములుగాని తర్కములుగాని చయిదములుగాని వినాశకారణములని యెరిగి మన మీవిజయ విశ్రాంతియందు జీవితములను తేజోవంతములు చేయగల సాధన లభ్యసింతుముగాక ! గ్రంథాలయముల నట్టిసాధనలకు కార్యరంగములుగా నుపయోగింతుముగాక ! ఇట్టి విజయవిశ్రాంతియందు కలహములుపెంచి నీతిసూత్రతర్కము లన్వేషించుచు కార్యక్రమపద్ధతులలో పరస్పర లోపముల విమర్శించుచు, నీర్ష్యల రగుల్చుటన్నను యాంధ్ర ప్రముఖులు తమ్ము సమరమందు ప్రోత్సహించి, శ్రీకృష్ణజన్మస్థానములో నాశ్వాసించిన జ్ఞానవిశేషములను జనసామాన్యమునకు పంచియిచ్చుటలో వినియోగపరచినచో మన భారతజననీచరణ

---

* ఈ వాక్యముల నీ గ్రంథమున చేర్చలేదు.

మంజీరములో మన యాంధ్రమును నాయకమణిగాచేసి ధన్యులు కాగలరని సవినయముగా విన్నవించుచున్నాను. అహింసాదయా సత్యశౌచముల కభినవ ప్రపంచములో ఆదర్శప్రాయులుకాగల మన యాంధ్రనాయకులీ యాశయమును తమ యుదారమగు సమాలోచనలో నుంతురుగాక.

కాగా మన గ్రంథాలయములు తిరిగి తలెత్తి మనయుద్యమ ప్రాప్యమును చేకూర్పవలెనన్నచో గ్రంథాలయములలో జరుగు పఠన మెట్లున్నదో ఎట్లుండిన బాగుండునో మన మన్వేషింపవలసి యున్నది.

గ్రంథాలయ వార్షికోత్సవనివేదికలలో సాధారణముగా నేయే గ్రంథములు పాఠశాల కుపయోగించుచుందురో తెలుపు వివరములు పేర్కొనబడవు అచ్చటచ్చట నేను విమర్శచేసి చూడగా నవలలకును నాటకములకును ప్రచార మెక్కువయని తెలియవచ్చెను. అందును నిరూపక నవలలకు మిక్కిలి ప్రచారము గలదు. నే నెరిగినంతవర కివి యనువాదముల కనువాదములు; గతాను గతికములు; తాత్కాలికానంద జనకములు; రెండవ పర్యాయము చదువవలెననే కోరిక కలిగింపనేరని వ్రాతలు. ఇట్టివి చదువుటవల్ల గ్రంథములు చదువునలవాటు కలుగుననుట నిజమే కాని టీ, కాఫీల లాగుననే యవి మనస్సుకు కలుగవలసిన దార్ఢ్యమును బలమును కలిగింపనేరవు.

పత్రికలలో "భారతికి" ప్రచార మెక్కువ. "భారతి" వంటిదిగాని మరియొకరీతిగా సరియైనదిగాని వేరొకమాసపత్రిక యాంధ్రమున లేనేలేదు. ఇంతవరకిది ప్రశంసనీయమే. ఇందు కాంధ్రావని శ్రీనాగేశ్వరరాయలవారికి కృతజ్ఞత ఎల్లెంతచూపినను తీరదుగాని కలకత్తా మాడరన్ రివ్యూవలె నుత్తమవైజ్ఞానిక పత్రికగా ప్రారంభింపబడిన మన "భారతి" క్రమక్రమముగా విలాసలాలసులగు వారికి వినోదముకల్పించు స్త్రీ పురుష భావనలను చేష్టితము

లనువర్ణించు పత్రికగా మారిపోవుచుండుట ముఖ్యముగా గ్రామము లందు నివసించు మన యాంధ్రావళి దురదృష్టపరిణామ మనవలసి యున్నది.

వ్యాపారరీత్యా ఈ మార్పెట్టిలాభకారియైనను ప్రజల మనస్సులను విజాతీయములగు నడతలలోనే లగ్నముచేయు సాధన మైనయెడల నిరూపకనవలా పఠనమువలె భారతీపత్రికాపఠనమును చిత్తచాంచల్య కల్పనమునకు హేతువగును. పాఠ్యములయందలి యిట్టి ధర్మరహస్యములు గ్రహించి గ్రంథాలయాధికారులు పాఠ కుల మనంబులను జ్ఞానపరములగు రచనలలో హత్తింపవలసి యుండును.

గ్రంథాలయ వర్గీకరణము

విద్యావిధానములో రూరల్ అర్బను అను గ్రామీణ నాగరక విద్యావిధాన విభాగమేర్పరచునట్లే గ్రంథాలయ వర్గీకరణ ములో గ్రామీణ నాగరక విభాగ మనుసరింప యత్నింపబడు చున్నది. పఠనమార్గములును బోధనవిధానములును సామాన్యములే యైనను పాఠ్యమందు రూరలు, అర్బను విభాగ మనుసరణీయమని కొందరందురు. ఇది విచారణీయము. రాష్ట్రేతరముల పరిస్థితు లెట్లున్నను మన యార్యావర్తములో నేమి దక్షిణాపథమందేమి జీవిత పరిస్థితులలో నిట్టి విభాగ మసంగతము. నిన్న మొన్నటి పట్టణ ములు నేటి పల్లెలైనట్లే నేటి పట్టణములు రేపటి పల్లెలు గావచ్చును. నిన్నటి పల్లిటి జానపదులే నేటిపట్టణ నాగరకులగుచున్నారు. కళింగసామ్రాజ్యమునకు రఘుమహారాజునాడు ప్రధాన కార్య స్థానమై సముద్రతీరమున సకలసంపదలకు నాకరమైన కళింగ పట్టణము నేడు జాలరుల పల్లెవలె నున్నది. గడిదుర్గములు గల్గి గజపతిరాజ్యమునకు దక్షిణ కవాటమువలె దుర్భేద్యమై కర్ణాటా ధీశ్వరుల గడగడలాడించిన కొండవీడు నే డెట్లున్నదో త

విదితమే. హూణశకాబ్దములు 1713 వరకు నామరూపములు లేక నగణ్యమై యుండిన వనప్రాంతము నేడు బెలిజియముకన్న నెక్కువ వైశాల్యముగల కళింగవిజయనగరం రాజ్యాస్థానమగు విజయ నగరపట్టణమై విద్యాలయముల కాకరమై యున్నది. మా తల్లిగారి బాల్యములో మా ప్రాంతమునకు ప్రధానమగు రేవుస్థలమై మిక్కుటమగు వర్తకవ్యాపారముతో తులలేని యైశ్వర్యముతో తేజోవంతములగు జనసంఘములతో నుజ్జ్వలముగానుండిన భీముని పట్టణము నేడా పరిసరమందలి పల్లెలలో నొకపల్లెయైపోయినది. పెద్ద పెద్ద గ్రామములలో తునిదాటిననుండియు నగరజీవితపు పోలిక లెన్నో కనబడుచున్నవి. విశాలమగు భూములుగల మొఖాసాదారు లును వారి యనుచరులగు కర్షకులును తమబిడ్డలకు నాగరికవిద్యలు నేర్పింప తమ గ్రామములువదలి పట్నములు చేరుకొనుచున్నారు. పల్లెటూళ్ళ నాటు ప్రజలు పట్నములలో వర్తకస్థానములలో పనులకు కుదురుకొని నాగరికము ననుకరించుచున్నారు. కర్షకయువకులు కులవృత్తులుమాని నౌఖరీ చదువుల భ్రమలలో బడి యట్టిచదువుల రహస్యముల నెరిగి సాధింపజాలక యట్టిప్రయత్నములో కాయ పటిమను గోల్పోయి తిరిగి గ్రామముల కేగి తమ సోదరకర్షకులవలె పొలములలో పనిచేయగల యోరిమి లేక యుభయభ్రష్టులై వగచు చున్నారు. ఇట్టి పరిస్థితులలో విద్యావిధానమును స్థానికభేదకల్పన ముపై నాధారపరచు ప్రయత్నము విఫలమును నిర్జీవమును గాక తప్పదు. కాగా గ్రంథాలయ వర్గీకరణమున నిట్టివిభాగము కల్పించి గ్రంథసంపాదనమున వివిధమార్గములు త్రొక్కుట వ్యయ ప్రయాసములకే కారణముకాగలదు అందువల్ల లాభ మత్యల్పము. ఇక గ్రంథాలయములకు రాజ్యాంగాధికారులామో దింపని గ్రంథములు సేకరింపగూడదని గౌణకనియమము బాధక మగుచున్నది. "బసవరాజీయ" మను గ్రంథ మే పితూరీదారు కథయో యని భ్రమపడికాబోలు ఒక మాండలిక విద్యాశాఖాధి

కారి యొక్క గ్రంథాలయమునకు నిషేధించెను. ఇట్టి నిషేధింపులు సాధారణముగా సూక్ష్మవిమర్శతో జరుగుచున్నట్లు కనబడదు. నిదర్శనములు నాయనుభవములోని విచట బేర్కొన్నచో విద్యాశాఖాధికారుల సర్వజ్ఞత్వమునకు భంగము కలుగును. ఇక నిట్టి నిషేధములు జ్ఞానపరులుగాని రివిన్యూ అధికారులు చేయుటకు దిగినచో గ్రంథాలయముల కెట్టిపాట్లు ఘటిల్లునో యూహింపుడు. కనుక గ్రంథసంపాదనమున గ్రంథాలయములకు గల స్వాతంత్ర్యమును సర్వవిధముల గాపాడుకొనదగియున్నది. దానికి ప్రతిబంధకమగు నెట్టి సహాయమును గ్రంథాలయాధికారు లంగీకరింపగూడదు. ఇంతకును వృత్తివిద్యలనుగూర్చిన గ్రంథములు కొన్ని, ఐతిహాసికములు కొన్ని, ప్రపంచవృత్తాంతబోధకములు కొన్ని, ఉత్తమ సాహిత్యగ్రంథములు కొన్నియు నుండినచో నెట్టి గ్రంథాలయమైనను మిక్కిలి యుపయోగకారి కాగలదు. బడులలో గ్రామమందలి పిల్లలకు లభించుజ్ఞానమును వృద్ధిపరచు గ్రంథములును, గ్రామజీవితమును తగురీతిని సంస్కరింపగల యంశముల నుపన్యసించుగ్రంథములును ముఖ్యముగా పాఠకలోకములోనికి ప్రచారమునకు దెచ్చుటకై గ్రంథాలయాధికారులు ప్రయత్నపడవలెను. అట్టి ప్రయత్నములో ధనసహాయమునకు లోటుండదు.

గ్రామస్థులకు తమతమ గ్రామములం దభిమానములును బాధ్యతలును దృఢపడుటకుగాను గ్రామచరిత్రలు దెలుపుపుస్తకములను గ్రామపరిపాలన విధానములనుగూర్చిన పుస్తకములను చేకూర్చుకొని గ్రంథాలయములం దిట్టి యంశములను గూర్చి ప్రసంగములును కావ్యశ్రవణమును చేయించవలెను. గ్రామములోని పురాతనకుటుంబముల చరిత్రలు సంపాదించి పూర్వులు గ్రామముకొరకు చేసిన దానధర్మములను విశదపరచవలెను.

గ్రామాభివృద్ధికి కావలసిన ప్రత్యేక కార్యములందు కావలసిన జ్ఞానము నిచ్చు గ్రంథములను గ్రంథాలయములోనుంచి వాటిని గూర్చి యవకాశము గలిగినప్పుడెల్ల ముచ్చటించుచుండవలెను. గ్రామస్థులకు తీరుబడిగల తరుణములు కనిపెట్టి పురాణపఠనములు గాని ప్రపంచచరిత్రనుగాని కాలమానస్థితియందలి మార్పులను గూర్చిన ప్రసంగములుగాని గ్రంథాలయములో జమచేసి వారికి వినిపించవలెను. గ్రామమునకు వివిధవిద్యలలో ప్రవీణులను రావించి గ్రంథాలయమందు వారి విద్యాప్రకాశనములకు ప్రోత్సాహ మొసగవలెను. ఇట్లు గ్రంథాలయములను జ్ఞానమార్గము నకు దించినయెడల వాటికి బహుజన సమాదరణమును గ్రామస్థులకు సత్సాంగత్యలాభమును సమకూరును. సత్సాంగత్యమువల్ల నిర్మోహత్వమును దానివలన చిత్తనిశ్చలతయు కలిగి జీవితము పవిత్రవంతమై నడవడికి మూఢవిశ్వాసముల దాస్యమునుండి విముక్తి కలుగును.

లోకకల్యాణకరమగు జాతీయతయందే జనసామాన్యము యొక్క మనస్సులను లగ్నముచేయుట మననిర్మాణకార్యక్రమము నకు బలవర్ధకముగా గలిగినయెడల మన జనసామాన్యము దృష్టిని విదేశీయ విలాసములనుండి మరల్చి స్వదేశీయ నాగరికతా బోధకములగు గ్రంథములందలి రహస్యములను వినుటయందు దృఢపరుపవలెను. మనబుద్ధులింతవరకు దేశీయవస్తు విముఖతయందేగాక దేశీయ సాహితీనిరసనమునందును ప్రాగల్భ్యము చూపిన్నవి. అదియే నాగరికతయని భ్రమసిపోయినవి. ఇప్పటి నూతన జాతీయవిజృంభణ మువలన దేశీయవస్తు సమాదరణమునకు దిగినను భాషాసాహిత్యములను దేశీయశాస్త్రకళా విచారణములను నింకను అవలంబింప సాహసింపకున్నవి. మన వస్త్రములు మోటు. మన సాంఘికాచారములు నింద్యములు. మన కట్టుబాటు లకారణజనితములు. మన

కళలును శాస్త్రములును ప్రళయమునకన్న వెనుకటివి. మనము మాట లాడు భాష గ్రామ్యము, జఘన్యము. మనమా చదువువలన పాడయిన నిరుద్యోగులము. ఇట్టి దృష్టిని మన యాంగ్లవిద్యాధిక యువజనము మార్చుకొనినగాని తాము తరింపలేరు. సరిగా గ్రామీణుల జీవితములను తేజోవంతముగా చేయనేరరు. మన యాంధ్ర కవిత్వము స్థితి చూడుడు. నాలుగు పద్యము లల్లగల యాతడు కవి. పూర్వ ఛందస్సులను కాదని, తా నేర్పరచుకొన్న ఛందోనియమము నైనను సరిగా పాటింపనేరక, భాషను భావములను విశదపరచుటకు గాక దాచిపెట్టి గ్రహణవీధికి రాకుండా చేసి యంతయును అనవసరమగు విచారసాగరములో ముంచువాడు నవకవి. ఆంగ్ల మందలి లిరిక్కు పద్ధతి ననుకరింపబోయి దానితో టాగూరుమహాకవి రచనలయందలి వ్యంగ్యతను జోడిచేయబోయి మన నవకవులు, శృంగార రచనలను గావించి భావకవిత్వమని క్రొత్తనామకరణము చేసినారు ఇది శృంగారమో శృంగారాభాసమో, శృంగార వికారమో, విప్రలబ్ధమో, శృంగార ప్రేరిత కరణమో లాక్షణికులే నిర్ణయింపగలరు. ఒకటిమాత్రము నిజము. పరాకున వీధిగుమ్మములో కార్యాంతరమున నిలుచుయువతీమణు లీరచనలకు గురియగుచున్నారు. వీథిలోపోవు పిచ్చివానిరాతికి గురియైనట్లు. అయినను ఈ రచనలలో మన తొల్లింటి ప్రాబంధిక శృంగారకవులు చూపిన తేజముగాని, వైవిధ్యముగాని, చిత్రకళగాని, రసభావభాషానాగరికత గాని, గేయలాలిత్యము గాని, కళారహస్యపాండితిగాని, తుదకు మానసతత్వ వివేచనగాని సరిగా కనబడవు. ఇట్టి కవితలకు పత్రికా సంపాదకుల యనుగ్రహము ప్రకాశన సాధనమగుచున్నది. "భారతి" పత్రిక సాముగరిడీ యగుచున్నది. దానంజేసి జనసామాన్యమందు తగని ప్రచారము కలుగుచున్నది. ఇందలి నూతనత్వము 1. పూర్వ భాషను క్రొత్తపదబంధములలో నిఱికించుట 2. ఉత్తమనాయక నాయికా హావభావ విన్యాసమును మననాటి మోటు జీవితములకు

పట్టించి వర్ణింపదలచుట. "సైకో అనాలిసిసు" మానసతత్త్వ విచారణ దృష్టిని చూచినయెడల ప్రపంచములో తీరనేరని యింద్రియ లౌల్యమును భావప్రపంచములో తీర్చుకొన బ్రయత్నించుట యని తేటపడును. మన నవకవు లుత్సాహపరులు, స్వతంత్రులు, యువకులు; నియమములను శృంఖలములుగా తలచువారు; నవనవలాడు కోమలహృదయులు; క్రొత్త ప్రపంచమును నిర్మింపవలెనని యువ్విళులూరువారు; ప్రతిభావంతులు, పేరు ప్రతిష్ఠలు సంపాదించి కాలసముద్రపు టిసుక తిన్నెలలో తమ పదచిహ్నములను విడువదలచినవారు; సంసారయాత్ర ప్రారంభింప నూగులాడుచున్నవారు. ఇట్టివారే తమకవితలలో చలాక్షీ విలాస విలోకనములే యారాధ్యదైవతములుగా భావించుకొని యింద్రియ లోలత్వమే కవిత్వమని భ్రమపడి పరమేశ్వరుడు తమ కొసంగిన కళా నైపుణ్యమును లోక కళ్యాణ కరములగు నుత్తమాశయములను వర్ణించుటలోను ఉత్తమార్థముల విశదపఱచుటలోను వినియోగపరుపకుండుట మిక్కిలి శోచనీయమైయున్నది. ఇది మన యాంధ్రావనిదురదృష్ట మనవలసియున్నది. ఇట్టి రచనలు ప్రస్తుతపు పరిస్థితులలో కేవల మసంగతములు. జాతీయ జీవిత పరిణామములు మిక్కిలిగా కలిగి యాంగ్లదేశమును ప్రధానతరగతి రాజ్యముగా చేయవలసిన రోజులలో స్పెన్సరు మిల్టనుకవులు, మన నవకవులవంటి విద్యాపరులగు యువకులెట్టి యాశయానుప్రాణితములగు కవితలను మెరయించిరో మన నవ కవులు విశేషించి చదివిన బాగుండును. కాకున్న తొల్లింటి యాంధ్ర కవితా శేఖరులు తమ కవితలలో మెరయించియుండినట్టి లోకజ్ఞత నైన పరిగణించి కార్యశూరతకు చదువరుల మనస్సుల డీకొల్పగల రచనలు చేసి తామే సంచార కార్యాలయములై గ్రంథాలయములను బలపరచి జన సామాన్యమునకుపకరించి తమ యార్థికాశయ సాఫల్యముగూడ గాంచగల్గుదురు.

గాక యని యుద్బోధించు చున్నాను. తొల్లింటి సమరములలో మన యాంధ్ర రాజులు భట్రాజులను నియమించి సేనలలో వాడ వాడలు తిరిగి యుద్ధరంగములో పోటరుల కుత్సాహము కలుగునట్లు వీరకవితలు పాడించుచుండెడివారు. మచ్చుకొకటి రెండుపద్యము లుదాహరింతును :—

సీ॥ ఘోటకఖురపుటక్షుణ్ణధరాజాత
పాంసువుపై నల్లభంబుగాగ,
భటసింహ విక్రమోద్భట సింహనాదముల్
స్వస్తివాదంబులచంద మొంద,
పదిదిక్కులొక్కటంబగిలి బీటలువార
భేరీనినాదముల్ బూరటిల్ల,
విజయసమారబ్ధవేళ కౌతుకమున
మొగమున గరువంపు మురువుదోప.

గీ॥ నౌర! పెండ్లికినేగినట్లనికినేగి
యక్షతంత్రంబు లివియేటి లక్ష్యమనుచు,
రేకమోవక గెల్చుట నీకెచెల్లు
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక॥

ఈ పద్యము శృంగారప్రబంధమని పేరెన్నిక గన్న "విజయ విలాసము"లోనిది గదా !

తారావిలాససమ్మోహితు డగు చంద్రుడు పని పడినప్పు డొక్కత్రుటిలో యెట్లు వీరవ్యాపారమునకు దిగినాడో చూడుడు.

సీ॥ బిబ్బోకవతి గబ్బిగుబ్బ గుప్పినసొంపు
గనునురంబున దివ్యకవచ మొప్ప
జవరాలి నినుకీలుజడ వేటుదద్దు ము
ద్దులవెన్నునను కవదొనలు మెఱయ
వెలదికి కలపంబు నలదఘుమ్మనుపాణి
తలమున గాండివధనువు దనర

కిసలయాధరమేని పసపుడాల్దుప్పటి
కాసె నొప్పగు మొలకెత్తి యమర

గీ॥ మోముదామర చిఱునవు మురువుమీఱ
తార గౌగిట జేర్చి యత్తలిరుబోణి
కులుకుకిలికించితంబుగ గెలువు మనుచు
బనుప రహిమీఱె వనజారి బయలు దేఱె॥

ఇందు శృంగారము వీరరసముగా నెంత సహజముగా మార్చి చూపబడినదో చూడుడు. మొన్నటి శాంతిసమరమునకు సముచిత మగు సన్నాహముతో శృంగార జీవితమునుండి యుద్ధరంగములకు దిగిన మన యాంధ్ర యౌవనుల నరనారీముఖుల నెందఱినో యిది జ్ఞాపకమునకు దెచ్చుచున్నదిగదా !

లోకజ్ఞతయిట్లు మెరయించి సమయోచిత రచనలను చేసి మన నవకవులు ధన్యులగుదురుగాక ! విస్మృతములగు శాస్త్రకళా బోధక గ్రంథములను వెదకు ప్రయత్నము కన్న నవకవుల కృతుల నాదరించి పోషించుట పరమ ధర్మమని వీరిలో కొందరు గ్రంథాలయ సభలో నుపన్యసించియుండుట స్వాయముగా నెరిగియుంటిని గావున నీ యవసరమున నిట్లు చెప్పవలసి వచ్చెను. ఇది కేవలము శాస్త్రదృష్టిని చెప్పినదిగాని వ్యక్తిగతమగు విమర్శ కాదు. ఈ నవ కవులలో నాకు పరమ మిత్రులును, ఆప్తులును, నాయెడల తనవాని తనము గలవారును పలువురు గలరు

విద్యావిధానముగా మార్చుట

మన యుద్యమ మిప్పుడు లోకలుబోర్డు విధానముగానో కాంగ్రెసు కమిటీ విధానముగానో యేర్పరింపబడియున్నది. ఇది పరిపాలనా విధానమున నడిపించుటలో నిలువలేదు. విజయవాడ రామమోహన గ్రంథాలయము నాంధ్ర కేంద్రగ్రంథాలయము గాను, ఆంధ్రగ్రంథాలయ సంఘమును గ్రంథాలయోద్యమ పరి పాలక సంఘముగాను మార్చు ప్రయత్నమును సాగలేదు. గ్రంథా

లయోద్యమ పరిపాలక సంఘముయొక్క పత్రిక "గ్రంథాలయ సర్వస్వము"ను ప్రకటించు ప్రయత్నమును నిలిచిపోయినది. మా మిత్రులు బారువ శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయ కార్యకర్తలు మ.రా.శ్రీ. తిత్తి బలరామయ్య నాయుడుగా రీయుద్యమమును పూటుచేయుటకు క్రొత్తమార్గము కనిపెట్టినారు. లోకలు బోర్డు ఆక్టులలోనున్న కొన్నిసెక్షనుల ననుసరించి యూనియను బోర్డులు గ్రంథాలయములుపెట్టి జనోపయోగకరముగా నడిపించుట దీపములు పెట్టుట, రోడ్లువేయుట, వీథులు దొడ్లు శుభ్రపరచుట, జలాశయములను కాపాడుట వంటి యవసర కర్తవ్యమే యని బోధించిరి. ఇట్లు గంజాం విశాఖపట్నం జిల్లాలలో కొన్ని కొన్ని యూనియనులలో గ్రంథాలయము లేర్పరుపబడినవి. ఇవి పనిచేయుచున్నవి గాని, యీ యుత్సాహమును చాలినంతగా కనబడదు. గ్రామస్థులలో తగవరులలో ప్రబలములగు నభిప్రాయభేదములు కలిగినప్పుడు వీటి కాదరణ తగ్గవచ్చును. అట్లు తగ్గుచున్నది కూడ. కనుక ఇంతకన్న ఫలప్రదములగు మార్గముల నన్వేషింప నీ మహాసభ ప్రయత్నింపదగి యున్నది. ఈ సందర్భములో నాకు రెండుమార్గములు కనబడుచున్నవి. ఒకటి వాల్తేరు ఆంధ్ర యూనివర్సిటీతో గ్రంథాలయముల నేదో విధముగ నతుకుట. ఈ విద్యాలయ కార్యస్థానము విజయవాడలో నున్నప్పు డుపాధ్యక్షులుగా నుండిన పండితవర్యులగు మ. రా. రా. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిట్టి ప్రణాళిక తయారుచేసి గ్రంథాలయమును నా యూనివర్సిటీ ఎక్స్టెన్షన్ విధానములోనికి దించ బ్రయత్నించిరి గాని ఎక్స్టెన్షన్ విధానము యూనివర్సిటీలు చేయవలసిన యసలుపనిలో భాగము కాదని మదరాసు గవర్నమెంటు వా రా యత్నమును నీళ్ళు కారించినారు. అభిప్రాయ మున్నంతవరకా ప్రాంతమువైపు గ్రంథాలయములు చూడ నవసరములేదు. ఇట్టిదే గవర్నమెంటువారి ఎడల్టు ఎడ్యుకేషను విధానమున్న

గనుక, నా ప్రయత్నముతోనైనను గ్రంథాలయములను హత్తింప ననువుకాదు. ఇక వేరొండు మార్గమేమంటిరా? చిత్తగింపుడు. మదరాసు యూనివర్సిటీ వంటివి సర్వతంత్ర స్వతంత్రత గల వివిధ పరిపాలనలో నున్న వివిధ విద్యాశాలల ద్వారా పని నడపుకొను చున్నవి. అట్లే మా ఆంధ్రభారతీతీర్థ పరిశోధక విశ్వవిద్యాలయము తోనో, మా అరానీ అంతర్జాతీయ విశ్వవిద్యాలయ విధానము తోనో మన లయిబ్రరీలకు సహచరత్వము కలిగింపవచ్చును. ఈ మహాసభలో ప్రజలకు జ్ఞానబోధ చేయగల పఠనపాఠ్య పరీక్షా విధానమును గ్రంథాలయోద్యమములో జ్ఞానపరముగా పాల్గొన దలచిన గ్రంథాలయము లనుసరింప వలసినదిగా నేర్పరచి, మూడు సంవత్సరములవరకు కమలులో పెట్ట నిశ్చయించినయెడల నే మా విధానము నంగీకరించి తగిన పరీక్షలును యోగ్యతాపత్ర విధాన మును నిర్ణయించి యీ యుద్యమ ప్రాప్యసాఫల్యమునకు తోడ్పడ యత్నింతుము. గ్రంథాలయముల స్వతంత్రకు లోటుండదు. గ్రంథాలయ పరిపాలనలో మాకు జోక్యముండదు. పఠనపాఠ్య బోధన విధానములలో మాకనువైన సాయము చేయగలము. పరీక్షా విధానము నడిపింపగలము. గ్రంథాలయములు చూచి, యందందుపన్యసింప గలము. గవర్నమెంటు సహాయము నింత వరకు కోరి యెరుగము. ఇకమీద కోరదలచుట లేదు. కనుక నుభయతారకముగా నుండుటకై యీ సభాంతరమునుండి జాతీయ కళాకౌశలములను విద్యా బిరుదములచే ప్రోత్సహించి యుజ్జీవింప జేయుట మూలముగా ప్రజాసేవ చేయ సమకట్టిన మా యుద్యమము నకు నాంధ్రజనావళి సమాదరణమును వేడుచున్నాను.

మరియొక మాట. మనమెంత వగచిననుసరే మన జన సామాన్యమునకు పూర్వాంధ్రసాహిత్యములపై యభిమానముపోదు. ఇది యసమంజసమగు పూర్వాచారపు పిచ్చియని మన మన

వచ్చును. కాని ఇందుకు కారణము లేకపోలేదు. పూర్వాంధ్ర సాహిత్యములు నేటి కేడెనిమిది వందల సంవత్సరములకు పైగా నిలిచియున్నవి. జనసామాన్యములో ప్రచారముగని యున్నవి. ఇవి సామాన్య జనులెరుగరనుట కేవల మవిమర్శకత్వము. తాళపత్ర గ్రంథములలో మూడువంతులివియే. గ్రంథమునుచూచి గ్రంథము వ్రాసినవా రనేకులు పండితులని యీ తాళపత్రములే రుజువు. కాని వారట్టి గ్రంథములను మననాడు మన యువకులు పరీక్షాపత్రములు వ్రాసినంతకన్న వేయిరెట్లు జాగ్రతగాను శుభ్రముగాను నాజూకుగాను శ్రద్ధగాను వ్రాసిరి. వీరిలో నన్నిజాతులవారును గలరు. వివిధ వయస్సులవారు గలరు. పలు గ్రామములవారు గలరు. గ్రంథమును చదువుటయు వ్రాయుటయు వినుటయు పుణ్యకార్యముగా గ్రహింపబడు చుండిన రోజులవి. కృతిచేయుట బిడ్డలనుకని వంశము నిలుపుట వంటి ఘనకార్యమే. అందుచేతనే విద్య నేర్చినవారు తమ విద్యాతపువునకు సత్ఫలముగా కవిత నెన్నినారు. సాహితీపరులు గ్రామీణులు కవితను పారంపర్యముగా నభ్యసించియుండిరి. రాజులును రాజామాత్యులును కవితా విద్యయందు ప్రావీణ్యము సంపాదించిరి. అన్యభాషాకాంక్ష దేశములలో నాధిపత్యము చేసినవారును ఆంధ్ర రాజు లాంధ్ర కవిత్వము చెప్పియే యుండిరి. ఆంధ్రకవుల నాదరించిరి. ఇట్లాంధ్రకవిత చిరస్థాయియై సార్వజనీకమైనది. గ్రంథపట్టికలు చూచినయెడల కవిత్వము చెప్పినవారిలో నన్ని తెగల బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, వెలమలు, రెడ్లు, కమ్మలు, కాపులు, కంసాలులు, కుమ్మరులు, సాలీలు, వీరశైవులు, సృష్టికరణములు, భట్రాజులు, పద్మనాయకులు, బోగమువారు, సాతానులు, యోగులు, మఠాధిపతులునుగూడ కలరని తేలును. దీనినిబట్టికవిత్వ మొకరిసొమ్ముగా దనియు, సాహితీపరులై

పరిశ్రమ చేసినయెడల నెవ్వరైనను నేర్వదగినదనియు తేలును. ఇంతేకాదు. నవరసవర్ణన లటుండగా, వేదాంతము మొదలు పాక శాస్త్రమువరకు ననేక శాస్త్రరహస్యము లీయాంధ్రసాహిత్యమున ప్రత్యేకముగా విశదపరుపబడినవి. జీవితమందుగలుగు సంశయము లెన్నో యిందుమూలమున నివారణ కాగలవు. 'సంశయాత్మావినశ్యతి' యన్నట్లు ఆత్మనాశనమును కల్పించు సంశయములనుగూడ నీ సాహిత్యము విడగొట్టగలదు. ఇందలి సమన్వయ మహత్వము, కళావిశేషములు, మానమర్యాదలు, ప్రతిభ, పాండిత్యము, స్వాభావికత, జీవిత రహస్య విమర్శనమును నంతమట్టుకు అంతతేటగా నవకవితలలో సాధారణముగా కనబడవు. అంతవరకు నీ పూర్వ సాహిత్యములు ప్రజల మనస్సులలో రాజ్యము చేయగలవు.

కనుక నీతియగు మార్గమేమనగా వీటిని నిరాకరించుట మాని మన నూతనాశయ సాఫల్యమునకు వీటినే ఆధారపరచుకొనుట. ఇట్టి ప్రయత్నమునకు స్టేటు విద్యాప్రణాళిక ననుసరించి యూనివర్సిటీలలో కన్న 'సార్వజనీన సర్వకళాశాల' లనదగు గ్రంథాలయములలోనే ఎక్కువ అవకాశము లుండును. కాని మన పూర్వాంధ్ర కవిత లిట్లు విమర్శింప నవకాశమిచ్చునా యనియే కొందరి సంకోచము. వీటియందాంధ్రత్వముగాని వైజ్ఞానిక బలము గాని లేదని కొందరి విమర్శ. ఇందులో నేవో యొకటి రెండుతప్ప మిగిలిన వన్నియు "ప్రొయ్యినిడవలయు"నని మరియొక పెద్ద విమర్శకుల వాక్యము. ఇది నవనాగరిక పాశ్చాత్య వ్యామోహజన్యమగు నున్మాదము. ఇట్టి నిరసన మన కవిత్వము నెడలజూపువారు కేవలము గ్రామములందు విద్యా ప్రచారము చేయుటకు పనికిరారు. రాత్రి పాఠశాల విధానమునే కొంచెము మార్చి విద్యాభ్యాసము చేయు వయసుమీరిన వారికి జ్ఞానబోధ చేయుమార్గము నడపుచున్న స్టేటు

అడల్టు ఎడ్యుకేషను పద్ధతి నిష్ప్రయోజనమైనట్లే, జానపదులు శతాబ్దముల తరబడిని తరతరములుగా ననుసరించుచు వచ్చిన విద్యాబోధనలును వారి మనస్సులనుండి పూర్ణముగా తుడిచివేసి నవీనతనందు ప్రతిష్ఠింపవలెనను గ్రామపునర్నిర్మాణ ప్రయత్నమును విఫలమై కొంత వృథాశ్రమ యయిన తరువాత మన కండ్లు తెరచును. కనుక కథలు, పాటలు, కాలక్షేపములు, పౌరాణికములు మొదలగు జాతీయ బోధన విధానములద్వారా క్రొత్తజ్ఞానమును పూర్వపు టచ్చులలోనే పోసి జానపదులకు సుకరమును సులభ గ్రాహ్యమును చేయుట యుక్తము.

మన యాంధ్రసాహిత్యము మనశిల్పమువంటిది. స్థూలదృష్టి కిది గతానుగతికముగను కృతకముగను కనుపడినను విమర్శన చేసినకొలది ఇందులోని సొగసులును చిత్రములును విశేషములును గోచరములగును. శిల్పమందువలెనే ఇందును సాంప్రదాయభేదములు, విధానవైవిధ్యము, కళాప్రత్యేకత, అలంకార బాహుళ్యమును గలవు. శిల్పములందువలె విమర్శించినచో నాంధ్రహృదయమును, నాంధ్రతయు కనబడకతప్పదు. మనసాహిత్యములోగల భావములయు, రసములయు, అవస్థాభేదములయు, నౌదార్యమును సమాదరణీయతయు, చమత్కృతియు, మనస్సు నరిషడ్వర్గముతోడి సమరములో కాపాడగల కవచములును ఎట్టివి బహుళముగాకలవో నిరూపించుటకై కొన్ని యుదాహరణము లిచ్చుచున్నాను. ఇట్టివి మనజానప[illegible] తేటపరచినచో జీవితమందు క్రొత్తయుత్సాహమును, కష్టములందు ధైర్యమును, ఉత్తమాశయసాధనమందు పట్టుదలయు కలుగును. మన యాంధ్రకవిత్వములో నెన్ని వివిధ శాస్త్రములు మోపియున్నవో చూచితిరా? వ్యాకరణము, జ్యోతిషము, సంగీతము, [illegible]స్త్రము, సాముద్రికము, గణితములు, కామశా

స్త్రము, ఛందస్సు, నిఘంటు, కావ్యశాస్త్రము, ఆయుర్వేదము, మంత్రశాస్త్రము, వేదాంతము, ఇతిహాసము, రాజనీతి, యోగము, ప్రశ్నశాస్త్రము ,స్వరశాస్త్రము, సస్యానందము, వృక్షాయుర్వేదము, ధనుర్వేదము, శిల్పము, మయవాస్తు, విశ్వకర్మప్రకాశిక, గృహవాస్తు, నాట్యశాస్త్రము, హయలక్షణము, గజశాస్త్రము, పశుశాస్త్రము, చిత్రకళ, ఇంద్రజాలము, రత్నశాస్త్రము, లోహశాస్త్రము, రసవాదము, పాకశాస్త్రము, ఇంకను నిట్టిశాస్త్రములును గూఢవిద్యలును పోగా మిగిలిన వెన్నేనిగలవు. ఆంధ్రశాసనములలో నింతకు మిక్కిలి శాస్త్రములు మనవారు సాధించినవి పేర్కొనబడినవి. అయినను ఈనాటి యున్నతవిద్యాబోధనమునకు మన భాష చాలదను నపవాదమును మన యాంగ్ల విద్యాధిక ప్రముఖులు లేవదీసినారు. ఇట్టి విద్యలను బోధింపగలవారును పూజాపురస్కారములు లేక ఆవాహన విసర్జనలు లేక అచ్చటచ్చట మాటుమణిగియున్నారు. ఈ మహాసభామూలమున మా యాంధ్రభారతీతీర్థ కార్యకర్తలకు కొంత చేయూత లభ్యమయినచో నచిరకాలములో నిట్టి పండితులను చేర్చి యిప్పటి విజ్ఞానముతో వీరి పాండిత్యములను సమన్వయపరిపించి వీనిమూలమున గ్రంథాలయముల ద్వారా గ్రామీణులకు తిరిగి దేశీయ విజ్ఞానమును నందజేయగలుగుదు మను నాశతో నాంధ్ర భారతతీర్థ ప్రధానిగా నట్టి యవకాశమాంధ్రావళి మాకు కలిగింతురుగాక యని వేడువాడను.

ఇంక మనవారు నిరసించు ప్రబంధములనుండియే యాంధ్రతాద్యోతకములగు కొన్ని విశేషముల నెత్తిచూపి యూనివర్సిటీవిద్యావిధానము సామాన్య జనుల జ్ఞానముపై నాధారపరచి సోపానములుగా కట్టినయెడల బాగుండుననియు నభినవదృష్టిని చూచినను మన పూర్వాంధ్రసాహిత్యములు, అందును కేవలము గతానుగతికములైనవియు కొంతవరకు నిలువగలవే యనియు నిరూపించెదను.

కవుల పాండిత్యములు

ఆంధ్ర కవిత సామాన్యపు పద్యము లల్లడము కాదు. అది మెరయించుటకు కవు లెట్టి యసాధారణపు ప్రభావము గడించిరో "ప్రకృష్ట బలరామ చరిత్ర"లోని కవిని గూర్చిన వర్ణనమున గలదు.

సీ॥ ఘటికాప్రబంధ హృద్గతసమస్యా గీత
ప్రాయ నావీన నాటకవిభేద
భరతకళాశాస్త్ర పాదార్థగుప్త్యను
లోమవిలోమాచలోష్ఠజిహ్వ

... ... ...

సదుపమాలంకృతి కవిత్వ సాంఖ్యయోగ
మంత్రతంత్ర తత్తంత్ర యంత్రపార
గంతృ విజ్ఞాననిధి విజగమునఁ గవులు
నీ సరెవ్వరు వేంకటదాససుకృతి.

కవితోత్సవములు

ఇట్టి కవుల నాదరించిన రాజులును మంత్రులును స్వయముగా పండిత కవు లగుటయేగాక కృతులందుటకు ప్రత్యేకోత్సవముల గల్పించియుండిరి. దీనికి ఋజువు పారిజాతాపహరణములో

క॥ "ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికరగుంఫిత 'కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూప్రసాదనరసికా"

అని కృష్ణదేవరాయలవారిని స్తుతించుచో గలదు. రాయలవారి యనంతరమును నిట్టి యాచారము పాటింపబడినట్లు "తారకబ్రహ్మ రాజీయము"లో గలదు.

"అమ్మహామహీశ్వరుం డొక్కనాడు ... నిజస్వామియగు నచ్యుతదేవరాయలు ప్రతి సంవత్సరంబు శ్రీ వేంకటేశ్వరునకు సత్కావ్యప్రబంధ పుష్పాంజలి సమర్పించుచు కీర్తిసుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాడు ..." అని వర్ణన.

లేఖినివల్ల యింటిపేరు మారుట

"శేషధర్మములు" రచించిన తామరపల్లి తిమ్మయకవి వంశ వర్ణనలో నాతని కుటుంబమువారు "పైడిఘంటము" వారైన విధానమును వర్ణించినాడు. ఎట్లనగా :—

ప్రౌఢరాయల మెప్పించి రాయసమున
పైడిగంటంబు గొని వ్రాసి భద్రలీల
పైడిగంటంబువా రని పద్దు దెచ్చి
యలరె మీ తాత ముత్తాత యబ్బమంత్రి॥

ప్రతాపమువల్ల యింటిపేరు మారుట

ఇట్లే ప్రతాపమువల్లకూడా నింటి పేరులు మారినవి.

ఉ॥ శ్రీపతి రాయమంత్రి నరసింహుని గోపన శౌర్యవంతుడై ।
యేపునమీఱి యా గజపతీంద్రుని సాంద్రబలంబు సద్భుజా ।
టోపమునన్ హరించి యుదుటుం గనుటన్ భువి నాటనుండి సం ।
ప్రాపిత మయ్యె నా పిడుగు వారను పేరుల సంతువారికిన్ ।

మంత్రులు నేర్చిన విద్యలు

తొల్లింటి యాంధ్ర ప్రముఖులగు మంత్రు లెట్టి పండితులో చూడుడు.

"చంద్రికా పరిణయము"లో

సీ॥ అనఁటిపం డొలిచి యిచ్చినరీతి జనులకు
వేడ్కఁగాఁ గృతులు గావించు విద్య
భాష్య చింతామణీ ప్రముఖశాస్త్రములఁ ద
ర్కించి గీష్పతి నైన గెలుచు విద్య
దర్శితప్రతిరాగ దానసహస్రుఁడై
యింపుగా వీణ వాయించు విద్య
శిలలెల్ల బండు వెన్నెల సోకిన సుధాంశు
శిలలుగా గానముచేయు విద్య

యెఱుఁగు; ఎఱుఁగనివిద్య లే దెల్ల విద్య
లెఱుఁగఁగాఁ గేమి మఱియొక్క హెచ్చు విద్య
యెఱుఁగు నేమంటివా యర్థి తృప్తికరణ
విద్య మాకృష్ణవిభుఁడు భావింప నరుఁడె ?

ఆంధ్రుల ధైర్యసాహసములు

ఆంధ్రుల ధైర్యసాహసము లెన్ని వంశవర్ణనలలోనో గలవు. ఇవియన్ని పౌరుషజాతులవారిని గూర్చియు గలవు. ధైర్య, బల స్థైర్య, బలవిశేషములు మూడును కలిసి యొక్కటనొక్క యవసరమున పరోపకారబుద్ధితో ప్రదర్శింపబడిన రంగమంతయు నొక్క పద్యములో స్ఫురింపబడినది. చూడుడు——

చ॥ విడువక పెమ్మసాని పెదవీర నృపాలుని యందలంబుపై
నడుచు నుదారఘోర మదనాగము చేపిడియమ్ము కొద్ది మె
క్కుడువడి గ్రుద్దిపోదఱెను కొంచక లింగయమంత్రి సింహమిం
పడరెడు ధీడ్కఁ రాయ లవురాయన నామిడిగేసి చెంగటన్.

ఇది "చారుచంద్రోదయము"లో యన్నమచింతలవారి వంశ వర్ణనలో గలదు.

గురువులు ప్రియతమ శిష్యులకు విద్యాబోధన చేసిన విధానము

పూర్వము గురువులు తమకు ప్రియతములగు శిష్యులకు చేసిన విద్యాబోధన విధానములు మనము విమర్శించి చూచినయెడల ప్రస్తుతము జర్మనీలో జరుగు సెమినారు విధానమువంటివని పోల్చ వచ్చును. దీని కుదాహరణము పచ్చిశృంగార వర్ణనములతో నిండిన దను "శశాంకవిజయము"లో స్పష్టతమముగా కలదు

మ॥ పరమప్రీతి నహర్నిశంబు త్రిదశోపాధ్యాయ వర్యుండు సు
స్థిరతన్ శాస్త్రము సెప్పి చింతనలు ప్రీతిం దానె చేయించి ప
ల్మరు నయ్యర్థ ముపన్యసింపుమని లీలందాన శంకించి యు
త్తరము న్దెల్పఁగ నేర్పె సభ్యతనువాదప్రౌఢిమం దిద్దుచున్॥

కర్షకత్వ వర్ణన

పూలతోట పెంచుపని యెంత స్వభావోక్తిగా వర్ణింపబడి నదో "వైజయంతీవిలాసము"లో చూడనగును.

వ॥ ఇట్లు సైకొని

గీ॥ అది మరియు మెత్తగా దున్ని యచ్చు గట్టి
విత్తనాల్చల్లి యలరు దీవియలయంట్లు
నాటి, కారీపరజము సాంద్రముగ జల్లి
విసువ కేతాన నెత్తు కావేరి నీరు.

విశ్వకర్మ కులజులు దండనాథు లగుట

మననాడు మిలిటరీ జాతులనియు నాన్ మిలిటరీ జాతు లనియు గవర్నమెంటు ఉద్యోగస్థులగు తెల్లవారు క్రొత్త జాతి భేదమును మనలో తెచ్చిపెట్టుచున్నారు. ఇది సత్యముకానందుకు అక్షరలలితాచార్యులును శిల్పకారవృత్తి నిరతులును అగు విశ్వ కర్మ కులజులలోకూడ పూర్వము సైన్యాధిపతు లుండినట్లు "నాగర ఖండము"లోని దిగువ పద్యములు సూచించుచున్నవి.

గీ॥ అతఁడు పూర్వాది సర్వదిగంతరాళ
వినుత ఘన మేఘ వాహన కనక కుండ
లాభరణ ముఖ్యబిరుదాంక లాభవైభ
వుండు ధవళేశపురపు మార్కొండ విభుఁడు.

క॥ అతఁడు ప్రసిద్ధి వహించెన్
క్షితి నరగజపతుల గెలిచి చెలగి జయశ్రీ
సతి చేకొనిన మహమ్మద్
కుతుపశహా చందునకును కుడిభుజ మనఁగన్.

కమ్మ దొరల మండలాధిపత్యము

ఇట్లే కమ్మదొరలును గజపతులవద్ద మండలాధిపత్యము వహించి శౌర్యపరాక్రమ ప్రకటనము చేసినట్లు "జానకీరాఘవము" లో అడపావారి వంశవర్ణనలో గలదు.

పారసీ పాండిత్యము

ఇక, మనవా రాంధ్రగీర్వాణములలోనే గాక రాజభాష యగు పారసీలోను అసమాన ప్రావీణ్యము చూపి మెప్పు పొందినం దుకు దాఖలా "గోపాల లీలా సుధాలహరి" యను ప్రబంధములో ప్రయాగ వంశమువారి వర్ణనలో గలదు.

"ఆరోహణావరోహణముల నొకసారి విని పారసీ వచించిన ఘనుండు, మెచ్చి ఢిల్లీశ్వరుం డిచ్చిన పచ్చల పల్లకీ గొనిన కృపా సముద్రుఁ, డగు ప్రయాగ వేంకటాద్రి."

ఆధ్యాత్మికబలము

మనవారైహికవిద్యలలోవలె యాధ్యాత్మిక విద్యలలోగూడ నుత్తమ ప్రావీణ్యతగని జనోపయోగకరముగా వినియోగించిరను

టకు నిదర్శనము "ఆధ్యాత్మరామాయణములో" కంచర్ల వారి వంశవర్ణనలో గలదు. ఎట్లనగా-

క॥ కపిలేశ్వరపురి లింగము
 విపరీతిగ నుదుటికన్ను విప్పినఁజని తా
 నుపశాంతిగ నొనరించెను
 జపమహిమన్ శరభరాజు సభ్యులుమెచ్చన్।

ఆంధ్రజాతీయతాబోధకములగు నిట్టి విషయము లెన్నియేని మన ప్రబంధములనుండియే చూపవచ్చును. ఇది యాంధ్రత్వ ప్రకాశముకాదా? ఈ గ్రంథములన్నియు మన విద్యాధిక విమర్శకు లేర్పరచిన "ప్రొయ్యినిడవలసిన" పట్టికలోనివేగదా. వీటిని ప్రొయ్యినిడినచో నెన్ని మంచి యంశములు మనపూర్వుల స్మరణ చేత మనకు త్తేజము కల్పించునవి గోల్పోవవలసివచ్చును. కాన సాహితీపరులు మన జాతీయ సాహిత్యరహస్యములు బయలుదీసి దేశీయవిద్యకు నూతనవికాసము కల్పింతురుగాక!

ఒక చిత్రము చూచితిరా! "హంసవింశతి" కావ్యము శృంగారమయముగదా! అది దుర్వ్యాపారమునుండి యొక మగ నాలిని తప్పింపజేయబడిన సయుక్తికయత్నమును తెలియజేయును. ఉద్దేశము మంచిదే. అది పలువురు దుర్వ్యాపారులగు కులాంగనల చరిత్రముతోను వర్ణనలతోను నిండియున్నదనుటయు నిజమే. ఇందలి వర్ణనాంశములు కొన్ని వ్రీడాజుగుప్సాకరము లనుటయు నిజమే. అయినను దుర్వ్యాపారికి తాను సాధింపజాలని సాపత్యము లను చూపి యా వ్యాపారమునుండి మరలించు సాధనముగా నీ కథలుపయోగపడినవి గాని స్థూలదృష్టిని చూచినయెడల నీ గ్రంథ మున నిది ప్రధానాంశము కాదనియు, ప్రధానాంశము జనసా మాన్య విశేషవర్ణనలును, విద్యాకౌశల్యాది విశేషవర్ణనలును అని

బోధపడగలదు. చిత్రమేమనగా పురాణములందువలె ప్రసంగరీత్యా పలువిధములగు విద్యారహస్యము లిందుపన్యసింప బడినవి. వాటి నన్నిటిని యథావిధిగా తత్తత్ శాస్త్రదృష్టిని విశదపరుపవలెనన్న రెండు సంవత్సరములు పాఠ్యపరిమితి యున్నను చాలదు. ఇందు ప్రథమాశ్వాసములో మాణిభద్రుని వీరవిద్యాప్రావీణ్య వర్ణనములో 32 ఆయుధములు, 12 దండలు, 14 విసరులు, 32 విన్నాణములు, 12 గతులు, 12 గాయమానభేదములు, మరికొన్ని సరుకుల భేద ములు, 16 ఉపవీతములు, 32 ప్రచారములును పరాక్రమ కల్పన సమర్థములుగా వేర్వేరు వరుసను బేర్కొనబడినవి. వీనిని మన దేశీయ వ్యాయామ ప్రోత్సాహకులు తిరిగి ప్రచారములోనికి తేవలసి యున్నది.

2. ఆ యాశ్వాసములోనే వైద్యవర్ణనలో ఘృతములు, చూర్ణములు, లేహ్యములు, రసాయనములు, తైలములు, అంజన ములు, రసౌషధములు, భస్మములు, ద్రావకములు, కషాయములు, కైకర్ణికలును వివరింపబడినవి. ఆయుర్వేద వైద్యులు వీటిలో నేవి ప్రచారమందున్నవో ఏవి లేవో విమర్శింపదగినది.

3. ద్వితీయాశ్వాసములో పట తంత్రములోని లోమెరుగులు తబిసీలుగా శాస్త్రపారిభాషికముగా వర్ణింపబడినవి. మన తఖిలీ యుపాసకులు వీటి విశేషములను వివరింతురుగాక.

4. ఆయాశ్వాసములోనే గొల్లలవర్ణనలో గొర్రెల మేకల రకములు, గొల్లసుద్దులు నుదాహరింపబడినవి. ఉత్సవసమయమం దలి పురవర్ణనలో దీపికావిశేషములు, బాణాసంచారకములు, వాద్యవిశేషములు, గృహాలంకారములుగా స్త్రీలు రచించు పలు రకముల ముగ్గులు, క్రీడావిశేషములును చెప్పబడినవి. కోడిపందె ములు వర్ణించుటలో కోళ్ళజాతులు వివరింపబడినవి.

5. చతుర్థాశ్వాసములో జ్యోతిషశాస్త్ర విశేషములును, మంత్రశాస్త్ర మర్మములును వశ్యవిద్యలును చెప్పబడినవి.

ఇవీ అవీ అననేల? ఈ గ్రంథము ఏ యంశమును వర్ణింపవలసినచోట నందలి రహస్యములు తత్తదుచిత పరిభాషతో వర్ణించును. దీని నొక్కదానినే యీనాటి యాంధ్రుల విజ్ఞానసూచిక యనవచ్చును. ఇట్టివి, ఇంతకుమించినవి యాంధ్రసాహిత్యమం దెన్నో విచిత్రవైజ్ఞానిక గ్రంథములు గలవు. ఇట్టి వర్ణనలకు సాధ్యపడిన భాషలో శాస్త్రవస్తువుల నుపన్యసించుటకు తగిన పరిభాష లేనే లేదనువారి యజ్ఞానమున కచ్చెరువందవలయునో చింతింపవలయునో తెలియరాకున్నది. ఇట్టి కాలమహిమకు వగవక మన కర్తవ్య మెరిగి మన దేశీయభాషాసాహిత్యముల మూలమున జానపదులకు జ్ఞానబోధ మొనరించు ప్రయత్నములో జ్ఞానవిషయక స్వదేశీతమము దీక్షతో నవలంబించి మన విద్యావిషయక స్వారాజ్యమును సాధించి జాతీయతా విజృంభణమునకు చిరస్థాయిత్వము కల్పించి మన జీవితములను పవిత్రవంతములుగా చేసికొనగలుగుదుము గాక !

— ఆంధ్రపత్రిక నుండి.

# ఇరువదియవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, విశాఖపట్టణము

[ 1935 నవంబరు 25 ]

## శ్రీ శరణురామస్వామి చౌదరి

మహనీయుల ఉపదేశములు గ్రంథరూపమున నుండుటచే వానిని సేకరించి గ్రంథాలయములను స్థాపించుచున్నాము. ఈ గ్రంథాలయోద్యమము ఇప్పటిదికాదు. భారతవర్షమున బౌద్ధ యుగముననే వెలసి ప్రపంచమునకాదర్శప్రాయమైనది. 2000సం॥ లకు పూర్వమే బౌద్ధులు విశ్వవిద్యాలయములను, గ్రంథాలయములను స్థాపించిరి. బౌద్ధయుగము నుండియే గ్రంథసేకరణ ప్రారంభమైన దని చెప్పవచ్చును ఆ దినములలో గ్రంథములను తాటాకుల మీద భూర్జపత్రముల మీద వ్రాసి జాగ్రత్తగ జాతికి అప్పగించిన పండితులకు, కవిశేఖరులకు వందన సహస్రములు. బౌద్ధయుగమున పాటలీపుత్రము, నలంద, ఒదంతపురి, అమరావతి, విక్రమశిల మొదలగు నగరములలో గొప్ప గ్రంథాలయములున్నవి. ప్రతి గ్రంథాలయమున లక్షలకొలది గ్రంథరాజములున్నవి. ఆ గ్రంథ ములు ఆ యా విశ్వవిద్యాలయములలో నున్న విద్యార్థులేగాక దేశముననున్న ప్రజలుకూడ తీసికొనిపోయి చదువుచుండెడివారు. నేటి విశ్వవిద్యాలయాధికారులు, చక్రవర్తులు వారి మార్గము ననుసరించి ప్రజలలోని జ్ఞానవ్యాప్తిని చేయుదురుగాత. హిందూ చక్రవర్తుల పరిపాలన దినములలో ప్రతి దేవాలయమున గ్రంథా లయ ముంచి ప్రజలలో విజ్ఞానమును వ్యాపింపజేసిరి.

మహమ్మదీయుల దండయాత్రలలో పెక్కు గ్రంథాలయ ములు దహనము చేయబడినవి. వారి దండయాత్రల కాగలేక

పెక్కురు పండితులు, భాషాభిమానులు లక్షలకొలది గ్రంథములు తీసికొని టిబెట్టు, నేపాలు, కాశ్మీరదేశములకు పారిపోయి గ్రంథ రాజముల జాగ్రతపరచిరి. పాశ్చాత్యుల దండయాత్రలలో కూడ గ్రంథాలయములు నశించినవి. వేలకొలది గ్రంథములు పాశ్చాత్య దేశములకు గొనిపోయిరి. సంస్కృత గ్రంథములు పెక్కు జర్మనీ దేశమునందు మనము చూడజాలనివి నేటికిని గలవు. మనదేశమున కొరవడిన పలు శాస్త్రిగ్రంథములు జర్మనీదేశమునందున్నవి. నేపాల్ చక్రవర్తియగు శంషేర్‌జంగ్ మహారాజు 15,000 తాళ పత్ర గ్రంథములను బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయమున కొసంగి భారతవర్షమునకు తీర్చరాని నష్టమును కలుగజేసెను. ఆంధ్రదేశ మున చాళుక్యుల పరిపాలన దినములలో రాయనారాయణ ప్రభువు పెక్కు గ్రంథాలయముల స్థాపించెను. భాండాగారికులకు మాన్యము లిచ్చి పోషించెను.

**పాశ్చాత్య దేశములలో గ్రంథాలయోద్యమము**

ఆధునిక యుగములో గ్రంథాలయోద్యమము మొదట అమెరికా దేశములో ప్రారంభమైనది. బోస్టన్ పబ్లిక్ గ్రంథాలయ మునకు శంకుస్థాపన చేయు సుముహూర్తమున పండితోత్తముడగు "ఆలివల్ వెన్డెల్ హోమ్సు" ఏజాతిగాని, దేశముగాని, విజ్ఞానము లేక స్వాతంత్ర్యము పొందజాలదని నొక్కి వక్కాణించెను. విజ్ఞాన ధురీణులు పెక్కురు గ్రంథాలయావశ్యకతను గూర్చి పత్రికల ద్వారా, ఉపన్యాసములద్వారా బోధించిరి. అమెరికా దేశమున నేడు ప్రతినగరమున, పట్టణమున, పల్లెయందున గ్రంథాలయములు గలవు ఆదేశ గ్రంథాలయోద్యమమునకు కుబేరుడును, భాషాభి మానియు నగు ఆండ్రూకార్నీజీ 10 కోట్ల రూప్యములు వెచ్చించి ప్రపంచమున కాదర్శప్రాయుడాయెను. 1925 సంవత్సరమునుండియు

మోటారులలో సంచార గ్రంథాలయములను ఆ దేశమున సాగించు చుండిరి.

రషియా

జారుచక్రవర్తి పరిపాలన దినములలో 100కి 20 మంది మాత్రము విద్యనేర్చినవారుండిరి. ప్రపంచమున కాదర్శప్రాయమైన సోవియట్ ప్రభుత్వము స్థాపించిన తరువాత ప్రభుత్వమువారు వయోజన విద్యాలయములు స్థాపించి ప్రజలందరికి విద్యాసౌకర్యముల గావించిరి. 80 వత్సరములు వచ్చి పండ్లూడినవారుకూడ విద్య నభ్యసించిరి. నేడా దేశమున 100కి 90 మంది విద్యనేర్చిరి. సోవియట్ ప్రభుత్వమువారు గ్రంథాలయముల విరివిగ స్థాపించిరి. లక్షలకొలది ధనము ఖర్చుపెట్టుచుండిరి. జారుచక్రవర్తి రాజభవనము నొకదానిని గ్రంథాలయముగ మార్చిరి. ఆ గ్రంథాలయము ఆ దేశమునకు ఒక గొప్ప విజ్ఞాన మందిరమై వెలయుచున్నది. పలు చిత్తరువులందమర్చిరి. ఆ దేశచరిత్ర ఆ గ్రంథాలయమును జూచిన నేర్చుకొనవచ్చును. రైళ్ళలో సంచార గ్రంథాలయములు స్థాపించి ప్రయాణీకులకు సౌకర్యమును కలుగజేసిరి. గ్రంథాలయములేని గ్రామమును గాంచజాలము.

ఇంగ్లండు

లండన్ నగరమున బ్రిటిష్ మ్యూజియమ్‌లోనున్న గ్రంథాలయము ప్రపంచమునకెల్ల పెద్దది. ఇందు 50 లక్షలు గ్రంథములున్నవి. మన దేశ చరిత్రకు సంబంధించిన పూర్తి వివరములు కావలయునన్న మన మీ గ్రంథాలయమునకు పోవలసినదే. పూర్వము మనము ఈ గ్రంథాలయము నుపయోగించుకొనుటకు స్వేచ్ఛ యుండెడిది, ఇపుడు చాల కట్టుదిట్టములు చేసిరి. ఆ దేశమున ప్రతి గ్రామ పాఠశాలయందును ప్రభుత్వమువారు గ్రంథాలయ ముంచి పజలలో విద్యావ్యాప్తిని కలుగజేయుచున్నారు. 400

సంచార గ్రంథాలయము లున్నవి. లండన్ నగర జనసంఖ్య 45 లక్షలు. ఆ నగర కార్పొరేషన్‌వారు ప్రతి సంవత్సరము విద్యకై 17 కోట్ల రూపాయలను ఖర్చుపెట్టుచున్నారు. మొత్తము దేశము మీద ఎంత ఖర్చగుచున్నదో యూహింపుడు.

దెన్మార్కు

ఈ దేశమున ప్రతి నగరమున గ్రంథాలయములు గలవు. జిల్లా కేంద్ర స్థానములలో 27 గొప్పగొప్ప గ్రంథాలయములున్నవి. ప్రతి గ్రామమున శాఖా గ్రంథాలయము లున్నవి. సంచార గ్రంథాలయము లున్నవి. వీని నన్నిటిని ప్రభుత్వమువారే నడుపుచున్నారు.

స్వీడన్

ఇచ్చటకూడ ప్రభుత్వమువారే గ్రంథాలయోద్యమమును నడుపుచున్నారు. 24 జిల్లాలలో కేంద్ర గ్రంథాలయము లున్నవి. ప్రతి గ్రామమున శాఖా గ్రంథాలయము లున్నవి.

జకోస్లోవేకియా

ప్రభుత్వమువారు ఈ దేశమున 1919 సంవత్సరములో ప్రతి గ్రామమున గ్రంథాలయమును నెలకొల్పిరి. గ్రంథాలయములేని గ్రామ ముండగూడదని శాసించిరి. పట్టణములలో కేంద్ర గ్రంథాలయముల నెలకొల్పిరి.

స్లోవేకియా

ఈ దేశము యుగొసావియా పరిసరములలో నున్నది. దీని జనసంఖ్య 15 లక్షలు. ప్రధాన నగరము "లుబ్లిజనా". వీరు నిన్న మొన్నటి వరకును బానిసజాతిగ నుండిరి. ఇపుడు ప్రతి పట్టణమున పల్లెయందు గ్రంథాలయములు స్థాపించుకొనిరి. ప్రధాననగరమున నున్న గ్రంథాలయమునకు 40 వేలమంది సభ్యులు గలరు. మిగిలిన పట్టణ గ్రంథాలయములకు 30 వేలు, 20 వేలమంది సభ్యులుగలరు. 10–14 సంవత్సరముల బాలబాలికలకు ప్రత్యేక గ్రంథాలయము

లున్నవి. ఈ గ్రంథాలయములకు 23వేల బాలబాలికలు సభ్యులుగ నున్నారు. ఇంత చిన్న దేశమున గ్రంథాలయోద్యమము ఆదర్శ ప్రాయముగ నడుపబడుట ఆనందదాయకము.

భారతదేశము

ప్రపంచమున ఇతర దేశములలో విద్య ఏ విధముగ అభివృద్ధిగ నున్నది గాంచిన, మన నిస్సహాయత తేటతెల్ల మగుచున్నది.

| | | చదువు వచ్చినవారు | |
|---|---|---|---|
| | | పురుషులు | స్త్రీలు |
| జర్మనీ | నూటికి | 100 | 100 |
| డెన్మార్కు | ,, | 100 | 100 |
| జపాను | ,, | 98 | 96 |
| అమెరికా | ,, | 96 | 94 |
| ఇంగ్లండు | ,, | 94 | 91 |
| ఇండియా | ,, | 7 | 1.25 |

విద్యాసౌకర్యములు

| | జనాభా | ప్రాథమిక పాఠశాలలు |
|---|---|---|
| అమెరికా | 10 కోట్లు | 3 లక్షల 17 వేలు |
| ఇంగ్లండు | 5 ,, | 86 వేలు |
| జపాను | 6½ ,, | 1 లక్ష 76 ,, |
| ఇండియా | 35 ,, | 2 లక్షల 6 ,, |

ఒకొక్కమనిషికి ప్రాథమిక విద్యకగు ఖర్చు

| | | |
|---|---|---|
| డెన్మార్కు | రు | 17–5–0 |
| అమెరికా | | 16–4–0 |
| ఇంగ్లండు | | 9–0–0 |
| ఫిలిప్పైన్ దీవులు | | 8–0–0 |
| జపాను | | 7-0–0 |
| ఇండియా | | 0–2–0 |

ఈ పై అంకెలను గాంచిన మన ప్రభుత్వమువారు ఇతర నాగరిక దేశములకంటె ఎంత స్వల్పమొత్తమును మనవిద్యకై ఖర్చు పెట్టుచున్నారో గమనింపుడు. ఇతర దేశములసంగతి విడచి నను వారి స్వదేశమగు ఇంగ్లండునందు మనుజునికి ప్రాథమికవిద్యకు సం॥నకు 9–0–0 లు వెచ్చించుచు మనదేశమున 0–2–0 లు మాత్రము వెచ్చించుట విచారకరము. సైన్యమునకన్న కోట్ల కొలది సంతసముగఖర్చుచేయుదురుగాని విద్యకడిగిన బొక్కసములో పైకము లేదందురు. ఎప్పుడు బడ్జట్‌లో లోటువచ్చినను ముందు విద్యాశాఖ విరాళమునే తగ్గింతురు. ఇట్టి సవతితల్లి ప్రేమచేతనే భారతదేశము విద్యాశూన్యమై నాగరిక ప్రపంచమునవగుబాట్లపా లగుచున్నది. భారత ప్రభుత్వమునకు సం॥నకు 200 కోట్ల రూపా యల పన్నులిచ్చుకొనుచున్నను విద్యావసతులు లేక క్రుమ్మవలసి వచ్చుచున్నది. పన్నుల భారముచే ప్రజలు క్రుంగిపోవుచున్నను దేశమున కవసరమగు విద్యాభివృద్ధిని కలుగజేసికొనుటకు ప్రజలు వెనుకంజవేయక శక్తికొలది పాటుపడుచునే యున్నారు. విద్యాభి లాషులై పెక్కు భాషాసేవకమండలులను విద్యాలయములను గ్రంథాలయములను స్వయముగ స్థాపించుకొనుచున్నారు. భారత

దేశ గ్రంథాలయోద్యమము ఏవిధముగ నడుపబడుచున్నది పరిశీలింతము.

బరోడా

భారతదేశ గ్రంథాలయోద్యమ మనిన మొట్టమొదట స్ఫురణకు వచ్చునది బరోడా రాష్ట్రము. ఆ రాష్ట్రము ప్రభువగు గైక్వార్ ప్రభువు భారత వర్షమున అన్ని రాష్ట్రములకు ఆదర్శప్రాయముగ గ్రంథాలయోద్యమమును విజయవంతముగ ఆశక్తవంతముగ నడుపుచున్నారు. ఏ పట్టణమునగాని గ్రామమునగాని గ్రంథాలయము స్థాపించిన 1 పాలు ధనము ప్రజలు 2 పాళ్ళు ప్రభుత్వమువారు స్థానిక సంస్థలవారు భరించెదరు. అందుచే ఉత్సాహముగ గ్రంథాలయోద్యమము దేశమందంతటనువ్యాపించి ప్రజల విద్యావంతులుగ జేసినది. ఈ రాష్ట్ర జనసంఖ్య 25 లక్షలు మాత్రము. ఇచట 1907 సం॥ననే నిర్బంధవిద్య అమలునందుంచబడెను కీ॥ శే॥ గోపాలకృష్ణ గోఖ్లే మొదలగు దేశభక్తులు మన భారత ప్రభుత్వమువారిని నిర్బంధవిద్య ప్రవేశపెట్టుమని, ఇంకను మీరు నిర్బంధముగ చదువుకొనుటకు అర్హులుగారని జవాబుచెప్పి నిన్నమొన్న ఒక చట్టమును గావించిరి. ఆ చట్టము ప్రకారము నిర్బంధవిద్య ప్రారంభింపవలయునన్న మనము నూతనముగ పన్నులు వేసికొనవలయును. అందుచే ఆ చట్టము వ్యర్థమైనది. బరోడా కేంద్ర గ్రంథాలయమున 7 లక్షలు గ్రంథములున్నవి.

బరోడా రాష్ట్రమున జిల్లా పట్టణ గ్రంథాలయములు కలసి 45 ఉన్నవి. 800 గ్రామ గ్రంథాలయములున్నవి. 200 పఠనమందిరము లున్నవి. రాష్ట్రములోని ప్రజలు నూటికి 60 మంది గ్రంథాలయములను, పఠనమందిరములను ఉపయోగించుకొనుచున్నారు. ప్రతిపాఠశాలయందు ప్రభుత్వమువారు మంచి గ్రంథాలయముంచి

ప్రజలకు పుస్తకము లందించుచున్నారు. సంచార గ్రంథాలయము లను కూడ స్థాపించిరి. భారతవర్షమున అన్ని రాష్ట్రములకంటె ఈ బరోడా సంస్థానమే విద్యయందు గ్రంథాలయోద్యమమునందు ముందంజవైచి తన కీర్తిచంద్రికల వెదజల్లినది. నాగరిక ప్రభుత్వ మని చెప్పుకొను బ్రిటిషు ఇండియా ప్రభుత్వము దీని నంగీక రించునా?

ఆంధ్ర దేశము

మన ఆంధ్రభూమియందు బౌద్ధుల కాలమున, చాళుక్యుల కాలమున గ్రంథాలయోద్యమము ప్రభుత్వాదరణచే నడుపబడినది. మధ్యయుగమున ఈ యుద్యమమే మాసిపోయినదని చెప్పవచ్చును. నవ్యభావోదయ కాలమున ఆంధ్రదేశమునకూడ నూతనోద్యమ ములు తలఎత్తినవి. ప్రాచీనకాలమున ఆంధ్రభాషయందు భక్తి ప్రేరిత పురాణములు, రసవంతములగు కావ్యములు పెక్కులు గలవు. సామాన్యజనుల కర్థమగు వచనగ్రంథములు పెక్కు కాన రావు ఆంధ్రదేశ యుగపురుషుడగు శ్రీ కందుకూరి వీరేశలింగ కవి వచన గ్రంథములతో ఆంధ్రమాత నలంకరింప ప్రారంభించెను. ఇంతియగాక పెక్కు సంస్కృత నాటకములను తెనిగించి ఆంధ్ర భాషా దేవిని పూజించెను. ఈ మహామహుడు అన్నివిధముల ఆంధ్రుల కాదర్శప్రాయుడై యుగపురుషుడాయెను. శ్రీ గురజాడ అప్పారాయ కవీంద్రుడు వాడుకభాషలో గ్రంథములు వ్రాసి ఆంధ్ర సరస్వతీదేవి కరకమలములందుంచెను. ఆ కవిచంద్రుని శిష్యుడై శ్రీ గురజాడ రామమూర్తి పంతులుగారు నేటికిని అమూల్యములగు గ్రంథములను ప్రకటించుచుండిరి. ఆ కవీంద్రుని యుద్దేశములు సాఫల్యమొనర్చుటకు సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తులు విలసిల్లినవి.

అన్ని నూతనోద్యమములతోపాటు ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము కూడ ప్రారంభింపబడినది. 1886 లో ఈ విశాఖ పట్టణముననే మొట్టమొదటి గ్రంథాలయము, సరస్వతీ పఠన మందిరమును. మంథిన ఆదినారాయణమూర్తిగారు స్థాపించిరి. తరువాత భీమవరం తాలూకా కుముదవల్లిలో 1897 లో శ్రీ వీరేశలింగ కవి సమాజ గ్రంథాలయము స్థాపితమైనది.

తరువాత కొన్ని దినములకు రాజమహేంద్రవరమున శ్రీ వీరేశలింగ కవి పుస్తకభాండాగారము, వసురాయ పుస్తకభాండాగారములు నెలకొల్పబడినవి. ఈ రెంటిని కలిపి నేడు గౌతమీ గ్రంథాలయమని పిలుచుచున్నారు. అదియే నేడు ఆంధ్రదేశమున గొప్ప గ్రంథాలయము. ఇందు 20 వేల పుస్తకములున్నవి. 1911 సం॥ న బెజవాడ పట్టణమున రామమోహన గ్రంథాలయము శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రి, శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగార్లు స్థాపించిరి. తదాది నేటి దనుక ఆంధ్రులకు అదియే కేంద్ర గ్రంథాలయము. వారిరువుర త్యాగ ఫలితమే నేటి ఆంధ్ర గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశమున వారు చూడని గ్రంథాలయము లేదనిన అతిశయోక్తి కాదు అఖిలభారత గ్రంథాలయ సంఘ నిర్మాణమునకు గూడ వారిరువురే కృషిచేసి నేటి కొక రూపమును తెచ్చిరి. మొదటివారు శ్రీ నరసింహ శాస్త్రిగారు విగత జీవులైనను కీర్తికాయులే. వెంకటరమణయ్యగారు నేటికిని మొదటి యుత్సాహముతోనే గ్రంథాలయోద్యమమును నడుపుచు మన మన్ననలకు పాత్రుడైన ధన్యుడు. గ్రామములలో గ్రంథాలయములు స్థాపించి ప్రజాసేవ చేసినవారిలో కీ॥ శే॥ కుప్పా శ్రీరామశర్మ, ఆరెకపూడి రామశాస్త్రి, భమిడిపాటి యజ్ఞనారాయణశర్మ, ఊటుకూరి సుబ్బరాయశ్రేష్ఠిగార్లు ముఖ్యులు. శ్రీయుతులు మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి, నాళం కృష్ణరాయకవి ఉద్యమారం

భము నుండియు నేటివరకు గ్రంథాలయోద్యమ సేవ చేయుచు మనకు మార్గదర్శులైరి.

ఆంధ్రదేశమున 750 గ్రంథాలయములున్నటుల లెక్కల వలన తెలియుచున్నది. ఇందు పెక్కు కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి మండలములందున్నవి. మా గుంటూరు మండలమున 200 గ్రంథాలయములున్నవి. తెనాలి తాలూకాలో 17 గ్రంథాలయములకు స్వంత భవనము లున్నవి. జిల్లా తాలూకా గ్రంథాలయ సంఘములు పనిచేయుచున్నవి. జిల్లా సంఘ పక్షమున మ్యాజిక్ లాంతరు ద్వారా ఉపన్యాసము లొసంగ బడుచున్నవి. తూ॥ గోదావరి జిల్లా ఆలమూరు కేంద్రమున కూడ మ్యా ిక్ లాంతరు ద్వారా ఉపన్యాసము లొసంగబడుచున్నవి. గుంటూరు జిల్లాలో పెదపాలెం సేవాశ్రమ వాణీమందిరమువారు ప్రయాణీకుల బోటులలో సంచార గ్రంథాలయములను నెల కొల్పి మార్గదర్శకులైరి ఈమధ్య రాజకీయోద్యమ ప్రాబల్యముచే అణగిపోయిన గ్రంథాలయోద్యమము మరల ఉత్సాహవంతముగ సాగింపబడుచున్నది. మండల గ్రంథాలయ సభలు, తాలూకా సభలు మరల జరుగుచుండుట సంతసప్రదము దేశాభిమానులు, భాషాభిమానులు ఉద్యమమునకు తోడ్పడి ప్రజావిజ్ఞానమునకు చేయూత నొసగ ప్రార్థించుచున్నాను. ప్రభుత్వాదరణము లేకపోయి నను, ప్రజల స్వయంశక్తి ధారబోసి బ్రిటిషు ఇండియాలో మనమే ఇంత దిగ్విజయముగ గ్రంథాలయోద్యమము నడిపి మిగిలినరాష్ట్ర ములకు మార్గదర్శుల మైతిమి. ఇంతటితో మన కర్తవ్యము పూర్తికాలేదు ఇంకను వేలకొలది గ్రామములు ఆంధ్రదేశమున గ్రంథాలయములు లేక మీ సేవకై ఎదురుచూచుచున్నవి. శిథిలా వస్థలో నున్న గ్రంథాలయముల పునరుద్ధరించు భారము మీామీద నున్నది.

కలకత్తా

కలకత్తా కార్పొరేషన్ వారు అనతికాలము నుండియే గ్రంథాలయములు స్థాపించి ఆ నగర ప్రజల విజ్ఞానమునకు తోడ్పడుచున్నారు. కలకత్తా నగరమునందు 146 గ్రంథాలయములు స్థాపించిరి. ప్రతి సంవత్సరము రు. 58000-0-0 లు వెచ్చించుచున్నారు. వీనియందు 5 లక్షలు గ్రంథము లున్నవి. అన్ని గ్రంథాలయములకు వివిధ వార్తా పత్రికలను తెప్పించుచున్నారు. ప్రతి గ్రంథాలయమునకు దినమునకు 200 మంది పాఠకులు వచ్చుచున్నారు. ప్రతిదినము 5000 గ్రంథములు చదువబడుచున్నవి. ఇండియా ప్రభుత్వము వారిచే స్థాపింపబడిన ఇంపీరియల్ గ్రంథాలయము ఈ నగరమునందే యున్నది. ఇందు లక్షల కొలది గ్రంథము లున్నవి. ప్రభుత్వమువారిచే నడుపబడు గ్రంథాలయములలో నిదియే గొప్పది. ఈ గ్రంథాలయము పరిశోధకులకు ఎంతేని యుపయుక్తముగ నున్నది.

మదరాసు

ఇచ్చట ప్రభుత్వమువారిచే నడుపబడు విశ్వవిద్యాలయ గ్రంథాలయము, కెనెమరా గ్రంథాలయము, అడయారు గ్రంథాలయము ప్రజా విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నవి. ఏ డెనిమిది సంవత్సరముల నుండియు ప్రజలచే నగర గ్రంథాలయ సంఘము స్థాపించబడి కృషి చేయుచున్నది. వీరు గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన కొన్ని గ్రంథములు కూడ ప్రకటించిరి. క్రైస్తవ యువజన జన సంఘము వారిచే సర్క్యులేటింగు గ్రంథాలయములు స్థాపించబడి చాల యుపయుక్తముగ నున్నవి. తమిళ దేశమునందు ఇప్పుడిపుడే గ్రంథాలయోద్యమము ప్రారంభమైనది.

స్వదేశ సంస్థానములు

బరోడా రాష్ట్రము ఇదివరకే భారతదేశమునకు మార్గదర్శకమైనది మైసూరు సంస్థానమువారుకూడ బెంగుళూరు, మైసూరు పట్టణములలో గొప్ప గ్రంథాలయములను స్థాపించిరి. పెక్కు గ్రామములలోకూడ గ్రంథాలయములను స్థాపించి భవనములుకూడ కట్టించిరి. క్రమక్రమముగ అన్ని గ్రామములలోను గ్రంథాలయములు స్థాపించుటకు మహారాజావారు కృషిచేయుచు ప్రజల ప్రేమను చూరగొనుచుండిరి. తిరువాన్కూరు సంస్థానమువారు గూడ గ్రంథాలయముల నెలకొల్పుచుండిరి. మొన్ననే ప్రతి గ్రామ ప్రాథమిక పాఠశాలలోను గ్రంథాలయమును నెలకొల్ప ఆ ప్రభుత్వమువారు తీర్మానించి, కొంత ద్రవ్యమును ప్రత్యేకించుట ఆనందదాయకము.

ఆంధ్ర విశ్వవిద్యాలయం

భారతదేశమున అన్ని విశ్వవిద్యాలయములకంటె ముందుగ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారే పుస్తక భాండాగారికుల తరిఫీదు తరగతులను ప్రారంభించి మార్గదర్శకులైరి. ఇచ్చట శిక్షను బడసిన వారు ఆధునిక పద్ధతుల ప్రకారము గ్రంథాలయములను నడిపి ఆకర్షవంతముగ చేయగలరు. ఈ విశ్వవిద్యాలయము స్థాపించినపుడు ఆంధ్రభాషాభివృద్ధికి తోడ్పడునని ఉవ్విళ్ళూరితిమి. ఈమధ్య కొందరు పండితులచే గ్రంథములు వ్రాయించి వారినే అచ్చువేసి కొనమనిరి. ఇదియా విశ్వవిద్యాలయము భాషాభివృద్ధికి తోడ్పడుట? ప్రపంచ విఖ్యాతిగన్న రాధాకృష్ణుని ఆధ్వర్యముక్రింద ఆంధ్రభాషాదేవి నూత్నాలంకారములతో శోభిల్లునా?

పంజాబు

ఇచ్చటకూడ ఇప్పుడిపుడే గ్రంథాలయోద్యమము ప్రారంభమైనది. విశ్వవిద్యాలయమువారు గ్రంథాలయోద్యమమునకు సంబం

ధించిన మాసపత్రికను ప్రకటించి ఉద్యమమునకు చేయూత నొసంగుచుండిరి.

ప్రభుత్వ విరాళములు

దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు మద్రాసు శాసనసభాసభ్యులుగ నున్నపుడు మనరాష్ట్ర గ్రంథాలయములకు విరాళములు యివ్వవలయునని తీర్మానమును ప్రతిపాదించిరి. ఆ తీర్మాన ఫలితముగ సంవత్సరమునకు రు 20,000 లు యిచ్చుటకు ప్రభుత్వమువారంగీకరించిరి. కొన్నివత్సరములు ఆ మొత్తమును ఖర్చు పెట్టనేలేదు. విరాళములు యిచ్చుటకు పలు ఆటంకములు పెట్టుచున్నారు ప్రభుత్వమువా రెంత మొత్తమును యిచ్చెదరో అంత మొత్తమును గ్రంథాలయములవారుకూడ పుస్తకములకే ఖర్చు పెట్టవలయునట. మిగిలిన ఖర్చులు లెక్కకురావు ఇట్టి నిర్బంధములుంచుట అన్యాయము. వారిచ్చు విరాళములో 4వ వంతు సంఘమువారు భరించునటుల నిర్ణయింపగోరెదను. సంవత్సరమునకు 1 లక్ష రూప్యములైనను గ్రంథాలయములకు విరాళము లిచ్చి ప్రభుత్వమువారు తమ ధర్మమును నెరవేర్చెదరుగాక.

గ్రంథనిషేధము

కొన్నాళ్ళనుండియు ప్రభుత్వమువారు గ్రంథాలయముల మీద దాడి వెడలుచున్నారు. సోదాచేసినపుడు వారిష్టమువచ్చినటుల గ్రంథములు తీసికొని వెళ్ళుచున్నారు. ప్రభుత్వమువారిచే నిషేధించబడిన గ్రంథములుగాక మిగిలినవి తీసికొనిపోవుటకు వారికి హక్కెక్కడిదో? ఈ విషయమై సోదాచేయువారిని ప్రభుత్వము వారు మందలించెదరుగాక. నిషేధగ్రంథముల పట్టిక ప్రతి గ్రంథాలయమునకు పంపుటయో, పత్రికలో విరివిగ ప్రకటించుటయో చేసిన బాగుండును. ఈమధ్య మాగ్రామ గ్రంథాలయమునకు ఒక

విద్యాశాఖాధికారివచ్చి "జీవయాత్ర" అను వేదాంత గ్రంథము ఉండకూడదని నిషేధించెను. ప్రభుత్వోద్యోగుల పరిశీలన ఏవిధముగ నున్నదో గాంచుడు.

స్థానిక సంస్థలు

పశ్చిమగోదావరి జిల్లాలో తాలూకాబోర్డులవారును జిల్లా బోర్డులవారును స్వయముగ గ్రంథాలయముల నెలకొల్పి విజ్ఞాన వ్యాప్తికి తోడ్పడుచున్నందులకు హృదయపూర్వక వందనములు. మిగిలిన జిల్లాబోర్డులవారుకూడ స్వయముగ గ్రంథాలయముల నెలకొల్పియు గ్రామములలోనున్న పెక్కు గ్రంథాలయములకు ధన సహాయము చేసియు తమ ధర్మమును నెరవేర్చెదరుగాక. గ్రామ వాసుల నుండి వసూలుచేసిన లక్షలకొలది సెస్సు మీయధీనమున నున్నది. పలు గ్రామములలో ఉత్సాహవంతులచే నెలకొల్పబడిన గ్రంథాలయములు ధనాభావముచే శిథిలావస్థలోనున్న సంగతి మీరెరుంగుదురు. ప్రభుత్వమువారి వలె మీరును ప్రజాశ్రేయమును మరువకుందురుగాక.

గుంటూరు, బెజవాడ, తెనాలి మున్సిపల్ సంఘములవారు గ్రంథాలయములు స్థాపించి ఆ యాపురవాసులకు విద్యాభివృద్ధి సౌకర్యములు గలుగచేసినందుకు వందనార్హులు. మిగిలిన మున్సిపాలిటీలవారుకూడ వీరిమార్గమును ద్రొక్కి జ్ఞానాభివృద్ధికి తోడ్పడెదరుగాక.

పరపతి సంఘములు

రాజమహేంద్రవర సెంట్రల్ బ్యాంకువారు గత వత్సరము ఒక గ్రంథాలయమును నెలకొల్పిరి. ఈ విధముననే ఆ యా కేంద్రములలో మిగిలిన సెంట్రలు బ్యాంకులవారుకూడ గ్రంథాలయములు స్థాపింపవేడెద. గ్రామపరపతి సంఘములవారుకూడ గ్రంథా

లయములు స్థాపించిరో గ్రంథాలయములకు ధనసహాయము చేసిరో ఉద్యమమునకు తోడ్పడ వేడెద. సెంట్రల్ బ్యాంకుల వారికి ఇన్‌స్పెక్టరులు పెక్కురుందురు; వీరు గ్రామములవెంట ఎప్పుడును తిరుగుచుందురు. సంచార గ్రంథ పేటికలు సంపాదించి వీరి సహాయమున గ్రామములకు పంపవచ్చును. ఇట్టి మహత్కార్యమును బూని ఏ బ్యాంకువారు ఆంధ్రదేశమునకు మార్గదర్శులయ్యెదరో చూచుటకు నిరీక్షించు చున్నాము.

యువకుల కర్తవ్యము

కళాశాలలలోను ఉన్నత పాఠశాలలలోను విద్య నభ్యసించుచు యువకులు సెలవు దినములలో కాలము గడుపుచున్నారు. వీరు గ్రామములలో నున్నరోజులలో గ్రామవాసులకు పెక్కు విషయములనుగూర్చి బోధించవచ్చును. కళాశాల పండితులు ఈ విషయమును హెచ్చరించుచునే యున్నారు. గ్రంథాలయములు లేని గ్రామములు వేలకొలది యున్నవి. రాత్రిపాఠశాలలు నెలకొల్పి వయోజనులకు విద్యగరుపవచ్చును. మనదేశమున ఇంకను నూటికి 9 మందియే విద్యనేర్చినవారు. మిగిలిన 91 మంది మా సేవకై ఎదురు చూచుచున్నారు. విద్యార్థులేగాక గ్రామములలో చదువు మానిన యువకులు వేలకొలది యున్నారు. ఏ దేశము అభ్యున్నతి బడసినను యువకుల సహజ ఉత్సాహ శక్తులవలననే. యువకులారా! మేల్కొనుడు. జర్మనీ, ఇటలీ, రష్యా, టర్కీ, చీనా, జపాను దేశముల యువకులు వారి వారి దేశముల అభివృద్ధికి వికాసమునకు విజ్ఞానమునకు ఏ విధమున నిరంతరోత్సాహముతో పాటుబడుచున్నారో గమనింపుడు. మీ సేవకై మీ మాతృ దేశము ఎదురు చూచుచున్నది. ఆ దేవి ఋణమును తీర్చ బద్ధకంకణులు గండు.

ముగింపు :

ఆంధ్రభాష నేటివరకు పొందిన అభివృద్ధికి సంతసము. వాడుకభాష పెంపొందించుటకు భారత వర్షమునకు మనము మార్గమును జూపితిమి. కాని ఈ యభివృద్ధి చాలదని మనవి చేయుచున్నాను. మన మాతృభాషలో చరిత్రలు, శాస్త్ర గ్రంధములు యింకను వేలకొలది పెంపొందవలయును. విజ్ఞాన సర్వస్వమును పూర్తి చేయించుచున్న శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారికిని, నూతన పరిశోధనలతో ఆంధ్రుల చరిత్రను పూర్తి చేయుచున్న శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారికిని, సూర్యరాయ నిఘంటువును పూర్తిచేయుచున్న శ్రీ పిఠాపురం మహారాజా వారికిని వందనములు. స్వాతంత్ర్యాభిప్రాయములను కలుగచేయు గ్రంధములు మిక్కిలి స్వల్పముగ నున్నవి. మన సారస్వతమున లోటుపడిన గ్రంధ రాజములు పూర్తిచేయుటకు పండితులు, విజ్ఞానులు భాషాభిమానులు, దేశాభిమానులు పూనుకొనెదరుగాక. అనతికాలమున తెనుగుతల్లిని సర్వాలంకరణములతో నలంకరించెదరుగాక.

మానవుడు సద్గ్రంథ పఠనమువలన తత్వవేత్త కాగలడు. పండితుడు కాగలడు, భక్తుడు కాగలడు, యోగిపుంగవుడు కాగలడు, రాజకీయవేత్త కాగలడు, యోధుడు కాగలడు - అవి యివి యననేల సకల ఉన్నతిని పొందగలడు. కాన సోదరులారా ! ఆంధ్రదేశమున నున్న లక్షలకొలది గ్రంధ రాజములు మిమ్మాహ్వానించుచున్నవి. వానిని తనివిదీర పఠించి విజ్ఞానులుగండు. భాషాసేవ, దేశసేవ జేసి ధన్యులుగండు.

— ఆంధ్రపత్రిక నుండి.

# ప్రభుత్వము

## ఆర్థిక సహాయము :

గ్రంథాలయములకు ప్రభుత్వము వారొసంగుచున్న ధనసహాయ మత్యల్ప మనియు, యే తత్సహాయమును పొందుచున్న స్వల్ప సంఖ్యాకములకు గ్రంథాలయ ములకు సహితమయ్యది విశేషించి ప్రయోజనకారిగా నుండుటలేదనియు యీ సభ వారభిప్రాయపడుచు గ్రంథాలయముల సహాయార్థము ప్రభుత్వమువారు యెక్కువ సహాయము చేయవలెననియు, అద్దానిని (కఠిన) నియమబద్ధము లేక యొసంగు చుండవలయుననియు యీ సభవారు ప్రభుత్వమువారిని హెచ్చరించుచున్నారు.

**1931 XIV 5**

ఈసంవత్సరము చెన్నరాజధానిలోని గ్రంథాలయములకు రు.కి 35000/- విరాళము నిచ్చిన మదరాసు ప్రభుత్వమువారినీ సభవా రభినందించుచు, ఈ మొత్తమును కనీసము లక్ష రూపాయల వరకైనను హెచ్చించవలెననియు, గ్రంథాలయ ములకు విరాళములను పంచుటలో నా యా గ్రంథాలయములను బట్టి ఉచితమైన మొత్తము నివ్వవలెననియు, దరఖాస్తుల బంపుకొన్న గ్రంథాలయము లన్నింటికి విధిగా విరాళముల నిచ్చునట్లేర్పాటు చేయవలెననియు మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

**1942 XXIV 2**

మదరాసు గవర్నమెంటువారు 1942-43 సం॥కు కూడా గ్రంథాలయము లకు ధనసహాయము చేయ నిశ్చయించుకొనినందుల కీసభవారు సంతసించుచున్నారు.

కాని, గవర్నమెంటువారు చేయు సహాయము మొత్తమునకు సమముగా గ్రంథాలయ నిర్వాహకులు ఖర్చుచేయవలెనను షరతు గ్రంథాలయములకు మిక్కిలి యిబ్బంది కలిగించుచున్నది. కాన యీ షరతును రద్దు చేయించవలయుననియు, అట్లు షరతు పూర్తిగ రద్దుచేయుటకు వీలుకాని యెడల గ్రంథాలయ నిర్వాహకులు చేయవలసిన ఖర్చు మొత్తము (ఇచ్చునట్టి గ్రాంటుకు సమానమైన మొత్తము) లో సంవత్సర ప్రారంభమునుండి గ్రంథాలయోపయోగమునకు గాను చేయబడు వార్తా

పత్రికల చందాయి - సిబ్బంది జీతములు - సంపాదించిన పుస్తకముల వెల-బైండు ఛార్జీలు - సాదరు ఖర్చులు మొదలగు న్యాయమైన ఖర్చు పద్దులన్నియు చేర్చుకో వలయుననియు, యీ సభవారు గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

1942 XXIII 5

ప్రభుత్వమువారు స్రొవిన్షియలు ఫండునుండి వివిధ గ్రంథాలయముల కొసంగు గ్రాంటు సందర్భములో గ్రంథాలయములు రిజిష్టరు చేయబడవలయునను నిర్బంధమును తొలగించవలసినదిగా ప్రభుత్వమువారి నీ సభవారు కోరుచున్నారు.

1934 XIX 12

ప్రభుత్వ విరాళములపై గ్రంథాలయముల నుండి రాబడు దరఖాస్తులు అట్టి గ్రంథా యములుండు ప్రదేశమునకు గల మునిసిపాలిటీ లేక జిల్లాబోర్డుల ద్వారానే పంపబడవలయునను నియమమును తొలగించవలయునని ఈ సభవారు మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

1934 XIX 1၁

ప్రభుత్వమువారి విరాళములు పొందిన గ్రంథాలయములు వెచ్చించవలసిన మొత్తములో నివేదిక సంవత్సరారంభము నుండి వ్యయపరచిన మొత్తములు చేర వని ప్రభుత్వమువారు విధించిన షరతు గ్రంథాలయముల కిబ్బందికరము గాన దీనిని రద్దుచేయవలసినదిగ ఈ సభవారు మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

1942 XXIV 3

గ్రంథాలయ శిక్షణను బొందినవారు పనిచేయుచున్న గ్రంథాలయములకు ప్రభుత్వమువారు గ్రాంటుల నిచ్చుటలో ప్రత్యేక వివక్షణను జూపవలెనని ప్రభుత్వమువారిని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

1942 XXIII 11

గ్రంథాలయముల పోషణకొరకు Assessed waste lands శిస్తుకట్టు గయాళి భూములను గ్రంథాలయములకు శాంక్షన్ చేయుటకొరకు జిల్లా కలెక్టర్లకు త్తర్వు లిప్పించవలసినదిగా ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు

1934 XIX 16

ఇదివరలో మదరాసు ప్రభుత్వమువారు పంచాయతీ బోర్డుల కొసంగు చుండెడి గ్రాంటును ప్రస్తుతము నిలుపుదలచేయుట గ్రామ ప్రజల విజ్ఞానాభివృద్ధికి

భంగకరము గావున వెంటనే మరల రాబోవు 1935-36 సం॥ బడ్జెటు నుండియు పంచాయతీ బోర్డులచే నిర్వహింపబడిన గ్రంథాలయములకు గ్రాంటు నేర్పాటుచేయ గలందులకు మద్రాసు ప్రభుత్వమువారి నీ సభవారు గోరుచున్నారు.

1934 XIX 10

## స్థానిక సంస్థలు - గ్రంథాలయాలు :

రు. 500/- లకు మించిన ఆదాయము గల ప్రతి పంచాయతీ బోర్డువారు తమ ఆదాయములో సంవత్సరమునకు నూటికి 10 వ వంతున ఖర్చుచేసి తప్పకుండా ఒక గ్రంథాలయమును పోషించవలెనని యీ సభవారు మదరాసు స్థానిక స్వపరిపాలన శాఖా ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

1942 XXIII 9

గ్రామ పంచాయతీలు లోకల్ బోర్డు ఇన్‌స్పెక్టర్‌వారి యనుమతి పొంద నక్కరలేకుండగనే గ్రామ గ్రంథాలయములకు విరాళము ఇచ్చుటకు వీలుకలుగ జేయుటకు గవర్నమెంటువారిని యీ సభవారు కోరుచున్నారు

1942 XXIII 7

గ్రంథాలయములకు స్థానిక సంస్థలు ధనసహాయ మొసఁగుట చాల యవసరమనియు, అట్టియెడ ప్రభుత్వమువారు జోక్యము కలిగించుకొని అడ్డు తగులకుందురు గాక యనియు ఈ సభవారు ప్రభుత్వమువారిని హెచ్చరించుచున్నారు.

1931 XIV 4

లోకల్‌బోర్డ్సు సవరణచట్టములో తాలూకాబోర్డు గ్రంథాలయములను గ్రామ పంచాయతులకు నిచ్చివేయుటచే తాలూకా ముఖ్యపట్టణములలో నున్న గ్రంథాలయములకు తగిన చేయూత లభించదని ఈ సభవారభిప్రాయపడుచు, తాలూకా ముఖ్య పట్టణములలో నున్న బోర్డుగ్రంథాలయముల నైనను జిల్లాబోర్డుల క్రిందనే యుంచవలెనని లేదా ఆ స్థానమునగల పంచాయతీలు వానిని సమర్థతతో నిర్వహించుటకు ఆక్టులో నేర్పాటు చేయవలెనని ఈ సభవారభిప్రాయపడుచున్నారు

1934 XVII 10

పంచాయతీబోర్డులచే నిర్వహింపబడు గ్రంథాలయములకు గాని లేక బోర్డు పేరునగాని పంచాయతీఫండు నుండి పత్రికలు వగైరాలు ప్రభుత్వపు టనుమతిలేనిదే తెప్పించరాదని గావించిన సర్క్యులరువల్ల గ్రామప్రజల వయోజన విజ్ఞానాభివృద్ధికి భంగకరము గావున సదరు సర్క్యులరును రద్దుపరచవలసినదిగా ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు

1934 XIX 7

ప్రజలయొక్క సర్వవిధములగు అభివృద్ధికి ముఖ్యసాధనము జ్ఞానాభివృద్ధి గనుకను, అందుకు తగిన సాధనములు ప్రస్తుతము మనదేశమున లేకపోవుటచే ప్రజలు దుస్థితియందుండుటచే యీ క్రిందివిధానము ననుసరించిన సంస్థలను వెంటనే నెలకొల్పుటకు ప్రజలనున్ను, స్థానిక సంఘములవారినిన్ని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

(క) ప్రజలకు అవసరమగు విషయములగూర్చి వారికి దెలియు విధమున ఉపన్యసించగల సమాచారబోధకులను నియమించుట, వారి బోధనకు సాధకముగ నుండుటకు కరపత్రములను ప్రచురించుట, మ్యాజిక్‌లాంతరు సహాయము చేకూర్చుట.

(చ) తాత్కాలిక పాఠశాలల స్థాపించుట.

(ట) ప్రచార గ్రంథాలయ పేటికలను స్థాపించి, గ్రామములలోను పట్టణములలోను వ్యాపింపజేయుట.

1928 XII 2

(క) గుంటూరు, బెజవాడ మ్యునిసిపలు సంఘములవారు సార్వజనిక ధర్మ గ్రంథాలయములను నెలకొల్పి జ్ఞానాభివృద్ధికి తోడ్పడుచున్నందులకును, తెనాలి తాలూకా యందలి గ్రంథాలయముల కొసంగుటకు రు. 1000-00 లు గ్రాంటు యిచ్చిన ఆ బోర్డువారిని, ఆ మ్యునిసిపాలిటీలను యీ సభవారు అభినందించుచున్నారు.

(చ) ఆంధ్రదేశమునందలి యితర మ్యునిసిపాలిటీలుకూడ సార్వజనిక ధర్మ గ్రంథాలయములను స్థాపించుటకు ఈ సభవారు కోరుచున్నారు

(ట) ఆంధ్రదేశమందలి ప్రతి తాలూకాబోర్డును తమ ప్రధాన పట్టణములందు ఆ తాలూకా యందలి ధర్మగ్రంథాలయములకు సహాయముగా ఉండునటుల ఒక కేంద్రగ్రంథాలయమును నెలకొల్పుటకు ఈ సభవారు కోరుచున్నారు.

1928 XII 3

ఆంధ్రదేశములో ఉండే జిల్లాబోర్డులు అయిదువేల జనాభాకు మించియుండే గ్రామాదులలో గ్రంథాలయములు నెలకొల్పవలెనని యీ సంఘమువారు ఆయా జిల్లాబోర్డులవారిని ప్రార్థించుచున్నారు.

1935 XX 6 (అ)

గ్రామపంచాయతీ సంఘములు బోర్డులపక్షమున గ్రంథాలయములు స్థాపించి పంచాయతీ నిధినుండి పోషింపజేసి ప్రజల భాషాభివృద్ధికి తోడ్పడవలెనని పంచాయతీబోర్డులను కోరడమైనది.

1935 XX 8 (అ)

జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, పంచాయతీబోర్డులు, సహకారసంఘములు, గ్రంథాలయములను స్థాపించవలసినదనియు, ఇదివరకున్న గ్రంథాలయములకు విరివిగా సహాయము చేయవలసినదనియు ఈ సభవారు కోరుచున్నారు.

1933 XV 15

విలేజి డెవలపుమెంటు ఫండులోనుంచి గ్రంథాలయములకు ప్రతి సంవత్సరము కొంతభాగము విరాళములుగా ఇవ్వవలసినదిగా ఆయా జిల్లాబోర్డుల కమిటీల వారిని ఈ సభవారు కోరుచున్నారు.

1933 XV 14

స్థానికసంస్థలు తమ గ్రంథాలయోద్యోగులను ఈ శిక్షణ తరగతులకు* బంపవలసినదనియు, ఇందుకు తగిన సదుపాయములను వారికి కలుగజేయవలసినదనియు నీ సభవారు కోరుచున్నారు.

1942 XXIV 7 (అ)

కృష్ణాజిల్లా, అంగలూరు శ్రీ బాలసరస్వతీ పుస్తకభాండాగార భవననిర్మాణమునకు సుమారు 6 సంవత్సరములకు పూర్వమే కృష్ణాజిల్లాబోర్డువారు 1500 రూప్యములు గ్రాంటుకు మంజూరుచేసి యింతవరకు యిత్తుమని కాలము గడపి, యే కారణము లేకయే సదరు గ్రాంటును తిరిగి రద్దుచేసినందులకు విచారించుచు, తిరిగి సదరు గ్రాంటును మంజూరు చేయుదురని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

1931 XIV 13

గ్రంథభాండాగారుల సర్వీసు :

మదరాసు ప్రభుత్వమువారిచే జి. ఓ. నెం. 4977 నందు స్థానిక ప్రభుత్వము వారిచే నడుపబడు గ్రంథాలయములందు పనిచేయు గ్రంథభాండాగారుల సర్వీసు

---

*ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు నిర్వహించు తరగతులకు

తక్కువ (Inferior)గా ప్రకటింపబడినది గాన యీ సభవారు తమ జి. ఓ. ను సవరణచేసి గ్రంథభాండాగారుల సర్వీసు ఎక్కువ (Superior) గా ప్రకటింప వలయునని ప్రభుత్వమువారికి విన్నవించుచున్నారు.

1942 XXIII 12

ఉపాధ్యాయుల సేవ :

స్థానిక సంస్థలక్రింద పనిచేయు ఉపాధ్యాయులలో గ్రంథాలయోద్యమసేవ చేయదలచువారికి పాఠశాల పనికి నష్టమురానివిధమున సేవకు, గ్రామాంతర పర్యటనమునకు ప్రభుత్వమువారు స్థానికసంస్థల కవకాశమునొసగ నీసభవారు కోరుచున్నారు.

1942 XXIII 9

గ్రంథాలయముల రిజిస్ట్రేషను :

1860 సం. నెం 21 రు చట్టప్రకారము రిజిస్టరుచేయుటకు యివ్వవలసిన ఫీజును గ్రంథాలయములకును, పఠన మందిరములకును లేకుండ ఉచితముగా రిజిస్టరుచేయించునటుల చట్టమును సవరించివేయవలెనని ప్రభుత్వమువారి నీ సభవారు కోరుచున్నారు.*

1934 XVII 7
1934 XIX 11

ప్రభుత్వమువారిచే రిజిస్టరు కావలెననే నియమము అన్ని గ్రంథాలయములకు అవసరములేకుండా 1860 వ సం. పు 21 వ నెంబరు ఆక్టుక్రింద రిజిస్టరు చేయబడిన ఆంధ్రదేశగ్రంథాలయసంఘమునకు శాఖాసంఘముగా చేర్చబడిన గ్రంథాలయములను రిజిస్టరు చేయనవసరములేకుండా గ్రాంటుల నొసంగగలందులకు ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

1935 XX 9 (అ)

ప్రభుత్వ ప్రచురణలు :

దొరతనమువారిచే ప్రచురింపబడు పారిశ్రామిక, ఆరోగ్య విషయక ప్రచురములనన్నిటిని, జిల్లా గజెటులను, ఆంధ్రభాషయందు ముద్రింపబడు గ్రంథముల పట్టికలను ఆంధ్రదేశమందలి గ్రంథాలయములన్నిటికిని ఉచితముగా దయచేయవలెనని యీ సభవారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

1931 XIV 6 (అ)

---

* ఇదే భావమును ప్రకటించుతీర్మానమును 1931 లో జరిగిన 14 వ ఆం. దే. గ్రం. మహాసభవారుకూడ చేసినారు.

ప్రభుత్వమువారిచే ప్రచురింపబడి గ్రామాధికారులకు మామూలుగా పంపబడుచున్న వ్యవసాయ, సహకార, ఆరోగ్యశాఖల ప్రభుత్వ కరపత్రములు, చిత్రపటములు వగైరా ప్రచురణలను ప్రతి గ్రామగ్రంథాలయమునకు తప్పక పంపు యేర్పాటు చేయించవలసినదిగనున్న, ఆ యా శాఖల అధికారులు గ్రంథాలయ సంఘమువారు కోరినప్పుడువచ్చి అన్నివిధముల వారికి తోడ్పడుటవల్ల ఆ ప్రచురణలకు సార్థకత కలుగుననియు యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

1942 XXIII 21

## రైల్వేలద్వారా పుస్తకాల ఉచిత బట్వాడా

ఒకపెద్ద గ్రంథాలయమునుండి చిన్న గ్రంథాలయములకు కొన్ని గ్రంథములను ఒకేపర్యాయము తెప్పించుకొని, ఉపయోగించి సదరు గ్రంథములను తిరిగి ఆ గ్రంథాలయమునకు చేర్చుటలో ఖర్చులులేకుండ చేయుటకై రైల్వేకంపెనీవారికి ఆర్డరు యివ్వవలసినదిగ గవర్నమెంటువారిని కోరడమైనది

1942 XXIII 10

## పుస్తకాల జాబితా

మన రాజధానియందు నానాభాషలలో ప్రచురింపబడు గ్రంథముల పట్టికను దొరతనమువారు ఫోర్టుసెంటుజార్జి గజెటులో మూడునెలలకొకసారి ప్రచురించుట వలన ప్రజాబాహుళ్యమునకు లేశము లాభము కానరానందున, జిల్లా గజెటులోకూడ ప్రచురింపజేయునటుల ఈ సభవారు దొరతనమువారిని కోరుచున్నారు

1934 XVII 4
1934 XIX 8

## ముద్రితగ్రంథముల సరఫరా

ముద్రాలయములలో ముద్రింపబడు గ్రంథములలో మూడేసి ప్రతులచొప్పున గైకొనుచు వానిని తమకు తోచినరీతిని పంపుచున్న దొరతనమువారిని నాల్గవప్రతి కూడ గైకొనుచు నయ్యది ఆంధ్రులకుపయోగపడునట్లు ఆంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథాలయమునకో ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమునకో పంపుచుండగలందులకు తగిన శాసనముల నిర్మించుటకై విద్యాశాఖకు సంబంధించిన శాసనసభ్యులను ఈ సభవారు కోరుచున్నారు

1934 XVII 9
1934 XIX 13

కేంద్ర గ్రంథాలయం :

ఆంధ్రదేశ మధ్యమున అనుకూలమైన స్థలమందు ఆంధ్రభాషయందు ప్రచురింపబడు గ్రంథములనన్నిటిని, చెన్నపట్టణ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార మందలి యితర అముద్రితగ్రంథప్రతులనన్నిటినిజేర్చి, ఆంధ్రదేశమందలి యితర గ్రంథాలయములకు సహాయభూతముగనుండునట్లు గ్రంథాలయము నొకదానిని ప్రభుత్వమువారు నెలకొల్పుట అత్యావశ్యకము గనుక అట్టి గ్రంథాలయమును త్వరలో స్థాపించవలయునని ప్రభుత్వమువారిని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

1931 XIV 6 (ఇ)

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము :

గ్రంథాలయములు స్థాపించుట, సక్రమముగ నిర్వహించుట మొదలగు గ్రంథాలయోద్యమవ్యాప్తికిని వయోజనవిద్యావ్యాప్తికిని విశేషముగ పాటుబడుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునకుకూడా గ్రంథాలయములకు వలెనే ధనసహాయము చేయవలెనని యీ సభవారు మద్రాసు గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

1942 XXIII 5

ఆంధ్రదేశమందు ప్రభుత్వమువారికిని గ్రంథాలయములకును జరుగు ఉత్తర ప్రత్యుత్తరములను, ఆంధ్రదేశ గ్రంథాలయముల అభివృద్ధికై పాటుబడుచున్న ఆంధ్రదేశగ్రంథాలయ సంఘముద్వారా జరుగగలందులకు ఈ సభవారు ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

1933 XV 11

గ్రంథాలయప్రవేశానికాటంకాన్ని కల్పించే నిబంధనలు :

ఉదకమండలములోని పబ్లికు లైబ్రరీలో చదువరులు ప్రేక్షకులు ప్రవేశించుటకు దర్బారుదుస్తులు ధరింపవలెనను నిబంధన అక్రమమని సభవారు అభిప్రాయపడుచు అట్టి నిబంధనను తొలగించుటకు గవర్నమెంటువారు త్వరపడి చేయవలెనని యీ సభవారు కోరుచున్నారు.

1928 XII 7

గ్రంథాలయ శాసనం :

మద్రాసు గ్రంథాలయ చట్టమునుగూర్చి ఉపసంఘమువారు తయారుచేసిన నివేదికను ఆమోదించడమైనది. దానిని ప్రచురించుటకు తీర్మానించడమైనది.

ప్రస్తుతము దేశము నావరించిన ఆర్థిక దుర్భరస్థితియందు క్రొత్తపన్నులు వేయుట భావ్యముకాకపోవుటచేతను, క్రొత్త సంస్కరణము లందు గ్రంథాలయముల ఉపయోగమునుగూర్చి యెక్కువ సదుపాయములు గలుగుటకు సావకాశముండుట చేతను, స్వభావమునందును, ఉద్దేశమునందును, నిర్మాణమునందును మిక్కిలి లోప భూయిష్టముగానున్నట్టి మద్రాసు గ్రంథాలయచట్టమును విరమించుకోవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1933 XV 8

మదరాసు పబ్లిక్ లైబ్రరీల బిల్లువిషయమై యీ మహాసభవారు దిగువ సూచనలను చేయుచున్నారు.

(అ) మనదేశములోని గ్రామాల క్షేమమును ఆలోచించి గ్రామానికి సంబంధించిన సర్వవయోజనవిద్యకు గ్రంథాలయము కేంద్రముగా నేర్పరచుకొని పని చేయడం ఆవశ్యకము. పిల్లలకుకూడ బళ్ళలోని గ్రంథాలయాలుకాక ప్రజాగ్రంథాలయ ఉద్యమములో భాగంగా గ్రంథాలయాలు ఏర్పడవలెను. ఈ బిల్లుకు "గ్రంథాలయ, వయోజనవిద్యల బి"ల్లని నామకరణము చేయవలయును. ఉద్దేశనిర్వచనములో పై విషయములు స్పష్టపరచవలెను.

(ఆ) ప్రస్తుతమున్న పరిస్థితులలో ఎయిడెడ్ గ్రంథాలయాల విధానాన్ని బలపరచి కార్యనిర్వహణ చేయడం అవసరం. ఈ సూత్రాన్ని ప్రభుత్వంవారంగీకరించి యిప్పటి చిత్తుబిల్లులోవలె గ్రాంట్-ఇన్-ఎయిడ్ కోడ్ సర్కారువారు తమకు పెట్టుకొన్న నిబంధనల అధికారాన్ని వినియోగించి తయారుచేయడం తలపెట్టకుండా దానికి తగిన ప్రధాన సూత్రాలను ఈ శాసనములోనే యిముడ్చవలెను. ఇట్టి ఎయిడెడ్ గ్రంథాలయాలకు లైబ్రరీ అథారిటీలు, విరాళాలు ఇవ్వడానికి వారికి స్వాతంత్ర్యాలు యివ్వవలెను. అందుకు తగిన నిబంధనలు ప్రభుత్వమువారు ఏర్పరచవలెను.

(ఇ) ప్రతి గ్రామములోను ప్రభుత్వమువారు వసూలుచేసే పన్నులలో గట్టి భాగాన్ని గ్రామస్థులపరముచేసి వారి యిష్టానుసారము దానిని ప్రజోపయోగానికి వినియోగించే అవకాశాలు యిచ్చేవరకు క్రొత్త సెస్సు వేయడంగాని, సెస్సులుమీద సెస్సులు పేర్చడంగాని గ్రామస్థులకు తృప్తికరముగా ఉండదు. కాబట్టి గ్రంథాలయాలకుగాను సెస్సులువేసే విధానాన్ని ఎంత అదుపులో పెడితే అంత మేలు. గ్రంథాలయోద్యమాభివృద్ధి ప్రజల ఔదార్యముమీదను ఎక్కువ ఆధారపడడమే ప్రస్తుతానికి సముచితము.

(ఈ) ఈ బిల్లులో ఏర్పాటుచేసియుండే రాష్ట్రగ్రంథాలయాల కమిటీ స్వరూపము యిట్టిదని తేల్చియుండలేదు. తగిన వివరణ ఇవ్వడం అవసరం. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి ఈ సంఘములో ప్రాతినిధ్యమివ్వవలెను.

రాష్ట్రగ్రంథాలయ కమిటీవారు ప్రభుత్వమువారు తమకు పంపించే విషయాలలోనే సలహా యివ్వవలెననడం కమిటీని అస్వతంత్రం చేయడమవుతుంది. వారు తాము స్వతహాగా ఆలోచించి ప్రభుత్వానికి సలహాలు పంపడానికిని వారికి సంపూర్ణాధికార ముండవలెను.

(ఉ) ఈ బిల్లులో ఏర్పరచిన బహుసంఖ్యాక కమిటీల విధానమంతా అనవసరమైన చిక్కువిధానముగా ఉంది. గ్రంథాలయ అథారిటీలన్నీ స్థానిక సంస్థలుగా ఉండగలవు కాబట్టి ఆ సంస్థలు స్టాండింగు కమిటీలు ఏర్పరచుకొని తద్వారా యీ కార్యనిర్వహణము చేయవచ్చు. పని నియమించితే చాలును. ఆ స్టాండింగు కమిటీలలో సగమువంతువరకు గ్రంథాలయశాస్త్ర నిపుణులో, గ్రంథాలయ నిర్వహణ అనుభవజ్ఞులో ఉండవలసిందని, అట్టివారు ఆ స్థానికసంస్థ సభ్యులయినా కాకపోయినా అందులో నుండదగుదురని నియమింపవచ్చును. స్థానికసంస్థల శాసనాలలో యిందుకు తగిన మార్పు చేయవలెను. ఈ కమిటీలకు ప్రణాళికలు వేయడానికి, విరాళాల మొత్తాలు సూచించడానికి, కార్యక్రమము నెరవేర్చడానికి స్వాతంత్ర్యముండవలెను. వీటి పనులను సమన్వయము చేయడానికి ప్రభుత్వమువారు నిబంధనల మూలకముగా కొన్ని అధికారములు పెట్టుకొనవలెను.

(ఊ) గ్రంథాలయాల డైరెక్టరు, గ్రంథాలయాల అథారిటీలకు మిత్రుడు, సచివుడు, బంధువుగా ఉపకరించవలెనేగాని యీ బిల్లు తోపింపజేసే నిరంకుశ యాజమాన్యాలుగలవాడుగా ఉండరాదు.

కేంద్ర గ్రంథాలయాలను, జిల్లాగ్రంథాలయాలను పరిపాలనచేస్తూ రాష్ట్ర గ్రంథాలయ సంఘానికి, ప్రభుత్వానికి ఇతర అన్ని గ్రంథాలయాలకు సాంకేతిక సలహాలు, సహాయము యిస్తూ గ్రంథాలయాల డైరెక్టరు పనిచేయవలెను.

(ఋ) లైబ్రరీ అథారిటీలు తమ ఉద్యోగులను, నౌకరులను, సిబ్బందిని నియమించుకోడములో, శిక్షించడములో, పరిపాలించుకోడంలో జిల్లా మునిసిపాలిటీయాక్టు, జిల్లాబోర్డులయాక్టు, వాటిక్రింద యేర్పడిన నిబంధనలు, జి. ఓ. లు వీటి నిర్బంధాలన్నిటికి లోనుగావడం, చీటికిమాటికి లోకల్ బోర్డుల, మునిసిపాలిటీల ఇన్‌స్పెక్టరు జారీచేసే ఉత్తరువుల ప్రకారమే నడచుకోవలసిందనే మొట్టికాయకు తలబగ్గడం ఉండకూడదు. ప్రభుత్వంవారు మొదట సక్రమంగా ప్రకటించి,

ఆక్షేపణలు సలహాలు విని చేసే చిక్కులేని నిబంధనలకు లోబడి వారు పనిచేయ డానికి అవకాశము లుండవలెను.

లైబ్రరీ అథారిటీలు చేసుకునే ఉపనిబంధనలు సర్కారు మంజూరు అయిన తరువాతనే అమలులోకి రావలసినదనడం మార్చవలసి ఉంటుంది. ఉపనిబంధనలు చేసుకోవడానికి అవకాశమిచ్చి తప్పు జరిగిందన్నచోట గవర్నమెంటు సరిదిద్దటానికి అవకాశము పెట్టుకున్నామంటే సముచితంగా ఉంటుంది.

(ఝా) రాష్ట్రానికంతటికీ ఒక కేంద్ర గ్రంథాలయం, అది శాఖలతో ఏర్పడుతుందన్నప్పటికిన్నీ తృప్తికరం కాదు. ఒక్కొక్క భాషాప్రాంతానికి ఒక్కొక్క కేంద్ర గ్రంథాలయ మేర్పరచవలెను.

జిల్లాకు ఒక పెద్ద గ్రంథాలయాన్ని గవర్నమెంటు వారేర్పచి అచటనుంచి జిల్లాలోని అన్ని గ్రంథాలయాలకు పుస్తకాలు సరఫరా చేయడానికిన్నీ, అన్ని గ్రంథాలయాల సాధనసంపత్తి పరస్పరం వినియోగపడేరీతిగా కార్యము నడపడానికిన్నీ ఏర్పాటులుండవలెను.

(ఞ) గ్రంథాలయాలు నిర్వహింపవలెనన్న, వయోజనులకు విద్యాబోధ చేయవలెనన్న ప్రత్యేకం శిక్షణపొందినవారే అర్హులుగా వుంటారు. కాబట్టి అట్టి అర్హులనే నియమించడానికినీ, భాషాశాఖలద్వారా రాష్ట్రగ్రంథాలయ కమిటీ తగిన శిక్షణ ఇవ్వడానికినీ ఏర్పాటులను యీ శాసనములో యిముడ్చవలెను.

(ట) పై తీర్మానాలకు అనుగుణంగానూ ఇంకా యితర వివరాలు ఆలోచించిన్నీ, ప్రభుత్వమువారు పెట్టదలచుకున్న బిల్లుకు సవరణలు తయారుచేసి వారికి పంపడానికిన్నీ, శాసనసభ్యుల కందజేయడానికిన్నీ, ఈ శాసనసందర్భములో తగిన యితరచర్య తీసుకోవడానికిన్నీ ఉపసంఘమును నియమించడమైనది.

* * * *

(ఠ) శాసనం అమలులోకి వచ్చేలోపుగా యిప్పుడు గ్రంథాలయ సేవ యందనుభవము కలిగి, ముందుకూడా సేవచేయడానికి నిర్ణయించుకొన్నవారికి యిప్పుడే శిక్షణయిచ్చి ముందు కార్యక్రమానికి తోడ్పడే మానవబలాన్ని సమకూర్చుకోవలసిందని ప్రభుత్వానికి యీ సభవారు సూచిస్తున్నారు.

1948 ప్రత్యేక మహాసభ

# గ్రంథాలయాలు

వివిధ కార్యకలాపాలు :

ప్రతి గ్రంథాలయమందును స్త్రీలు హెచ్చుగా సభ్యులుగా చేరి గ్రంథాలయోద్యమ వ్యాపనము స్త్రీలయందుగూడ విశేషముగా కలుగులాగున చేయవలెనని ప్రజలనీ సభవారు హెచ్చరించుచున్నారు.

ప్రతి గ్రంథాలయమందును అధమము అయిదుగురైనను స్త్రీలు సభ్యురాండ్రుగా చేరులాగునను, పరిపాలనాసంఘమందిద్దరైన స్త్రీ సభ్యురాండ్రుండులాగునను, గ్రంథాలయ పరిపాలకులు ప్రోత్సహించెదరని ఈ సభవారు కోరుచున్నారు.

1934 XVII 11

గ్రామాలలోని గ్రంథాలయములచే అభివృద్ధికరమైన కార్యక్రమాలను సాగింపచేయుటకుగాను వ్యాయామము, వక్తృత్వము, వ్యాసరచన, పాటలు, చేతి పనులు వగైరాలయందు పోటీలను జరిపించి యువకులను గ్రంథాలయసేవలోనికి ఆకర్షించవలసినదిగ యీ సభవారు గ్రంథాలయములవారిని కోరుచున్నారు.

1942 XXIII 13

ప్రతి గ్రంథాలయము తమ గ్రంథాలయములోని భాండాగారిచేత ప్రతిదినమును వార్తాపత్రికలోని ముఖ్యాంశములను సామాన్యప్రజలకు చెప్పించుచుండవలయునని యీ సభవారు గ్రంథాలయములను కోరుచున్నారు.

1942 XXIII 18

వయోజనవిద్యావ్యాప్తికిని, విజ్ఞానాభివృద్ధికిని గ్రంథాలయముల స్థాపించి ప్రచారముచేయుచున్న ప్రతిపట్టణ, గ్రామగ్రంథాలయసంఘములవారున్నూ, నిరక్షరాస్యతా నిర్మూలనము చేయుటకు వయోజన రాత్రి పాఠశాలలు స్థాపించి నడుపవలసినదిగ ఈ సభవారు కోరుచున్నారు.

1941 ఆం. దే. వయోజనవిద్యా మహాసభ 10

ప్రపంచ వాఙ్మయములో సంస్కృత వాఙ్మయము ప్రాచీనము. అందలి గ్రంథములు సర్వోత్తమములు. సంస్కృతవిద్య క్షీణించుటవలన అనర్థము కలుగుచున్నది. కాన ఉన్నత ప్రాథమిక పాఠశాలలందు పై తరగతులలో సంస్కృత విద్యను నిర్బంధముగ ఏర్పాటుచేయవలయునని యీ సభవారు తీర్మానించుచున్నారు. ప్రతి గ్రంథాలయమందును సంస్కృతవిద్యను బోధించుటకు తత్తదధికారులు తగిన ప్రయత్నములు చేయవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

1942 XXIII 17

వ్యవసాయ విజ్ఞానం :

రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారు వ్యవసాయ విజ్ఞాన ప్రచారవిషయమై గావించు కృషి నీ మహాసభవారభినందించుచు వారి గ్రంథముల తమ తమ గ్రంథాలయములలో నుంచి రైతు లోకములో వీనిని వ్యాపింపజేయవలసినదిగ ఆంధ్ర దేశములోని గ్రంథాలయ నిర్వాహకుల నీసభవారు గోరుచున్నారు.

1942 XXIV 11

హిందీప్రచారం :

ప్రతి భారతీయునకు ముఖ్యమైనటువంటియు, అవసరమైనటువంటి భాషయగు హిందీభాషను అభివృద్ధిచేయుటకు సాధ్యమైనంత శ్రద్ధతో గ్రంథాలయమున కను బంధముగ హిందీ పాఠశాలను స్థాపించి రాష్ట్రభాషను అభివృద్ధిచేయవలయునని యీ సభవారు కోరుచు, ప్రతి గ్రంథాలయముగూడ హిందీభాషాభివృద్ధికి హిందీ గ్రంథములుగూడ గలిగియుండవలయునని యీ సభవారు కోరుచున్నారు.

1931 XIV 10

గ్రంథాలయోత్సవాలు :

గ్రంథాలయోద్యమమునకు నూతన వికాసమును ఉత్సాహమును కలిగించుటకుగాను గ్రంథాలయ మహోత్సవము అనుపేరున సంవత్సరమునకొక వారము దినములు పండుగ దసరాలో జరుపుటకును, అపుడు సరస్వతీపూజ, గ్రంథాలయ భిక్షలు, ఉపన్యాసములు, ప్రదర్శనములు, ఊరేగింపులు జరుపవలెననియు ఆంధ్ర దేశ గ్రంథాలయములన్నిటిని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

1933 XV 2
1934 XVII 6

ఆంధ్ర వాఙ్మయములోని ముద్రితా ముద్రిత గ్రంథములకు సారస్వత సాధనములను సేకరించుటకుతోడు, ఆంధ్రదేశ గ్రంథాలయములన్నియు, ఆంధ్రుల ప్రత్యేకవ్యక్తిత్వమును, కళలను, ఆచారములను, పండుగలను, వర్ధంత్యుత్సవములను ప్రోత్సాహపరచు సాధనములను అవలంబించుటకును తమకు సంబంధించిన రాత్రి పాఠశాలలు మున్నగువానియందు ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వమును కళారూపమును తెల్పు విద్యావిధానము నవలంబించుటకును యీ సభవారు తీర్మానించుచున్నారు.

1931 XIV 8

గ్రామచరిత్ర :

ప్రతిగ్రామమందలి గ్రంథాలయ సంఘమువారు తమ గ్రామముల తాలూకు

పూర్తి చరిత్రను తయారుచేసి తాలూకా, జిల్లా, రాష్ట్రగ్రంథాలయ సంఘములకు పంపించగలందులకు యీ సభవారు ప్రార్థించుచున్నారు.

1935 XX 7

గ్రంథాలయ రిజిస్టర్లు :

గ్రంథాలయ కార్యనిర్వాహక వర్గమువారలు అందరు అన్ని గ్రంథాలయములలోను ఉంచబడిన రిజిష్టర్లు అన్నీ ఒకేమాదిరిగా నుంచునటులను, ఏఏ రిజిష్టర్లు ఎలా ఉంచవలెనో వాటి తఖ్సీళ్ళను నియమించవలెనని యీ సభవారిని కోరడమైనది.

1935 XX 9 (అ)

పత్రిక :

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ప్రచురించు గ్రంథాలయ పత్రికను, ఇతర వాఙ్మయమును తెప్పించుకొని తమపని నెక్కువ దక్షతతో నిర్వహించుకొనవలసినదిగ ఆంధ్రదేశమునందలి గ్రంథాలయ పఠనాలయములను, గ్రంథాలయ సేవకులను ఈ సభవారు కోరుచున్నారు.

1942 XXIV 8

దాతృత్వం :

గౌతమీ గ్రంథాలయమునకు ఇదివరలో అమూల్యమగు విరాళమునిచ్చి ఆంధ్రదేశ ధర్మగ్రంథాలయ ఉద్యమమునకు ప్రోత్సాహముగలుగజేసిన శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారు ఆ గ్రంథాలయముయొక్క స్త్రీ శాఖకు మరల రు 20,000 లొసంగి మహోపకారముజేసినందులకు, శ్రీవారికి యీ సభవారు కృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచున్నారు.

1928 XII 6

గ్రంథాలయశిక్షణ :

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారిచే నిర్వహింపబడు గ్రంథాలయ శిక్షణ తరగతులలో చేరి తమ పనిలో ప్రవీణతను సంపాదించి తమ విధిని చక్కగ నెరవేర్చుటకై గ్రంథాలయముల నిర్వాహకుల నీ సభవారు హెచ్చరించుచున్నారు.

1942 XXIV 7 (అ)

# వయోజనవిద్య

ప్రభుత్వ నిషేధాలు, నిర్బంధనలు

ఆంధ్రరాష్ట్రమందు వివిధ సంఘాల ఆధిపత్యాన నడుపబడుచున్న వయోజన విద్యాలయాలమీద ప్రభుత్వమువారు జూన్ 11 వ తేది అమలుజరిపిన నిషేధాజ్ఞ సామాన్య పౌరసత్వహక్కులనే భంగపరచుచున్నది ప్రజాస్వామ్యంకోసం పోరాడు తున్నామనే బ్రిటిష్ గవర్నమెంటు యీ మాత్రపు ప్రజాహక్కులనుగూడ తొలగించుట అన్యాయము, అక్రమము కాన ఆ నిషేధాజ్ఞను వెంటనే ఉపసంహరించుకో వలసినదిగ ఈ సభవారు మద్రాస్ ప్రభుత్వమువారిని హెచ్చరించుచున్నారు.

1941 ఆం దే వయోజనవిద్య మహాసభ, తెనాలి 4

ఇప్పుడిప్పుడే మొలకెత్తుచున్న వయోజన విద్యాప్రచారమునకు ప్రభుత్వము వారు చేసిన నిషేధము దేశాభివృద్ధికి గొడ్డలిపెట్టు కావున సర్కారువారు మరల నాలోచించి యీ నిషేధమును ఉపసంహరించుకొనవలయునని యీ సభవారు కోరు చున్నారు.

1942 XXIII 3

వయోజనవిద్యాప్రచారకులైన చాలమంది విద్యార్థులను మన రాష్ట్రములో ప్రభుత్వము ఎట్టి విచారణగాని లేకుండా నిర్బంధములో ఉంచడాన్ని ఈ సభవారు ఖండించుచున్నారు నిర్బంధములోనున్న వయోజనవిద్యాప్రచారకులను ఎట్టి షరతులు లేకుండా వెంటనే విడుదల చేయవలెనని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరు చున్నారు

1941 ఆం. దే. వయోజనవిద్యా మహాసభ 7

ఆంధ్రరాష్ట్రములోని జిల్లాబోర్డులు, పురపాలకసంఘములు, పంచాయతీ బోర్డులు, ఇతర ప్రజాసంస్థలవారును వయోజనవిద్యా ప్రచారమును నిరోధించు మద్రాసు గవర్నమెంటువారి చర్యను గర్హించుచూ, వారి ఉత్తర్వును రద్దుపరచ వలసినదిగ తాము తీర్మానించి ప్రభుత్వమువారికి పంపవలయునని ఈ సభవారు కోరుచున్నారు

1941 ఆం దే వయోజనవిద్యా మహాసభ 11

వయోజనవిద్యా ప్రచారంపై నిషేధం తొలగించవలసినదిగ ప్రభుత్వాన్ని కోరుచు అన్నిగ్రామాలలోను, తాలూకాలలోను, జిల్లాలలోను ప్రజాశ్రేయస్సుకోరే అన్ని సంస్థలనుండి ఎన్నుకోబడ్డ ప్రతినిధులతోను, విద్యావ్యాపక విషయములో కృషిచేయు బాధ్యతగల వ్యక్తులతోను కలసియున్న సంయుక్తరాయబారవర్గాల

నేర్పఱచి ప్రభుత్వమువద్దకు రాయబారాలు నడపుతూ నిరంతరము ప్రభుత్వం నిషేధాజ్ఞను తొలగించేవరకు ప్రజాందోళన - సభలద్వారా, అసమ్మతి ప్రదర్శనాల ద్వారా - సాగించుచుండవలయును.

ప్రత్యేకంగా రాష్ట్రాంతరపున పై చెప్పినవిధముగానే ప్రజాసంస్థలనుండి - అనగా యువజన, విద్యార్థి, గ్రంథాలయ, రైతు, కార్మిక, మహిళాసంఘములనుండి ప్రతినిధులతోకూడిన రాయబారవర్గమును ఏర్పఱచి ప్రభుత్వమువద్దకు పంప వలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

రాయబారవర్గ సభ్యులు :

1. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, కన్వీనరు.
2. గోపరాజు రామచంద్రరావుగారు
3. చెరుకూరి చలపతిరావుగారు
4. కాట్రగడ్డ రాజగోపాలరావుగారు
5 రావి సత్యనారాయణగారు
6. గోగినేని భారతీదేవిగారు
7. బచ్చు జగన్నాథదాసుగారు
8. మద్రాసు విద్యార్థి సంఘసభ్యులొకరు

1941. ఆం. దే. వయోజనవిద్యా మహాసభ 5

విద్యాశాఖాధికారి ప్రసంగానికి ఆక్షేపణ :

ప్రపంచమందున్న అన్నిదేశాలలోను వయోజనవిద్యకై ఎంతయో ధనము వెచ్చిస్తూవున్న ఈరోజుల్లో -

"నిజమునాలోచించిన యెడల బడికిపోయెడువయసుదాటి పెద్దవారైనవారికి విద్యను గరపుటకై ధనమును ఖర్చుచేయుట నిరర్థకమేమోననియు, మంచిది కాద నియు తోచుచున్నది." అని బాధ్యతాయుతుడయ్యును మనరాష్ట్ర విద్యాశాఖాధికారి గుంటూరులో మాట్లాడుట చాల సంకుచితదృష్టితో నున్నదని ఈ సభవారు గర్హించుచు, వారికముందు సరియైనదృష్టితో వయోజనవిద్యకు తగిన ప్రోత్సాహమివ్వ గలరని నమ్ముచున్నారు.

1941 ఆం. దే. వయోజనవిద్యా మహాసభ 8

రాత్రిపాఠశాలలస్థాపన :

ప్రతి గ్రంథాలయ నిర్వాహకముక్రింద ఒకరాత్రి పాఠశాలను స్థాపించి

విద్యాశాఖాధికారుల అనుమతిపొంది ప్రభుత్వ ధనసహాయమును పొందుచు, జనసామాన్యమునందు వయోజన విద్యావ్యాప్తిని గావించవలెనని గ్రంథాలయ నిర్వాహకులను ఈ సభవారు కోరుచున్నారు.

1942 XXIII 14

గ్రామాలలో రేడియోలు :

దేశములో వెయ్యిజన సంఖ్యకు మించిన గ్రామములలోనైనను సంచార రేడియోలను యేర్పాటుచేసి గ్రంథాలయములు చేయు వయోజనవిద్యావ్యాప్తికి తోడ్పడవలెనని యీ సభవారు మద్రాసు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

1942 XXIII 6

స్థాయీసంఘము :

వయోజనవిద్యా ప్రచారాన్ని జయప్రదంగా కొనసాగించుటకవసరమైన కార్యకలాపాన్ని నెరవేర్చుటకు ఒక స్థాయీసంఘమవసరమని అభిప్రాయపడుచూ, క్రింది వారిని స్థాయీసంఘముగా ఏర్పాటుచేయుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

స్థాయీసంఘ సభ్యులు :

1. గా. హరిసర్వోత్తమరావుగారు – అధ్యక్షులు
2. గో. రామచంద్రరావుగారు – ఉపాధ్యక్షులు
3. చె. చలపతిరావు ,, – కార్యదర్శి
4. జి. యస్. బాలాజీదాస్ ,,
5. సి. వీరరాఘవస్వామి ,,
6. వై. ప్రభాకరరావు ,,
7. పి. వేంకటేశ్వర్లు ,,
8. కె. రాజగోపాలరావు ,,
9. జి. వి. సుబ్బారావు ,,
10. మానికొండ సూర్యావతి ,,
11. మారేపల్లి రామచంద్రశాస్త్రి ,, సభ్యులు

1941 ఆం. దే. వయోజనవిద్యా మహాసభ 6

# ఆంధ్ర విశ్వవిద్యాలయం

విద్వాన్ పరీక్షలు

ఆంధ్ర విశ్వవిద్యాలయములవారు తమ ప్రాచ్యవిషయ పరీక్షలలో తెలుగు ప్రధానముగాగల పార్టు "బి" విద్వాన్ పరీక్షను, ద్రవిడ భాషా పాండిత్యమునకై ఇచ్చు పార్టు "సి" విద్వాన్ పరీక్షను తీసివేసియును, తెలుగు పాండిత్యమునకై బిరుదు నిచ్చునట్టి పార్టు "డి" విద్వాన్ పరీక్షను అసలే పెట్టకుండను చేసి తెలుగు భాషయెడ నిరాదరణ చూపినందులకై ఈ సభవారు తమ విచారమును వెల్లడించుచున్నారు

తెలుగు భాషా పాండిత్యమును దేశములో విస్తరింపజేయుటకుగాను మదరాసు విశ్వవిద్యాలయముయొక్క ప్రాచ్యభాషా పరీక్షల విద్యాప్రణాళికకు సమానముగ పార్టు బి, సి, డి విద్వాన్ పరీక్షలను ఆంధ్రదేశగ్రంథాలయసంఘ పక్షమున జరుపుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు

సదరు పరీక్షలను అమలులో పెట్టుటకు కావలసిన కార్యక్రమము ఈ సంఘ పక్షమున నిర్వహించుటకు ఉపసంఘమేర్పాటుచేయడమైనది

1935 XX 3

గ్రంధ భాండాగారియొక్క తరిబీతు పరీక్షను ఆంధ్ర విశ్వవిద్యాలయమందు పెట్టుదురని యీ సభవారు కోరుచున్నారు

1934 XVII 3

గ్రంధ భాండాగారి తరిబీదు శిక్షణ తరగతులను వెంటనే ప్రారంభించుట అవసరమని ఈ సభవారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారిని కోరుచున్నారు.

1934 XIX 14

మద్రాసు, కలకత్తా విశ్వవిద్యాలయముల వారివలె, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారుగూడా గ్రంధ భాండాగారుల తరగతులను ఏర్పరచవలయునని యీ సభవారు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిని కోరుచున్నారు

1942 XXIII 16

ఇతర విశ్వవిద్యాలయములు క్రొత్తగ గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పాటు చేయుచుండగ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు కొంతకాలము వీనిని సాగించి నిలిపివేసినందులకీ సభవారు తమ విచారమును వెలిబుచ్చుచు, తిరిగి గ్రంథాలయ శిక్షణ తరగతులను వెంటనే ప్రారంభించవలసినదిగ ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులను కోరుచున్నారు

1942 XXIV 4

గ్రంథాలయ సహకారం :

చెన్నపురిలోనున్న కెనిమెరా లైబ్రరీవారివలెనే, మన ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులును ఆంధ్రరాష్ట్రీ గ్రంథాలయములనన్నిటిని తమకు జేరికగా జేసికొని ఆ యా గ్రంథాలయములకు వలయు గ్రంథములను బదులుగా నిచ్చిపుచ్చుకొనుటలు జరుపుటకై తమ సమ్మతిని దెలుపగలందులకు ఈ సభవారు కోరుచున్నారు.

1934 XVII 8
1934 XIX 9

స్థానికచరిత్రల ఉద్ధరణ :

మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోనున్న, ఆంధ్రదేశపు ప్రాచీన చారిత్రక సాంఘిక సారస్వతాది చరిత్రాంశములకు నిధానమనదగిన లోకల్ రికార్డ్సు వాఙ్మయమును చాల జీర్ణదశలోనున్నను, అమూల్యములు అలభ్యములై యున్నను; వాని నుద్ధరించి ప్రచురింపవలసినదిగా పెక్కురోజులనుండి ఆంధ్రులు కోరుచున్నను యింతవరకెట్టి ప్రయత్నమును గావింపని మద్రాసు ప్రభుత్వమువారి చర్యకు విచారపడుచు, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారుగాని, అథవా ఆంధ్ర మహాశయులైనను వాని నుద్ధరించుటకు వెంటనే పూనుకొందురుగాక యని యీ సభవారు తీర్మానించుచున్నారు.

1931 XIV 9

గ్రంథాలయ పరిశీలకుని నియామకము :

ఆంధ్ర యూనివర్సిటీ యేరియాలోని కళాశాలా పాఠశాలా గ్రంథాలయములను, ఆంధ్రదేశమునందలి తదితర గ్రంథాలయములను పరిశీలించి, వాని సక్రమ నిర్వహణకు తోడ్పడు సలహాలనొసంగుటకై సమర్థుడగు నొక సుశిక్షిత గ్రంథభాండాగారి నేర్పాటుచేయవలసినదిగ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి నీమహాసభవారు కోరుచున్నారు.

1942 XXIV 5

ఆచార్యులకు తెలుగుభాషలో పాండిత్యం :

ఆంధ్ర విశ్వవిద్యాలయములోని వివిధ శాస్త్ర శాఖలకు నియమింపబడినట్టియు, ఇకముందు నియమింపబడునట్టియు ఆచార్యులను తెలుగుభాషలో పాండిత్యము సంపాదించి వ్రాయుటకు, ఉపన్యసించుటకు కృషిచేయవలయునని ఈ సభవారు సవినయముగా మనవిచేయు చున్నారు.

1935 XX 4

**పుస్తకాల రిజిస్ట్రేషను :**

ముద్రాలయములలో ముద్రింపబడు గ్రంథములలో మూడేసి ప్రతుల చొప్పున గైకొనుచు వానిని తమకు దోచినరీతిని పంపుచున్న దొరతనమువారిని నాల్గవ ప్రతికూడ గైకొనుచు నయ్యది యాంధ్రులకుపయోగపడునట్లు ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకో ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమునకో పంపుచుండగలందులకు దగిన శాసనముల నిర్మించుటకై శాసన సభ్యులను ఈ సభవారు కోరుచున్నారు.

1934 XVII 9

# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

**సభ్యత్వము :**

ఆంధ్రదేశములోని గ్రంథాలయముల అభివృద్ధికై చిరకాలమునుండి విడువక కృషిసల్పుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమున దేశమునందలి గ్రంథాలయములు, పఠన మందిరములు, స్థానిక సంస్థలు, సహకారసంఘములు, విద్యాభిమానులగు వ్యక్తులు సభ్యులుగచేరి ఆంధ్ర జాతీయ వికాసమునకు, గ్రంథాలయోద్యమాభివృద్ధికి తోడ్పడవలసినదిగ ఈ సభవారు ఆంధ్రదేశీయులను, ఆ యా సంస్థల నిర్వాహకులను కోరుచున్నారు.

1942 XXIV 6

**పునరుద్ధరణ :**

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమును స్థాపింపజేయుటకును, గ్రంథాలయములను సర్వజనోపయోగకరముగను జనాకర్షముగను చేయుటకును కావలసిన విధానమును దేశమందంతటను వ్యాపింపజేయుటకు యేర్పడిన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును పునరుద్ధరించుటయును, "గ్రంథాలయ సర్వస్వమును" తిరిగి ప్రారంభించుటయును ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమాభ్యుదయమునకు అత్యంతావశ్యకముగనుక, ఆంధ్రులెల్లరు అట్టి ప్రయత్నములకు తోడ్పడవలయునని యీ సభవారు ప్రార్థించుచున్నారు. ఆంధ్రదేశమందంతటను గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకై సంచార కార్యదర్శి నొకరినైన నేర్పాటుచేయవలసినదనియు, దానికి కావలసిన ద్రవ్యమును సమకూర్చుటకు అందరును సహాయపడెదరనియు యీ సభవారు ప్రార్థించుచున్నారు.

1931 XIV 7

సేవాశాఖ స్థాపన :

ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమవ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునకు అనుబంధముగ సేవాశాఖను స్థాపించుటకు తీర్మానించడ మైనది.

1934 XVIII 1

జిల్లా, తాలూకా గ్రంథాలయసంఘములు :

ఆంధ్ర గ్రంథాలయోద్యమమును నూతన వికాసముతో, తేజోవంతముగ విజ్ఞాన ప్రచారము సల్పుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు శాఖలుగ వివిధ జిల్లాలయందును, తాలూకాలయందును సంఘములు ఏర్పడవలయుననియును, స్థానికసంస్థలు, సహకార సంఘములు, పంచాయతులు, గ్రంథాలయములు, గ్రంథాలయాభిమానులు – ఆ సంఘమునందు సభ్యులుగా చేరవలయుననియు ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

1933 XV 5

ఆంధ్రదేశమున జిల్లా తాలూకా గ్రంథాలయసంఘముల నెలకొల్పుటకై ఉపసంఘము నొకదానిని ఏర్పరచుటకు ఈ సభవారు తీర్మానించు చున్నారు.

1934 XIX 4

గ్రంథాలయములను పునరుద్ధరించుటకుగాను జిల్లా గ్రంథాలయ సంఘములను విద్యాభిమానులగు సభ్యులతో యేర్పాటుచేయవలయునని ఆ యా జిల్లా కాంగ్రెసు సంఘములవారిని యీ సభవారు కోరుటకు తీర్మానించడమైనది.

(గుంటూరు మండల గ్రంథాలయసంఘమును స్థాపించుటకు ఒక యువ సంఘమునేర్పాటు చేయడమైనది. వీనిసభ్యులు 1. గ్రంధి వెంకట సుబ్బారాయ శర్మ, 2. మట్టా అల్లూరయ్యగుప్త, 3. వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు.)

1931 XIV 11

గ్రంథాలయ యాత్ర :

ఆంధ్రదేశమంతయు గ్రంథాలయ యాత్రలద్వారా గ్రంథాలయోద్యమమును వ్యాపింపచేయవలసినదని యీ సభవారు తీర్మానించుచు వా. గోపాలకృష్ణయ్యగారి నాయకత్వమున పశ్చిమాంధ్రజిల్లాలకు సైకిళ్ళమీద గ్రంథాలయ యాత్ర పంపుటకు తీర్మానించడమైనది.

1935 XX 10

కరపత్రముల ప్రకటన :

జనసామాన్యమున కుపకరించు వివిధ విషయములపై ప్రవీణులచేత కరపత్రములు వ్రాయించి గ్రంథాలయములద్వారా వీనిని ప్రచారము చేయవలసినదిగ ఈ మహాసభవారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారిని కోరుచున్నారు.

1942 XXIV 9

గ్రంథాలయ రిజిష్టర్లు :

గ్రంథాలయ రిజిష్టర్లను సాధ్యమైనంత త్వరలో తయారుచేసి అచ్చువేయించవలసినదిగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారిని యీ సభవారు కోరుచున్నారు.

1942 XXIII 15

గ్రంథాలయాల పట్టిక :

ఆంధ్రదేశమున నున్న గ్రంథాలయములయొక్క పట్టికను త్వరలో ప్రకటించుట మిక్కిలి అవసరముగాన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువా రీ కార్యమును త్వరలో నెరవేర్చవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

1934 XIX 3

నివేదికలు - లెక్కలు :

ఇటుపై జరుగు సంవత్సర సభలలో జరిగిన సంవత్సరముల కార్యక్రమమును, ఆదాయ వ్యయపట్టికను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు తప్పక ప్రకటించుచుండవలెనని యీ సభవారు కోరుచున్నారు.

1934 XIX 6

ఆంధ్ర గ్రంథాలయోద్యమంపై అన్యాయ విమర్శ :

"ఆంధ్రదేశమందున్న గ్రంథాలయ ఉద్యమమునుగూర్చి ఆవంతయైన దెలిసికొనకుండ ఆంధ్రదేశమందు వందలకొలది గల గ్రంథాలయములు పెక్కు వత్సరములనుండి జగద్విఖ్యాతముగ పనిచేయుచుండుటను గమనింపజాలక, ఆంధ్రదేశ గ్రంథాలయ ఉద్యమము యొక్కయు, ఆంధ్రదేశ గ్రంథాలయముల యొక్కయు ప్రతిష్ఠకు భంగకరమగునటుల మద్రాసు "గ్రంథాలయ సంఘము"వారు నూతనముగా ప్రచురించిన "గ్రంథాలయ శాస్త్రముయొక్క అయిదు చట్టములు (The five laws of Library)" అను గ్రంథమునందు ఆంధ్రదేశమందలి గ్రంథాలయ ఉద్యమమునుగూర్చి వ్రాయుచు,

"ఆంధ్రదేశమందు గడచిన పది సంవత్సరముల ఆఖరున గ్రంథాలయము లకు సుభిక్షమైన పంట పండినది. కాని కొంతవరకు రాజకీయ ఉద్యమమందు కలిసి పోయి దానియొక్క విపర్యయమువలన అణగిపోయి క్రమముగా నశించుచున్న కొన్ని శేషములను మాత్రము మనము చూచుచున్నాము. (We see a few decaying remnants of a bumper crop of libraries that shot forth at the close of the last decade in the land of the Andhras, but soon got strangled, partly as a result of the vicissitudes of the political movement with which they got intertwined)" అని అప్రస్తుతముగా వ్రాసినందులకు ఈ సభ వారు మిక్కిలి గర్హించుచు, అన్యాయముగ వ్రాసిన సదరు వ్రాతను తమ గ్రంథము నుండి తీసివేయవలసినదని సదరు మద్రాసు గ్రంథాలయ సంఘమువారిని ఈ సభ వారు కోరుచున్నారు.

1933 XV 13

# వివిధములు

అభినందనలు, సన్మానాలు :

గ్రంథాలయోద్యమ సోదరులలో ప్రముఖులగు శ్రీ విక్రమ దేవవర్మగారు జయపుర సంస్థానాధీశ్వరులైనందులకు యీ సభవారు సంతసించుచున్నారు.

1931 XIV 12

ఆంధ్ర భాషోద్ధరణకై పాటుపడిన వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, వెంకటేశ్వర శాస్త్రులుగారియొక్క సేవను ఈ సభవారు ఉగ్గడించుచు, ఆంధ్ర దేశీయులు వారికి ఉచితరీతిని సన్మానము చేయుదురని ఈ సభవారు హెచ్చరించు చున్నారు.

1934 XVII 5

విశ్వదాత, జ్ఞానదాత, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారికి ది 30-4-37 తేదీకి 70 సంవత్సరముల వయస్సు పూర్తియగును గావున అప్పటికి యావదాంధ్ర మండలి పక్షమున శ్రీవారిని సన్మానించుటకు తగిన ప్రయత్నములు చేయవలసినదని ఈ సభవారు తీర్మానించుచున్నారు. మరియు అట్టి సన్మానము చేయదగిన ఈ క్రింది మార్గములనుకూడ ఈ సభవారు సూచించు చున్నారు.

(క) శ్రీవారి పటమును ఆంధ్రదేశ గ్రంథాలయములందును, పట్టణము లందుండు పౌరమందిరములందును ప్రకటింపజేయుట.

(చ) సర్వతోముఖమైన ఆంధ్రదేశ సౌభాగ్యమును ప్రస్ఫుటింపజేయగల సంపుటము నొకదానిని తయారుచేసి ఆ నాటికి శ్రీవారికి సమర్పించుట....

1935 XX 5

# వివిధములు

ఆంధ్రరాష్ట్రము :

ఆంధ్ర విజ్ఞాన, ఆర్థిక, సాంఘికోన్నతికి ఆంధ్రదేశమునంతటిని ప్రత్యేకించుట అత్యవసరముగాన ఆంధ్రరాష్ట్రమును వెంటనే యేర్పరచ వలయునని, యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

1933 XV 12 (క)

ప్రత్యేకాంధ్రరాష్ట్ర మవసరమని యీ సభవారభిప్రాయ పడుచు రాష్ట్ర నిర్మాణమునకై తగు ఏథముల పాటుపడవలెనని దేశీయులెల్లరను గోరుచున్నారు.

1934 XIX 17 (బి)

ఆంధ్రరాష్ట్రములోని ముఖ్యప్రాంతములగు జయపురం, పర్లాకిమిడి, బరంపురం మొదలగు ముఖ్యాంధ్రప్రదేశమును నూతన ఒరిస్సా రాష్ట్రములో చేర్చుచు ఆంధ్రాభ్యుదయమునకు ఆంధ్ర విజ్ఞానాభివృద్ధికి తీరని నష్టము కలిగించిన జాయంటు పార్లమెంటరీ కమిటీవారి సలహాను తీవ్రముగా ఖండించుచు అట్టి సలహాను ఉపసంహరించుకొనునటుల ఆంధ్రులెల్లరును ప్రచండాందోళన జరుపవలెనని ఈ సభవారు ఆంధ్రదేశీయులను కోరుచున్నారు.

1934 XIX 17 (ఎ)

గ్రంథప్రచురణ :

ఆంధ్రదేశమందు వివిధ ప్రాంతములలో నేడు ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికై స్వసహాయమున గౌతమ ధర్మసూత్రములు, న్యాయవైశేషిక దర్శనములు, బ్రహ్మసూత్రములు, కావ్యాదర్శాదులగు నలంకార గ్రంథములు మున్నగువానిని పరివర్తించియు, ప్రకటించియు పెక్కువిధముల భాషాభివృద్ధికి తోడ్పడుచున్న పండితులను ప్రకాశకులను యీ సభవారు అభినందించుచున్నారు.

1931 XIV 15

రాచకీయ గ్రంథములను ప్రత్యేకముగా ప్రకటించుటకును దానికి తగిన ధనమును సమకూర్చుటకును యీ క్రిందివారిని ఉపసంఘముగా నేర్పాటు చేయుటమైనది.

మఠం బాలసుబ్రహ్మణ్యగుప్త, ప్రభల చంద్రశేఖరం, రాళ్ళబండి చంద్రమౌళి, కల్లూరి చంద్రమౌళి, అయ్యదేవర కాళేశ్వరరావు, న్యాయపతి నారాయణమూర్తి, కందాళం సర్వేశ్వరశాస్త్రి, కల్లూరి సుబ్బారావు, బెజవాడ గోపాలరెడ్డి, గొట్టిపాటి బ్రహ్మయ్య, ఆత్మకూరి గోవిందాచార్యులు, అయ్యంకి వెంకటరమణయ్య, వంకా సూరిశాస్త్రి, వప్పూరి రామాచార్యులు, మల్లిమడుగుల జగన్నాథస్వామి, గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగార్లు సభ్యులు. మంతెన వెంకట్రాజు, కటికనేని హనుమంతరావుగార్లు కార్యదర్శులు.

1931 XIV 14

కీ. శే. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జీవితచరిత్ర రచించిన గుమ్మడిదల సుబ్బారావుగారిని, శ్రీవారి గ్రంథములన్నియు ప్రచురించిన ఆంధ్ర విద్యాపీఠగోష్ఠివారిని ఈ సభవారు అభినందించుచు శ్రీవారి గ్రంథరాజములను ఆంధ్రదేశములోనున్న వివిధ గ్రంథాలయములవారు వారి గ్రంథాలయములందు ఉంచుట అవసరమని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

1934 XIX 5

ఆంధ్రదేశమునందలి గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు మన పూర్వగ్రంథములను ప్రచురించుటయేగాక ఆధునికమగు వివిధ శాస్త్రవిషయములపై గ్రంథములను వ్రాసి, వ్రాయించి, ప్రచురించి చౌకగ జనుల కందజేయు విషయమై శ్రద్ధ వహించవలసినదిగ ఈ మహాసభవారు కోరుచున్నారు.

1942 XXIV 10

దేవాదాయ, ధర్మాదాయ సంస్థలు :

హిందూ దేవాలయబోర్డువారిచే నియమింపబడిన దేవాలయ ట్రస్టీలు దేవాలయ నిధులనుండి గ్రంథాలయములు నెలకొల్పి, భాషాభివృద్ధి చేయించవలెనని బోర్డు వారినిన్ని, ట్రస్టీలను కోరడమైనది.

1935 XX 8 (అ)

గ్రంథాలయ శిక్షణ :

ఆంధ్రదేశమునందు గ్రంథాలయ శిక్షణ తరగతులను విరివిగ నడపుటకు విద్యాపోషకులగు శ్రీశ్రీశ్రీ జయపురం మహారాజా విక్రమదేవవర్మగారిని ఉదారముగ విరాళము నిప్పించవలసినదని ఈ మహాసభవారు ప్రార్థించుచున్నారు.

1942 XXIV 7 (ఇ)

అనుబంధము : ౧

# మహాసభల సంగ్రహ వృత్తాంతము

## [౧౧]

30-11-1926 వ తేదీన ఏలూరులో జరిగిన పదకొండవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభకు శ్రీ నాళం కృష్ణారావుగారధ్యక్షత వహించిరి. దీని ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ మాగంటి బాపినీడుగారు సభవారికి స్వాగతం చెప్పిరి.

## [౧౨]

అనంతపురంలో 1927 వ సం.లో జరిగిన ఇతరసభలతోపాటు పండ్రెండవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ జరిగినది. దీనికి శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారధ్యక్షత వహించిరి.

## [౧౩]

పదమూడవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ 28-7-1928 వ తేదీన గుంటూరునందలి హిందూ హైస్కూలు భవనమున జరిగినది. శ్రీయుత చెన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారధ్యక్షతవహించిరి. శ్రీ దేశరాజు హనుమంతరావు పంతులుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగనుండి సభవారికి స్వాగతంచెప్పిరి. వివిధ మండలములనుండి ప్రతినిధులు మహాసభకువిచ్చేసిరి. మొత్తం 7 తీర్మానములు చేయబడినవి. ఈ మహాసభ వివరాలు గ్రంథాలయసర్వస్వము 7 వ సంపుటం 2 వ (1928 ఆగస్టు) సంచికలో ఉన్నవి.

## [౧౪]

పదునాలుగవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 30-6-1931 వ తేదీన గుంటూరులో జరిగినది. అధ్యక్షులు డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు. ఈ మహాసభ ఆంధ్రమహాసభలతోపాటు జరుపబడినది. మొత్తం 15 తీర్మానములను సభవారామోదించిరి.

## [౧౫]

పదునేనవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ బెజవాడలోని శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగారమునందు 1933 ఆగస్టు 10, 11 తేదీలలో జరిగినది.

శ్రీ భూపతిరాజు సీతారామరాజుగారు అధ్యక్షతవహించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ గోపు రామచంద్రరావుశ్రేష్ఠిగారు స్వాగతంచెప్పిరి. శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మి నరసింహారావు సభను ప్రారంభించిరి. అధ్యక్షుల ఉపన్యాసానంతరం మదరాసు గ్రంథాలయచట్టమునుగూర్చి నివేదిక తయారుచేయుటకు ఒక ఉపసంఘమును, గ్రంథ భాండాగారులకు ఇయ్యవలసిన తరిబీతును గురించి నివేదిక తయారుచేయుటకు మరొక ఉపసంఘమును ఏర్పాటుచేసిరి.

మధ్యాహ్నం జరిగిన సమావేశములో శ్రీయుతులు వంగిపురపు జగన్నాథరావు, కలిదిండి నరసింహరాజు, మిస్ సామియేలు (మదరాసు స్త్రీలకళాశాల గ్రంథభాండాగారిణి)గార్లు గ్రంథాలయోపయోగములనుగురించియు, శ్రీ యాతగిరి లక్ష్మివెంకటరమణగారు 'వయోజనవిద్యావశ్యకత'ను గురించియు ఉపన్యసించిరి. ఉదయం ఏర్పాటుచేసిన ఉపసంఘములు సమర్పించిన నివేదికలను సభవారామోదించినపిమ్మట మొత్తం 13 తీర్మానములనుగావించిరి.

11-8-33 వ తేదీ ఉదయం జరిగిన సమావేశంలో అంగలూరునందలి మేరీగ్రంథలయ కార్యదర్శిని శ్రీమతి అట్లూరి సీతమ్మగారు 'గ్రంథాలయోద్యమమున తమకుగల అనుభవమును గూర్చియు శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు "స్త్రీల గ్రంథాలయము"లను గురించియు శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరంగారు "గ్రంథాలయ పరిపాలనయందు గ్రంథాలయశాస్త్రం" ఉపయోగమునుగురించియు ఉపన్యసించిరి.

ఈ మహాసభ వృత్తాంతము గ్రంథాలయసర్వస్వము 1934 జనవరి సంచిక (9 వ సంపుటము మొదటి సంచిక)లో ప్రచురించబడినది.

## [ ౧౬ ]

ఆంధ్రగ్రంథాలయోద్యమ రజతోత్సవ మహాసభను ౧౬ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభగ పరిగణించడమైనది. ఇది బెజవాడలోని శ్రీ రామమోహన ధర్మపుస్తక భాండాగారమున 1933 ఆగస్టు 11,12 తేదీలలో సమావేశమైనది. దీని అధ్యక్షులు శ్రీ చట్టి నరసింహారావుపంతులుగారు. ప్రారంభకులు శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరుగారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ తుమ్మలపల్లి జగన్నాథంగారు. దేశంలోని వివిధ ప్రాంతాలనుండి మహాసభవిజయాన్ని కాంక్షిస్తూ సందేశములు వచ్చినవి. వీనిని పంపినవారిలో బరోడా గ్రంథాలయాధికారి శ్రీన్యూటన్ మోహన్‌దత్తు, మద్రాసు గ్రంథాలయసంఘము, శ్రీ మాడపాటి హనుమంతరావు (హైదరాబాదు), మైసూరుపబ్లిక్ లైబ్రరీ కార్యదర్శి హెచ్. సుబ్బారావు,

హైదరాబాదునందలి శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయ కార్యదర్శి శ్రీ ఐ. సీతారామారావు, కాశీవిశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారి శ్రీ జి. యస్. మిశ్ర, కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ భాండాగారి శ్రీ కె. యం. అసదుల్లా, శ్రీ యన్. సి. కేల్కారు (పూనా), శ్రీ కడవ కోటిరెడ్డి, శ్రీ యస్. సత్యమూర్తి (మదరాసు) ప్రభృతులున్నారు.

రెండవనాటి సమావేశంలో ఉదయం మహాసభకువచ్చిన గ్రంథాలయ సేవకులొకొక్కరు తమ అనుభవములను, కష్టనిష్ఠురములనుగూర్చి ముచ్చటించిరి. మధ్యాహ్నం దిగువ పెద్దలకు చందనము, అత్తరు, పన్నీరు, తాంబూలాదుల నిచ్చి శాలువలను బహూకరించుటద్వారా సన్మానించిరి. 1. శ్రీ భూపతిరాజు తిరుపతిరాజు 2. చట్టి నరసింహారావు 3. శ్రీ గోపరాజు బ్రహ్మానందం 4. శ్రీ కొత్తపల్లి వెంకటరాజు 5. శ్రీమతి అట్లూరి సీతమ్మ 6. శ్రీ మేకా గంగయ్య 7. శ్రీ కొప్పరపు వెంకటరమణయ్య 8. శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య 9. శ్రీ సూరి కృష్ణమూర్తి (కీ. శే. నరసింహశాస్త్రిగారికుమారులు) 10. శ్రీ యాతగిరి లక్ష్మివెంకటరమణ 11. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య. శ్రీ వెంకటరమణయ్యగారికి, అదనంగా దంతంతో చెక్కబడిన సరస్వతీవిగ్రహాన్నికూడ బహూకరించిరి. కీ. శే. సూరి వెంకట నరసింహశాస్త్రిగారిపట్ల గౌరవమును చూపుటకై వారి కుమారులు శ్రీ కృష్ణమూర్తిగారినికూడ సన్మానించిరి.

ఉత్సవసభయగుటచే దీనిలో తీర్మానములేమియు చేయలేదు.

ఈ మహాసభ వృత్తాంతము గ్రంథాలయసర్వస్వము 1934 జనవరి సంచిక (9 వ సంపుటము మొదటి సంచిక)లో ప్రచురించబడినది.

# [ ౧౭ ]

పదునేడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1934 జనవరి 21,22 తేదీలలో కాకినాడలోని అన్నదాన సమాజపు ఆవరణలో వేసిన పందిరిలో జరిగినది. దీనికి శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారధ్యక్షత వహించిరి. పలువురుస్త్రీలు మహాసభకు ప్రతినిధులుగావచ్చిరి. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ దుగ్గిరాల వెంకట సూర్యప్రకాశరావుగారి ఉపన్యాసం యీ పుస్తకంలో ప్రచురించడమైనది. శ్రీ ఇప్పగుంట సుబ్బకృష్ణయ్యగారు సభను ప్రారంభించిరి. మొదటిదినం సమావేశంలో శ్రీ యాతగిరి లక్ష్మివెంకటరమణగారు 'గ్రంథాలయము – ఆధునికజీవితము' అను తమ వ్యాసమును చదివిరి. 20 సంవత్సరముల వారిగ్రంథాలయసేవను అభినందిస్తూ ఆహ్వాన సంఘమువారు వారిని సన్మానించి ఖద్దరు శాలువను సమర్పించిరి. తర్వాత వంగిపురపు జగన్నాథరావుగారు (తెనాలి) 'గ్రంథాలయ ప్రచారము'ను

గురించి ఉపన్యసించిరి. శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు 'స్త్రీలు గ్రంథాలయ ములు' అను విషయముపై మాట్లాడిరి. బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయశాస్త్రి పురాణ ముల ఔన్నత్యమునుగురించి ప్రసంగించుటయేగాక, శ్రీ కొత్తపల్లి సూర్యారావు గారు పాండురంగ మాహాత్మ్యమున పుస్తక భాండాగారసందర్భమును పఠించుచుండ వీరు దాని అర్థమును సభికులకు విశదపరచిరి. శ్రీమాన్ యాయుర్ణి అప్పలా చార్యులవారి వీణాగానంతో మొదటిదినపు కార్యక్రమం ముగిసినది.

రెండవరోజు అధ్యక్షులవారి ఉపన్యాసం తర్వాత సభవారు మొత్తం 15 తీర్మాన ములను చేసిరి. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి కృషిని అభినందిస్తూ వారికి 'గ్రంథాలయోద్ధారక' బిరుదును సభవారు సమర్పించిరి. బిరుదసమర్పణ సమయ మున శ్రీ వెంకటరమణయ్యగారికి ఖద్దరు శాలువను కప్పి వారిని సన్మానించిరి.

# [ ౧౮ ]

1934 జనవరి 21 వ తేదీన కాకినాడ అన్నదాన సమాజములో జరిగిన ప్రథమాంధ్ర గ్రంథాలయ ప్రచారమహాసభ పదునెనిమిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభగ లెక్కింపబడినది. దీని ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ నేత్రకంటి యోగా నందరావుగారు. ప్రారంభకులు గ్రంథాలయభీష్మ బిరుదాంకితులు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు, శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు మహాసభ అధ్యక్షురాలు.

"ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున కనుబంధముగ సేవాశాఖను స్థాపించుటకు "సభవారు ఒకే ఒక తీర్మానమును గావించిరి. శ్రీ కళా వెంకట్రావుగారు 1914 నుండి 1920 వరకు గ్రంథాలయోద్యమము విజృంభించి పనిచేసినందున ఆంధ్రదేశంలో రాజకీయోద్యమం విజృంభించినదనియు, విజ్ఞానవ్యాప్తివలనదేశస్వాతంత్ర్యము సిద్ధించినగాని ఫలితం ఉండదనియు, కనుక గ్రామగ్రంథాలయ సేవాశాఖను ప్రత్యేకం స్థాపించి ఆద ర్శంగా పనిచేయుటవసరమనియు ఉపన్యసించిరి. ఉద్యమ ప్రచారమునుగూర్చిన శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరంగారి ఉపన్యాసం తర్వాత సభ ముగిసినది.

# [ ౧౯ ]

పందొమ్మిదవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ 1934 డిసెంబరు 24 వ తేదీ సాయంత్రం మదరాసునగరమున కాంగ్రెసు మందిరమున సమావేశమైనది. అన్నామలై యూనివర్సిటీ ఆర్థికశాస్త్రాచార్యులు డాక్టరు బి.వి. నారాయణస్వామిగారు సభను ప్రారంభించిరి. మరునాడు సాయంత్రం సభతిరిగి సమావేశమైనప్పుడు ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

ప్రతినిధులకు స్వాగతము చెప్పిరి. మహాసభాధ్యక్షులు శ్రీ దాసు త్రివిక్రమరావు గారు. ఈ సభవారు 17 తీర్మానములు చేసినారు. దివాన్ బహద్దూరు గోపతి నారాయణ స్వామిగారు సభానంతరం ప్రతినిధులకు విందునిచ్చిరి. దీనితోపాటు అఖిల భారత గ్రంథాలయమహాసభకూడ మదరాసులో జరుగుటచే దీని ప్రతినిధులు రెండు సభలలోనూ పాల్గొనుటకు వీలుచిక్కినది.

[ ౨౦ ]

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి) గారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున విశాఖపట్నం పురమందిరంలో 25-11-35 వ తేదీన ఏర్పాటుచేయబడిన ఆంధ్రదేశ గ్రంథాలయసేవకుల ద్వితీయ మహాసభ ఇరువదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభగ ఎంచబడినది. దీనికి శ్రీ శరణురామస్వామిచౌదరిగారు అధ్యక్షతవహించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ కొల్లూరు సూర్యనారాయణగుప్తగారు స్వాగతోపన్యాసం చేసినారు. చిత్తూరుజిల్లా నారాయణవరం వాస్తవ్యులు శ్రీ సి. వి. రంగంశ్రేష్ఠిగారు సభను ప్రారంభించి గ్రంథాలయోద్యమ నిర్మాణమునకు వలయు సాధనములను తెలిపిరి. 11 తీర్మానములు సభవారి అంగీకారం పొందినవి. హిందీప్రచారానికి వ్యతిరేకంగా శ్రీ గ్రంధి వెంకటరమణయ్యగారు ప్రతిపాదించిన తీర్మానముపై తీవ్రమైన చర్చజరిగినది. దీనిని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బలపరచిరి. దీనిపై చాలసవరణలు వచ్చినవి. శ్రీయుతులు ఉన్నవ లక్ష్మీనారాయణ, తల్లావఝుల శివశంకరశాస్త్రి, పురిపండా అప్పలస్వామి, మల్లిమడుగుల జగన్నాధరావు ప్రభృతులీ చర్చలో పాల్గొనిరి. చివరకు ఉపపాదకులు దీనినుపసంహరించుకొనిరి.

[ ౨౧ ]

ఇరువదియొకటవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 26-10-1937 వ తేదీన బెజవాడలోని శ్రీ రామమోహన ధర్మ పుస్తకభాండాగారములో జరిగినది. శ్రీ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు దీని కధ్యక్షతవహించిరి.

[ ౨౨ ]

ఇరువదిరెండవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ రాజమహేంద్రవరములోని గౌతమీ గ్రంథాలయములో 1941 జనవరి 14-16 తేదీలలో జరిగినది. గౌతమీ గ్రంథాలయ స్థాపకులును, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘపు మొదటి కార్య

దర్శులలో ఒకరునునగు మధురకవి నాళం కృష్ణారావుగారి షష్టిపూర్తి ఉత్సవమున కనుబంధంగా యిది యేర్పాటుచేయబడినది. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు దీనికధ్యక్షత వహించిరి. అడవి శంకరరావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగ సభ వారికి స్వాగతంచెప్పిరి. శ్రీ నిడదవోలు వెంకటరావుగారు సభను ప్రారంభించిరి. ఆంధ్రదేశగ్రంథాలయసంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు 1938 జులై నుండి 1940 సంవత్సరాంతంలోపల సంఘపక్షాన నడచిన కార్యకలాపాలను సభవారికి నివేదించిరి.

మహాసభ కంగంగా వయోజనవిద్యా వమావేశం ఏర్పాటుచేయబడినది. దీనికధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. శ్రీ గోపరాజు రామచంద్ర రావుగారు ప్రధానోపన్యాసకులు. వీరు తమ ఉపన్యాసంలో ప్రతిపాదించిన అంశ ములపై జరిగిన చర్చలో శ్రీ నరసింహదేవర సత్యనారాయణ ప్రభృతులు పాల్గొ న్నారు. అనకాపల్లి శ్రీ శారదా గ్రంథాలయభాండాగారి శ్రీమాన్ పీతాంబరం వెంకటాకృష్ణమాచార్యులుగారు "గ్రంథాలయనిర్వహణము"ను గూర్చి వ్రాసిన ఉపన్యాసాన్ని చదివినమీదట దీనిపైన కొంత చర్చనడచినది.

16-1-41 వ తేదీ ఉదయం శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు దేవాదాయ, ధర్మాదాయములకు సంబంధించిన తీర్మానములపై ప్రసంగించారు. శ్రీ బత్తుల కామాక్షమ్మగారు 'గ్రంథాలయోపయోగముల'నుగురించి ఉపన్యసించారు.

ఈ మహాసభ వివరాలు ఆం. దే. గ్రం. సంఘము 27 వ సం. నివేదిక లోను, ఆంధ్ర గ్రంథాలయం 2 వ సంపుటం 1-2 సంచికలోను వెలువడినవి.

## [ ౨3 ]

ఇరువదిమూడవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ తెనాలితాలూకా పెద పాలెంలో శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యగారి యింటిముందు నిర్మింపబడిన పందిరిలో 1942 మే నెల 27,28 తేదీలలో జరిగినది. దీని అధ్యక్షులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారు (హైదరాబాదు), ప్రారంభకులు శ్రీ కెత్తే వెంకటస్వామినాయుడుగారు (మదరాసు). వివిధ ప్రాంతాలనుండి 60 మంది ప్రతినిధులు సభకువచ్చిరి. దీనికి హాజరైన పెద్దలలో శ్రీయుతులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామ శాస్త్రి, గోపరాజు రామచంద్రరావు, మాగంటి బాపినీడు, మోటూరి సత్యనారాయణ, కల్లూరి చంద్రమౌళి, శరణు రామస్వామిచౌదరి, జమ్ములమడక మాధవరామశర్మ, వల్లమూడి వెంకటరత్నం, గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగార్లున్నారు. అహ్వాన సంఘా ధ్యక్షులు శ్రీ పుతుంబాక సీతారామయ్యగారు సభవారికి స్వాగతంచెపుతూ పెదపాలెం గ్రామచరిత్రను, అక్కడ 1905 నుండి నడచిన గ్రంథాలయ కార్యక్రమమును

సభవారికి చక్కని శైలిలో వినిపించిరి. ఈ సందర్భమున ఏర్పాటైన ప్రదర్శనాన్ని శ్రీ మాగంటి బాపినీడుగారావిష్కరించిరి. ఈ ప్రదర్శనములో వివిధ భాషలలోని బాల - వయోజన వాఙ్మయములు చూపరులదృష్టి నెక్కువగ ఆకర్షించినవి. పుస్తకాల బైండింగుకు సంబంధించిన వివిధ దశలను ప్రత్యక్షముగా దీనిలో చూపిరి. పత్రికల విభాగము, బొమ్మల పుస్తకాలు విడివిడిగ యేర్పాటుచేసిరి.

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు వయోజనవిద్యా శాఖాసమావేశమునకధ్యక్షత వహించిరి. ఈ శాఖాసమావేశములో చదువుటకు 8 వ్యాసములు వచ్చినవి. వీనిలో శ్రీ హరిసర్వోత్తమరావుగారు 'లాబాక్ అక్షరాభ్యాసపటము', శ్రీ మోటూరి సత్యనారాయణగారి, 'సాక్షరతాప్రచారమా లేకసంస్కృతిప్రచారమా', శ్రీ యాతగిరి లక్ష్మీ వెంకటరమణగారి 'వయోజనవిద్య - రష్యాదేశము' అన్న వ్యాసములు ముఖ్యమైనవి. శ్రీ మోటూరి సత్యనారాయణగారి అధ్యక్షతను కూడిన ప్రచారశాఖా సమావేశములో శ్రీయుతులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరి నాగభూషణం, జమ్ములమడక మాధవరామశర్మ, కస్తూరి కుటుంబరావు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగార్లు దిగువ విషయాలపై వ్రాసిన తమ వ్యాసములను చదివిరి.

1. గ్రంథాలయము - ప్రదర్శనకార్యము, 2. గ్రంథాలయ నిర్వహణ సంఘాలు, 3. సాహిత్య విభక్తి 4. ఉద్యమవ్యాప్తి - గ్రంథాలయసేవ, 5. బాల వాఙ్మయం.

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను నడచిన సాంకేతిక శాఖాసమావేశంలో దిగువ వ్యాసములు పఠించబడినవి.

1. గ్రంథాలయములు - పుస్తకములను సరిచూచుట

2. గ్రంథాలయసేవ - శాస్త్రపద్ధతులు (ఆంగ్లంలో)

ఈ మహాసభవృత్తాంతములతో ప్రత్యేక సంచిక వెలువడినది.

## [ ౨౪ ]

ఇరువదినాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ 29-12-42 వ తేదీనుండి 1-1-1943 వ తేదీవరకు అనంతపురంజిల్లా హిందూపురమందలి శ్రీ లక్ష్మీనాటక శాలయందు జరిగినది. రిటైర్డు జిల్లా విద్యాశాఖాధికారి రావుబహదూరు శ్రీ యం. లక్ష్మీనారాయణరావు దీనికధ్యక్షతవహించిరి. మదరాసు యూనివర్సిటీ గ్రంథ

భాండాగారి, ప్రసిద్ధ గ్రంథాలయశాస్త్రజ్ఞులు రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్ సభను ప్రారంభించిరి. వీరిప్రారంభోపన్యాసం అనువాదం యీ పుస్తకంలో ప్రచురింపబడినది. వ్యవసాయ డెమాన్‌స్ట్రేటరుగారి ఆఫీసులో గ్రంథాలయ, కళా ప్రదర్శనములు ఏర్పాటుచేయబడినది. దీనితోపాటు 3 శాఖా సమావేశములు, పండిత సభ, రాయలసీమ కళాపరిషత్సమావేశము, సాహిత్యసమావేశము, నవ్యసాహిత్య సభ జరిగినవి. వీనికి వరుసగా కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మ, శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శిరోమణి కె. వెంకటరామశాస్త్రిలు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లు అధ్యక్షతవహించిరి. సాంకేతిక శాఖాసమావేశములో డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు 'ఆంధ్రసంస్కృతి'పై ఉపన్యసించిరి. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతనుకూడిన ప్రచారశాఖా సమావేశంలో దిగువ విషయాలపై వ్యాసములు చదువబడినవి.

1. ఆధునిక యుగము : గ్రంథాలయములు, 2. గ్రామప్రజలు : గ్రంథాలయములు 3. గ్రంథాలయము : విద్యాలయము, 4. గ్రంథాలయసేవకుడు 5. గ్రంథాలయవ్యాప్తి, 6. సంచార గ్రంథాలయములు, 7. ప్రాచీన భారతీయ విజ్ఞానము (పద్యములు)

జనాబ్ ఉమర్ ఆలీషాకవి ప్రత్యేకోపన్యాసం చేసిరి. వయోజనవిద్యాశాఖకధ్యక్షతవహించిన శ్రీ కె. జె. జి. సుందరంగారు అక్షరాస్యతా ప్రచారంలో తమ అనుభవాలను, అక్షరాస్యతా ప్రచార పద్ధతులను వివరించిరి. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు "వయోజనవిద్య – బోధకుల శిక్షణ"నుగురించి ప్రసంగించిరి. 'మానవపతనము'నుగురించి శ్రీ టి. అప్పలనరసయ్యగారింగ్లీషులో ఉపన్యసించిరి.

30–12–42 వ తేదీన మహాసభకరుదెంచినవారి వినోదార్థము సంగీతాది వివిధ ప్రదర్శనములు, 31–12–42 వ తేదీ రామదాసు నాటకము ఏర్పాటుచేయబడినవి. ఈ నాటకంలో రామదాసుపాత్రను నాట్యకళాప్రపూర్ణ శ్రీ తాడిపత్రి రాఘవగారు, తానీషాపాత్రను ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ రొద్దం రాజారావుగారు నిర్వహించి ప్రేక్షకుల నలరించిరి. మహాసభ ముగింపు సమావేశంలో ధర్మవరం వాస్తవ్యులు ఆదర్శ గ్రంథాలయసేవకులునగు శ్రీ రామానందుల వెంకటేశమయ్యగారిని సన్మానించిరి. ఈ మహాసభ వృత్తాంతము ఇరువది నాలుగవ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ సంచికలో వివరముగ ప్రచురింపబడినది.

# ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభ, తెనాలి

1941 వ సం. జూన్ 11 వ తేదీన మదరాసుప్రభుత్వము వయోజనవిద్యా తరగతులను నిషేధిస్తూ జారీచేసిన ఉత్తరువును పురస్కరించుకొని ఆం. దే. గ్రం. సంఘ యాజమాన్యమున తెనాలి పట్టణంలో 24-8-1941 వ తేదీన ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభ యేర్పాటుచేయబడినది. దీనికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారధ్యక్షులు. నాటి మదరాసురాష్ట్ర విద్యామంత్రి డాక్టరు పి. సుబ్బరాయన్‌గారు సభాప్రారంభకులు. తెనాలి పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ రావి సత్యనారాయణగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. ఈ మహాసభకు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారొక గేయమును పంపిరి. శ్రీ చివుకుల శేషశాస్త్రి తమ గేయమును సభలో పాడి సభికులనుత్తేజపరచిరి. శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు 'వయోజనవిద్యా ప్రణాళిక'నుగూర్చిన తమ వ్యాసమును చదివిరి. రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాధన్‌గారు 'వయోజనవిద్య – గ్రంథాలయోద్యమము' అను విషయముపై పంపిన ఆంగ్ల వ్యాసము సభలో చదువబడినది. ఆంధ్రయూనివర్సిటీ లైబ్రరీకిచెందిన శ్రీ పి. కొండారెడ్డిగారు 'వయోజనవిద్యలో గ్రంథాలయాలపాత్ర' అను విషయముపై తమ ఆంగ్ల వ్యాసమును చదివి వినిపించిరి. ఈ మహాసభను పురస్కరించుకొని, సంఘ పత్రికయగు 'ఆంధ్రగ్రంథాలయం' ప్రత్యేక సంచికను వెలువరించినది.

నిషేధాజ్ఞ నుపసంహరింపజేయుటకు వివిధ సంస్థల ప్రతినిధులతోకూడిన 8 మంది సభ్యులతో ఒక రాయబారవర్గమును, ఆంధ్రదేశంలో వయోజనవిద్యా ప్రచారాన్ని కొనసాగించుటకు 11 మంది సభ్యులతో స్థాయీ సంఘాన్ని సభవారు యేర్పాటుచేసిరి.

మహాసభ నిర్వహణమునకు, సంచిక ప్రచురణకు కావలసిన ధనము తెనాలితాలూకాలోని ఉద్యమాభిమానులనుండి సేకరింపబడినది.

అనుబంధము : ౨

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

[ఈ సంఘము 1925 వ సం. అక్టోబరు 17 వ తేదీన సొసైటీల రిజిస్ట్రేషను చట్టము (1860 వ సం.పు 21 వ ఆక్టు) క్రింద రిజిస్టరు చేయ బడినది. దీని రిజిస్ట్రేషను సర్టిఫికెటు నకలు దిగువ యివ్వబడినది.

అప్పుడేర్పడిన నిబంధనలలో తర్వాత అప్పుడప్పుడు కొన్ని మార్పులు చేయబడుచువచ్చినవి. 1937 సెప్టెంబరు 18 వ తేదీన తెనాలితాలూకా పెదపాలెము నందలి ఆర్యబాలసమాజ భవనమున శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారి అధ్యక్షతను కూడిన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రచారకుల సమావేశములో అప్పటికమలులో నున్న సంఘనిబంధనలలో మార్పులను సూచించు నిమిత్తము శ్రీ పాతూరి నాగభూషణంగారు సమావేశకర్తగా 6 గురు సభ్యులతో ఉపసంఘ మొకటి నియమించబడినది. దీని సభ్యులు 14-10-1937 వ తేదీన వేటపాలెమునందలి శ్రీ సారస్వత నికేతనమున సమావేశమై అప్పటికి గల సంఘనిబంధనలను సవరించుటకు తమ సూచనలను సిద్ధపరచిరి. ఈ సూచనను పరిశీలించి 25-12-1938 వ తేదీన పటమట గ్రామం లోని శ్రీ అచ్చయ్య ధర్మగ్రంథాలయ భవనమున శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను సమావేశమైన సంఘసర్వసభ్య సభవారు కొన్ని సవరణలతో పై ఉపసంఘంవారు సిద్ధపరచిన సంఘ నియమావళి నామోదించిరి. వీరి ఆమోదమును పొందిన నియమావళిని దిగువ యిచ్చుచున్నాము.]

CERTIFICATE OF REGISTRATION OF SOCIETIES

Act. XXI of 1860

No. S. 1 of 1925–26

I hereby certify that the Andhra Desa Grandhalaya Sangham, Bezwada has this day been registered under the Societies Registration Act 1860

Given under my hand at Masulipatam this seventeenth day of October one thousand nine hundred and twenty five.

(Sd.) A. SUNDARA RAJA RAO
Addl. Asst. Registrar




(True copy)

# నియమావళి

I. సభ్యత్వము :

సభ్యులు పదకొండురకములుగ నుందురు.

1. మహారాజ పోషకులు :

ఒకేసారి సంఘమునకు రు 1000-0-0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని ఇచ్చువారు.

2. రాజపోషకులు :

ఒకేసారి సంఘమునకు రు 250-0-0 గాని, అంతకుమించిన రొక్కమును గాని, అంతకుసరిపడు స్థిరాస్తినిగాని ఇచ్చువారు.

3. పోషకులు :

ఒకేసారి సంఘమునకు రు 100-0-0 గాని, అంతకుమించిన రొక్కమును గాని, అంతకు సరిపడు స్థిరాస్తినిగాని ఇచ్చువారు.

4. సహాయులు :

ఒకేసారి సంఘమునకు రు 50-0-0 గాని, అంతకుమించిన రొక్కమును గాని ఇచ్చువారు.

5. శాశ్వత సభ్యులు :

ఒకేసారి సంఘమునకు రు 25-0-0 గాని, అంతకుమించిన రొక్కమును గాని ఇచ్చువారు.

6. సాధారణ సభ్యులు :
సంవత్సరమునకు రు 1_0_0 కు తక్కువగాని చందా చెల్లించువారు.

7. గౌరవ సభ్యులు :
పాలకవర్గముచే సూచింపబడి సర్వసభ్యసభవారి ఆమోదమును బడసినవారు.

8. గ్రంథాలయములు _ పఠన మందిరములు :
ఈ సంఘమునకుగాని, దీని శాఖాసంఘములకుగాని సంవత్సరమునకు రు 1_0_0 కు తక్కువగాని చందా చెల్లించునవి.

9. శాఖా సంఘములు :
సంవత్సరమునకు రు 5_0_0 చందా చెల్లించునవి.

10. గ్రామ పంచాయతీ బోర్డులు, సహకారసంఘములు :
సంవత్సరమునకు రు 2_0_0 చందా చెల్లించునవి.

11. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, సెంట్రల్ బ్యాంకులు, తదితర సంస్థలు :
సంవత్సరమునకు రు 5_0_0 చందా చెల్లించునవి.

II. నిర్వాహణము.

1. సంఘ వ్యవహారములు (1) ఒక అధ్యక్షుడు (2) ముగ్గురు ఉపాధ్యక్షులు (3) ఒక కోశాధిపతి (4) ఒక కార్యదర్శి (5) ముగ్గురు సహాయ కార్యదర్శులు (6) పంద్రెండుగురు సభ్యులుగల పాలకవర్గముచే నిర్వహించబడును.

2. (క) పాలకవర్గము సర్వసభ్యసభవారిచే సంవత్సరమున కొకపర్యాయము మే నెలలో జరుగు వార్షికసభలో ఎన్నుకొనబడవలెను.

(చ) పాలకవర్గము నెన్నుకొనుటలో తెలుగుప్రాంతము లన్నిటికిని ప్రాతినిధ్యముండునటుల చూడవలెను.

(ట) పాలకవర్గములో సంవత్సర మధ్యకాలమున గలుగు ఖాళీలను పాలకవర్గమువారే భర్తీచేసికొనవచ్చును.

III. సభలు :

1. (అ) పాలకవర్గమువారు సంవత్సరమునకు కనీసము నాలుగు పర్యాయములైనను వేర్వేరు ప్రాంతములలో సమావేశమగుచుండవలెను.

(ఆ) పాలకవర్గసభకు కనీసము ముగ్గురు సభ్యులైనను హాజరుకావలెను. అత్యావశ్యకమైన కార్యమున్నప్పుడు సభ్యులకు తెలియజేసి వారి లిఖితపూర్వక సమ్మతుల ననుసరించి తీర్మానముల చేయవచ్చును.

2. (అ) సర్వసభ్యసభ సాధారణముగా సంవత్సరమునకు ఒకతూరి సమావేశముకావలెను. అయితే సంఘాధ్యక్షులకు అవసరమనితోచినయెడల ప్రత్యేక సమావేశములను పిలువవచ్చును.

(ఆ) సర్వసభ్యసభకు కనీసము 15 గురు సభ్యులైనను హాజరుకావలెను.

3. (అ) పాలకవర్గములోని కనీసము ముగ్గురుకాని, సర్వసభ్య సభలోని కనీసము 15 మంది గాని సభ్యులు లిఖితపూర్వకముగ చర్చించవలసిన విషయములను తెలుపుచు కోరినయెడల ఆ యా సంఘ సమావేశములను, అట్టి కోరిక అందజేయబడిన 15 దినములలోగా కార్యదర్శి జరుపవలెను. అటుల జరుపుటకు కార్యదర్శి తప్పినయెడల, అధ్యక్షునికి తెలిపి మరి వారములోపల వారును సమావేశమేర్పరచనియెడల ఆ సభ్యులే సదరు సమావేశములను సమకూర్చవచ్చును.

(ఆ) పాలకవర్గ సభలకు 5 పూర్ణ దినములును, సర్వసభ్య సభలకు 10 పూర్ణ దినములను గడువుతో ప్రకటనలు సభ్యులకు పంపవలెను.

IV. సర్వసభ్యసభ :

సంఘముయొక్క అన్నిరకముల సభ్యులు నిందు పాల్గొనుట కర్హతగలిగియుందురు. పాలకవర్గము నెన్నుకొనుట, బడ్జెట్టులను, వార్షిక నివేదికలను, ఉపనిబంధనలను అంగీకరించుట, సంఘముయొక్క అన్ని వ్యవహారములపైనను అధికారముగలిగియుండుట సర్వసభ్యసభయొక్క అధికారములు.

V. పాలకవర్గము :

సంఘ నిబంధనల ననుసరించి సంఘ వ్యవహారముల నడపుట, సర్వసభ్య సభలో చేయవలసిన తీర్మానముల నాలోచించి నిర్ణయించుట, సర్వసభ్యసభవారి ఆమోదమునకు లోబడి గౌరవసభ్యులను సూచించుట, ఉపనిబంధనలను చేయుట, కార్యాచరణకవసరమైన ఉపసంఘముల నియమించుట పాలకవర్గము వారి విధులు.

VI. అధ్యక్షుడు :

సంఘముయొక్క అన్ని సభలకును అధ్యక్షతవహించుట, సంఘ వ్యవహారములన్నింటిని నిర్వహించుట అధ్యక్షుని విధులు.

VII. ఉపాధ్యక్షులు :

అధ్యక్షుడిచ్చిన అధికారమునుబట్టి వారిస్థానే వ్యవహరించుట, అధ్యక్షుడు లేని సమయములలో క్రమముననుసరించి హాజరైన ఉపాధ్యక్షులలో ఒకరు వారిస్థానము నాక్రమించి సభా వ్యవహారములను జరుపుట ఉపాధ్యక్షుల విధులు.

VIII. కోశాధిపతి :

పాలకవర్గము వారి తీర్మానము ననుసరించి సంఘముయొక్క ధనమును, ఆస్తిని జాగ్రత్తపరచి అందుకు సరియైన లెక్కలను, వోచరులను ఉంచుట కోశాధిపతి విధులు.

IX. కార్యదర్శి :

1. సంఘ సమావేశములను సమకూర్చుట, సంఘపక్షమున ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుట, అధ్యక్షుని అధికారమునకులోబడి సంఘ తీర్మానములను అమలు జరుపుట, సంఘమునకు సిబ్బందిని ఏర్పరచుట, శిక్షించుట, తొలగించుట. పాలక వర్గమువారి తీర్మానముననుసరించి సంఘద్రవ్యమును వినియోగించుట, వార్షిక నివేదికలను, బడ్జెటులను తయారుచేయుట కార్యదర్శి విధులు.

2. సంఘముపై తేబడు అన్ని అభియోగములను, సంఘమువారితరులపై తెచ్చెడి అన్ని అభియోగములను కార్యదర్శిపేరిట జరుపవలెను.

X. సహాయ కార్యదర్శులు :

పాలకవర్గము వారు ప్రత్యేకముగా నిర్దేశించిన పనులను, కార్యదర్శి కోరిన పనులను నెరవేర్చుచు కార్యదర్శి కన్నివిధముల సహాయపడుచుండవలెను.

XI. లెక్కలు — తనిఖీ :

తెలుగు సంవత్సరాదితో ఈ సంఘముయొక్క లెక్కలు ప్రారంభమగును. ఈ సంఘముయొక్క లెక్కలను ప్రతి సంవత్సరమును పాలకవర్గముచే నిర్ణయింపబడు తనిఖీదారునిచే తనిఖీచేయించవలెను.

XII. ప్రత్యేక నియమములు :

ఈ సంఘముయొక్క నిబంధనలను వేటినైనను తొలగించుటకుగాని క్రొత్త వానిని చేర్చుటకుగాని, ఉన్నవానిని మార్చుటకుగాని సర్వసభ్యసభ కధికారము గలదు.

అనుబంధము 3

# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

## ప్రధాన నిర్వాహకులు

సంఘస్థాపన నాటినుండి 1926 నవంబరు 30 వ తేదీ వరకు ఆయా సంవత్సరములలో గల సంఘముయొక్క ప్రధాన నిర్వాహకుల వివరములు గ్రంథాలయ ప్రగతి - మొదటిభాగములో ఇవ్వబడినవి. దీనికి పిమ్మటనుండి 1942-43 (చిత్రభాను) సం. చివరివరకు సంఘ నిర్వాహకులుగనున్న ముఖ్యుల సమాచారం మాకు లభించినవరకు దిగువనిచ్చుచున్నాము.

రక్తాక్షి (1924-25) సం.

క్రోధన (1925-26) సం. ఎన్నిక తేది 1925 అక్టోబరు 28

అక్షయ (1926-27) సం.

ప్రభవ (1927-28) సం.

విభవ (1928-29) సం.

శుక్ల (1929-30) సం.

ప్రమోదూత (1930-31) సం.

వివరాలు లభించలేదు.

ప్రజోత్పత్తి (1931-32) సం. ఎన్నికతేదీ 1931 జూన్ 30

అధ్యక్షులు : డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు

ఉపాధ్యక్షులు : శ్రీ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు వగైరా (17 మంది)

కార్యదర్శి : శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

సహాయ కార్యదర్శులు : శ్రీ తిత్తి బలరామయ్యగారు వగైరా (13 మంది)

## ఆంగీరస (1932-33) సం.

వివరాలు లభించలేదు.

## శ్రీముఖ (1933-34) సం.

ఎన్నికతేదీ 1933 ఆగస్టు 10

అధ్యక్షులు : శ్రీ భూపతిరాజు సీతారామరాజుగారు

ఉపాధ్యక్షులు : శ్రీమతి కె. శామ్యుల్ అమ్మగారు వగైరా (22 మంది)

కార్యదర్శి : శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

సంయుక్త కార్యదర్శి : శ్రీ గుళ్ళపల్లి వెంకటపున్నయ్యశాస్త్రిగారు

సహాయ కార్యదర్శులు : శ్రీ తిత్తి బలరామయ్యగారు వగైరా (19 మంది)

## భావ (1934-35) సం.

ఎన్నికతేదీ 1934 జనవరి 20

అధ్యక్షులు : శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు

ఉపాధ్యక్షులు : రావుసాహెబు యం. అప్పారావుగారు వగైరా (19 మంది)

కార్యదర్శి : శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు

సంయుక్త కార్యదర్శి : శ్రీ తుమ్మలపల్లి జగన్నాథంగారు

కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు :

శ్రీ నడింపల్లి వేంకట లక్ష్మినరసింహారావుగారు

సహాయ కార్యదర్శులు :

శ్రీ తిత్తి బలరామయ్యగారు వగైరా (21 మంది)

## యువ (1935-36) సం.

ఎన్నికతేదీ 1934 డిసెంబరు 25

అధ్యక్షులు : శ్రీ దాసు త్రివిక్రమరావుగారు

ఉపాధ్యక్షులు : రావుసాహెబు యం. అప్పారావుగారు వగైరా (17 మంది)

కార్యదర్శి : శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు

సహాయ కార్యదర్శులు : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు వగైరా (16 మంది)

## ధాత (1936-37) సం.

ఎన్నికతేదీ 1936 మార్చి 15
,, 1936 అగష్టు 8

అధ్యక్షులు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఉపాధ్యక్షులు : శ్రీమతి బొడ్డపాటి శీతాబాయమ్మగారు
వగైరా (13 మంది)
కార్యదర్శి : శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు
సహాయ కార్యదర్శులు : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు
శ్రీ పాతూరి నాగభూషణంగారు
శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రిగారు
శ్రీ కలచవీడు వేంకటరమణాచార్యులుగారు
శ్రీ ఉప్పులూరి రామశాస్త్రిగారు
కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు: శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

## ఈశ్వర (1937-38) సం.

వివరాలు లభించలేదు.

## బహుధాన్య (1938-39) సం. *

ఎన్నికతేదీ 1938 జూలై 24

అధ్యక్షులు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఉపాధ్యక్షులు : శ్రీ ఊటుకూరు జయరామదాసుగారు
శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరంగారు
శ్రీ తేతలి సత్యనారాయణమూర్తిగారు
శ్రీ కల్లూరు సుబ్బారావుగారు
కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు
సహాయ కార్యదర్శులు : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు

---

* శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు తమ కార్యదర్శిపదవికి రాజీనామా చేసినారు. దీనిపైన కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, సహాయ కార్యదర్శి శ్రీ మల్లెల శ్రీరామమూర్తి 24-7-38 వ తేదీన జరిగిన సమావేశ ప్రకటనలపై సంతకముచేసి వీనిని బట్వాడా చేసినారు.

శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు
శ్రీ కస్తూరి లక్ష్మీనరసింహారావుగారు
శ్రీ తేకుమళ్ళ రామచంద్రరావుగారు

కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు :
శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

## ప్రమాది (1939-40) సం.

ఎన్నికతేదీ 1938 డిసెంబరు 25

అధ్యక్షుడు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఉపాధ్యక్షులు : శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు
శ్రీ దువ్వూరి రామకృష్ణరావుగారు
కోశాధిపతి : శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు
కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు
సహాయ కార్యదర్శులు : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు
శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరంగారు

## విక్రమ (1940-41) సం.

ఎన్నికతేదీ 1940 ఆగస్టు 17

అధ్యక్షులు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
ఉపాధ్యక్షులు : శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
శ్రీ నాగినేని వెంకయ్యగారు
శ్రీ తేతలి సత్యనారాయణమూర్తిగారు
కోశాధిపతి : శ్రీ కొమ్మూ సీతారామయ్యగారు
కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు
సహాయ కార్యదర్శులు : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు
శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు
* శ్రీ యక్కలి రామయ్యగారు

---

* 1-9-40 వ తేదీన ఎన్నికైనారు.

శ్రీ నాగినేని వెంకయ్య, శ్రీ యక్కలి రామయ్యగార్లు రాజీనామా నిచ్చుటచే వీరిస్థానే వరుసగా శ్రీ పాలుట్ల విశ్వనాథరావుగారిని, శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారిని 14-1-41 వ తేదీన జరిగిన పాలకవర్గ సమావేశంలో ఎన్నుకోవడ మైనది.

**వృష (1941-42) సం.** ఎన్నికతేదీ 1941 ఆగస్టు 23

| | |
|---|---|
| అధ్యక్షులు : | శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు |
| ఉపాధ్యక్షులు : | ,, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు |
| | ,, అయ్యంకి వేంకటరమణయ్యగారు |
| | ,, నాగినేని వెంకయ్యగారు |
| కార్యదర్శి : | ,, పాతూరి నాగభూషణంగారు |
| సహాయ కార్యదర్శులు : | ,, శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు |
| | ,, వట్టికోట ఆళ్వారుస్వామిగారు |
| | ,, ఈదుపుగంటి శివమూర్తిగారు |

**చిత్రభాను (1942-43) సం,** ఎన్నికతేదీ 1942 మే 28

| | |
|---|---|
| అధ్యక్షులు : | శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు |
| ఉపాధ్యక్షులు : | ,, అయ్యంకి వెంకటరమణయ్యగారు |
| | ,, సురవరము ప్రతాపరెడ్డిగారు |
| | ,, శరణు రామస్వామి చౌదరిగారు |
| కార్యదర్శి : | ,, పాతూరి నాగభూషణంగారు |
| సహాయ కార్యదర్శులు : | శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు |
| | ,, అడుసుమల్లి శ్రీనివాసరావుగారు |
| | ,, వేగేశన సూరపరాజుగారు |
| కోశాధిపతి : | ,, కొమ్మా సీతారామయ్యగారు |

అనుబంధము : ౪

# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రచురణలు

1927–1942 సం. ల మధ్య సంఘపక్షమున వెలువడిన ప్రచురణల వివరములు :

1. గ్రంథాలయ సర్వస్వము – మాసపత్రిక
   ౧. ఏడవ సంపుటము (11 సంచికలు)
   (సంపా) అయ్యంకి వేంకటరమణయ్య
   1928–1929 1/8 డెమ్మీ 184 పుటలు
   ౨. ఎనిమిదవ సంపుటము (5 సంచికలు)
   (సంపా) అయ్యంకి వేంకటరమణయ్య
   1929 1/8 డెమ్మీ 80 పుటలు
   3. తొమ్మిదవ సంపుటము (9 సంచికలు)
   (సంపా) అయ్యంకి వేంకటరమణయ్య
   1934, 1935 1/4 క్రౌను 272 పుటలు
   ४. పదవ సంపుటము (11 సంచికలు)
   (సంపా.) గాడిచర్ల హరిసర్వోత్తమరావు
   మారేపల్లి రామచంద్రశాస్త్రి
   అయ్యంకి వేంకటరమణయ్య
   1/4 క్రౌను 440 పుటలు
   ౫. పదకొండవ సంపుటము (6 సంచికలు)
   (సంపా.) గాడిచర్ల హరిసర్వోత్తమరావు
   మారేపల్లి రామచంద్రశాస్త్రి
   అయ్యంకి వేంకటరమణయ్య
   1/4 క్రౌను 240 పుటలు
2. ఆంధ్ర గ్రంథాలయం – ఆంధ్రాంగ్ల త్రైమాసిక పత్రిక
   ౧. సంపుటము (3 సంచికలు)
   సంపాదకులు : పుణ్యమూర్తుల రాజశేఖరం
   1939–40 1/8 రాయల్ 230 పుటలు

౨. సంపుటము ౨ (౨ సంచికలు)
(సంపా) గాడిచర్ల హరిసర్వోత్తమరావు
పుణ్యమూర్తుల రాజశేఖరం
పాతూరి నాగభూషణం
941 1/8 రాయల్ 193+36

3. ఇరువదిమూడవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ
పెదపాలెము : మే 27-28, 1942
1942 1/8 డెమ్మీ 8+88 పుటలు

3. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము - నివేదికలు
౧. ఇరువదియైదవ సంవత్సర నివేదిక [1938-39]
939 1/8 డెమ్మీ 38 పుటలు
౨. ఇరువదియారవ సంవత్సరనివేదిక [1939-40]
1940 1/8 డెమ్మీ 29 పుటలు
3. ఇరువదియేడవ సంవత్సర నివేదిక [1940-41]
1941 1/8 డెమ్మీ 38 పుటలు

4. ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక
సంకలనము : పాతూరి నాగభూషణం
1939 1/16 డెమ్మీ 12+136 పుటలు వెల రు 1-0-0

6. వయోజనవిద్య - మొదటి పుస్తకము
కర్త : గాడిచర్ల హరిసర్వోత్తమరావు
1942 1/8 డెమ్మీ 52 పుటలు వెల రు 0-4-0

7. ముసలమ్మ మరణము [పద్యకావ్యము]
కర్త : కట్టమంచి రామలింగారెడ్డి
1940 1/8 ఇంపీరియల్ 8+23 పుటలు వెల రు 0-4-0

అనుబంధము : ౩

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షులు*

## ౧. శ్రీ నాళము కృష్ణారావు

## (1881-1961)

జననం తూర్పుగోదావరిజిల్లా మండపేట, విద్యాభ్యాసం మెట్రిక్యులేషన్ వరకు కాకినాడలో. 1898 వ సం.లో రాజమహేంద్రవరములోని శ్రీ వీరేశలింగ గ్రంథభాండాగారం స్థాపించారు. ఇది తర్వాత గౌతమీ గ్రంథాలయంగా రూపొందింది. దీనికి వీరు ఆమరణాంతం అధ్యక్షులు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపు తొలి కార్యదర్శులలో ఒకరు. 11 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షులు. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ యావజ్జీవ గౌరవసభ్యులు.

బాల్యమునుండియు సాహిత్యాభిలాషి. యుగపురుషుడు శ్రీ వీరేశలింగంగారికి కుడిభుజముగానుండి వారి సంఘ సంస్కరణోద్యమము లన్నింటిలోను పాల్గొని వానివి విజయవంతముగ నిర్వహించిరి. ఒకప్పుడు సంఘ బహిష్కారమునకు సహితం గురియైరి. 'మానవసేవ' యను సచిత్ర మాసపత్రికను నిర్వహించి, దీని ద్వారా భాషాసేవ, సంఘసేవ చేసిరి.

దేశస్వాతంత్ర్యం నిమిత్తం మహాత్మ గాంధి నిర్వహించిన ఉద్యమాలలో కూడ పాల్గొని తమ దేశభక్తిని చాటుకొనిరి,

'మీగడ తరకలు' మున్నగు కమ్మని ఖండకావ్యములు రచించి 'మధురకవి' యను బిరుదును పొందిరి. విద్య – పుస్తకములు – గ్రంథాలయములు అను శీర్షికల క్రింద ఉన్నత భావములను ప్రబోధించు రసవంతమైన పద్యములను రచించి వ్యయముగ ప్రచురించిరి.

సాహిత్యంతోపాటు సంగీతకళనుకూడ వీరు సేవించిరి. రాజమహేంద్రవరములో శ్రీ రామవిలాస గానసభను స్థాపించి ఎన్నో గానసభలను నిర్వహించిరి. వీరి సతీమణి శ్రీమతి సుశీలమ్మగారు స్థాపించిన ఆంధ్ర మహిళా గానసభకు వెన్నుపట్టుగనుండి సహాయపడిరి.

---

* వీరిలో శ్రీ దుగ్గిరాల వెంకట సూర్యప్రకాశరావుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు; డాక్టరు యస్. ఆర్. రంగనాథన్‌గారు ప్రారంభకులు.

ఆంధ్ర నారీలోకంలో ప్రసిద్ధ సాహితీపరురాలగు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు వీరి ప్రియపుత్రిక.

## ౨. శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిపంతులు

## (1869-1945)

జన్మస్థానము పశ్చిమగోదావరిజిల్లా నరసాపురం తాలూకా, కాళీపట్నం ము. స్వగ్రామము సంబలదీవిలోని పేరుపాలెము.

విద్యాభ్యాసం నరసాపురంలో. 15వ యేట మెట్రిక్యులేషను పరీక్షలో ప్రథమ కక్ష్యలో ఉత్తీర్ణులైనారు. తర్వాత రాజమహేంద్రవరంలోని ప్రభుత్వ కళాశాలలో ఎఫ్. ఏ., బి. ఏ చదివినారు. బెజవాడలోని సి. బి. యం. హైస్కూలులో కొద్ది కాలం ఉపాధ్యాయులుగ, తదుపరి బందరులో రెవిన్యూశాఖోద్యోగిగ, 20 సం.లు నోబుల్ కాలేజీలో బోధకులుగ పనిచేసినారు.

వందేమాతరోద్యమ సమయంలో 'భారతధర్మ దర్శనము' (పద్య గ్రంథము)ను రచించి ప్రకటించినారు. వృత్తిరీత్యా ఉపాధ్యాయులైనను, ఆ నాటి సాంఘిక రాజకీయములలో ముఖ్యపాత్రను వహించినారు.

19.0 వ సం.లో మదరాసు ప్రభుత్వంలో అసిస్టెంట్ ట్రాన్స్‌లేటర్ పదవిలో ప్రవేశించి, త్వరలోనే ట్రాన్స్‌లేటర్‌పదవి నధిష్ఠించినారు. దీనిలో 14 సం. లు పనిచేసి 1924 వ సం. లో ఉద్యోగం విరమించినారు. తర్వాత వానప్రస్థ జీవనం సాగించి వేదాంతం ప్రబోధ చేస్తూ శేషజీవితాన్ని గడపినారు.

వీరిది ఆదర్శజీవితము, ప్రతిభగల వ్యక్తిత్వము.

ఆంధ్రవైజ్ఞానికులలో సుప్రసిద్ధులు, త్యాగధనులునగు శ్రీ కాళీపట్నం కొండయ్యగారు వీరి మేనల్లుడు.

## ౩. డాక్టరు బుర్రా శేషగిరిరావు

## (1844-1941)

జననం విశాఖపట్నంజిల్లా తాటితుబ్బు. ఇంటర్మీడియట్ పర్లాకిమిడిలో పూర్తి చేశారు. గిడుగురామమూర్తి పంతులుగారి శిష్యులు. విజయనగరం కళాశాలలో బి. ఏ., రాజమండ్రిలో ఎం ఏ. చదివారు. బి. ఏ. పరీక్షలో చూపిన ప్రతిభకు

"మెక్డొనాల్డు మెడలు" బహుమతిగా వచ్చింది. 1908 లో విజయనగరంలోని మహా రాజావారి కళాశాలలో సహాయాధ్యాపకులుగా చేరి 30 సంవత్సరాలకుపైగా పని చేశారు. ఆంగ్లభాషాశాఖ ప్రధానాధ్యాపకులుగా రిటైరయినారు. 1915-17 సంవత్స రాలలో మదరాసు యూనివర్సిటీలో ద్రవిడభాషా పరిశోధకులుగ నియమింప బడారు. 1920 వ సం. లో మదరాసు యూనివర్సిటీ కమిషన్‌లో సభ్యులుగ నున్నారు.

1923 వ సం. లో "శ్రీ భారతీతీర్థ"అనే సంస్థను స్థాపించి, దేశీయ విద్య లను ప్రోత్సహించారు మనదేశం వారితోపాటు ఎందరో విదేశీపండితు లీ సంస్థలో సభ్యులుగాచేరి దీని అభ్యుదయానికి తోడ్పడ్డారు. ఈ సంస్థపక్షాన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారికి "గ్రంథాలయ శాస్త్ర విశారద" అనే బిరుదప్రదానం జరిగింది. శ్రీ శేషగిరిరావుగారి వైజ్ఞానిక కృషికి మెచ్చి అమెరికన్ ఇంటర్నేషనల్ అకాడమీవారు వీరికి "డాక్టర్ ఆఫ్ లెటర్స్" బిరుదునిచ్చారు.

వీరు గొప్ప పరిశోధకులు. ఆంధ్రదేశంలో ప్రబలిన శైవమతం, ఆంధ్రుల చరిత్ర, ఆంధ్రసాహిత్యాలకు సంబంధించి ఎన్నో అమూల్యమైన వ్యాసాలు వ్రాశారు. ఇతర పుస్తకాలతోపాటు 'బొబ్బిలి ముట్టడి' అనే వీరరసప్రధానమైన నాటకాన్ని కూడ వీరు వ్రాశారు. ఇది అచ్చుపడినట్లు కనబడదు. గిడుగు, గురజాడలతో కలసి వీరు శిష్ట వ్యావహారిక భాషా ప్రచారానికి అమితంగా కృషిచేశారు.

## ౪. శ్రీ భూపతిరాజు సీతారామరాజు

## (1891-1966)

వీరు శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజు సి ఐ ఇ. గారి పుత్రులు. వీరి జన్మస్థలం విశాఖపట్నం జిల్లా ఆలమంద. విశాఖపట్నంలోని సి. బి. యం. హైస్కూలులో సెకండరీవిద్య పూర్తిచేసి అచ్చటి ఎ. వి. యన్. కళాశాలలో కాలేజీవిద్య నభ్యసించారు. తదుపరి లండన్ (ఇంగ్లాండు), డబ్లిన్ (ఐర్లండు) నగరాలలో బారిస్టరు పరీక్షకు చదివి ఉత్తీర్ణులయ్యారు. లండనులో నుండగా లాలా లజపతిరాయి సాహచర్యం లభించి వారిని రాజకీయగురువుగా ఎంచుకున్నారు. తదుపరి శ్రీ జిన్నాసాహెబ్ అధ్యక్షతను ఏర్పడిన నేషనలిస్టు పార్టీకి చీఫ్‌విప్పుగా పనిచేశారు. విశాఖపట్నం తాలూకాబోర్డుకు 10 సం. లు అధ్యక్షులు. 1926-27 సం. లలో 'రాజకీయాభివర్ధని' మాసపత్రికకు సంపాదకులు.

విశాఖపట్నంలో ప్రముఖ న్యాయవాదులలో ఒకరు, ప్రజాహితోద్యమాలలో పాల్గొంటూ వుండేవారు. కొంతకాలం చీపురుపల్లిలో ఉన్నారు.

## ౫. శ్రీ దుగ్గిరాల వెంకట సూర్యప్రకాశ (1864-1948)

జన్మస్థానం కాకినాడ, ప్రారంభవిద్య స్వగ్రామమగు రామచంద్రపురమున అభ్యసించారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో బి. ఏ. పూర్తిచేశారు. 189 ప్రాంతమున ఉద్యోగములో ప్రవేశించి, ట్రెజరీ డెప్యూటీ కలెక్టరు కచేరి హెడ్ అకౌంటెంటుగ ఉద్యోగవిరమణ చేశారు. వీరు వీరేశలింగం పంతులుగారి శిష్యులు. ఆంధ్రాంగ్లములలో అనర్గళముగా గంటలకొలది ఉపన్యసించు శక్తిగలిగియుండిరి. కలెక్టరు కచేరియందలి పెద్ద గ్రంథాలయములోని పుస్తకములను పూర్తిగా చదివినారు. వారు మదరాసురాష్ట్రములోని హిందూ, ఆంధ్ర, కృష్ణాపత్రిక మొదలైన వానితోపాటు, రాష్ట్రేతరమందలి న్యూఇండియా, హిందూస్థాన్ రివ్యూ, అమృత బజార్, మోడరన్ రివ్యూ మున్నగు పలు పత్రికలకు వ్యాసములు వ్రాయుచుండెడివారు.

గోదావరి డిస్ట్రిక్టు ఎసోసియేషన్ తరఫున గొప్ప గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసి బహువిధ గ్రంథములను సమకూర్చిరి. కీ. శే. పోలవరం రాజాగారి రు 20,000/- విలువచేయు గ్రంథాలయాన్ని, తమ స్వంతలైబ్రరీని దీనికి చేర్చిరి. చాల సంవత్సరములు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకు ఉపాధ్యక్షులుగనుండిరి.

తూర్పుగోదావరిజిల్లాలో సహకారోద్యమ వ్యాప్తికి కృషిసల్పుటయేగాక డిస్ట్రిక్టు బ్యాంకి యూనియనును స్థాపింపజేసిరి.

ప్రభుత్వోద్యోగంలో ఉండికూడ ప్రజోపయోగమగు వివిధ కార్యకలాపాలలో పాల్గొనుచుండిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారు వీరిని "జంగమ పుస్తక భాండాగారము"గ అభివర్ణించారు. కాంగ్రెసు మహాసభతోపాటు జరుగుచుండిన సంఘ సంస్కరణ సభలకు వెళ్ళి వీనిలో పాల్గొనుటద్వారా దేశంలోని ఎందరో పెద్దల స్నేహమును సంపాదించారు. కాకినాడలో నిమ్నజాతులకు పాఠశాలలను ప్రారంభించుటయేగాక పి. ఆర్. కాలేజీలో వారికి ప్రవేశమును కలుగజేయుటకు కృషిసల్పినారు. వీరేశలింగంగారి హితకారిణీ సమాజమునకు రు 3000 రొక్కమును, రామచంద్రపురం హైస్కూలు విద్యార్థుల వసతిగృహమునకు స్థలమును విరాళముగా ఇచ్చినారు. దీనులయెడ వీరెంతో ప్రేమగలిగియుండువారు సంఘసేవయన్నను, పరోపకారమన్నను వీరికి పరమప్రీతి.

# ౯. శ్రీ దాసు త్రివిక్రమరావు
# (1894-1950)

బెజవాడ వాస్తవ్యులు శ్రీ దాసు కేశవరావుగారి జ్యేష్ఠ పుత్రులు.

ఇక్కడ మెట్రిక్యులేషను పరీక్ష పూర్తిచేసుకొని ఇంగ్లాండుకుపోయి బారిషరు పరీక్షలలో గణనీయంగా ఉత్తీర్ణులైరి.

బెజవాడలోని రామమోహన గ్రంథాలయం, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముల నిర్వహణలో పూర్తిగా సాయపడుచుండిరి. 19 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ కధ్యక్షతవహించినపిమ్మట 15 నెలలపాటు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులుగా నుండిరి. 1934 లో బెజవాడలోజరిగిన ఆంధ్రదేశ గ్రంథభాండాగారికుల శిక్షణ శిబిర నిర్వహణములో ప్రముఖ భాగస్వాములు.

ఆల్ఇండియా పబ్లిక్ లైబ్రరీ అసోసియేషన్ సంయుక్త కార్యదర్శిగా, ఇండియన్ లైబ్రరీ జర్నల్ సంపాదకులుగా భారతీయ గ్రంథాలయోద్యమ నిర్వహణలో ప్రముఖ భాగస్వాములైరి.

1928 వ సం. లో గ్రేట్ బ్రిటన్‌లో బ్లాక్‌పూల్ పట్టణంలో జరిగిన ఆదేశపు గ్రంథాలయ మహాసభకు ఆలిండియా పబ్లిక్ లైబ్రరీస్ అసోసియేషన్ ప్రతినిధులుగ హాజరైరి. అదేసమయములో ప్రపంచ యువజనసమాఖ్యకు భారతదేశ ప్రతినిధిగ వెళ్ళిరి.

1933 లో తిరుచినాపల్లిలో జరిగిన ప్రథమ తమిళనాడు రూరల్ లైబ్రరీ సర్వీస్ కాన్ఫరెన్సుకు, 1936 లో పుదుక్కోటలో జరిగిన రీడింగ్‌రూమ్ & లైబ్రరీ కాన్ఫరెన్సుకు అధ్యక్షత వహించిరి.

1933 సెప్టెంబరునెలలో కలకత్తాలో జరిగిన ఇండియన్ లైబ్రరీకాన్ఫరెన్సుకు హాజరై, ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ స్థాపనయందు ప్రముఖపాత్ర వహించి, దాని ప్రథమ సభ్యులవర్గమున నుండిరి.

బెజవాడలో వాసికెక్కిన వాణీ ప్రెస్ నిర్వహణములో తండ్రిగారికి తోడుపడుచు, 'ఆంధ్రవాణి'యను దినపత్రికను, 'సందేన్యూస్'అను ఆంగ్ల వారపత్రికను స్థాపించి, వీనికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని సంపాదకులుగా నియమించిరి. ఈ అవకాశమును పురస్కరించుకొని శ్రీ హరిసర్వోత్తమరావుగారిని ఆంధ్రదేశగ్రంథాలయ సంఘాధ్యక్షులుగ ఎన్నుకొనడం, నాటినుండి జీవితాంతం (1960 ఫిబ్రవరి 28) వరకు వారే సంఘాధ్యక్షులుగ కొనసాగడం జరిగినది.

## ౭. శ్రీ శరణు రామస్వామి చౌదరి

## (1900 -        )

జననం తెనాలితాలూకా అమృతలూరు.

ప్రాథమికవిద్య స్వగ్రామంలో. 1915-19 సం. లలో ఆంధ్రజాతీయ కళాశాల - మచిలీపట్నంలోను, 1919 వ సం. లో దివ్యజ్ఞాన కళాశాల, మదనపల్లి లోను ఉన్నతవిద్య నభ్యసించిరి.

విద్యార్థిదశనుండియు గ్రంథాలయాలపట్ల మక్కువయుండినది. వారి గ్రామం లోని నాటి ఉభయభాషా సంజీవనీసంఘ గ్రంథాలయ నిర్వహణములో భాగస్వాములు, 1928 లో తెనాలితాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు. 1936 నుంచి దాదాపు 30 సం. లు గుంటూరుజిల్లా గ్రంథాలయసంఘాధ్యక్షులు. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘంలో కొంతకాలం ఉపాధ్యక్షులు. మదరాసు పౌరగ్రంథాలయాల శాసనం క్రింద ఏర్పడిన గుంటూరుజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి మొదటి 6 సం. లు అధ్యక్షులు.

దేశస్వాతంత్ర్య పోరాటంలో, వందేమాతరోద్యమ కాలంనుండి స్వాతంత్ర్యావతరణ వరకు పాటుపడి, పెక్కుమార్లు జైలుశిక్షననుభవించారు. చాలకాలం గుంటూరుజిల్లా హరిజనసేవకసంఘ కార్యదర్శిగా నున్నారు. తెనాలితాలూకా వేమూరు నియోజకవర్గంలో జరిగిన ఉపఎన్నికలో ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నికై 2 సం. లు ఈ పదవి నధిష్ఠించినారు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడినక్రొత్తలో రాష్ట్ర గ్రంథాలయకమిటీ సభ్యులుగ ప్రభుత్వంచే నియమింపబడినారు. ఇటీవల ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘ యావజ్జీవ గౌరవసభ్యులుగా ఎన్నుకోబడినారు. పత్రికలలో అప్పుడప్పుడు వెలువడిన వ్యాసములుగాక వీరు 'కేథరిన్' అను రష్యన్ వీరవనిత చరిత్రను, 'ఇటలీదేశభక్తాగ్రగణ్య' గారిబాల్డి జీవితము'ను, 'బౌద్ధమతము' అను వ్యాస సంపుటిని రచించి ప్రచురించినారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభతోపాటు కొన్ని జిల్లా, తాలూకా మహాసభలకు అధ్యక్షతవహించినారు. గుంటూరుజిల్లాలో గ్రంథాలయ యాత్రలలో పాల్గొన్నారు.

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి 30 సంవత్సరాలకుపైనుండి కార్యదర్శిగనున్న శ్రీ పాతూరి నాగభూషణం వీరి మేనల్లుడు. ఒకప్పుడు వీరుభయులు గుంటూరుజిల్లా గ్రంథాలయ సంఘానికి అధ్యక్షకార్యదర్శులుగ ఉన్నారు.

## ౮. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి)
## (1874 - 1951)

జన్మస్థలం కృష్ణాజిల్లా గన్నవరంతాలూకా కనకవల్లి అగ్రహారం. కార్య క్షేత్రం విశాఖపట్నం. తెలుగుబాస పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన 'తెలుగు నలువ ; కవి; పండితనటుడు; నాటకకర్త; నాట్యాచార్యుడు; రాజకీయ నాయకుడు; జాతీయ వాది; సంస్కర్త. ఆంధ్ర గ్రంథాలయోద్యమనాయకులలో ముఖ్యులు. కళాభిలాషక నాటకసమాజం, సంగీతమానినీ సమాజం (కళావంతుల సంపూర్ణసంస్థ), దంతకళా శాల, ధర్మాశ్రమం, రామలీలోత్సవం, హిందూపఠనమందిరం, వసంత పఠనమందిరం, స్వరాజ్యసమితి, ప్రజాసంఘం, కవితాసమితి, తెలుగుగుడి మొదలైన సంస్థల స్థాపకులు. తెలుగు సంధ్యావందనం, తెలుగు తోబుట్టువులు, తెలుగు నుడిదండలు, నన్నయ్యనుడులు, నుడికడలి మొదలైన గ్రంథాలు, ఎన్నో నాటకాలు, కావ్యాలు, విమర్శలు, వ్యాసాలు వ్రాశారు.

1921 లో కాంగ్రెసులో చేరారు. విశాఖజిల్లాకు నాయకత్వం వహించారు. ఉప్పుసత్యాగ్రహంలో కారాగృహశిక్ష అనుభవించారు. 1918లో విశాఖపట్నంలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శి; విశాఖజిల్లా గ్రంథాలయసంఘమునకు కొన్నాళ్లు అధ్యక్షులు. తొలి విశాఖజిల్లా గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు. 1921 వ సంవత్సరములో విశాఖపట్నంలో జరిగిన మండల గ్రంథాలయ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి కొన్నాళ్లు ఉపాధ్యక్షులు, కొన్నాళ్లు కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు; కొంతకాలం గ్రంథాలయ సర్వస్వము సంపాదకులు. 1941 వ సం.లో రాజమహేంద్రవరములో జరిగిన 21 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ అధ్యక్షులు.

1 21 లో విశాఖపట్నంలో జరిగిన విశాఖపట్టణం మండల గ్రంథాలయ ప్రత్యేక మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు

## ౯. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి
## (1896 - 1953)

జననం పాలమూరు (మహబూబ్‌నగర్) జిల్లా అలంపురం తాలూకా ఇటికాలపాడు గ్రామంలో. హైదరాబాదు నిజాం కళాశాలలోను, మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలోను ఉన్నతవిద్య నభ్యసించి పట్టభద్రులైనారు బి. ఎల్. పట్టంపొంద పుచ్చుకొన్నారు. శ్రీయుతులు వెల్లాలశంకరశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రిగారలవద్ద

తర్క-వ్యాకరణాలు చదువుకొన్నారు. కొద్దికాలంమాత్రమే హైదరాబాదులో న్యాయవాద వృత్తిలోనుండినారు. 1924-34 సం. లలో హైదరాబాదునందలి రెడ్డి విద్యార్థి వసతిగృహాన్ని నిర్వహించి, దీనికి చక్కని గ్రంథాలయాన్ని, తాళపత్ర గ్రంథాలను సమకూర్చినారు 1925-1948 సం. లలో నాటి తెలంగాణా ఏకైక వార్తాపత్రిక **గోలుకొండ** పత్రికకు సంపాదకులుగానుండి, నాటి నిరంకుశనైజాం ప్రభుత్వాన్ని ఎదిర్చి తెలంగాణానికి రాజకీయంగా, సాంస్కృతికంగా, సాహిత్యకంగా ఎనలేనిసేవ చేసినారు. నిజాం రాష్ట్ర ప్రథమ ఆంధ్రమహాసభ కధ్యక్షులు. 23 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభకధ్యక్షులు, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘోపాధ్యక్షులుగాను, ఆంధ్ర గ్రంథాలయట్రస్టు ధర్మకర్తలుగాను, గ్రంథాలయ సర్వస్వము సంపాదకవర్గ సభ్యులుగాను. ఉండి జీవితాంతము గ్రంథాలయోద్యమానికి తోడ్పడినారు క్యాతూరులో జరిగిన 26 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ విజయమునకు ప్రధాన కారకులు. 1940 లో 'గ్రంథాలయోద్యమం' అనే పుస్తకాన్ని ప్రకటించినారు. గొప్ప పరిశోధకులు, పండితులు, కవులు, విమర్శకులు. వీరి యితర రచనలలో ముఖ్యమైనవి : 1 రామాయణ విశేషాలు, యువజన విజ్ఞానము, ఆంధ్రుల సాంఘిక చరిత్ర. వీనిలో కట్టకడపటి పుస్తకం వీరి మరణానంతరం భారత ప్రభుత్వంనుండి రు 5000/- బహుమతిని సంపాదించినది.

మాతృభాషయగు తెలుగుతోపాటు వీరు సంస్కృతం, ఉర్దూ, హిందీ, పార్సీ, ఇంగ్లీషు భాషలలో అధికారం సంపాదించారు.

## ౧౦. డాక్టరు యస్. ఆర్. రంగనాథన్
## (1892 - )

గ్రంథాలయక్షేత్రంలో ప్రపంచమన్ననలను బడసిన నాయకావతంసుడు. గ్రంథాలయశాస్త్ర సంబంధంగా దాదాపు 60 పుస్తకాలు, కొన్నివేల వ్యాసాలను రచియించిన విద్వాంసుడు. గ్రంథాలయాల నిర్వహణ పద్ధతులలోనూ, పుస్తకాల వర్గీకరణము, సూచీకరణములలోనూ నూతన సిద్ధాంతములను ప్రవేశపెట్టిన పరిశోధకుడు. మొదట మదరాసు యూనివర్సిటీలో గణిత శాస్త్రాచార్యులుగా, తదుపరి యూనివర్సిటీ లైబ్రరీభాండాగారిగా ఉండి లండనుకుపోయి గ్రంథాలయశాస్త్రం అభ్యసించి తిరిగివచ్చిననాటినుండి తనబుద్ధివైభవాన్ని పూర్తిగా గ్రంథాలయశాస్త్ర పరిశోధనకై వినియోగించిన జిజ్ఞాసువు. ఆపైన మదరాసు, బెనారస్, ఢిల్లీ, ఉజ్జైన్ యూనివర్సిటీలలోను గ్రేట్‌బ్రిటన్, అమెరికా, కెనడా, జపాన్ మున్నగు ఇతరదేశాలలోని

గ్రంథాలయ పాఠశాలలలోను గ్రంథాలయశాస్త్ర బోధకుడు. మదరాసు గ్రంథాలయ సంఘానికి చాలకాలం కార్యదర్శి, ఆ పిమ్మట అధ్యక్షుడు. ఐక్యరాజ్యసమితికిచెందిన గ్రంథాలయ ప్రవీణుల అంతర్జాతీయ సమితిలో సభ్యుడు, ప్రపంచ విజ్ఞానసమితి ఇంటర్నేషనల్ బిబ్లియోగ్రఫీ కమిటీ మెంబరు. భారతదేశపు యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్‌వారి లైబ్రరీకమిటీ అధ్యక్షుడు. బెంగుళూరులోని ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూటువారి డాక్యుమెంటేషన్ రిసర్చి అండ్ ట్రైనింగ్ సెంటరులో గౌరవాచార్యుడు. భారత జాతీయ గ్రంథాలయశాస్త్రాచార్యుడు, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘంతో కలుపుకొని మనదేశంలోను, ఇతర దేశాలలోనూగల ఎన్నో సంస్థలలో గౌరవసభ్యుడు.

భారతదేశంలో గ్రంథాలయశాస్త్రపితగా, గ్రంథాలయ శాసననిర్మాతగా పేరు బడసినవ్యక్తి. తన విజ్ఞానంద్వారా దేశదేశాలలో గౌరవంపొందుతూ అచ్చట తరచు సంచరిస్తూ తన బోధనలద్వారా అందరినీ ఆకర్షిస్తూ భారతదేశ గౌరవాన్ని ఇనుమడింపజేస్తున్న మనీషి. తాను అతిసాదా జీవనాన్ని గడపి, తన ఉద్యోగాలలో లభించిన వేతనాన్ని, తన పుస్తకాలద్వారా లభించిన ఆదాయాన్ని పొదుపుచేసి, ఒక లక్ష రూపాయలను గ్రంథాలయ పీఠస్థాపనకై మదరాసు యూనివర్సిటీ కిచ్చుటయే గాక, తన అర్ధాంగి శ్రీమతి శారదా రంగనాథన్‌పేరట చిన్న చిన్న బహుమానాలను తానుద్యోగంచేసిన తావులన్నింటిలోను ఏర్పాటుచేసినాడు. 1962 వ సం. లో ఆమెపేరట ప్రత్యేక ధర్మనిధిని నెలకొల్పినాడు. ఈ నిక్షేపక్షాన గ్రంథాలయశాస్త్ర వ్యాప్తికై వివిధరకాల కార్యక్రమాలు నిర్వహింపబడునట్లు ఏర్పాటు గావించినాడు.

అనుబంధము : ౬

# ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభ, తెనాలి*

## అధ్యక్షోపన్యాసమునందలి ముఖ్య విషయములు

### విద్యయే శక్తి

మనదేశములో మహాయోగులు విద్యను సర్వసాధనముగా నుపయోగించినారు. విద్యవలన మృత్యువును తరించినారు. ఇహలోక పరలోకములకు రెంటికి విద్య తారకముగా నిర్వచించినారు. జ్ఞానమంటే మనవారిది వట్టి పరలోకజ్ఞానమే యనుకొనువారు చాల పొరబడుచున్నారు. నాల్గువిధములయిన జ్ఞానములు మన పెద్దలు నిర్వచించినారు.

(1) సంజ్ఞానము – చక్కనైనట్టి ఎరుక

(2) ఆజ్ఞానము – శాసనవిధానశక్తి

(3) విజ్ఞానము – శాస్త్రవిషయగ్రహణము

(4) ప్రజ్ఞానము – సర్వము నెరుగుట

ఇందులో గర్భితమయిన అర్థము అందరికి నా వివరణలేకయే తెలియగలదు.....

* * *

మన పూర్వులు చతుష్షష్టికళలని పేరుపెట్టి 64 విద్యల నభివృద్ధిచేసిరి. కాని అందరును ముక్కుమూసుకొని కూర్చొని ఇతరుల కీలోకమును వదలి వైకుంఠమునకు బొమ్మనలేదు. అందే జీవితశక్తి కలుగవలెనన్నా, ముక్తి ప్రాప్తించవలెనన్నా విద్య, జ్ఞానము ప్రథమాధారము అనిరి.

ఐతరేయోపనిషత్తునందలి ఉత్తరశాంతి పాఠమున బ్రహ్మచారి ఏమనుచున్నాడో చూడుడు.

అధ్యయనమునందు దృఢబుద్ధి యలరుగాక ।
అధ్యయనము నన్విడువనిదగునుగాక ।

పఠన మొనరింపబడు వేదభాగములను
రేయిబవళులు నేను దర్శింతుగాక ।

తన్ను అధ్యయనము విడువరాదట । రేయిబవళులు వేదభాగములను తాను దర్శించుచుండవలెనట ।

---

* 3 24-8-41 వ తేదీన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగినది.

నా మతమున పూర్వము మనదేశమున దాస్యములోకి త్రోయబడిన ఏ కొందరోతప్ప నాటి రాజకీయసంఘమంతయు బ్రహ్మ క్షత్రియ వైశ్యులే. వీరి యందరకును బ్రహ్మచర్యాధికారము, అధ్యయనాధికారము కలదు. అందుచేత వీరెల్లరును తమ్ము విడువని అధ్యయనము నారాధించిరి. ఆనాడు వయోజనవిద్య యని, ఇందులో అక్షరజ్ఞత ప్రధానమా ? విజ్ఞాన వికాసములు ప్రధానములా ? అనునట్టి ప్రశంసలే రాకుండెను. జ్ఞానమన్నది శక్తి. శక్తిసాధింపదగినది వాయువును పీల్చినట్లు, ఆహారమును భుజించినట్లు విద్యను సంపాదించిరి. రాజ్యము లేలుకొనిరి. లోకమునకు జ్ఞానభిక్ష పెట్టిరి.

## పాశ్చాత్యదేశములు - విద్యాప్రచారము

నేడు పాశ్చాత్య సీమలలోనూ మోక్షసంపాదనకు కావలసిన శక్తిమాట యెట్లున్నా జీవయాత్ర గడుపుటకు కావలసిన శక్తి సంపాదించుటకయి జ్ఞానమును సంపాదించుచున్నారు. ఉపాసించుచున్నారు ! 'నాలెడ్జ్ ఈజ్ పవర్' అన్నారు. అనగా జ్ఞానమే దానిశక్తి యగుట వారి మతముకూడాను. అట్టిజ్ఞానము, పూర్వము మనలోవలెనే అందరు ఆరాధింపవలసినదని, సాధింపవలసినదని వారు పూనుకొని మనవారు బ్రహ్మచర్య కాలముగా ఎంచిన విద్యాభ్యాసకాలమును విద్యార్థిదశలోని విద్యగా నెంచుచు జీవితాంతమువరకును అనేక రూపముల నందరును సాధింప దగిన తక్కుంగల విద్యను వయోజనవిద్య యన్నారు.

విద్యను సాధించుటకు పూర్వము మనదేశములో శ్రవణము అంటే వినికిడి ఎక్కువగా ఉపయోగించినా, అక్షరములు లేవనిగాని గ్రంథములు లేవనిగాని యనుకొనరాదు. అశోకునినాటి శిలాశాసనాదులు, మన తక్షశిలావి ప్రాచీన విద్యాలయములు మన యక్షరజ్ఞానపు ప్రాచీనత్వమును స్పష్టముగా సూచించును. అచ్చు కూర్చుట ఏర్పడి లక్షలకొలది ప్రతులు విజ్ఞాన సంపుటములగు గ్రంథాలకు తయారు కావడముతో, విద్యసంపాదించుటకు కావలసినసాధనము అక్షరజ్ఞత యయిపోయినది. చారిత్రక పరిణామము పరిపాలనచే తెగిపోకయున్న రాష్ట్రిలలో ఈ క్రొత్తమార్పు మామూలు జీవితప్రవాహములోనే కలిగి ప్రత్యేకము అక్షరజ్ఞత ప్రయత్నాలుచేసికొనవలసినపని ఆధునిక రాష్ట్రిలకు కలుగలేదు. ఇంగ్లండు, అమెరికా సంయుక్త రాష్ట్రిలు ప్రముఖముగా ఈ పరిణామానికి ఉదాహరణములు.

*　　　　*　　　　*

వయోజనవిద్యకు అక్షరజ్ఞత ప్రథమాధారమేయయినా అదే వయోజనవిద్య కాదనడము ఇదివరలోనే స్పష్టపరచినాను, స్కూళ్లు విశ్వవిద్యాలయాలకు మించిన వయసున, జాతిలోని ప్రతి పురుషుడును, స్త్రీయును పూర్ణ జీవితమును గడుపుట

కెరుంగవలసిన సర్వ విజ్ఞానమును వారికందజేయడము వయోజనవిద్య కార్యక్రమము.

## వయోజనవిద్యా ప్రచారసాధనాలు

మన కుటుంబముల దినసరి కార్యక్రమములోనే వయోజనవిద్యా ప్రచారమున కవకాశములున్నవి. పాటలు, పండుగలు, పేరంటములు, కొలువులు, వివాహాది శుభముహూర్తములు అన్నిటిని మనతో జేరు నలుగురకు యెక్కువ విషయగ్రహణము కలుగు నవకాశాలుగా తీర్చవచ్చును. స్కూళ్లు, కాలేజీలు, విశ్వవిద్యాలయములలో వారి విద్యాప్రణాళికకు మించి జరుగు సంఘోద్దీపక వ్యవహారముల మాట నేను చెప్పనే యక్కరలేదు భజనలు, బొబ్బిలికథలు, వీధి నాటకములు, హరికథలు, యాత్రలు వయోజనవిద్యా ప్రచారకులకు మంచి యవకాశములు. యాత్రలకిపుడు క్రొత్త తేజస్సు కలిగినది. ఆంధ్రదేశములో గ్రంథాలయసంఘమువారు గ్రంథాలయ యాత్రలు చేయుచున్నారు. ఆ యాత్రలలో బొమ్మల లాంతరు సహాయమునసైతేనేమి ఇతరత్రానైతేనేమి విజ్ఞానవిషయములనేకములు బోధించుచున్నారు. ఈ సందర్భములోనే గ్రంథాలయ పఠనాలయముల మాట కొంత చెప్పుకొననిండు.

నేటి దినము దేశభాషలలో పఠనాలయములను విరివిగా ప్రోత్సహించుట అత్యవసరము. నూతనయుగ విజ్ఞాన ప్రబోధకములగు గ్రంథములు నేడు వెలువడుట మన భాషలలో తక్కువ. కారణాలన్నింటిని నేనిచట ఏకరువు పెట్టనక్కరలేదు. మీరందరెరిగినదే. పత్రికలు దినదినము, వారవారము లోక విజ్ఞానాన్నంతా వెదజల్లక విధిలేదు. కాబట్టి అందులోనుండి వివిధ విషయములకు సంబంధించిన వ్రాత లప్పటికప్పుడు కత్తిరించి వేరేవేరే ఫైళ్లగా అతికించి పెట్టితే చదువరులకు మంచి విజ్ఞానము పంచిపెట్టడానికి వీలున్నది.

పఠనాలయాల యావశ్యకత ఇంత ఉందంటే గ్రంథాలయాల యావశ్యకత లేదనికాదు. మంచి గ్రంథాలు చేర్చిపెట్టడము చాలకాలముగా అనుభవములో నున్న పని; ఉండగలదు.

* * *

పైనచెప్పిన సాధనాలేకాక వయోజనవిద్యకు బొమ్మల ప్రదర్శనాలు, వస్తుప్రదర్శనాలు, శిల్పాలు, ఉపన్యాసాలు, సినిమాలు – ఇట్టి వెన్నియో కలవు. నేడు అన్నిటికంటె ఎక్కువ విస్తారంగా వస్తుందేది రేడియో.

రేడియోకు సంబంధించిన అన్ని వివరాలను నేనిక్కడ విమర్శింపదలచుకొనలేను. ఇటీవల పడమటిదేశాలలో ప్రచారములోనికి వచ్చిన 'గ్రూపు లిసనింగు'

అను విధానము చాల ఉపయోగకరమని నా యభిప్రాయము. దానికి తగిన సుశిక్షిత సేవకబృందమును మనము సిద్ధము చేసికొని ఈ దేశమునందును మన మా విధానము ననుసరించడము లాభప్రదమని నా మనవి.

'గ్రూప్' అనగా ఒక ముఠా. రేడియోలో చెప్పే విషయాలు విని అవగాహన చేసుకొనే ఉద్దేశ్యముతో కొందరు కొంద రటనట ముఠాలుగా యేర్పడుదురు. లంకాషైరులో నలుగురు వ్యవసాయదారులు, ఒక బేక్‌దారు, ముగ్గురుకూలీలు, ఇద్దరు ఉపాధ్యాయినులు, ఇద్దరు గృహలక్ష్ములు, ఒక పీనుగుల మోతరి, ఒక మతాచార్యుడు ఒక ముఠాగా చేరిరి. గం 8-30 లకు రేడియోలో వినుట కేర్పడియుండ, గం. 8-15 లకు వీరు సమావేశమైరి. ఈ ముఠానాయకుడు రేడియోలో రాబోయే విషయమును ప్రస్తావించెను. ఈ ముఠాయెదుట నొక పటము పరచి 'మెడిటరేనియన్', 'పసిఫిక్' సముద్రాలను చూపి కొన్ని వివరాలను చెప్పెను. తరువాత 30 నిమిషములు రేడియో వినిరి. కొందరు కొన్నిగుర్తులు వ్రాసుకొనిరి. అది ముగిసినపిదప ముఠావారు కొంత విశ్రాంతి పొందిరి. తరువాత ముఠానాయకుడు రేడియోలో చెప్పిన సంగతులు కొన్నివాక్యాలలో సంక్షేపించి అనువదించి, విమర్శ యీ సంగతులమీద జరుగవచ్చునని సూచించెను. ముఠావారు వీటిని విమర్శించడమేగాక తాముగ క్రొత్త విమర్శన లారంభించిరి. ఒక యరగంట చర్చజరిగిన పిదప నాయకుడు దానినంతయు సమన్వయపరచి యుపన్యసించెను. అందరును ఏదో కొంత విషయమును నేర్చుకొంటిమని సంతోషించి యిండ్లకు పోయిరి.

ఈ యేర్పాటు చాల మంచిది. వయోజనవిద్య ఏ రూపంగా చెప్పదలచుకొన్నను ఇందులోని మార్గమవలంబనీయమే యగును. కాని నాయకత్వము వహింపవలసినవాడు సమర్థుడుకావలెను. ప్రపంచ విజ్ఞానము బాగా కలవాడుగా నుండవలెను. తనతో చేరే నలుగురిలో ఉత్సాహము జనింపజేసేవాడు కావలెను. వారి ఆత్మగౌరవము నిలిపి తన యాత్మగౌరవము నిలుపుకొనగలవాడు కావలెను. వారడుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పగల శాంతుడు గావలెను. ఈ సామర్థ్యము, ఈ గుణసుబు పుటుకతో రావు. శిక్షణతో రావలెను. కావున వయోజన విద్యాప్రచారము కోరేవా[illegible]నసుగు మానవబల మేర్పరచుకొనుటకు తగిన సంఘవిధానము[illegible]యున్ననాలోచింప వ[illegible]ను.

— ఆంధ్రగ్రంథాలయం 2 వ సంపుటము 3-4 సంచికనుండి